గాలగ బెశ్వర! నీది నిర్జరవయోరూపంబు, శృంగార ల
క్ష్మీ లీలారస పట్టభద్రుఁడవు నుక్ మేలే! యిటుల్ వంతచే
వ్రీలంగాఁ గతమేమి? లో మఱచితో స్వాతంత్ర్యకల్యాణ గా
నాలోలామృతగీతికాక్షర సమామ్నాయంబు ప్రాయంబునన్!

# ఇంకొకవిధము

## విశ్వనాథ సత్యనారాయణ

గోపీనాథుఁడును మలయగిరియును నెప్పుడును గలిసియే తిరుగుచుందురు. మలయగిరి కుడిచేయి గోపీనాథునిబుజమున కెడముగానున్న నిముసము మనము చూడలేము. మలయగిరి గోపీనాథుని "ఏమండి" యని పిలుచును. ఇతరులతోఁ జెప్పునపుడు "వారు" అని ప్రశంసించును. గోపీనాథుఁడు మలయగిరిని "ఏమిరా" యనిపిలుచును. గోపీనాథునకు సుమారు ముప్పదియేండ్లు, మలయగిరి పదునైదేండ్లవాఁడు.

వీరిరువురకును దేహములు మాత్రమే రెండు. మలయగిరికి గోపీనాథుఁడు తల్లిందడ్రులకన్న మాననీయుఁడు, ప్రేమాస్పదుఁడు. మలయగిరి సుకుమారమైన మొగముపైని వెన్నెల కనుగొందకముందు గోపీనాథునకుఁ బ్రియము చూచుటయైన నిష్టమే. గోపీనాథుఁడు మలయగిరితో మాటలాడుచున్నప్పు డాతనివదనము మలయగిరి మొగమున కెంతదూరముననో యుండదు. గోపీనాథుని చేతులకు పిన్నగాలికికదలు మలయగిరిముంగురుల సవరించుటయే పని.

సాయంసమయమందు బజారులోని గులాబిపువ్వులను గోపీనాథుఁడు మలయగిరి కురులయందు ముడుచును. అప్పుడిరువురు నొకరి నొకరు చూచుకొని నవ్వుకొనుచుందురు. ఎవనితోనైన గోపినాథుఁడు

మాటలాడుచు పోవుచున్న మలయగిరి యతనిమోచేతిని తనమోచేయి తగుల్చును. ఒక్కొక్కప్పుడు మాటలాడుచునే తల్లిని బిల్లవలె మలయగిరి గోపీనాథుని యెదురఱొమ్ముపై తనతల మోపును.

ఎప్పుడును తనమీఁద నొరగినిమురించు మలయగిరి కదలికల వలననే గోపీనాథునకు మెలకువ. ఒలుచుచున్న నారింజపండు నే నొలిచెదనని గోపీనాథుఁ డడిగినకొలఁది మలయగిరి యియ్యక తానే యొలుచుకొనుచు నతని మొగముఁజూచి నవ్వుచుండును. గోపీనాథుఁడు బజారున నేవింతవస్తువు చూచినను నది మలయగిరికి తెచ్చిపెట్టకున్న నతనికి నిద్దురపట్టదు. ఒక్కొక్కప్పుడు గోపీనాథునిపైన దేనికేని కోపమువచ్చి తన్నినను గోపీనాథుడుఁ పోనిమ్మని సంధికిచేయిచాచును. మలయగిరి కన్నీళ్లతోఁ గవుగలించుకొనును. అతఁడు పసివాఁడని గోపీనాథున కెక్కడలేని ప్రేమ.

గోపీనాథుఁడు ప్రసిద్ధనటుఁడు. సంగీతము లేదుకాని యతనియభినయము నభినందించని విద్యార్థికుఁడు లేఁడు. అతనిపేరు చెప్పిన డబ్బుకురియును. నాటకరంగమున నతనిప్రీతి భయప్రతిమానము. స్వభావసిద్ధముగ నతఁడు నటకుఁడగుటఁ దక్కినవాని కేమిగాని విద్య రానివాఁడైన యతనివాచకము ప్రశంసకందదు. అతఁడెప్పుడు నాటక మాడినను ప్రధానపాత్ర యతనిది. తక్కినవారినెవరినో కూఁడఁగట్టి తక్కిరిబిక్కిరిగా నాటకమాడును. నాటకము రక్తికట్టని రాత్రిలేదు.

ఈసారి "పారిజాతాపహరణ" మాడుతలంపతనికి జనించినది. పాత్రలందరికిఁ బంచినాఁడు. మలయగిరి సత్యభామ వేయునట్లు. మఱు నాటినుండి మలయగిరిని తయారుచేయ మొదలుపెట్టినాఁడు. పాపము తఁడు నోటమాటబట్టలేఁడు. ఆయుస్సు చాలదు. ఎన్నివిధములనో ప్రయత్నమైనది. నాటకారంభమైనది. నిన్నటినుండియు గోపీనాథునకుదిగులు. సత్యభామకుదగినవాఁడు దొరకలేదు. మలయగిరి పాడుచేయును.

నాటకమైపోయినది. జనులందఱు గుంపులు గుంపులుగా నిండ్లకేగుచున్నారు. ఎవర్నినోట చూచినను "ఆకుఱ్ఱవాఁడెవరు? ఆహాహా! ఎంత బాగుగానున్నది! ఆమాధుర్యము, ఆస్వభావానురక్తి, ఆమధురిమ, ఆయమాయకత్వము! ఇంతచిన్నవయసులో నింత నటుఁ డెట్లయినాఁడు! భార్యాభర్తల యనురాగమువలెనున్నదే వారినాటకము" అనుమాటయే.

# గువ్వలచెన్నుని పద్యాలు

మారుతి, బి. ఏ., ఎల్. టీ.

కొన్నిసంవత్సరములకు ముందు ఆంధ్రపత్రికలో గువ్వలచెన్నుని పద్యములారు ప్రచారములో నున్నట్లు ప్రకటింపబడినవి. అంతకు పైగా పద్యము లదివరలో ఎవ్వరును ప్రకటించినట్లు తోచదు. నేను ఇంకను ఆరుపద్యములు సేకరించినాను. ఇందు నాలుగు పద్యములు కృష్ణాజిల్లాలో దొరకినవి. రెండుపద్యాలు కర్నూలుజిల్లాలో దాసరులవద్దను, భట్రాజులవద్దను. ఇంకను పద్యము లుండవచ్చును. ఎవ్వరికైన క్రొత్తపద్యములు దొరకిన పత్రికాముఖమున వెల్లడిచేసినచో ఆంధ్రలోకమున కుపకార మగును. ఇదివరలో ప్రకటింపబడినవి, క్రొత్తవి ౧౨ పద్యాలు.

౧ నిలువెల్ల నమృత ప్రాయము
పలుకెల్ల శిలాక్షరంబు పరికింపగ నీ
తలఁపెల్ల ధర్మమార్గము
కులపావనమూర్తివన్న గువ్వలచెన్నా.

౨ పలువిద్య లెన్ని నేర్చిన
కులవిద్యకు సాటిరావు కుంభిని లోనన్
వెలకాంత లెందరైనను
కులకాంతకు నీడుగారు గువ్వలచెన్నా.

3 కలిమిగలనాడు మనుజుఁడు
విలసితసత్కీర్తిచేత వెలయఁగవలయున్
కలి మేమి శాశ్వతంబా?
కులగిరులాకదలకున్న గువ్వలచెన్నా.

౪ కలిమిగల లోభికన్నను
విలసితముగ పేద మేలు వితరణియైతే
బలమైన జలధికన్నను
కొలఁదగునా చెలమ మిన్న గువ్వలచెన్నా.

౫ ఈవియ్యని పదపద్యము
గోవే చదివించుకొనును కువలయమందున్
ఈవిచ్చిన పదపద్యము
గోవా మఱి చదువకున్న గువ్వలచెన్నా.

అంగీలు పచ్చడంబులు
సంగతిగా శాలుజోళ్లు సరిగంచుల మేల్
రంగుల దుప్పట్లులన్నియు
గొంగడి సరిపోలవన్న గువ్వలచెన్నా.

కుడి కూలును నుయి పూడును
వడినీళ్ళకు చెఱువు తెగును వనములు ఖిలమౌ

చెడనిది పద్యముసుమీ్మా
కులనిధి యంభోధికన్న గువ్వలచెన్నా.

౮ పెక్కావులు గలవానికి
బక్కా వొకటీయకున్న పాడికి వెలితో
పెక్కండ్రు దాతలుండిన
కుక్కం డొక డీయకున్న గువ్వలచెన్నా.

౯ సారాసారము లెఱుఁగని
బేరజములకు బుద్ధిజెప్ప పెద్దలవశమా
నీరెంత పోసి పెంచిన
కూరగునా నేలవేము గువ్వలచెన్నా.

౧౦ తనపద్య మెవరు చదివిన
వినినంతనె వేగపడక వెయ్యార్లీయక్
వెనుకయు ముందును జూచిన
కొనసాగదు కీర్తులెన్న గువ్వలచెన్నా.

౧౧ ఇలువరుస దానగుణములు
కలవారికి గాక లోభిగాడ్దెలకేలా
తలుపేల చాపగుడిసెకు
కులపావనమూర్తికన్న గువ్వలచెన్నా.

౧౨ పదిమందిదాత లిచ్చిన
అధముం డొకఁడీయకున్న నర్థికి కొదువా
పదివేలు గోవులిచ్చిన
కొదువా యొకటీయకన్న గువ్వలచెన్నా.

ఈ పద్యములలో కొన్ని పాదములకు పాఠాంతరము లుండ్గె
౫-౧౦ పద్యములకు అర్థము వెల్లడిగాలేదు. ౮-౧౬

భావ మొక్కటియే. రెండవపద్యమునకు పాఠాంతర మీరీతిని కర్నూలు జిల్లాలో వాడుకలో నున్నది.

ఇలకాంత లెందరైనను
కులకాంతకు సాటిరారు కువలయమందున్
పలువిద్య లెన్నినేర్చిన
కులవిద్యను బోలవన్న గువ్వలచెన్నా!

# ఎ వ రు మం చి వా రు?

చింతా, దీక్షితులు, బి.ఏ., ఎల్.టి.

## ౧.

### నాన్న మంచివాడుకాడు - అమ్మేమంచిది

వినాయకచవితినాడు అమ్మ తలనీళ్లోస్తూ "నాన్నగారితోకూడా పూజచేసుకో" అంది. నాన్న పాలవెల్లి కట్టేటప్పుడు నేనుకూడా కట్టబోయినాను. వెలక్కాయఒకటి పాలవెల్లికి కట్టేటప్పుడు గట్టిగాలాగడంమూలాన్ని పాలవెల్లి తెగి క్రిందపడింది. నాన్న కోప్పడ్డాడు. నాన్నపక్కను కూచుని నేనూ పూజచేస్తానన్నాను. "సరే" అన్నాడు నాన్న. నేను రెండుచేతులతోటీ పత్రి పువ్వులూ పూజచేస్తూవుంటే నాన్న మళ్లీ కోప్పడి ఒక్కచేత్తోటే చెయ్యమన్నాడు. నేను ఒక్కచేత్తోటే అంత పత్రి ఒక్కమారు దేవుడునెత్తిమీద పోశాను. నాన్న కొట్టేడు. అమ్మ

అప్పుడు "వాడినెందుకు కొట్టేరూ పండగపూట. వాడికేం తెలుసును. చెప్పి చేయించాలికాని" అంది.

నాన్న ఒకపువ్వు నాచేతికిచ్చి నెత్తిమీద వెయ్యమన్నాడు నాన్న నెత్తిమీదవేశాను. నాన్న కళ్లెర్రచేశాడు. అమ్మలోపలకు వెళ్లిపోయి పక్కన నవ్వింది. అమ్మనుకూడా కోప్పడ్డాడు నాన్న.

నాన్న ఎప్పుడూ నన్ను బళ్లోకి వెళ్లమంటాడూ! తాను ఒక్కమాటూ బళ్లోకి వెళ్లడు గాని! తను కోటూతలపాగాపెట్టుకొని షికారు వెళుతూ నన్నొక్కనాడూకూడాతీసుకువెళ్లడు. బళ్లోకివెళ్లమని వెళ్లకపోతే కొడతాడు. నేనెందుకువెళ్లాలి బళ్లోకి? నాన్నఎందుకు వెళ్లకపోవాలి? అమ్మేనయం. నాన్నకొట్టినప్పుడు "ఊరుకోనాన్నా ఊరుకో" అని చేగోణీలు చేసిపెడుతుంది.

సాయంత్రం అవడముతోనే నాన్న నన్ను దగ్గిరకూచోబెట్టుకొని వారాలపేర్లూ మాసాలపేర్లు అన్నీ చెప్పమంటాడు. ఆకాశంకేసితిరిగి నక్షత్రాలనిచూస్తూ చెప్పమన్నదిచెప్పకపోతే నాన్నకొడతాడు. అన్నానికిలేచి వేళఅయిందాకా నాన్న పద్యాలూ అన్నీ నాకు చెపుతాడు. ఒక్కమాటూ ఆడుకోనివ్వడు.

నాన్ననన్ను ఒక్కమారూ వాచీకి కీయివ్వనియ్యడు. తనుమాత్రం రోజూ తిప్పుతాడు. నాన్నకు పెట్టినిండా రూపాయిలున్నాయి. పప్పులు కొనుక్కుంటాను ఒకరూపాయి యిమ్మంటే యియ్యడు.

అమ్మేనయం. నాన్ననన్ను ఎప్పుడూ బజారుకుతీసుకువెళ్లడు. అమ్మ నన్ను పేరంటానికి తీసుకువెళ్లుతుంది. అరటిపండూ తమలపాకులూ యిస్తుంది. రాత్రిదగ్గిరపడుకోబెట్టుకొని జోకొట్టుతుంది. పాటలు పాడుతుంది.

## ౨

## అమ్మమంచిదికాదు- నాన్నేమంచివాడు

నాకాడుకోవడానికి ఒక్కపువ్వూఇవ్వకుండా అమ్మఅన్నిపువ్వులూ గౌరీదేవికి పూజచేస్తుంది. నేను గౌరీదేవిమీద పువ్వులుగానే తీసుకుంటే అమ్మకొడుతుంది. నాన్నచూస్తూ ఊరుకుంటాడు.

సంకురాత్రి పండుగకు అమ్మ తెల్లారగట్టేలేచి ముగ్గులెడుతుంది. అమ్మలేవడంచూచి నేనూలేచి బుట్టతోముగ్గులెడుతూవుంటే అమ్మ పెట్టనివ్వదు. నన్నుముగ్గులెట్టనిస్తేనా? అమ్మకంటె బాగాపెడతాను. కుక్కపిల్లనూ, కోతిపిల్లనూ, పువ్వులనూ చెట్లనూ ముగ్గుతోపెడతాను. మేష్టరుగారి బొమ్మనుకూడా పెడతాను. అమ్మపెట్టనివ్వదు.

నాన్నఎన్నోబొమ్మలు కొనిపెట్టేడు. అమ్మ ఆబొమ్మలన్నీ పెట్టెలో పెట్టుకుంటుంది. ఆడుకోడానికి ఒక్కబొమ్మాయివ్వదు. ఇమ్మంటేకొడు తుంది. నాబొమ్మలన్నీ అమ్మ దాచుకోవడమెందుకు?

అమ్మ రోజూ రోజూ తలంటి నీళ్లోస్తానంటుంది. వద్దంటేమానదు. నాన్న ఒక్కమాటూ తలంటి నీళ్ళోసుకోడుగదా నేనుమాత్రం రోజూ రోజూ ఎందుకు పోసుకోవాలి. అమ్మకు చెప్పితే తెలియదు.

వంటవండేటప్పుడు అమ్మ ఒక్కమాటూ నన్ను పొయ్యిదగ్గిరకు రానివ్వదు. రానిస్తే వంటంతా గుజ్జెనగూళ్ళకింద చేసేద్దును. వంట పొయ్యిలో కొరకంచుతీసుకొని గిర్రునతిప్పితే ఎంతో తమాషాగా వుంటుంది. అమ్మ పొయ్యిదగ్గిరకే రానివ్వదు.

వీధులోకి ఈతపళ్ళు అమ్మ తెచ్చినప్పుడు ఎవళ్ళూ చూడకుండా పోలేదు బియ్యంతెచ్చి ఈతపళ్లుకొని జేబులోవేసుకొని వీధి అరుగు

మీద కూచుని కాళ్లువిసురుకుంటూ ఒక్కొక్కపండేతింటూ చుట్టూతా వున్నకుక్కలకీ ఆవులకీఒక్కొక్కపండువేస్తూంటే ఎంతో బాగుంటుంది. అమ్మ ఒక్కమారూ ఈతపళ్లు కొనుక్కోనివ్వదు.

ఉట్టిమీద గిన్నెలో పాకంవుండలు అమ్మచూడకుండా తీసుకుని కుక్కపిల్లని "దూదూ" అనిపిలిచి ఒక్కొక్కవుండే పెడితే అదికూడా వస్తుంది. అమ్మ ఒక్కవుండేనా తీసుకోనివ్వదు. తీసుకుంటే కోప్పడి కొడుతుంది. అమ్మ మంచిదికాదు. నాన్నేమంచివాడు. కొత్తచొక్కాలు, బూట్సుజోడూ కొనిపెడతాడు.

# సంయోగము

## సురేశచంద్ర చక్రవర్తి

ప్రపంచమునందు గతి యొకటియుండుట యత్యావశ్యకమని తెలుపుటకో యనునట్లు ఝుణఝుణధ్వానముతో నిర్ఝరమొకటి ఆద్యంతములు లేనిదానివలె మహావేగముగాఁ బ్రవహించుచుండెను. ఆనిర్ఝర ప్రాంతమున నొక సమప్రదేశమందుఁ జిన్న కుటీరమొకటి కలదు. అందు యౌవనుఁడగు పార్వతీయుఁడొకఁడు నివసించుచుండెను. ఆ భిల్లునకు వేరు వేరు పుష్పములను, లతలను, పత్రములను గొనితెచ్చి పుష్పిత నికుంజమట్లు తన కుటీరము నలంకరించుటతప్ప వేరుపనిలేదు. అయితే వాఁడు ప్రభాతములందు మేల్కాంచి చుట్టుప్రక్కల పర్వతములమీఁది తుషారముపై ఉదయసూర్యుని బంగరుకిరణములు తళతళలాడునపుడు ఝరప్రాంతమునకుఁబోయి ఎవరికోసమో కుటీరమును

నిర్మించుకొని నిరీక్షించుచున్నట్లు కూర్చునియుండును. అట్లు నిరీక్షించి నిరీక్షించి పిదప సూర్యుని సువర్ణకాంతి కొండమంచుపై తళతళలాడుట మాని కౌష్యవర్ణముద్ధరించి వానిశిరమును జిటజిట లాడించినంతనే యతఁడు లేచి దీర్ఘ నిశ్వాసము విడిచి తన కుటీరమునకుఁ దిరిగివచ్చును. తదుపరి లతా పుష్పాదులకొఱకు బోవుచుండును.

ఈ రీతిని కొన్నిదినములు గడచెను. ఒకనాఁడతఁడు వెనుకటయట్టులా సెలయేటితీరమునఁ గూర్చుని చూచుచుండ నావలియొడ్డున నొక శిలాతలముపై తద్గర్భమును జీల్చుకొనివచ్చి పుష్పించిన పద్మమో యనునట్లు జవ్వనియగు సుందరి యొకతె యతనికిఁ గాన్పించెను.

ఆమెను గాంచినంతనె, "నీవెవ్వరికొరకింతకాలము నిరీక్షించుచుంటివో ఆసుందరి యీయామెయే" యని యతనికెవరో చెప్పినట్లయ్యెను. తత్క్షణమే యాతని హృదయము సార్థకతారూపమగు సంతోషముచే నుప్పొంగెను. అతఁ డనిమేష నేత్రములతో నపరిచితయగు నా యౌవనవతివంక చూడసాగెను.

అపరిచితయా యీయామె? కావచ్చును! కాని యీయామెవలె పరిచితలెవ్వరులేరు. ప్రతిసంవత్సరమును, ప్రతిదినమును ప్రతిక్షణమును నే యువతికై తాను నిరీక్షించుచున్నాఁడో ఆసుందరి ఆయానందదాయిని యీయామెయే!

ఈపరిచయము వారల కొకనాఁటిదికాదు; బహుకాలముల నుండియు, బహుజన్మములనుండియు నున్నదియే! ఆమె ప్రస్తుత మపరిచితవలె నున్నను నతనికంతయాత్మీయు లింకెవరు లేరు.

ఆభిల్లుఁడిట్లు పలుకరించెను: "ఓసుందరీ! నీపేరేమి? నీవెచ్చటనుండి వచ్చుచున్నావు?"

ఆసుందరి ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను: "నాపేరు తరుణి, నేననాదిగా బహుదూరమునుండి వచ్చుచున్నాను."

"అనాదిగానా? అయితే నేనింతకాలము నిరీక్షించుచున్నది నీకోసమేనా? బహుదూరమునుండియా! అవును. దిగంతములనుండి మ్రోగుచున్న నీకాలియందెల ఝుళంఝుళశబ్దమును వినియున్నాను. ఈయరణ్యములో బహుదూరమునుండి విసరుచున్న నీకుంతలసౌరభము నాఘ్రాణించి యున్నాను. నిర్మలాకాశమందు బహుదూరమునుండి నీ నీలనయనముల అపారగాంభీర్యము నుపలక్షించి యున్నాను. ఆమెవ్వ నీవేనా? అయితే నీవునాదానవు. ఓతరుణీ, మనకు సంయోగమెట్లు కలుగును? నీవాయొడ్డున నుండనేల? ఈయొడ్డునకు రాలేవా?"

"ఆర్యా! మీపేరేమి?"

"నాపేరు కల్పశేఖరుఁడు."

"కల్పశేఖరా! మీచిన్నికుటీరములో నన్ను నిలుపఁగలరా? అందు నాకు చోటుచాలదు. అయినను, దుస్తరమగు నీసెలయేటిని నేనెట్లు దాటఁగలను. దీనివేగమునకు మదపుటేనుఁగులుసైతము కొట్టుకొనిపోవును. కనుక మీరే యీవలకురండు. ఆదరిని మీకాకుటీరమేకదా ఆవరణము. ఈదరిని ఆవరణమేమియులేదు. ఈవైపున కావలసినంత గాలి, వెలుతురునున్నవి. సృష్ట్యాదినుండి యిప్పటివరకు మెట్లవలెనున్న పర్వతములు మౌనముధరించి మహాస్వప్నములో నున్నట్లున్నవి. అనంతమైన శాంతియున్నది. ఈకొండలకుపైనను ప్రక్కను బయటను లోపలను తెన్నులు మన్నెలు వాయులు లోయలు అనంతములైన భూములు కలవు. ఆతెన్నులందు మన్నెలందు లోయలుగుండ వాయులమీదుగా హద్దులేని భూములందు ప్రయాణము చేయుదము. కల్పశేఖరా! మీదరికి రారాదా?"

"విన్నాను".
"ఆధ్వని ఎవరిది?"
"మహాప్రళయధ్వానము అనుకొనెదను!"
"ముందుపోవుటకు నీకు ధైర్యమున్నదా?"
"నీవున్నంతవరకు నాకేభయములేదు"
"అయితేబయలుదేరు"

మరల నిరువురు పోవసాగిరి. ముందునకు పోయినకొలఁది ఆభీషణ గర్జనముప్రబలముకాఁజొచ్చెను. నడుమనడుమ మార్గము దుర్గమముగా నుండెను. అయితే వారిప్రయాణమంతము కాలేదుగదా!

ప్రాచీరమువంటి మహాపర్వతమొకటి అడ్డుపడుటచే వారిఁక ముందు పోలేకపోయిరి. ఎటుచూచినను దానికంతము కనఁబడుటలేదు. ఎత్తెంతయో తెలియుటలేదు. మానవకాంక్షా పరిసమాప్తికై విశ్వకర్మయోజన దీర్ఘము, యోజనౌన్నత్యము గల ఈపర్వతేంద్రమును నిర్మించెనా యేమి! మానవమార్గ మంతటితోఁ దుదముట్టినది. అతిక్రమించుటకు సాధనాంతరములేదు. ఆపర్వతాగ్రమునుండి జలప్రపాతమొకటి భీషణ గర్జనముతో క్రిందికి పడుచుండెను. ఈజలప్రపాతమే నిర్ఝరముగా మారినది. ఈప్రపాతశబ్దమే పర్వతములందు ప్రతిధ్వనించి భీషణగర్జనముగా మారినది. ఈజలప్రపాత నిర్ఝరసంగమస్థలమందు వారిరువురు కింకర్తవ్యతావిమూఢులై నిలిచిపోయిరి. కల్పశేఖరుఁ డాలోచింపఁదొడఁగెను.

నేటివరకు సంయోగమెప్పటికైన కలుగునని ఆశయుండెడిది. నేఁడది కూడలేదు. మనస్సులు కలిసినవి; కానిశరీరములు కలియుటకిపు డుపాయముకూడలేదు. ఇఁక జీవించి ప్రయోజనమేమి? అప్పుడే అధైర్యపడవచ్చునా? ప్రథమకష్టమునకే చిరప్రయత్నము వ్యర్థమైనట్లెంచవచ్చునా?

అసంభవము! కల్పశేఖరుని అంతరాత్మ అట్టిదంగీకరింపదు. దురారోహమగు నీపర్వతము దాట మార్గమే లేదా- ఉపాయమే లేదా. జలప్రపాతమే నిర్ఝరమున కుత్పత్తిస్థానమగుటచే ఈ సెలయే రంతమైన దనుట స్పష్టము. ఈపర్వతముదాటిరేని వారియాత్ర ముగియును, సంయోగమును గలుగును. కల్పశేఖరుఁ డటునిటు పరికించెను. చూపుమేర వరకు నిష్ఠురతాప్రతిమూర్తివలె ఈపర్వతమే యతనికిఁ గనఁబడుచు, "నీకాంక్షకు, ఉద్యమమునకు, ఉత్సాహమునకు ఇదే పరిసమాప్తి! మానవుఁడా! పొమ్ము. నీమాతృక్రోడమునకుఁ బొమ్ము!" అని బెదరించు చున్నట్లుండెను.

ఆసమయమున నపూర్వుఁడగు సుందరపురుషుఁడొకఁడు వారికి ప్రత్యక్షమయ్యెను. అతఁడు విస్మయవిస్ఫారితనేత్రములతో వీరిచటి కెట్లు రాఁగలిగిరో యూహింపలేనివానివలె ఒకసారి కల్పశేఖరుని వంకను మఱొకసారి తరుణివంకను జూడసాగెను. కొంతసేపటికతఁడు నీవెవరవని కల్పశేఖరునిఁ బ్రశ్నించెను.

"నేను మానవుఁడను."

"నీవెవరు?" అని తరుణిని బ్రశ్నించెను.

"నేను మానవిని"

"మీరెక్కడనుండి వచ్చుచున్నారు?"

కల్పశేఖరుఁడిట్లుచెప్పెను. "ఎక్కడ పువ్వులు పుష్పించి ఎండిపోవునో మనుష్యులు జన్మించి మరణింతురో, ఎక్కడ ఘటనము విఘటనమగునో విఘటనము ఘటనమగునో, ఎక్కడ ఆశ కంతము సంకల్పమునకు హద్దు సాహసమునకు పరిమితిలేవో అక్కడనుండి వచ్చుచున్నాను."

"అయితే మీరు మర్త్యులా?"

"అవును."

"మీకిచట నేమికావలెను?"

"మీరెవరు?"

"నేను గంధర్వుఁడను"

"అయితే వినుఁడు; మాకు సంయోగము కావలెను. మేము అయి దేండ్లనుండి ఈ కొండవాగున కిరుప్రక్కల ప్రయాణము చేయుచు న్నాము. అప్పటినుండి మమ్మిది తీవ్రమైన శిరోవేదనవలె బాధించు చున్నది. మాయాత్ర ముగిసిన దనుకొంటిమి. ఈ జలప్రపాతము పడుచోట ఈ నిర్ఝరము మాబాధయు నిశ్శేషములై మాకు సంయోగ మగు ననుకొంటిమి."

"అసంభవము!"

"ఏది అసంభవము గంధర్వా?"

"మీకు సంయోగము."

"ఎందుచేత గంధర్వా?"

"ఎందుచేతనో నేనుచెప్పలేను. మీ రాకాంక్షించు సంయోగము మాత్ర మసంభవమని నాకుఁ దెలియును. ఓ మానవీ మానవులారా! నామాట వినుఁడు. మీరీ సంకల్పముమాని తిరిగి వెళ్ళుడు."

మానవుఁడు శిరముపైకెత్తి గంభీరస్వరముతో, "ఎంతమాత్రము మానఁజాలము!" అని పలికెను.

మానవి అధోవదనయై మృదుస్వరముతో, "ఎంతమాత్రము మానఁజాలము!" అనెను.

కల్పశేఖరుఁ డిట్లనెను: "గంధర్వా, ఈపర్వతముదాటుటకు మార్గ ముగాని ఉపాయముగాని లేదా?"

"నీవు తిరిగివెళ్ళుము."

"ఈపర్వతమెక్కుటసంభవమా గంధర్వా?"

"నామాటవిని తిరిగి వెళ్ళుము"
"ఇది మానవుల కసాధ్యమా గంధర్వా?"
"అసాధ్యముకాదుగాని దుస్సాధ్యము."
"అయితే సాధ్యమే."
"నీయదృష్ట మెట్లున్నదో చూడఁదలఁచితివా?"
"అవును."
"ఎంతమాత్రము తిరిగిపోవుగా?"

"తిరిగిపోవుటెచ్చటికిగంధర్వా! ఇఁకపోవుట మృత్యువుకడకే! బాల్యమున దేనిచే అవ్యక్తానంద మనుభవించితినో, కైశోరమునందే యస్పష్ట కాంక్షాసిద్ధికై నిరుద్దేశముగా ప్రయత్నించితినో, యౌవనమునందీ యైదేండ్లనుండి ఏ కాంక్షామదము నా శరీరమందలి ప్రతిపరమాణువున కెక్కియున్నదో ఆ కాంక్షను త్యజింపమందురా, గంధర్వా! మానవుల మనస్సు మీ రెఱుఁగరు!"

"మంచిది, అయితేవినుము. ఈ పర్వతమెక్కుటకు మార్గమున్నది. కాని మితిలేని ధైర్యముకావలెను. నీకంత ధైర్యమున్నదా?"

"మానవుల ధైర్యము మీ రెఱుఁగరు."

"ఈ పర్వతము ప్రాచీరమువలె దురారోహమై ఆమడపొడవున నున్నది. మీరిరువురు ఇరుప్రక్కల పర్వతపాదము ననుసరించి పోవలయును. ఈకొండకు చివరలందు లోయలున్నవి. ఆ లోయలపైకి పోతిరేని దీనిని దాటుటకు మార్గములు కనపించును. ఆ మార్గముల వెంటఁబోయి కొండ దాఁటితిరేని ఒకగొప్ప హ్రదమును దాని తీరమున నొక గొప్ప శాల్మలీవృక్షమును కనపించును. ఆవృక్షముకడకుఁ బోయిన మీమనోరథములు నెరవేరును. ఆహ్రదమునుండియే ఈ ప్రపాత ముత్పన్నమగుచున్నది. 'ఇవన్నియు గుర్తుంచుకొని త్రోవలు

తప్పక పోతిరేని అచ్చట మీకు నిశ్చయముగా సంయోగము కల్గును."

"అయితే ఈప్రయాణ మెన్నిదినములు పట్టును?"

"ఎవరు చెప్పఁగలరు?"

గంధర్వుఁ డంతర్ధానమయ్యెను.

కల్పశేఖరుఁడు తరుణితో నిట్లనెను: "నీకంత సాహసమున్నదా?"

"ఉన్నది."

"లక్ష్యభ్రష్టవు కావుగదా?"

"కాను."

ఇరువురు నిరుపక్కల బయలుదేరిరి. ఎన్నిదినముల ప్రయాణమో ఎవరు చెప్పగలరు?

* * * *

ఒకనాటి సాయంకాలమున కమలేందీవరముల పరిమళము వీతెంచెను. కల్పశేఖరుఁ డపుడు గంధర్వుఁడు చెప్పినహ్రదము సమీపించితిననియు తనప్రయాణము త్వరలో ముగియుననియు తలఁచి ద్విగుణితోత్సాహముతో గబగబ నడువఁదొడఁగెను. నలుదిశల చీఁకటులు గ్రమ్ముచుండెను. హ్రదతీరము జేరి నిలచిచూడగా అతనికొక మహావృక్షముగపడెను. అంతనతఁడదియే యాశాల్మలీ వృక్షమనుకొని త్వరితముగాఁ బోయి దానిక్రిందఁ గూర్చుండెను. అంధకారము గాఢముగా వ్యాపించెను. ప్రకృతియంతయు నిశ్శబ్దముగా నుండెను. ఆయంధకారము ప్రళయకాలాంబుదముకన్న గభీరముగను ఆనిశ్శబ్దము మృత్యువుకన్న భీషణముగను నుండెను. అట్టిసమయమున నతని మానసము చింతాజాలమునఁబడి కొట్టుకొనసాగెను.

కల్పశేఖరునకుఁ బ్రయాణము ముగిసినది. కాని తరుణికో! ఆమె

యెక్కడ? ఆమె యాకఠినమార్గమున దురారోహమగు నాపర్వత మును దాటి తన గమ్యస్థానము—తన కామ్యస్థానముఁ జేరగలదా? కల్పశేఖరుఁడు మార్గాయాసమున కోర్చి విపత్తులను గడచి ఎన్నో యేండ్ల కీహ్రదతీరముఁ జేరఁగలిగెను. అబ్బా! ఎన్నివత్సరములు పట్టె నవి! అతఁడు తనజీవితమంతయు ప్రయాణమునకై వినియోగించినట్లె నది! కాని అంతసాహసము అంతధైర్యము తరుణి కుండగలవా! హా తరుణీ—తరుణీ!

కొంత సేపటికా నిశ్శబ్దతను జీల్చుకొని ఎవరిదో పాదధ్వనివినఁబడెను. కల్పశేఖరుఁ డుత్కర్ణుఁడయ్యెను. క్రమముగా నాధ్వని స్పష్టముకాసా గెను. అతనిదృష్టి ఆ కటికచీకటిని భేదింపఁగలిగెను. అంతనతని కొక మనుష్యమూర్తి ప్రత్యక్షమయ్యెను.

కల్పశేఖరుని నాడులందు రక్తము తాండవించెను. అతని హృదయ మున ననేక విద్యుత్పరంపరలు తటతట ప్రసరించెను. వెంటనే అతఁడా మూర్తిని సమీపించి యెఱుఁగనట్లు నీవెవరని అడిగెను.

ఆమూర్తి "నేను తరుణి" ననెను.

తత్క్షణమే వారి శరీరము లొక్కగాఢాలింగనమునఁ గలిసిపోయెను. చిరకాలవర్ధితమగు వారిహృదయపిపాసయు చిరకాల పరిపుష్టమగు వారి హృదయకాంక్షయు నొక్కగాఢచుంబనమున లీనమైపోయెను. వారి మనోరథము సిద్ధించెను. వారి చిరకాలశ్రమమంతయు నొక్క సారి తీరిపోయెను. ఆనందపరవశులై వారచటి శిలాతలమునఁగూలబడిరి. పిదప వారాలింగనాబద్ధులుగనే ఆపాషాణశయ్యపై నిదురఁజెందిరి. పాషాణశయ్యయా—కాదుకాదు. అదిపుష్పశయ్యకన్న కోమలమైనది.

మరుదినము ప్రభాతమగుచుండగనే కల్పశేఖరుఁడు మేల్కాంచెను. వెంటనే జరిగిన కథయంతయు నతనికొక్కసారి స్ఫురణకువచ్చెను.

అతఁడు తనజన్మము సార్థకమైన దనుకొనెను. తన సాధనకంతకును ఫలిత మగు నిక్షేపము కౌఁగిటనున్నదని యతఁ డానందించెను. ఆ యానంద ముతో నతఁ డొకసారి తరుణిముఖమువంకఁ జూచెను—ఇదేమిటి!

మార్గమున పడగనెత్తియాడు కృష్ణసర్పమును గాంచినంత నే మార్గ స్థుఁ డొక్క గంతువేసి అవలఁబడునట్లు కల్పశేఖరుఁ డామెకౌఁగిలి వద లించుకొని ఈవలకు దూకెను. పిదప నతఁడు వజ్రాహతునిపోల్కి శూన్యదృష్టితో రాత్రియంతయు తాను కౌగిలించుకొన్న యా తరుణి వంకచూడసాగెను.

నిద్రాభిభూతయగు నా తరుణి ఆలింగనచ్యుతకాగానే మెల్లమెల్లగా కన్నులుదెఱచి లేచికూర్చుండి కల్పశేఖరునివంకఁ జూచెను.

కల్పశేఖరుఁడు కర్కశస్వరముతో, "నీవెవర" వని యామెనడిగెను.

ఆమె, "నేను తరుణి" ననెను.

కల్పశేఖరుఁ డున్మత్తునివలె వికటహాస మొనర్చెను. ఆ హాసము ప్రేతలోకభీభత్స ధ్వానమువలె ప్రతిదిక్కునందును ప్రతిపర్వతము నందును ప్రతిధ్వనించెను. అతఁడు భయంకరచీత్కారముచేసి అంధ కారమువలెనున్న యామెముఖము వీక్షించి తిరస్కారసూచకస్వరము తోనిట్లనెను: "నీవా – నీవా – తరుణివి! ఆ వ్రేలాడుచర్మము, ఆ మెత్తు పండ్లు, ఆ యెండిన మొగము, ఆ పొట్టబుగ్గలు, కాంతివిహీనములైన ఆలో తుకన్నులు, రెల్లుపూలవలెనెరసిన యా వెండ్రుకలు, నీవా – నీవా – తరుణివి – !"

జరాగ్రస్తురాలగు నాపొలతి కరుణావిషాదసూచకమగు మంద హాసముతో మెల్లగాలేచిపోయి వానిహస్తములు పట్టుకొని హ్రదతీర

మునకుఁ దీసికొనిపోయెను. తదుపరి తనకృశాంగులితో జలమువంక చూపించుచు, "చూడుము కల్పశేఖరా, నీప్రతిబింబముఁ జూడుము" అనెను.

కల్పశేఖరుఁడు తనయాకారమును జూచుకొనెను. తనమేని చర్మమంతయు మాంసహీనమై ఎండి వ్రేలాడుచుండెను. లలాటమునల్లవడి వడలియుండెను. వ్రాలియున్న కనుబొమ్మలు కోటరగతములగు నయనములను గప్పుచుండెను. మంచుకన్న తెల్లనై శిరోజములు జడలుకట్టియుండెను. భుజస్కంధములు ఎముకలపై చర్మము పొదిగినట్లుండెను. తరుణీధ్యానములో నుండుటచే జరాక్రాంతుఁడైన కల్పశేఖరునకి వికారమింతవరకు తెలియలేదు. అతఁడేమియుననక ముఖమును హస్తములతో మూసుకొని అచ్చటనే చతికిలఁబడెను.



# ప్రేమ గీతములు

కనులపండువుగా నిన్నుఁ గాంతునేని
అధరము తపించి యమృతదాహమ్ము గోరు
తనువు కంపించు నోట గద్గదిక పొడము
తన్మయత నొంది నిన్ను సైతమ్ము మఱతు.

ప్రసవకుట్మలకాతి సౌరభములైన
భావముల నీవు తలఁపునఁ బారువెడల
గండపార్శ్వము జారి వక్షమ్ముఁ జేరి
బాష్పజలము సముద్రరూపము ధరించు.

అమృతమధురంబులు ఝరీరయంబు లగుచు
మోహవాంఛలు నెమ్మదిఁబొడమినపుడు
దీర్ఘ నిశ్వాస శోక సందీప్తమైన
పాటఁబాడుదు నున్మత్త బాలులీల.

ముగ్ధ లలితాంగి మూర్ఖుఁడు ముద్దుగొన్న
నధరము కపోలములు భగ్నమనవె నీకు
భానుసంక్లిన్న మగు బింబఫలముపగిది
ఇపుడు సంక్షోభమందు నాహృదయమట్లు.

మృదుల కుచమంజరీద్వయి నెదధరించి
భుజభుజగ పాశబంధానఁ బూంచనిన్ను
గాఢ ఝుంఝానిలాహతిఁ గదళివోలె
కంపమున సౌమ్యమూర్తి భగ్నంబు గాదె?

పరమశోభాస్పదా, నీయభాగ్య మేమి
కఠిన కైవర్తు వల మత్స్యకాంత పగిది
శబరుచేఁ జిక్కి-నకురంగి సామ్యమునను
దీనవై హీనజనుని యధీనవైతి!

మధుర స్వేచ్ఛంద వృత్తి నెమ్మదిఁ జరించి
వాహినీపతిఁ జేరుప్రవాహజలము
సేతుబంధ మొనర్చి కుత్సితజనంబు
ఆత్మధనమని గర్వించి యనుభవించు.

కాలమేఘుఁడు చంచలాకాంతఁ బొదువు
మధుకరుఁడు సూనవనితఁ జుంబనము సేయు
అమృతకరుఁడు దమస్వినుల ననుభవించు
ప్రకృతియే నిన్నుఁబోలె నభాగ్య యేమొ!

వికచసుమ సౌరభమువోలె విపినవీధి
స్వచ్ఛ ఝరీరీతి నిర్జనస్థలమునందు
రసవిహీనుల గీతస్వరమ్ము మాడ్కి
విధి సృజించెను వ్యర్థజీవినిగ నిన్ను!



శ్రీ రాధావల్లభో విజయతే !

# గొల్లకృష్ణుఁడు - గోపికలు

సుంకర వెంకటేశ్వరరావు

గోపబాలుర నెల్లరఁ గూడి నీవు
ఆలమందలఁ దోలుక యరుగు నపుడు
చల్ది చిక్కంబు భుజమున జాఱవిడిచి
నొసటఁ గస్తురితిలకంబు పసచెలంగ
వైరిముడి యొకప్రక్కకు వాలియుండ
నెమలి పింఛంబు దానిపై నీటు గులుక
నయన యుగమందు జిగజిగల్ నాట్యమాడ
ఫాలతలమున ముంగురుల్ పరువు లెత్త
మోవియందునఁ జిఱునవ్వు మొలకలెత్త
కర్ణములఁ గుండలంబులు కాంతు లీన
మెడను గురువిందపూసలు మెఱయుచుండ
రక్తమందార మాలలు రంజిలంగ
వెడద వక్షఃస్థలం బెంతొ వెలుఁగు దోప
హస్తమునఁ గంకణాల్ వింతయంద మొసఁగ
ఐదు వ్రేళ్ళకు నుంగరా లమరియుండ
విశ్వజాతంబు కుక్షిలో వెలసియున్న
కారణంబునఁ జిఱుబొజ్జ కదలుచుండ
పుట్టమును బొజ్జకిందుగాఁ బొందుపఱచి
పీతచేలంబు నడుమున బిగియఁజుట్టి
దట్టిలో శృంగవేణువుల్ దిట్టపఱచి
అందియలు కొంత కాళ్ళకు నంద మొసఁగ
చిఱుతగజ్జియ లల్లన చిందులిడగ

గొల్లపిల్లల నవ్వించు నల్లవాఁడు
ఏనుఁగుంగున్నవలె దారి నేఁగుచుండె.

* * *

ఇరుగు పొరుగులఁ గల గొల్లగరితలెల్ల
బాట కిరుప్రక్కలం గల బోఁటులెల్ల
చల్లలం జిల్కుచున్నట్టి జాణలెల్ల
మోహవార్ధిని మున్గిన ముగ్ధలెల్ల
పుష్పశరపీడచే రాత్రి పొక్కిపొక్కి
మొద్దునిద్దుర జెందిన ముదితలెల్ల
"నల్లగొల్లని జూడక తెల్లవాఱె!"
దనుచు మదిఁబొక్కి సుక్కిన యతివలెల్ల
వెన్నదిను చిన్నికృష్ణుని వేడ్కతోడఁ
గాంచు భాగ్య మపేక్షించు కాంతలెల్ల
వేణుగానామృతము గోరు వెలఁదులెల్ల
కూర్మిమై మజ్జనంబాడి కొప్పువెట్టి
కొప్పుపైఁ బుష్పగుచ్ఛముల్ గూర్చిచుట్టి
కుంకుమపు బొట్టులంబెట్టి గోపసతులు
పట్టుపుట్టంబులను వేడ్కఁ గట్టుకొనుచు
గుత్తమగు పట్టురవికలు కోరితొడిగి
కంఠి కాసులు ముత్యాలకట్లదండ
మేల్మిబంగారు హారముల్ మెడనువైచి
కృష్ణసందర్శనం బనుతృష్ణ వారి
వెంటనేయుండి సారెకు గెంటుచుండ
చల్లలమ్మెడు నెపమున జాఱువారు
పూవులంగోయు మిషతోడఁ బోవువారు

"అమ్మ, పోయెద నీళ్ళకం" చనుగువారు
"ఎవరు పిలిచినవా? రిదె నేఁగుదెంతు
పోకుమా, చెలి" యనువంకఁ బోవువారు
నల్లదొంగ నపేక్షించు గొల్లవారు!

* * *

పసులమేపుక చల్లనిపట్టుచేరి
స్తిమితముగ నీవు కూర్చున్న స్థితినిగాంచి
గుండ్రిముగ నీదుచుట్టును గూరుచున్న
గోపబాలుర చుట్టును గోవులుండఁ
గాంచు భాగ్యము గల్గెడు కామినులకు
బద్మతుల్యముగాఁ గనుపండువయ్యె.
విశ్వమోహన మొనరింప వేణు వపుడు
కరములంబూని మోవిని గదియనుంచి
భావగీతము హాయిగాఁ బాడునపుడు
నెమరులనుమాని పసులు నీనేర్పుగాంచెఁ
జిలుగుఁబల్కుల మఱచెను జిలుకపిండు
నేర్వఁగానెంచె నాట్యంబు నెమిలిదండు
తేనియలుద్రావ మఱచెను దేటిగండు
కోయిలలు "కూయి" యన మాని కూరుచుండె.

* * *

చూడవచ్చిన యాదవసుదతులపుడు
గొల్లపడుచుల మనసులు చిల్లులుపడ
మురళి మ్రోయించు కృష్ణునిమోముగాంచి
తనివితీరని మూలాన తలలు వాంచి
మురళినాదంబు వినివిని ముద్దులొలుకు

చేయుగా నచ్చటి వనదేవత లీదివ్య డెవరోయని వింతపడుచుండుగు. గ్రీష్మమధ్యందినార్కుడు నభోమధ్యమున దేదీప్యమానుడై వెల్గుచుండు కొన్నిమధ్యాహ్నసమయముల నతని గీతస్వరములు గిరిగహ్వరాంతరములఁ బ్రతిధ్వనులీనుచుండును. అవ్యక్తప్రదేశమునుండి వచ్చి యవ్యక్తదేశమునకుఁ బోవు సూర్యభగవానుని కెదురుగాఁ గూర్చుండి యుదయాస్తమయ సమయముల నతడు పాడుచు ప్రకృతిని సమ్మోహపరచుచుండును. మరియు నొక్కొక్కప్పు డతడు మునులు యాగములుచేయు యజ్ఞవాటికలకుఁబోయి యపరసామగానములగు తన గీతములచే నచ్చటిఋషుల కాశ్చర్యము కలిగించుచుండును. ఇట్టి శాంతమోహనప్రదేశములేకాక యతని గానమాహాత్మ్యమును జనసమూహములతోఁ గలకలలాడుపురములును గొన్నివేళల ననుభవించుచుండెడివి. అతడు పురవీథులఁ బాడుచుఁ బోవుచుండ నర్థచింతాపరాయణులగు పురజనులాతని గీతరాగబ్రహ్మానందము ననుభవించి తాత్కాలికముగ ముగ్ధులై యిహలోకమును మరచి కొంతసేపటికి సుషుప్తినుండి మేల్కాంచినవారివలెఁ దమపనులఁ బోవుచు నీయద్భుత పురుషుఁడెవరాయని యాశ్చర్యము నొందుచుందురు.

కాని భార్గవుని నొక్కరును బలకరింపరు. అతనిపేరుగాని యూరుగాని పుట్టువుగాని యెవరికిని దెలిసికొను వాంఛకలుగదు. అతని కవిత్వమువలెనే యతని విషయమంతయును అద్భుతమై యానందమును గలిగించుచుండుటచే నతనినెవ్వరు నేమియుఁ బ్రశ్నింపరు. పంచమస్వరమున మధురాలాపములు చేయు కోయిల పేరడుగువారెవరు? స్వేచ్ఛగా గంతులువేయుచు నొకకోననుండి యొకకోనకుఁ బరుగెత్తు నెలయేటి కూరెక్కడిది? సత్యప్రతిపాదనముచేయు నోంకారమునకు పుట్టువేల తెలిసికొనవలెను?

లోకమున భార్గవుడు గానముచేయనివిషయము లేదు. గభీరమగు సముద్రమును అనంతమగు బ్రహ్మాండమును విచిత్రమగు భూమియును అజ్ఞేయములగు భువనములును అశేషములగు గోళములును అతడు వర్ణించుచుండును. అతని కవిత్వమున లీనమగుట కెట్టి యుదాత్తవస్తువును గొప్పదికాదు; ఎట్టి పరమపరమాణువైనను నీచముకాదు. సృష్టిలోని సమస్తమును అతని సంగీతరసమున నేకమై ప్రవహించును. అతడేది గానముచేసినను, సామాన్యవిషయమైనను విశేషవిషయమైనను, అద్భుతమావహింపఁజేయును. అతడు జ్ఞానియో అజ్ఞానియో యెవ్వరును జెప్పలేరు. భూమియందును ఆకాశమందును, సముద్రమందును, అరణ్యమందును, ఎడారియందును జనపదమందును, అంతరాత్మయందును కాలమందును గల యజ్ఞేయమగు నద్భుతమాతని నావహించెను. ఆయద్భుతానుభూతియే యతనికవిత్వమున రూపొంది రాగరసమునఁ బ్రవహించుచుండెను.

౨

బాలరూపుడై లోకమందలి యద్భుతములను గానముచేయుచు సంచరించుభార్గవునకు లోకమందలి యద్భుత మంతకంతకు భారముకాఁజొచ్చెను. అతనికేగాక యతనిమూలమున సమస్తప్రకృతికి నానందము కల్గించుచుండిన యజ్ఞాతమగు నా సృష్ట్యద్భుతమే యతనికిఁ గొంతకాలమునకు దుస్సహమయ్యెను. భూతభవిష్యద్వర్తమానములు తెలిసికొనినఁగాని యతనికా భారముతీరి తృప్తికలుగునట్లు తోచలేదు.

ఇట్లుండ నాఋషిపుత్రుని కొకదిన మాకస్మికముగా కంఠస్వరము గద్గదమయ్యెను, హస్తాంగుళులు కంపించెను, మనసు స్తంభించెను. తుదకాతని విపంచీతంత్రులు సడలి స్వరహీనములయ్యెను.

భార్గవు డాపైన నొక్క-క్షణమైనను అందు నిలువలేకపోయెను. సృష్టి యద్భుతమైనదను జ్ఞానమతనికిఁ జాలలేదు. కాలస్వరూపమును దెలిసికొనవలెనను తృష్ణదుర్భరమైనది. ఎప్పుడు వీణాస్వనమాగిపోయెనో యాక్షణముననే యతడు త్రికాలజ్ఞుడును సాక్షాన్నారాయణ స్వరూపుడుననగు వేదవ్యాసుని సేవింప నార్తుడై పరుగెత్తెను. అతడప్పుడాముసీశ్వరుని చరణారవిందములు సేవింపవలెనను చింతతప్ప నితరము మరచియుండెను.

వేదవ్యాసుడును దీనాననముతోఁ బరుగెత్తుకొని వచ్చుచున్న యా ఋషికుమారునిఁజూచి, "ఓభార్గవా! అదృష్టశాలి వగునీ కీదైన్యము తోఁ బనియేమి?" అని ప్రశ్నించెను.

భార్గవుడు వ్యాసునికి వందనముచేసి "మహాత్మా! భూతభవిష్యద్వర్తమానములను దెలిసికొనుశక్తి త్రికాలవేదులగు తమయొద్దఁ బొందుట కీదీనుడు తమ పాదకమలముల నాశ్రయించుచున్నాడు." అనెను.

"భూతభవిష్యద్వర్తమానములతో నీ కేమిపని? ఇట్టిపిచ్చియూహలు మాని యద్భుత రసమొలుకు నీ కవిత్వము నాకు కర్ణపేయము చేయుము!"

"నేను సృష్టిలోని యద్భుతము సహింపలేకున్నాను. ఈ యద్భుతము చెదరిపోవునట్లు నన్ను త్రికాలజ్ఞునిఁ జేయుము."

"త్రికాలజ్ఞత నీకు లాభముకలిగింపబోదు. నామాటనమ్ముము."

"మీమాట నేను కాదనను. కాని యీయద్భుతభారమున నేను కుంగిపోవుచున్నాను. నాకులాభమైనను నష్టమైనను కాలజ్ఞత కలుగువరకు మీపాదములు విడువను!" అని భార్గవు డతికరుణముగాఁ బ్రార్థించెను.

వేదవ్యాసుడు జాలిపొందెను. భగవానుడు దీర్ఘకాలము ధ్యానించి యిట్లనెను: "వత్సా, లెమ్ము. ఆత్మఘాతియగు కోరిక నీవు కోరుటచే నా కిచ్చుటకు మనసొప్పకున్నది. ప్రస్తుతము భూతకాలజ్ఞత నీకిచ్చెదను. ఇప్పటికి దీనితో తృప్తినొందుము — నీ కన్నులుమూసికొనుము!"

భార్గవుడు మహాప్రసాదమని కన్నులు మూసికొనెను. వ్యాసభగవానుడు తనహస్తములతో మృదువుగా నతనికన్నులు స్పృశించి యిట్లు బొమ్మనెను.

భార్గవుడు కన్నులుతెరిచి చూచునప్పటికి వేదవ్యాసు డదృశ్యుడయ్యెను. అంతట నతడు తన్నుదాజూచుకొనగా బాలరూపము మారి కౌమారావస్థ వచ్చియుండుటకు మిక్కిలి యచ్చెరువొందెను. కాని యతనికి భూతవిషయము లన్నియు కన్నులగట్టినట్లుండెను. సమస్తములగు పురాణములును ఇతిహాసములును అతనికిగరతలామలకము లయ్యెను. అతని యద్భుతభారమును దగ్గిపోవుటచే యథాప్రకారమతడు తనవీణను దీసికొని సడలిన తంత్రులు సరిచేసి మనోహరముగా గానముచేయుచు బయలుదేరెను.

కౌమారావస్థ పొందిన భార్గవునిజూచి యందరు నాశ్చర్యము నొందిరి. అతని గీతములును మారిపోయినవి. ప్రకృతిని సమస్తమును తనలో లీనమొనరించుకొను నద్భుతమగు మధురిమ యతని సంగీతమున నంతరించినది. అతడును విజనప్రదేశములబాడుట చాలించెను సృష్టిస్వరూపమును శ్రీ మహావిష్ణువు నవతారములును సాంబసదాశివుని మాహాత్మ్యమును మహారాజుల చరిత్రములును పురాణములును ఇతిహాసములును ఆ ఋషికుమారుడు గానముచేయనారంభించెను

జనులు గుంపుగుంపులుగా నతనిని వెంబడించుచు భూతకాలజ్ఞుడగు నతడు పాడెడివిచిత్రవిషయముల నానందముతో నాకర్ణించుచుండిరి.

3

కొంతకాలమిట్లు గడచెను. భూతకాలమునఁ బాడవలసిన వన్నియు నతడుపూర్తిగా గానముచేసెను. అంతట భార్గవుని యాత్మలో నిన్నాళ్లు నణగియున్న యసంతృప్తి మరల తలచూపసాగినది. భూతజ్ఞత యతనికి సంపూర్ణతృప్తి కలిగింపలేదు. అవిదితములై యద్భుతము కలిగించు భవిష్యద్వర్తమానముల భార మతడు భరింపలేకపోయెను. తుద కొకనాడు మరల నతని విపంచి పల్కుటమానెను.

అంతట తత్తరముతో భార్గవుడు మరల వేదవ్యాసుని సన్నిధికిఁ బరుగెత్తెను. వేదవ్యాసుడు భార్గవుని యాగమనకారణ మెరిగి విషణ్ణుడయ్యెను. "అయ్యో భార్గవుడా! నీయానందమును బోఁగొట్టుకొనుటకు వచ్చితివా?" యని యత డడిగెను.

భార్గవుడు వందనముచేసి "దేవా! నా మనోభారమును లఘువొనరించుకొనుటకు వచ్చితిని. మీ కరుణాతిశయముచే భూతజ్ఞుడనైతిని. నాకు భవిష్యద్వర్తమానజ్ఞానము గూడఁ బ్రసాదింపవే!" అని ప్రార్థించెను.

వేదవ్యాసుడు చేయునదిలేక చివరకు, "ఇప్పుడు వర్తమాన జ్ఞానము నిచ్చుచున్నాను. ఇక తిరిగిమాత్రము నాయొద్దకు రావద్దు!" అని కఠినముగాఁబల్కి మాయమయ్యెను.

భార్గవుడు మరల సంతోషముతోఁ దనవీణ తీసికొని బయలుదేరెను. అతనికిప్పుడు యౌవనావస్థవచ్చినది. అతని కెల్లప్పుడును వర్తమాన

స్థితి యంతయును దెలియవచ్చుచుండెను. వర్తమానకాలమునుగూర్చి యు వృత్తాంతములగూర్చియు నతడు పాడసాగినాడు. కాని గీతము నందుc బూర్వమతనికిc గల యానంద మంతరించి సంతోషముగా మా రినది. జనులును అతని గానము సంతోషముతో నాలకించి ప్రత్యక్ష ముననను పరోక్షముననను అతనిని అతని కవిత్వమును బ్రస్తుతింపసాగిరి. "ఈ యువకుని గానము అజ్ఞాతములగు కృత్రిమమార్గములువదలి సరి యగు మార్గమున నిప్పటికిc బ్రవేశించిన," దని యందరును బ్రశంసించిరి.

క్రొత్తగా తనకుగల్గిన వర్తమానజ్ఞతగాని జనులుచేయు స్తుతులు గాని యాయువకుని కెక్కువకాలము తృప్తినీయ లేదు. అవి త్వరలో నే యతనికి విసుగుపుట్టించి కష్టము గలిగించెను. అతడు కొద్దికాల ముననే బడలినవానివలె జూపట్టెను. హస్తములు నిశ్చేష్టములైనవి. నాలుక యెండిపోయినది. వీణాస్వర మాగిపోయెను. మరల భావిజ్ఞాన తృష్ణ యతని హృదయమును వేధింపసాగెను. మహాత్ముడగు వేదవ్యా సుడు తనయొద్దకు మరలరావద్దని యాజ్ఞాపించినది జ్ఞప్తికిc దెచ్చు కొని కింకర్తవ్యతా విమూఢుడై యతడు కొంచెముసే పనుమానించు చు నిలుచుండెను. కాని యతని పాదము లతనికిc దెలియకుండగనే యతనినిc దీసికొనిపోయి వేదవ్యాసుని యెదుట నిలిపెను.

౪

నీలవర్ణుడగు వేదవ్యాసునిమూర్తి యిప్పుడు మునుపటి సౌమ్య తను వదలినది. అతని ముఖమునc గఠినభావము వ్యక్తమగుచుండ నతడు భార్గవుని దీక్షముగాc జూడసాగెను.

అట్టి వ్యాసుని యాకారమును జూచి భార్గవుడు సంభ్రమించెను. అతని సర్వాంగములను స్వేదాంకూరములు వ్యాపించెను. కంప మొందు స్వరముతో భార్గవుడు, "భగవన్, మీయాజ్ఞ నుల్లంఘించిన యీ శిష్యుని యపరాధమును మన్నింపవలెను. ఈ దీనుడు చేయఁ గల్గినది వేరేమియు లేకపోయినది!" అని యతికరుణముగా బల్కి రోదనము చేయనారంభించెను. అశ్రుధార లాయువకుని నేత్రాబ్జములనుండి ప్రవహించి యతని విపంచినిగూడఁ దడిపివేసెను.

వేదవ్యాసు డతని యాదీనాకారము చూచి దయాపరిపూర్ణుడయ్యెను. ఆతని ముఖమునందలి కాఠిన్యము సడలెను. అజ్ఞాతవిషయములు తెలిసికొనవలెనను తృష్ణ యావిర్భవించినపిమ్మట నది యసంపూర్ణ జ్ఞానముతోఁ దృప్తినొందదని యతనికి స్పష్టముగాఁ దెలియును. ఐనను భార్గవుని యాత్మనాశనమునకు దాను కారణమగుటకుఁ గూడ నతని కేమాత్రము నిష్టము లేదు.

"వత్సా! నీ విప్పుడు డడుగునది నీసర్వస్వనాశనమునకే సుమా! భవిష్యద్జ్ఞానము శుభప్రదము కాదు. అంతమాత్రమైనను లోకమున నజ్ఞాతమై యద్భుతముఁగల్గించు విషయ మున్న నేకాని కవితాత్ముడవగు నీవు జీవించుటయే దుర్లభము."

వేదవ్యాసుడు పల్కిన యీవాక్యములు విని భార్గవు డేమాత్రమును జలింపక స్థిరుడై, "మహాత్మా, నాకోర్కి సంపూర్ణముగా సిద్ధింపజేయుడు!" అనెను.

వేదవ్యాసు డామాటలువిని కొంచెముగా సంచలించెను. భార్గవుని యం దతనికిఁగల యగాధమగు ప్రేమాతిశయ మాతని శంకింపఁజేసెను. కాని వెంటనే యాలోకైకగురుడు హృదయము దృఢపరచుకొని

"ఇదిగో, నీకర్మానుగుణమగు ఫలమనుభవించు!" మని భార్గవుని నేత్రములు స్పృశించి యదృశ్యుడయ్యెను.

భవిష్య జ్జ్ఞానము కలుగఁగనే భార్గవుడు కఠోరస్వరములో కెవ్వు, మని కేక వేసెను. అతనిచేతినుండి యెన్నడును దొలగి యెరుగని యాది వ్యవీణ జారి భూమిపైఁబడి బ్రద్దలయ్యెను. తంత్రులన్నియుఁ దుత్తుని యలుగా తెగిపోయెను. భార్గవునికి వార్ధకము వచ్చినది. అతని కేశములన్నియుఁ బలితములయినవి. అతడు త్రికాలజ్ఞుడయ్యెను. అతనికి లోకములో నద్భుతమనునది లేకుండ నశించెను. అంతట గ్రీష్మాగమమున నల్పజలాశయమువలె నతని హృదయము శూన్యమయ్యెను.

* * * * *

మరల నీలోకములో భార్గవుని గీతాస్వర మెక్కడను వినఁబడలేదు. అతని గానమాధురి శాశ్వతముగా ప్రపంచమునుండి యంతరించెను. కాని యతని సంగీతమున బ్రహ్మానందము నొందిన ప్రకృతి పూర్వమైత్రిస్మరించి యిప్పటికిని నిరంతరము నిట్టూర్పులు విడుచుచు నప్పుడప్పుడు కన్నీరు కార్చుచుండును.



# మిత్రస్మృతి*

శ్రీ శేషాద్రి రమణ కవులు

కలకలలాడు నీనగుమొగం బిఁకఁ గానఁగరాదు, భావమం
జులమగు నీమృదూక్తి చెవిసోఁకదు మాకిఁక, నీప్రశాంతపే
శలరమణీయమూర్తి కనఁజాలునదృష్టము కల్గ దింక, నీ
చెలిమికి బాష్పతర్పణముఁ జేసెద గైకొను రాజశేఖరా!

మనములు రెండు నొక్కటయి మూర్పడ, నంకములేని చెల్మితో
దినములు వాసరంబులును దీర్చితి మొక్కతలంబునందు, దై
వనిహతి నొందఁగా, విజయువాడకు నీ వెపుడేగినాఁడవో
మనచెలికార మప్పుడె సమగ్రత నొందెను రాజశేఖరా!

తెలుఁగునఁ జక్కఁగా గవితఁ దీర్పఁగఁజాలితి, వాంగ్లభాషయన్
జలధిఁ దరింపఁగల్గితివి, సంస్కృతభాష పఠించుచుంటి, వీ
ఫలములనన్నిఁటిం బ్రజకుఁ బంచియొసంగఁ దలంచుచున్న, నీ
దలిరులఁ ద్రుంచుకైవడి విధాతృఁడు ద్రుంచెనె? రాజశేఖరా!

చదువుచునున్నపొత్తములు సాంగము జేయఁగలేదు తావకా
భ్యుదయముఁ గోరుమాత కెద,నూఱట చేకుఱలేదు సాహితీ
వదనము తావకీన రసవత్కవితానవభావభావనా
స్పదమయిమించలే దపుడె చావు వరించెనె? రాజశేఖరా!

---

* సాహితీసమితి సభ్యుఁడగు చామర్తి రాజశేఖరరావు మరణమునకు సభవారెంతయు విచారపడుచున్నారు. ఈతని చరిత్రము ముందుసంచికలో సంగ్రహముగాఁ బ్రకటింపఁబడును.

—త. శి. శా. సభాపతి.

ఎన్నఁడు బాడెనో యదుకులేశ్వరుఁ డల్లనఁ బిల్లగ్రోవి య
య్యున్నవరాగమాలికల నన్నిఁటి "సాహితి"లో లిఖించి మా
కన్నులముందుఁ జూపి తెలగాన రహస్యము తావకీనరూ
పోన్నతి కృష్ణవేణునినదోదధిఁ జేరెనె? రాజశేఖరా!

పొడమిన మూడునాళులకుఁ బోయెను దల్లి కృపార్ద్రచిత్తయై
కడుపునఁ గన్నబిడ్డవలెఁ గాంచెను నీపెదతల్లి పెంచి పే
రిడి చదివించి నేఁడు మరదృష్టఫలంబున నిల్వనీరుగాఁ
బడి పలవించె నామెకు నెవారలు దిక్కిఁక రాజశేఖరా!

కుంద శరత్ప్రమోద హిమగుంఫనముల్ నిరసించి నీయశో
దుందుభి మ్రోఁగు నింకని కుతూహల మొందుచునుండ నంతలో
దుందుభి శుక్లపక్షపుఁ బ్రదోషమునందుఁ దృతీయనాఁడు మ
మ్మందఱ వీడినావె పరమార్థపుటాసను రాజశేఖరా!

పదస మోరఁగ వంచి వాపోవుచున్నది
అనిశంబు తావకార్థాంగలక్ష్మి
నిస్పృహావశమున నిల్వనీరయిపోయె
గన్నాఱ నినుఁ బెంచికొన్నతల్లి
ఇఁక నిట్టిదేశికుం డీజన్మమునకు దు
స్తరమంచు నేడ్చె విద్యార్థిగణము
మిత్రుండు పోలేదు మేమె పోతిమటంచుఁ
జెలిమికాండ్రెల్ల రాల్చిరి జలంబు
కులసతిని జూచి పెదతల్లికోఁతఁ జూచి
శిష్యులను జూచి మిత్రుల చింతఁ జూచి

పరమునం దెంత నీయాత్మ పల్లటిలునొ
రాజశేఖర! తెలుపనేరము గదయ్య॥

మునుకొని బోధనాభ్యసనముఁ మదరాసున నేర్వ నేఁగుచో
నినుగుఱియించి పద్యములు నేను రచింపక తప్పదెట్లు వి
వ్వోనఁగలవాఁడనంచు నెదఁగుందుచునుంటిని నేఁటికిట్టి ఘో
రనిశితపాపకల్పనపరంపర కోర్చితి రాజశేఖరా!

# లీ లా శు క ము

శ్రీ శ్రీ చైతన్యదేవుఁడు పుణ్యక్షేత్రమగు నవద్వీపమున నవతరించినతరువాత రెండువందల సంవత్సరములకు జరిగినకథ. వైష్ణవమఠాధిపతి యొకఁడు చిలుక నొకదానిని బెంచెను. ఆ శుకము శైశవమునుండి సత్సాంగత్యమున సత్కథలు వినుచు సచ్ఛిక్షను బొందుచు రాధాకృష్ణ రాధాకృష్ణ యని పలుకనేర్చెను. క్రమముగా నాకరము,

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరేరామ హరేరామ రామ రామ హరే హరే!

అని వచింపనేర్చెను. శిక్షాభివృద్ధి యయినకొలఁది నాశుకము శ్రీ కృష్ణోత్తర శతనామములు, జయదేవుని గీతగోవిందము, లీలాశుకుని శ్రీ కృష్ణకర్ణామృతము, నారాయణతీర్థుని శ్రీ కృష్ణలీలా తరంగిణియుఁ బఠింపసాగెను. అందుచే వైష్ణవ భక్తులెల్లరు దానికి లీలాశుకమని పేరిడిరి. వైష్ణవభక్తు లుదయాస్తమయములందు మఠమునకు వచ్చి శుక

ముఖ నిర్గతమగు శ్రీకృష్ణలీలామృతము వీనులారఁ గ్రోలి ధన్యు లయినట్లు సంతసించుచుండిరి. నవద్వీప మంతయు శ్రీకృష్ణ నామామృతమున మునిఁగి తేలుచుండెను.

గంగాస్నానార్థము నానానగరములనుండి యరుదెంచిన స్త్రీపురుషాదు లీ యద్భుతవిషయము గాంచి యానందపులకితచిత్తు లగుచుండిరి. క్రమముగా నీ వృత్తాంతము దేశమెల్ల వ్యాపించెను. తీర్థయాత్రికులు కొందఱీవార్త బృందావనమునకుఁ దెలియజేసిరి. అంత నచ్చటి భక్తులందఱు లీలాశుకుని సందర్శించి తన్ముఖోదితమగు శ్రీకృష్ణనామామృతమును గ్రోలి కృతార్థత నొంద భావించిరి.

పుణ్యభూమియగు బృందావనమున ప్రధానాచార్యులగు ప్రభుపాద గోస్వామివారి శ్రీచరణ సన్నిధానమున భక్తులందఱు తమ ప్రార్థనము నివేదించిరి. గోస్వామివారు భక్తుల ప్రార్థనము కాదనలేక శిష్యునొకనిఁ బిలిచి యుత్తరమిచ్చి శ్రీధామమగు నవద్వీపమునకుఁ బంపిరి.

సకాలమునకాశిష్యుఁడు నవద్వీపముచేరెను. అతఁడు తెచ్చిన వార్త విని యచటిభక్తులు నిర్విణ్ణులైరి. కొంతకాలమువఱకు లీలాశుకుని హరినామస్మరణమువిని యానందించు భాగ్య ముండదు గదాయని వారు విచారపడిరి. ఏదెట్లైనను బృందావన ప్రధానాచార్యులవారి యానతి జవదాటరాని దగుటచే నొక శుభముహూర్తమున లీలాశుకుని వా రాశిష్యున కప్పగించిరి. నవద్వీపమునందలి ప్రజ లాబాలగోపాల మా లీలాశుక బృందావనయాత్రను దిలకించుట కై గంగాతీరమున కరుదెంచిరి, ఎవ్వరిముఖమునఁ జూచినను విషాదము

తాండవించుచుండెను; ఎవ్వరి నేత్రములు విలోకించినను బాష్పపూరితములై యుండెను. శ్రీ శ్రీ చైతన్యులు సంసారముఁ బరిత్యజించిన పిమ్మట నిట్టి హాహాకార మా నవద్వీపమం దిదివఱ కుద్భవింపలేదు. మఠాధిపతి పొంగిపొరలు దుఃఖము నెట్లో యాపుకొని శిష్యునితో నిట్లనెను: "వత్సా! ఈ లీలాశుకున కన్నపానములం దెట్టిలోపము జరుగనీయవలదు. శ్రద్ధాభక్తులతోఁ బోషింపుము. మరల సత్వరము మా లీలాశుకుని మాకు దయచేయవలసినదని యాచార్యులవారితో మరల మరల నా ప్రార్థనముగాఁ జెప్పుము. లీలాశుకుఁడు మరల మా కంటఁ బడువఱకును మా చూడ్కు లన్నియు బృందావనము మీఁదనే యుండును."

అంత నా మఠాధిపతి శిష్యునితో లీలాశుకు నొకపడవలో నెక్కించెను. లీలాశుకుఁడు దృగ్గోచరమగుచుండువఱకు నవద్వీపవాసు లెల్ల రుత్క్షిప్తనేత్రములతోఁ జూచుచుండిరి. కొంతసేపటికి నావ యదృశ్యమాయెను. విచారభారాక్రాంతహృదయులై వారందఱుఁ దమతమ గృహములకు మరలిరి. అకటా! నేఁడు నవద్వీపవాసులకుఁ గలిగిన దుస్స్నేహవియోగ మెప్పటికిఁ దీరఁగలదో కదా! భక్తిమూర్తియగు లీలాశుకుఁ డెన్నఁడు మరలివచ్చి సంతప్తమానములగు వారి హృదయములను శాంతపఱచునో కదా! మఠాధిపతి ప్రేమగద్గదస్వరముతో నిట్లుపాడెను.

యాని త్వచ్చరితామృతాని రసనా లేహ్యాని ధన్యాత్మనాం
యేవా చాపలశైశవ వ్యతికరా రాధాపరాధోన్ముఖాః
యావా భావిత వేణుగీతగతయో లీలాముఖాంభోరుహే
ధారావాహితయా వహన్తు హృదయే తాన్యేవతాన్యేవ మే!

కదావా కాలిందీ కువలయదలశ్యామల తరాః
కటాక్షాలక్ష్యంతే కిమపి కరుణావీచినిచితాః
కదావా కందర్పప్రతిభట జటాచంద్రశిశిరాః
కి మప్యంతస్తోషం దదతి మురళీకేళినినదాః!

౨

నవద్వీపమునుండి బృందావనము చేరుటకు రెండుమాసములుపట్టెను. పడవలో ప్రయాణికు లనేకులెక్కుచుండిరి. కొందఱు తీర్థయాత్రికులు, కొందఱు వర్తకులు, కొందఱు హీనజాతులు, కొందఱు త్రాగుబోతులు; పలుతెఱఁగుల స్త్రీ పురుషాదులందు ప్రయాణము చేయుచుండిరి. వారికోలాహలముతో సర్వదా నౌక ప్రతిధ్వనించుచుండెను.

నూతనస్థలమున నపరిచితులనడుమనుండుటచే శుకము కొన్నిదినములు మూకీభావము వహించియుండెను. క్రమముగా భయముదీఱి యాకీరము రకరికములమాటలు నేర్చుకొనసాగెను. ఆచిలుక మేధావి యగుటచేఁగొలఁదిదినములలోనే వివిధశబ్దములు పలుకనేర్చెను. అశ్లీలవాక్యములు, ఉన్మత్తప్రలాపములు, నావికులకేకలు, గ్రామ్యసంభాషణములు, స్త్రీలకలహములు, శిశువులరోదనములు మొదలగునవి నిపుణముగా ననుకరించుచుండెను.

నావలోనివారు ప్రొద్దుపోనిసమయములందు లీలాశుకమును మాటలాడించి సంతోషించుచుండిరి. కొంద ఱుత్సాహముతో హాస్యపుమాటలు, జుగుప్సావాక్యములు దానికి నేర్పి యది యంతో చతురముగా వానినన్నిటి ననుకరింప వారు ప్రమోదమందుచుండిరి.

శిష్యుఁ డాప్రయాణికులలో కొంగలనడుమ హంసవలె మెలఁగు చుండెను. లీలాశుకుని దుఃస్థితి చూచుచు నతఁడు వారింపలేకుండెను. కొన్నిదినములకు నౌక ప్రయాగచేరి, యచటినుండి యమునలోఁ బ్రయాణముచేసెను. ప్రయాణికులు వారివారి గమ్యస్థానములందు దిగిపోయిరి. బృందావన యాత్రికులుమాత్ర మానౌకలో మిగిలిరి. జనబాహుళ్యము తగ్గుటచే లీలాశుకుని విజృంభణముకూడ తగ్గెను. నౌకాప్రయాణమున మొదటిరోజులందువలె నిపుడును శుకము మూకీభావము వహించియుండెను. అది యట్లుండుటచే నతనికిఁ గొంచ మాతురత కలిగెను. చిలుక యిట్లు కొన్నిదినములూర కుండెనేని దాని వాగ్ఘోషముపోవునని యాతఁడు భావించెను. క్రమముగా నావ బృందావనమున వస్త్రాపహరణఘట్టమునందు నిలిచెను. ఈసంగతి తెలిసినంతనే బృందావనవైష్ణవబృందమంతయు యమునాపులినమునఁ జేరి, తాళమృదంగ సంకీర్తనములతో నెదురువచ్చి లీలాశుకుని పల్లకియందిడి గోస్వామివారి సన్నిధికిఁ గొంపోయిరి. హరినామస్మరణము తోడను, తాళమృదంగాది వాద్యధ్వనులతోడను దిక్కులు ప్రతిధ్వనింపసాగెను, భక్తులంద రిట్లు సంకీర్తనము చేసిరి.

ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ
గోపీపీనపయోధర మర్దన చంచలకరయుగశాలీ: ధ్రువమ్.

నామసమేతం కృతసంకేతం వాదయతే మృదువేణుం
బహుమనుతే తనుతే తనుసంగత పవనచలిత మపిరేణుమ్-ధీర.

పతతి పతత్రే విచలతి పత్రే శంకిత భవదుపయానం
రచయతి శయనం సచకితనయనం పశ్యతి తవ పంథానమ్-ధీర.

హరి రభిమానీ రజని రిదానీ మియమపియాతి విరామం
కురుమమ వచనం సత్వర రచనం పూరయ మధురిపుకామమ్-ధీర.

శ్రీ జయదేవే కృతహరిసేవే భణతి పరమరమణీయం
ప్రముదితహృదయంహరిమతి సదయంనమతసుకృతకమనీయమ్ధీర

3

బహుదినములు నౌకాయాన మొనర్చియుండుటచే లీలాశుకునకు దేహస్వాస్థ్యము చెడియుండవచ్చునని తలంచి ప్రభుపాదగోస్వామి లీలాశుకుని గానామృతము తోడనే యాస్వాదింప నవకాశము భక్తుల కొసంగలేదు. కొన్నిదినము లాయన శుశ్రూషచేయుచుండ లీలాశుకము మౌనముతో దానిని బరిగ్రహించుచుండెను. శరీరక్లాంతిచేత నో, నూతన స్థలమగుటచేతనో, లేక యెందునో లీలాశుకము మౌనము వీడలేదు. కొలఁది దినములకు లీలాశుకునకు దేహస్వాస్థ్య మలవడెను. రాసపూర్ణిమ సమీపించుచుండెను. భక్తులందరు నారాత్రి యమునా పులినమునఁ జేరి, లీలాశుకముఖ వినిస్సృతమగు నిరుపమాన ప్రేమగానామృతము నాస్వాదింప నుత్సుకులగుచుండిరి. భక్తులెల్లరు గుంపులు గుంపులుగా నరుదెంచి సైకతస్థలమున లీలాశుకుని చుట్టును మండలాకృతిని గూరుచుండి యిట్లుపాడిరి.

అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే నాంగనా
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః.

చారుచంద్రావలీలోచనై శ్చుంబితో
గోపగోబృంద గోపాలికావల్లభః

వల్లవీబృంద బృందారకః కాముకః
సంజగౌ వేణునా దేవకీనందనః.

పారిజాతం సముద్ధృత్య రాధావరో
రోపయామాస భామాగృహా స్యాంగణే
శీతశీతేవటే యామునీయే తటే
సంజగౌ వేణునా దేవకీనందనః.

అప్పుడు ప్రభుపాదగోస్వామి లీలాశుకుని సమీపించి, తెక్కులు దువ్వుచు, “అను బాబు! రాధాకృష్ణ! రాధామాధవ! రాధాశ్యామ! రాధాధరసుధ! అను బాబూ అను!” అని పలికెను. లీలాశుకము కొంతసేపూరకుండి, సుధాశబ్దము వినినంతనే యున్మత్తునివలెఁ గంఠ మెత్తి—

సురాపానము చేయుదును–నేను–సోకుగ గంజాయి త్రాగుదును
సుర త్రాగినే గంజాయి త్రాగి సొగసుగ కాళిని గొల్చెదను.

జయజయ కాళీ జయజయ కాళీ జయజయ కాళీ జయ కాళీ!

అని పాడెను. తరువాత నావికుల కేకలు, గ్రామ్యసంభాషణములు, ఉన్మత్తప్రలాపములు, స్త్రీలకలహములు, శిశువులరోదనములు, అవాచ్యములు, అశ్లీలములు, జుగుప్సితములు మొదలగు శబ్దపరంపర లనర్గళముగాఁ బ్రేలెను. భక్తులు చకితులై, స్తబ్ధులై, హతాశులయిరి. కొందఱు సిగ్గుచే తలవంచుకొనిరి; కొంద ఱీర్ష్యాభావముతో ముఖములు చిట్లించిరి! కొందఱు కృష్ణ! కృష్ణ! యని చెవులుమూసికొనిరి. స్త్రీలు చేలాంచలములతో మోములు మాటుచేసికొని యచ్చటినుండి వెడలి పోయిరి.

పిడుగడచిన చందమునున్న ప్రభుపాదగోస్వామి కొంతసేపటికి

తెప్పిరిల్లి, శిష్యునిఁబిలిచి రహస్యముగాఁ "ఏమి! యీదౌర్భాగ్యము?" అని యడిగెను. శిష్యుఁడు నౌకాయానమునకుఁ బూర్వము లీలా శుకముచేసిన హరిలీలాగానమును ప్రయాణములోఁ గలిగినపరివర్తనము నామూలాగ్ర మాచార్యునకు విన్నవించెను. సూక్ష్మదర్శి యగు గోస్వామి దుస్సాంగత్యమువలన లీలాశుకమున కిట్టియధోగతి తటస్థించెనని గ్రహించెను.

మిక్కిలి కుతూహలముతో నేతెంచిన భక్తులెల్లరు నుత్సాహభంగమునొంది తమతమ కుటీరములకు వెడలిపోయిరి.

౪

ప్రభుపాదగోస్వామి లీలాశుకమును తక్షణమే పంపివేయఁదలఁచి శిష్యునిఁ బిలిచి, "దీనిని నవద్వీపమునకుఁ గొనిపొమ్ము,

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్య మప్రియమ్.

అని శాస్త్రము చెప్పుటచే, నీదుర్వార్త దెలిపి వారికి విచారము కలిగింపరాదు. నేఁడే బయలు వెడలుము" అని యాజ్ఞాపించెను.

కొంతకాలమునకు శుకముతో శిష్యుఁడు నవద్వీపము చేరెను. ఈవార్త తెలియుటచే శ్రీ చైతన్యభగవానులు జన్మస్థానమునకు మరలివచ్చినట్లే యెంచి, నవద్వీపవాసులు సంతోషపరవశులయిరి. వారెల్లరు గంగాతీరమునకువచ్చి మహోత్సవముతో శుకమును మఠమునకుఁ గొనిపోయిరి. చాలకాలమునకు స్వస్థానమున చేరినను హరినామస్మరణముచేయక యూరకున్న చిలుకనుగాంచి కొంచెము విషణ్ణ

వాత దాన్ని పడుకోబెట్టి పక్కను కూచుని దువ్వుతాను. దువ్విదువ్వి దానిమెడమీద నేను నిద్దరోతాను. ఎంచక్క!

నాన్నే చూడకుండా వుంటేనా!

సన్నసన్నంగా నాన్నగదిలోకి వెడతాను. నాన్న నన్నెప్పుడూ ఒక్కవుత్తరమేనా రాయనిచ్చేవాడే కాడు. నాన్న రెండుకలాలూ రెండుచేతులతోటీ పుచ్చుకుంటాను. రెండుకవర్లు ముందుపెట్టుకుని ఆరెండుకవర్లమీదా ఉత్తరం రాస్తాను. నాన్నకోవుత్తరమూ, అమ్మకోవుత్తరమూ. కుక్కపిల్లకీ, మేకపిల్లకీ యింకో రెండుత్తరాలు రాస్తాను. ఈఉత్తరాలు కుక్కపిల్లకీ మేకపిల్లకీ నేనే తీసుకువెళ్లి యిస్తాను. నాన్న వుత్తరమూ అమ్మవుత్తరమూ పోస్టులో పడవేస్తాను.

మధ్యాహ్నము పోస్టుజవాను అమ్మకీ నాన్నకీ వుత్తరాలు ఇస్తాడు.

"ఈఉత్తరాలు ఎవరు రాసేరు చెప్మా" అంటారు నాన్నా అమ్మాను. నేను ఉలక్కుండా పలక్కుండా ఊరుకుంటాను.

నాన్నే చూడకుండా వుంటేనా!

ఒకగావంచా కట్టుకొని యింకోగావంచా బుజంమీద వేసుకుని కాలవకు వెడతాను. వెళ్లి ఎవరూ చూడకుండా నీళ్లల్లో పడి నీళ్ల మీద తేలుతాను. మునుగుతూ తేలుతూ ఎంతోసేపు ఆడుకుంటాను. నీళ్లల్లో మునిగి అడుగున ఏముందో చూస్తాను. ఆల్చిప్పలూ బొమ్మరాళ్ళూ గావంచాలో మూట కట్టుకుంటాను. ఆపాళంగా ఒడ్డుకు వచ్చి ఒళ్లు తుడుచుకుని యింటికి వస్తాను! అప్పుడు అమ్మ అంటుంది గదా, "నాన్నా, యింతసేపూ ఎక్కడకు వెళ్లి ఏంచేస్తూన్నావు?"

అప్పుడు నేనంటాను గదా, "అమ్మా, అమ్మా, వాళ్లబ్బాయి

రబ్బరుబొమ్మ కొనుక్కున్నాడు. నాక్కూడా కొనిపెట్టమనవూ కే నాన్నని!"

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్నగదిలోకి పిల్లిపిల్లలాగ చప్పుడుచెయ్యకుండా వెడతాను. ఆపళంగా లోపలతలుపు గడియవేస్తాను. నాన్నపంచ కట్టుకుంటాను. నాన్నపెద్దకోటు వేసుకుంటాను. నాన్నపెట్టుకునే జరీతలపాగా పెట్టుకుంటాను. పెద్దబూట్సుజోడూ సులోచనాలూ పెట్టుకుంటాను. చేత్తో కర్ర పుచ్చుకుంటాను. నాన్న వాచీ తీసి చెవిదగ్గిర పెట్టుకుని చూసి దాన్ని ఒక్కమారు గిరుక్కున తిప్పేస్తాను. అప్పుడు కోటుజేబులో పెట్టుకుంటాను. పెట్టుకుని గదితలుపుతీసి వీధిలోకి షికారు వెడతాను. తిన్నగా బొమ్మలదుకాణం దగ్గిరకువెళ్ళి ఆబొమ్మలన్నీ కొనేస్తాను. బ్రాహ్మణ దుకాణంమీదకు వెళ్ళి అక్కడ కారప్పూస అంతా కొనేస్తాను. ఆపళంగా ఇంటికి వస్తాను. అప్పుడు, "ఈ బొమ్మలూ కారప్పూసా ఎక్కడివిరా?" అంటుంది అమ్మ.

"నే బజారుకు వెళ్ళి కొన్నాను!" అంటాను.

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్న నడవలోపెట్టిన సైసికిలు వీధిలోకి తీసుకువచ్చి ఎవరూ చూడకుండా ఎక్కుతాను. ఎక్కి రంయిమనిరోడ్డుమీదనవారిచేస్తాను. తిన్నగా వెళ్ళివెళ్ళి ఎదురుగుండావున్న ఆకాశాన్ని ముట్టుకుంటాను. ఆకాశానికి సైసికిలు జేర్లాబెట్టి అక్కడ పువ్వులూ పళ్లూ జేబునిండా వేసుకుంటాను. కొంతసేపు నిద్దరోయి మళ్ళీ సైసికిలు ఎక్కి యింటికి వచ్చేస్తాను. వచ్చి అమ్మకు పువ్వులూ నాన్నకు పళ్లూ యిస్తాను. అమ్మ ముద్దెట్టుకుంటుంది గాని నాన్న తంతాడేమో!

నాన్నే చూడకుండా వుంటేనా!

పెరట్లో నూతిదగ్గిర జామిచెట్టు ఎక్కుతాను. ఎక్కి కొమ్మమీది నుంచి నూతులో ఏముందో చూస్తాను. జామికాయలు తుంపి నూతిలోకి విసురుతాను. బుడుంగు బుడుంగుమని దాల్లో పడుతూంటే చూస్తాను. ఆతరవాత జామికాయలు జేబునిండా వేసుకొని దిగివచ్చి పశువులశాలలోకి వెళ్లి అన్నీ తినేస్తాను. అమ్మకీ నాన్నకీ ఒక్కకాయినా పెట్టను.

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్నగదిలో బొమ్మలపుస్తకాలన్నీ తీస్తాను. అందులో బొమ్మలన్నీ చింపుతాను. చింపి దారంతో వాటినన్నింటినీ దండలాగ గుచ్చుతాను. గుచ్చి ఆదండ తువ్వాయిమెడలో వేస్తాను. వేసి ఆతువ్వాయిని కొరడాపుచ్చుకొని వీథులంపట పరుగెత్తిస్తాను. లేకపోతే ఆకాగితాలన్నీ పడవలుకట్టి తూముకాలవలో వేస్తాను. పడవల్లో చీమలని ఎక్కించి వదుల్తాను. అవి రంయిన పడవల్లో వెళ్లిపోతాయి ఎంచక్క!

నాన్నే చూడకుండా వుంటేనా!

పెరట్లో గోడపక్కని నీళ్లుపోసి మన్నంతా తవ్వుతాను. తవ్వి ఆమన్నుతో పిచ్చికగూళ్లు కడతాను. కట్టి ఆగూళ్లల్లో బెల్లంముక్క పెట్టి చక్కావస్తాను. పొద్దున్నే లేచివెళ్లి ఆగూళ్లల్లోకి పిచ్చికలు వచ్చేయేమో చూస్తాను.

నాన్నే చూడకుండా వుంటేనా! పలకా ఎలకపిల్లా అవతల పారేసి ఇంకా ఎన్నో చేస్తాను!

# త్యాగి

## ౧

"వత్సా! ధర్మము నీతికంటె పైమెట్టని మనసులో నుంచుకో!" అని దీక్షాసమయమున ఆచార్యుఁడు పలికెను.

శిష్యునిమానస ముత్సాహపరిపూర్ణ మయ్యెను. అతఁడు క్రొత్తగా త్యజింపవలసిన దేదియు లేదు. జీవితమునం దతఁడెన్నఁడు నీతిమార్గ భ్రష్టుఁడు కాలేదు; తెలిసిగాని తెలియకగాని తప్పటడుగు వేయలేదు. పాపమును దూరముగా విడిచి, సమభావముతో కాలము గడపినాఁడు. కావున, ధర్మ మాతనికి కరతలామలకము. ఇఁక నిష్టసిద్ధి యయినపక్షమున నతఁడు కృతకృత్యుఁడగును. అందుకే ప్రయత్నము ప్రారంభ మయ్యెను.

* * * *

ఆయేటి కాయేడు గడచిపోవు చుండెను.

అస్థి చర్మావశిష్ట మగు దేహముతో, అంధకారావృతమగు మానసముతో సాధకుఁ డింద్రియగ్రామము నరికట్టి, కూరుచుండెను. అయినప్పటికిని ఇంద్రియాతిరిక్తమగున దేదియు నాతనిహృదయాకాశమునఁ బ్రతిఫలించలేదు.

అతని మానస ముద్విగ్నమయ్యెను.

విశ్వము నాతఁడు పరిత్యజించెను, కాని విశ్వ మతనిని పరిత్యజించ

నట్లు తోఁచెను. పాపబంధమునుండి యతఁడు విముక్తుఁడయ్యెనను ఏబం ధమతనిని పట్టిలాగుచున్నది?

సాధకుఁడు హతాశుఁడయ్యెను.

కాని, సృష్టిని విస్మృతి యను చీఁకటినూతిలోఁ ద్రోయఁదలఁచిన వాఁడు హతాశుఁడైనచో నెట్లు?

కావున నతఁడు పీఠము వేసి కూరుచుండెను.

ప్రకృతిదేవతయొక్క దయార్ద్రదృష్టి యాచర్మావృతకంకాళముపైఁ బడుటచే విశ్వము నిట్టూర్పువిడిచెను; సృష్టికర్త యుదాసీనభావ ముతోఁ జూచుచుండెను.

* * * *

ఈవిధముగా కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట లుప్తస్మృ తితో, శిథిలితేంద్రియములతో సాధకుఁడొకనాఁడు లేచి " ఇదియే ఉపలబ్ధి! " అని పలికెను.

" ఇదే నీఉపలబ్ధి!" అని గుహామధ్యమున పరిహాసధ్వని ప్రతి ధ్వనించెను.

* * * *

సాధకుఁడు బయటికి చూచెను.

ప్రకృతి తనశ్యామలహస్తములు తనవైపునకు చాచియుండెను; విహంగకంఠము లాతనికి మంగళము పాడెను; పుష్పములు, ఫలములు, నిర్ఝరోదకములును అతని కభిషేకమంత్రము పఠించెను.

" నేను ప్రకృతిని జయించినవాఁడ నగుటచే నివి నాకు ప్రాప్యము లు!" అని సాధకుఁడు భావించెను.

ఆఁతఁడు ముందుకుఁ జని విలోకింపగా, నగరోపాంతమున కుటీర ద్వారమున రమణి యొకతె నిలిచియుండెను.

ఆమె యిట్లనెను : " తపోధనా! ఎంతకాలమునుండియో నీకోసమే వేచియున్నాను. తపఃక్లిష్ట దేహుఁడవు; నా సేవ పరిగ్రహించి, నా పుణ్యము నుజ్జ్వలము కావింపుము !"

"సేవ నాకేప్రియము. నారీరూపిణియగు ప్రకృతికి నేనే ప్రభువును" అని యాత్మప్రసాదగర్వితుఁడగు సాధువు తలపోసెను.

౨

ప్రసన్నభావమున కొన్ని దినములు గడచెను. రమణీప్రణయ మక్షుణ్ణముగా నుండెను. కాని సాధువు మానసమునందలి వికార మెచ్చటి నుండి వచ్చెనో, యెప్పుడు ప్రారంభమయ్యెనో యాతనికే తెలియ లేదు.............

బుభుక్షుహృదయుపు వాసనలను రాశీభూతముచేసి, సాధువొకనాఁ డిట్లనెను: "ఇంతకాలము నీవెచ్చట డాగియుంటివి రమణీ?"

రమణి శాంతదృష్టితో నాతనివైపు చూచి "నీహృదయములోనే" అనెను.

"ఎవరు నీవు?"

"నీవాంఛితమైన నీతి కధిష్ఠాన దేవతను."

"నీవు నా సాధనలబ్ధవా?...ఇంతకాలము తెలియనిచ్చితివి కావేల కఠినురాలా!"

"నిజముగా నేను కఠినురాలనే. విశ్వములో నీమనోరథము విరాజిల్లుచున్నప్రదేశమును మరుగుచేసి, యింతకాలముంటిని."

"మఱినేడు?"

"నేఁడవసరమువచ్చినది."

*    *    *    *

సాధువు నిశావసానమున రమణిని అర్మ్ముపైనుండి దూరముగాఁ ద్రోసివేసెను.

ఎంతకుటిలము, ఎంతభీభత్సముగా నున్నదామూర్తి!

ఇంతకాలము దేవీపీఠముపైఁ గూర్చుండఁబెట్టి పూజించిన దీమెనా! అంధకారములో నారమణి కుటిలహాసము మెఱుపుఁదీగెవలె విరాజిల్లెను.

సాధువు ఆవెలుఁతురులోఁ జూచెను.

విశ్వములోని సమస్తదౌర్బల్యము, సమస్తపాపము, ఆమె హృదయద్వారమున నిల్చి, యామెను శరణము వేడుచుండెను.

వానిని రానిచ్చినచో నతనికి ముక్తిలేదు.

ఆనాఁడు మొదటిసారి సాధువు విశ్వముతో తాదాత్మ్యము గ్రహించెను.

రమణీ వికటహాసముతో కుటీరము మరలఁ బ్రతిధ్వనించెను.... మంత్రచాలితమైన విధముగా సాధువుహస్తము రమణీ కంఠప్రదేశ

మును స్పృశించెను.... పరక్షణమున చైతన్యవిహీనమగు నామెదేహము భూమిపై దొరలెను.

* * * *

శిష్యుఁడరుదెంచి, ఆచార్యుని పాదములపైవ్రాలి, యార్తధ్వనిచేసి "ప్రభూ! ఇంతకాలపుసాధన నేటితో విఫలమయినదా?" అనెను.

"వత్సా! ఇంతకాలమునకు నీసాధన సిద్ధిపథమున నిలిచినది," అని యాచార్యుఁడు పలికెను.

# ఆసురలక్ష్మీసాంత్వనము

## సత్యాంజనేయులు

నాచేతన్ త్రిజగంబులున్ నిలుచు నానాజంగమస్థావర
ప్రాచుర్యంబునకేన మూలము జగత్ప్రారంభ సంరంభ వి
ద్యాచార్యుండను నేన సర్వజగదాహ్లాదంబు నా హాస మే
లా! చిన్నందనమొందుఁ ద్రైభువనలీలాజేత నీలాలకా!

ముల్లోకంబులు చంద్రహాసశిఖరంబున్ దాకి నొక్కుల్ వడెన్
చెల్లెంబో దశకంఠ పౌరుషము దిక్సీమంతినీభోగ్యమై
కల్లల్ వల్కెదు మొక్కవోవ నిది నాఖడ్గంబు ధూర్తద్విషత్
వల్లీ దుర్గమమార్గ భీకర లవిత్రప్రాయమై! బిత్తరీ!

కమరెన్ దానవలోక శాత్రవవధూగండమ్ము లుత్ఫుల్లముల్
నముచిద్వేషి మహాభయంకర మదాజ్ఞాబద్ధమై నాల్గునం

ద్రిములుఁగూడి ఘనీభవించి ద్రుతవల్గన్మద్రథధ్వాన సం
భ్రమ దాశాకరిణీశ్రవః కుహరసంబాధమ్ము గావించెడుఁ.

బాలేందీవర కోరకచ్ఛవికి నింపా! మాకరందావగా
వేలోపాంత చరన్మధువ్రతకుల ప్రేమమ్ము సాధించుటా!
చాలుంజాలు నిదేమిటే! పరిణతాంచ న్నాగవల్లీప్రభా
లీలాసుందర గల్లమిట్లగు టదేలే! బాలికారత్నమా!

దైతేయకామినీ ధమ్మిల్లసుమపరా
　గము గాలిచే కసుగందరాదు
దైత్యశుద్ధాంత కాంతాకపోలపటీర
　చర్చ వెన్నెలల చెమర్చరాదు
దానవానేక ముగ్ధాలోచనాంబుజ
　శ్రీలు క్రొందేటు లాసించరాదు
దివిజాంతకావరోధ వధూవిహార భూ
　ములు పచ్చవిల్కాడు తొలగరాదు

ఇది త్రిలోకైకవీర లంకేశపంక్తి
కంధరమహోగ్ర శాసనక్రమము ప్రకృతి
దీనిపైయధికారిణి దివిజులింక
నడుగడుగు వెంట కత్తిపై నడువవలయు.

# థియొడోర్ గోల్డుస్టూకర్*

"వానప్రస్థుఁడు"

వంగభాషయందు మధుసూదనదత్త మహాకవి
రచించిన "చతుర్దశపదీ కవితాబలీ" అనుగ్రంథమునుండి

దేవదానవు లబ్ధి మథించి సుధను
పొందినట్లు శుభక్షణమందు నీవు
సంస్కృత కలార్ణవంబును స్వబలమునను
త్రిచ్చి కంటివి కీర్త్యమృతంబు భళిర!
పండితాగ్రణి విదేశమందు నీవు!
భారతాటవి యందలి పికవరములు
నిన్ను విని సంతసించు సంగీతభంగి.
ఇట్టి గౌరవ మిందు నేరాజు పొందు!

దివ్యవీణను వాల్మీకి మేళవించి
రామచరితంబుఁ బాడు నీయాదరమున;
బదరి కాశ్రమమందుండి మహితగీతి
నిర్ఝరసమాన భీకరధ్వని యొనర్చు;
నీసఖుండు కవీంద్రుఁడు కాళిదాసు!
ఎంతపుణ్యమొ నీది జన్మాంతరమున!

* ఈ జర్మన్ పండితుఁడు ఆక్స్ఫోర్డు సర్వకళాశాలయందు ప్రధాన సంస్కృతాధ్యాపకుఁడుగా నుండెను. ఈతఁడు గొప్ప వైయాకరణి, సాహిత్యాచార్యుఁడు. భారతదేశమునం దీతని కత్యంతాదరము. రమేశచంద్రదత్తు మధుసూదనదత్తు మొదలగు మహామహులు ఇంగ్లండుదేశములో నీతనికడ సంస్కృత మభ్యసించిరి.

# భాస్కరరావుస్మృతి

## "వానప్రస్థుఁడు"

మిత్రరత్నము చిల్లా భాస్కరరావు రసవాదతంత్రమున బి. ఏ. పరీక్షయందుత్తీర్ణుఁడై రెండుమూఁడు మాసము లుపాధ్యాయ పదవియందుండి, ఆకస్మికముగా మృతినొందెను. పోవునాఁటి కతనికి ఇరువదిరెండుసంవత్సరములు నిండలేదు. ౧౯౧౬.

అమితమైన ధనమ్ము వ్యయమ్ము చేసి
చాల వత్సరములకుఁ బాశ్చాత్య వాస్తు
శాస్త్రపద్ధతిఁ గట్టిన సౌధవరము
కటకటా! కూలిపోయె భూకంపమునను.

చేతనైన దోహదములు చేసిచేసి
మమతతోఁ బెంచుచుండిన మావిమోఁక
ఉన్నతింగాంచి, తుదకు ఫలోన్ముఖమయి
అశనిపాతంబుచేఁ గూలె నక్కటకట!

వివిధమధుర ఫలమ్ములు పెట్టుచుండి
శ్రద్ధఁ బల్కులు నేర్పుచు సాఁకుచున్న
శారిక నిజోక్తు లెడలించు సమయమునకు
అకట! మార్జాల ముఖమున నంతమొందె.



# వీ ర గీ తి క

## " మారుతి "

యాదవ ప్రభువగు మహాదేవరాజు రుద్రమదేవిపై దాడి వెడలినపుడు కాకతీయులను యుద్ధమునకుఁ బురికొల్పుగీతిక.

పచ్చగందము మేన బాగుగాఁ బూసి
రక్తపుష్పమ్ము లురమ్మునఁ దాల్చి
ఏకవీరాదేవి నెదయందు నిలిపి
పద్మాక్షిదేవి దీవన లపేక్షించి
మైలారుదేవుని మన్నించి మించి
పల్నాటివీరుల పౌరుష మెంచి
శత్రులఁ జెండాడ శపథంబుఁ బూని
సదమలగౌతమీ జలములఁ జొచ్చి
సమయంబు సేయుఁడు సద్భక్తి మీఱ
వీరులారా! పృథివీసురులార!
వీరపుత్రికలార! విజితారులార!
జినునాథదేవునిఁ జిత్తాన చేర్చి
జైనులారా! మించు సాహసులార!
లేలెండు లేలెండు లెండు లేలెండు!

గణపతిదేవుని గారాబుబిడ్డ
మనచక్రవర్తిని మనవీరమాత
రుద్రమదేవిపై రోషించినాఁడు
బలములతోఁ దాను పయనమైనాఁడు

యాదవప్రభువు మహాదేవరాజు!
వీనికావరమును వీనిగర్వంబు
వీనితోఁ బోవలె! వీరు లైనట్టి
కాకతీయులఁ దాకఁ గలఁడె యీపంద!
యాదవవంశంబునం దుదయించె
రుద్రమ యనిమైన రూపింపకుండ
దాడి వచ్చినవాఁడు ధైర్యంబుతోడ!
పాఱఁ దోలఁగ వీనిఁ బ్రథితశౌర్యమున
లేరెందు లేరెందు రెందు లేరెందు!

ధీరులారా! వంశదీపకులార!
శూరులారా! కీర్తి శోభితులార!
మీఁతాత లెంత యమేయప్రతాప
వంతులో! మీరు నావంశమ్ములకును
వన్నె వెట్టుఁడు! కీర్తి వాడిపోకుండఁ
గాపాడుకొనరయ్య కాకతులార!

విన్నారె పల్నాటివీరుని గాధ?
బాలచంద్రుఁడు మంచిప్రభ గాంచినాఁడు
ఐతాంబ పూర్వపుణ్యాఫలంబు వీఁడు
వీర శిఖామణి విశ్రుత ఘనుఁడు
రణనీతి కుశలుఁడు ప్రకటవిక్రముఁడు
బాలచంద్రుఁడు ప్రతాపంబున మేఁటి!
వైరు లెందఱో నిల్చి వానినిఁ దాకి
ఖడ్గంబు చేబూని కామాక్షిఁ దలఁచి

గురిజాలగంగమ్మఁ గొల్చి చిత్తమున
చిందఱ వందఱ చేసినాఁ డరుల!
వెన్నిచ్చి యెఱుఁగఁ డే వేళను దాను
పటుభుజావిక్రమ ప్రౌఢి రాణింప
చేరి శత్రుబలంబుఁ జెండాడినాఁడు!
ప్రతిన నట్టిసరీతిఁ బవరంబునందు
నరసింహు శిరమును నఱికి యద్దాని
తండ్రికి నర్పించె ధైర్యంబు మీఱ!
పిదప స్వర్గపురంబు వేంచేసినాఁడు!
వీని సాటి జగాన వేరొండు లేఁడు!
కొలువరే బాలుని గురుభక్తితోడ!
తలఁపరే వీరుని దైవంబు రీతి!
చేయరే యాతఁడు చేసిన మాడ్కి!
ఆడరే స్తుత్యుక్తు లాతనిఁ గూర్చి!
పిఱికి కండయె లేని వీరులేమైన
అభిమానధన మున్న యాంధ్రులేమైన
కన్నతల్లులు వీరకాంతలేమైన
పుట్టిన భూమి సుసామ్రాజ్యమే మైన
రాణి రుద్రమదేవి ప్రఖ్యాతి నెంచి
గణపతిదేవుని గౌరవం బెంచి
రణరంగమును జొర రండు! లేరండు!
శూరులారా! కీర్తిశోభితులార!
లేలెండు లేలెండు లెండు లేలెండు!
యాదవవంశంబు నంత మొందింపఁ

గాఢ్జేయకంబులు కరములఁ దాల్చి
కదనరంగముఁ జొచ్చి కడుసాహసమున
శత్రులఁ దునుమాడి సమరరంగంబు
పీనుఁగుపెంటగఁ జేసి పేరు వహించి
వీరధర్మము నెఱవేర్చుఁడు మీరు!
కాకతులార! యుత్కంఠ దీపింప
లేలెండు లేలెండు లెండు లేలెండు!

# సన్నిపాతము

" గీతానందుఁడు "

శ్యామచరణుఁడు పదునెనిమిదేండ్ల యువకుఁడు. విశాలములును కాంతిమంతములును నగునతనికన్నులు ఎదుటివస్తువుల నతిక్రమించిదూరపువస్తువులవంకఁజూచుచుండును. అతఁడుసన్నిపాతజ్వరముచేనిరువదిదినములనుండి శయ్యాగతుఁడై యున్నాఁడు. నాఁడు ఇరువదియొకటవ దినము. ఆదినముగ్గడచినచో రోగి జీవించునని వైద్యులు చెప్పిరి.

కాని, నాఁటి సాయంకాలము వాయుదేవుఁడు హఠాత్తుగ విజృంభించి ప్రపంచమును కల్లోలపరచసాగెను. ఆకాశమునుదాఁకు వృక్షాగ్రములు వాయుహతిచే భూమినంటి లేచుచుండెను. మేఘములుమహాభూతములవలె నభోవీథులయందు భయంకరముగఁబరువులెత్తసాగెను. విశ్వమంతయును వాయుప్రవాహమున మహావేగముతోఁ గొట్టుకొని పోవుచున్నట్లుండెను. రాత్రిగడచినకొలఁదిని వాయుసంచలనము వృద్ధినొందుచున్నదిగానుండెను.

రాత్రి నడిజాము సమీపించుచున్నది. శ్యామచరణుఁడు ఉన్న తమైన మంచముపైఁ బరుండియున్నాఁడు. డాక్టరు ప్రక్కనే కుర్చీపై ఆసీనుఁడైయున్నాఁడు. ఇంకొక కుర్చీపై శ్యామునివృద్ధజనకుఁడు విషాదముకుళి తవదనుఁడు, చిర వేదనాసంక్షుభితలోచనుఁడు, జరాముద్రితరేఖాలలా టుఁడు, కూర్చుండియున్నాఁడు. బయట వాయుసంచలనముచేఁ గలి గిన వివిధధ్వనులు చిత్రచిత్రముగను భయంకరముగను వినఁబడు చున్నవి. లోపలమాత్రము సర్వము మౌనము.

శ్యామచరణుఁడు

నేఁడు ప్రకృతికుమారికి ఆటవిడుపుదినము. ఇన్నాళ్లనుండియు పరమే శ్వరుని పాఠశాలయందామె ఆత్మనిగ్రహము నేర్చుకొనుచున్నది. సర్వశక్తులను అణఁచి, సర్వేంద్రియములను నిగ్రహించి, యోగనిష్ఠ యందు ప్రమత్తయై యున్నది. కాని నేఁడు ఆటవిడుపు!

తండ్రి

శ్యామ!

శ్యామచరణుఁడు

నాయనా! నేఁడు శుభదినము. నేఁడు ప్రకృతిదేవికి పండుగ నిరోధ ములేని సంపూర్ణస్వేచ్ఛతో ఆమె నేఁడు తాండవించుచున్నది. సర్వాం గసౌష్ఠవయై నాట్యము చేయుచున్నది.

తల్లీ! మహిషాసురమర్దనీ! లోకజననీ! నాట్యము చేయుము! నాట్య ముచేయుము! నేఁటివరకు నిన్ను బంధించి యుంచినపరమేశ్వరుని శృం ఖలలు తుత్తునియలైనవి. నీసహజసౌందర్యమూర్తిని నేఁడు దర్శించు చున్నాను.

నాయనా! గదితలుపులు బిగించితిరేల? లోకమాత స్వచ్ఛందసంచారమునకు అవరోధము గల్పించుచున్నారా? [వాయుహతిచే తలుపులు తెరచుకొనిపోవును] అవిగో! తలుపులు పగిలిపోయినవి! లోకోత్తర బలసంపన్నయగు నామెశక్తిప్రవాహమును మీతృణసేతువుచే బంధింపఁ దలచితిరా? [దీపము ఆరిపోవును. వానజల్లు లోపలికి వచ్చును. మెరుపులు అంధకారమును మరింతదట్టము చేయుచున్నవి. ఉరుములు హృదయభేదకముగా వినఁబడుచున్నవి.]

అమ్మా! ఎన్నాళ్లకు నిన్ను దర్శించినానమ్మా! సర్వశృంఖలావిముక్తమైన నీసహజస్వరూపమును జూచుభాగ్య మెప్పటికి లభించినదమ్మా! ఇన్నాళ్లును నీసౌందర్యమున నంతర్భూతమై యున్న యద్భుతరసప్రవాహము నేఁ డెంతమోహనముగా వెల్లివిరిసిన దమ్మా! మహిషాసురమరనానంతరము లోకమోహనముగ నాట్యముచేసిన నాఁటి నీయద్భుతలీలలు ఎంతచిత్రముగ జ్ఞాపకము వచ్చుచున్నవమ్మా! [కనులు విస్తరింపఁజేసి బిగ్గరగ] అహో! లోకభీకరస్వరూపా! దుష్టదానవకపాలమాలావిశోభితా! కాళీ! [ఇంతలోఁ దండ్రివంకఁ దిరుగును. తండ్రి భయముచే వణకుచున్నాఁడు.]

నాయనా! ఏల వణఁకుచున్నావు? భయమా? సర్వశుభంకర యగు ప్రకృతి నిజస్వరూపమును జూచి మీ రేల భయపడవలెను? ఆమె భయంకరవదనమునందు విస్ఫురన్మందహాసములు మీకు కనఁబడుటలేదా? ఆమెదారుణాట్టహాసములమధ్య జగన్మోహనమగు వేణునినాదము మీకు కర్ణగోచర మగుటలేదా? ఆమెసర్వాంగవిజృంభణకోలాహలమునందు గీతివాద్య సహితమగు నృత్యసౌందర్యము మీకు స్ఫురించుటలేదా? అయ్యో! మీకు స్ఫురించదు. మీరు బానిసలు. కారాగారబద్ధయగు మాతృమూర్తి దీనవదనసౌందర్యమును చూచి సంతో

షమున మేను మరచు మీ నీచహృదయములకు ఆమె నిర్నిరోధస్వచ్ఛం దసంచారములు రుచించునా?

డాక్టరు

[నిరాశాసూచక మగు మొగముతో] అయ్యో! నేను వెళ్ళిపత్తునా?

శ్యామచరణుఁడు

డాక్టరుబాబూ! వెళ్లుచున్నారా? మీమందులపొది యేది? ప్రకృతిమాతకు దారుణసన్నిపాతము ప్రవేశించినది. ఆమెనుయీమహాపదనుండి యుద్ధరింపఁజాలరా? యుగములనుండి పెరుగుచువచ్చిన మీ వైద్యగ్రంథసహస్రములయందు ఈమహావ్యాధినిగూర్చి ఒక్కపలుకైన లేదుగా? ఇన్నితరములనుండి పెంపొందుచువచ్చిన మానవునిప్రకృతిశాస్త్రజ్ఞానము నిరర్థకమేనా? మానవుఁడు సృష్టికి ప్రభువుఁగాఁడా? అతఁడు నేఁ డేఁడీ! బలిష్ఠగృహాంతరాంతరములయందు దాగియున్నాఁడెల?

డాక్టరుబాబూ! ఇవ్వేళ ప్రకృతికి ఆటవిడుపు. నాకుకూడ ఆట విడుపు. మీమాయమందులచే స్వచ్ఛందమగు నామనోగతిని నిరోధింపకుఁడు. స్వేచ్ఛాసంచారము చేయుచున్న ప్రకృతిమాతపాదచిహ్నముల ననుసరించి నేను కూడ పోవుచున్నాను.

తల్లి! శ్యామసుందరస్వరూపా! నన్నుఁగూడ నీతోఁ గొనిపొమ్ము. నాప్రాణవాయువులను ప్రచండసంచలనము చేయుచున్న నీయనంతవాయువులలోఁ గలుపుకొమ్ము. నా తేజమును నీయుజ్జ్వలతేజమున లీనముకానిమ్ము. నాజీవనశక్తిని నీదివ్యశక్తితో సమముగ నాట్యము చేయనిమ్ము. నన్ను నీలో లీనము గానిమ్ము! [శ్యాముని ముఖము వివర్ణ మగును.]

* * * * *

[ఝంఝూమారుతము ఉపశమించును. భయంకరమైన మౌనము]

# గోదావరీమాత

చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టీ.

గోదావరీమాతఁ గొనియాడ రమ్మ!
రారమ్మ రారమ్మ, రమణు లందఱును!
అల్లదె అదె కాంచుఁ డదిగో నాతల్లి
ముంగొంగుబంగారుముల్లె నాతల్లి
నట్టింటి వరలక్ష్మి నాకన్నతల్లి
నాకు నోగిర మిడు నాకన్నతల్లి
నాకు సీరము పట్టు నాకన్నతల్లి
పట్టిన దంతయు బంగారు ముద్ద
ముట్టిన దంతయు ముత్యాలమూట
ఆయమ పలుకులు అమృతతుల్యములు
ఆయమ నడకలు అతికోమలములు
ఆయమ సొగసుల కాలవాలంబు
ఆయమ గుణముల కాటపట్టమ్మ!
పూలతోఁ బత్రితోఁ బూజింపరమ్మ!
రారమ్మ, రారమ్మ, రమణు లందఱును!

రంగారు భక్తి నీరాజనం బీయ
రారమ్మ, రారమ్మ, రమణు లందఱును!
మురిపెంపు పదముల ముద్దిడరమ్మ!
రారమ్మ, రారమ్మ, రమణు లందఱును!
ప్రి[illegible] హర్షంబొమొ వర్షించునమ్మ

మన కలవేల్పామె మన పట్టుఁగొమ్మ
మన కల్పభూజంబు మన వేల్పుటావు
మముఁ గాంచి మముఁ బెంచి మన్నించుమాత!
కరములు నొసలిపై ఘటియింపుఁడమ్మ
మనసుల నామెపై మరలింపుఁ డమ్మ!
గోదావరీమాతఁ గొనియాడ రమ్మ!
రారమ్మ, రారమ్మ, రమణు లందఱును!

# పా ర ము

## " మారుతి "

ఒకసంవత్సరము చెన్నపట్టణములో కాపురముచేసి క్రొత్తబోధనాపద్ధతులను నేర్చికొన్నాను. అవి శల్యగతములగుటవల్ల మనపూర్వుల విద్యాభ్యాసక్రమముపైనాకు గౌరవము లేకపోయింది. ఈనేర్చినపద్ధతులన్నీ కొంతమట్టుకు క్లాసులలో ప్రయోగం చేయమొదలుపెట్టేను. గాని దానివిలవ విద్యార్థులు గ్రహించకపోవుటచేత 'ఓగు నోగు మెచ్చు' అనే వేమన్నపద్యం జ్ఞాపకం చేసుకొని మాట్లాడక వూరుకున్నాను. ఈపద్ధతులను ఉపయోగించుటకు సమయము రాకపోతుందా అని ధైర్యం.

ధైర్యం ఎందుచేతనూ అంటే నాకు మూడేళ్ళయీడుగల కొడుకు. వాడికి చదువునేర్చుకొనుటకు తగినవయస్సు— అనగా నాలుగుసంవత్సరములు వచ్చినట్లయితే సక్రమముగా పుస్తకాలలో వున్నరీతిగా బోధనపద్ధతులను ప్రయోగించి తద్ద్వారా ఉత్తమవిద్య కరపించవలె

సని నే నభ్యసించిన మానసిక శాస్త్రమును పురస్కరించుకొని పనిజరిపి నట్లయితే నాకొడుకు ప్రతిభాశాలి అవుతాడని నాధైర్యం.

విద్యాభ్యాసమును ఓనమాలతో మొదలుపెట్టరాదు. వస్తువుల యథార్థ గుణగ్రహణము జ్ఞానేంద్రియములు చేయుచున్నవో లేవో తెలిసికొనవలెను. అట్లు జేయనియెడల వాని నభ్యాసపరిచి సరిగా గుణముల గ్రహించునట్లు చేయవలెను. అనగా బాలుడు తొలుదొల్త ఓనమాలను దిద్దుకొనుట మాని వేర్వేరురుచుల దెలిసికొనుట, వేర్వేరురంగుల దెలిసికొనుట, వేర్వేరువాసనల దెలిసికొనుట, వేర్వేరు శబ్దముల గుర్తుబట్టుట, పదార్థముల వేర్వేరుస్థితులను తాకి తెలిసి కొనుట నేర్చుకొనవలెను. అట్లు నేర్చుకొనుటవలన వారిజ్ఞానేంద్రియ మును వస్తువులయథార్థగుణములను గ్రహింప గలిగివుంటవి.

ఈవుద్దేశముతో నేను ఒకనాడు నిమ్మకాయ, బెల్లంముక్క, వక్కపొడి, పచ్చిమిరపకాయ యిత్యాదులు రుచులు నేర్పుటకును, గన్నేరుపువ్వు, పచ్చగడ్డి, మల్లెపువ్వు, దేవకాంచనము, మసిబొగ్గు, పసుపుకొమ్ము ఇత్యాదులు రంగులునేర్పుటకున్ను సంతరించుకొని మావాడిని దగ్గిర కూచోబెట్టుకున్నాను. మాఅమ్మ దూరంగా కూచుని ప్రత్తిబుట్ట దగ్గిరపెట్టుకొని వత్తులు చేసుకుంటున్నది.

నేనుచదువుచెప్పడం మొదలుపెట్టాను. ఏకాగ్రచిత్తముతో విష యగ్రహణము చేయగలిగి యుండుటకు మావాడిని బాసికపట్టు వేసు కొని కూచోమన్నాను. విద్యాభ్యసనసమయమునందు బాలురస్వేచ్ఛ నరికట్టుట మంచిపద్ధతి కాదు. అందుచేత బాసినపట్టు వేసుకొమ్మని చెప్పినా మావాడికి స్వేచ్ఛ నేను తగ్గించలేదు. ఒవంతసేపు బాసిన పట్టు ఒవంతసేపు పండుకోవడం ఒవంతసేపు మొగ్గలువెయ్యడం ఒవంత

సేపు గంతులు వెయ్యడం మొదలైన పనులన్నీ చదువునేర్చుకొనేటప్పుడు మావాడు చేస్తూనేవున్నాడు. మొట్టమొదట గన్నేరుపువ్వుపుచ్చుకొని “నాన్నా ఇదేమి?” టన్నాను.

“ఇది పువ్వు”
“దీనిపే రేమిటి?”
“దీనిపే రేమిటి నాన్నా?”
“నువ్వు చెప్పు?”
“నువ్వు చెప్పవు నాన్నా?”
“నేను చెప్పకూడదు. నువ్వు చెప్పుకోవాలి”
“నేను చెప్పవచ్చునా నాన్నా?”
“ఆ, చెప్పు.”
“నేను చెప్పను, నువ్వు చెప్పుకో నాన్నా.”
“నాకూ తెలియదు. నువ్వు చెప్పు.”
“నాకూ తెలియదు. నువ్వు చెప్పు.”
“అయితే చెప్పుతాను విను. ఇది గన్నేరు పువ్వు.”
“ఇది గన్నేరుపువ్వా నాన్నా!”
“అవును.”
“నువ్వు ఎక్కడ తెచ్చావు నాన్నా దీనిని?”
“దేవాలయం తోటలోంచి”
“నేనూ వెళ్లి తీసుకురానా నాన్నా?”
“వద్దు. నువ్వు అట్టే మాట్లాడకు. నే చెప్పేది విను.”
“మరీ గన్నేరుపువ్వు ఎందుకు తెచ్చావు నాన్నా?”
“చెప్పుతాను గాని– ఇది ఎలా వుంది?”
“మరి నా కాపువ్వు ఇవ్వవు నాన్నా?”

"ఆకుపచ్చగా వుంది."

"సరే. ఇది జ్ఞాపకం వుంచుకుంటావు కాదూ ?"

"అలాగే, నాన్నా. నా కా బెల్లంముక్క పెట్టవు ?"

"ఇంద. మరి అదంతా తినెయ్యకు !"

ఇంతట్లో యింటిలోంచి నాభార్య కేక వేసింది.

"అవునుగాని, కచేరీకి వేళయినట్టు వుంది. మీ అమ్మ వుండలేదు."

"కుర్రాడితో ఆడుకో నేబసులు స్నానం చెయ్యకూడదూ?"

"ఇదిగో లేస్తున్నా."

లేస్తూండగామాఅమ్మవత్తులు, పత్తిబుట్టలో పెట్టి మూతవేస్తూఅన్న దిగదా "అబ్బాయీ, ఎప్పటికప్పుడువాడితో అలాగ ఆడుతావు. వాడికి రెండు ముక్కలు చెప్తూతూ వుంటేగాని వాడికి చదువు వచ్చేవిధం ఎలాగ ?"

మొత్తంమీద ఆడవాళ్ళు—ఏమన డానికి నోరురాదు!

# సన్యాసి

సత్యాంజనేయులు

మొగలిరేకుల మృదుల కపోల యుగము
కలువమొండల వేడిమి కందువాడె
తెలిమొగులుచాటు నెలవంక తెలుగుఁ బూని
బూది బూసిన నీమోము మురువు తఱిఁగె.

## సన్న్యాసి

కన్నెపూఁబోణి గాటంపుఁ గౌఁగిలింత
నవసి వసివాడు నీమేని చివురు నేఁడు
కఠిన హృదయమ్ములేనియుఁ గఱగి పోవ
కటికి రానేలఁ గిడుమూలు గట్టె సకట!

కావిపుట్టమ్ము కటిసీమఁ గప్పుభాగ్య
భోగ్యరాహిత్యమైన వైరాగ్యమునకు
జాజిపూసౌరభమ్ములు జల్లు విరియు
జవ్వనమ్మున కెంత!? దవ్వు గలదు?

దివ్యకుసుమాంగి యానెలు దీసియిచ్చు
లేఁదములపాకు మడుపులు గా దటంచు
హరిణ శాబమ్ములకుఁ దృణాంకురము లిడగ
మనసు పుట్టెనె? ఎంత యమాయకుఁడవు!

మధుర దరహాస చంద్రికా సుధ తొలంగు
కామినీ స్నిగ్ధ గండ భాగమ్ము లాను
కప్పురపు తమ్మతావుల కావి మోవి
బీటువడ నీకు వైరాగ్యవృత్తి యేల?

అల్లనల్లన దఱిఁజేరి అలఁతి సిగ్గు
జాలిచూపుల క్రీగంట మేళవించి
మధుర మందస్వనంబుల మాటలాడు
ప్రణయినీ బాంధవం బెట్లు బాసినావు?

సర్వము పరిత్యజింపంగఁ జనును గాక
పూపజవరాలి పొలయల్కఁ బాపునాఁటి

ప్రణయభావమ్ము స్మరణకు రాకఁ గడవఁ
జనునె నీకు దీర్ఘనిశీథ సమయములను.

నవ్వేద వదేల? నామాట నమ్మి నీదు
నెలఁత కఁగఁ కేఁగి తప్పు మన్నింపు ముసుము
కఱకు రుద్రాక్షమాలల కంఠసీమ
కమ్మ సంపంగి దండలు గాఁగిలింప!

# అపోహము

కె. హెచ్. వి. యస్. నారాయణ, బి. ఏ., ఎల్. టి.

కొత్తూరిలోనికల్ల గొప్పవసితిదారుడు పుల్లయ్యకాపు. అతనికి పిత్రార్జితం మున్నూటయేభై యకరాలమెట్టభూమి, ఇన్నూట ఎకరాలపైగా వరిపొలమూ ఉన్నవి. అటువంటి వానిచేతిక్రింద బోలెడుమంది నౌకర్లున్నారంటే ఆశ్చర్యమేముంది? ఊళ్లో సగంమంది అతని భూమివల్లనే బతుకుతున్నారు. అందుచేతవీనిమాటంటే తీసివేసేవాళ్లెవరూలేరు. పుల్లయ్యస్వయంగా చేసుకునే పనిపాటలేవీ లేవు. ఎప్పుడో ఏడాదికి సగటున రెండుమూడుమార్లు పొలాలవైపు షికారుగాపోయిచూసి వచ్చేవాడు.

ఒకరోజు ప్రొద్దున్న పదిగంటలవేళప్పుడు ఇద్దరు నౌకర్లు వేగముతో వచ్చి పుల్లయ్యకు కొంచెము దూరముగా నిలబడినారు. పుల్లయ్య వాళ్లను చూసీచూడనట్టుగా మీసాలు మరింతపెనివేస్తూ, పొట్టసవరించు

కొంటూ, జానెడు పొడుగాటి పాటాకు చుట్టకాలుస్తూ పరధ్యాసం నటించాడు.

"కాపుగారండీ, మామునపి కూ సిత్త గించాలండి" అన్నాడు ఒకనొకరు.

"ఇంత పొద్దోయినా, యింకాపొలంలోకి పోలేదేంరా! ఈయేడు గింజలు విరాకిచ్చినట్టేలెండి—" ఈధోరణిలోకిదిగాడు కాపు.

"కాదు, బాబూ, పొద్దున్నే యెల్లాం సాందానిపొలంలోకి, నీరెడదామన్చెప్పి పారా గునపం పట్టుకెళ్లిసూ స్తే ఈరన్నకాపు పొలంలోంచి మురుగునీరంతా ఒచ్చి మనపొలం ముంచేసింది. ఈరన్నకాపు ఆడే ఉన్నాడు, నవ్వుతూ నిలబడ్డాడు. ఈకబురు కామందులారితో సెప్పుకోడానికొచ్చాం." అంటూఉండగానే, రెండోనొకరు అందుకొని "యీలాగై తే మనపొలం గిద్దెడు గింజలైనా పండదుండి పదేళ్లదాకా. కామందులారు మమ్మల్నంటారు తర్వాత" అనిమొదలెట్టాడు.

ఇదివరకూ తన అధికారానికి ఎదురులేదని విర్రవీగుతూన్న పుల్లయ్యకీమాటలు తలకొట్టేసినట్టయి, యేమనడానికీతోచక, వెనుక నేలమీద చేతులనానికొని, మునికాళ్లమీద కూచుని, జాగ్రతగా రెండు మూడునిమిషాలు బాధపడి లేచాడు. లోపలికిపోయి గుడ్డాలొకటి పైనవేసుకొని, దుడ్డుకర్రచేతబట్టి పాతచెప్పులు తొడుక్కొని, కొత్త చుట్టఅంటించి కాలుస్తూ బయలుదేరి ఏనుగలాగ పోతున్నాడు పొలంకేసి. అతన్ని చూసినవాళ్లంతా "పుల్లయ్యకాపు కోపంగా పోతున్నాడెక్కడకో" అనుకొని భయపడ్డారు. తోవలో నాలుగయిదు మార్లు కూచుని చుట్టమీద చుట్టఅంటిస్తూ యెలాగయితేనేం పొలంజేరాడయ్యా పుల్లయ్యకాపు.

తెల్లవారిందిగదా అని ఇంట్లోనుంచి అందరూ ఇవతలకు వచ్చారు. పుల్లయ్య అరుగుమీద స్తంభానికి జేరబడి పొగాకు చుట్టచుట్టుకుంటూ ఎదురుగా ఉన్న రావిచెట్టు అరుగువైపు చూసి యేదో ఆలోచిస్తూ కూచున్నాడు.

ఆవూరికి పురోహితుడేపెద్ద. గ్రామదేవుడు సత్యనారాయణ మూర్తికి పూజారి యీయనే. ఈయనకు అరవయియేళ్ళు దాటాయి గాని చూపుతప్పలేదు. పళ్లుకదలలేదు. తలవెండ్రుకలు అక్కడక్కడ మాత్రం కొంచెం నెరిశాయి. ఆజానుబాహువు. ఇప్పటికి చెట్టెక్కి విస్తరికి ఆకులను స్వయంగా కోసి తెచ్చుకుంటాడు. అంతఓపిక, అంతదార్ఢ్యము. లోకానుభవం చాలాఎక్కువగా కలదు. వైద్యంకూడా తెలియడముచేత ఆవూళ్ళోనేకాక చుట్టుపక్కలవూళ్ళలోకూడా ఈయనకు పలుకుబడి యెక్కువ. ఈయనమాటంటే యెవ్వరూమీటిపోరు. పెద్దమనుష్యులు నలుగురి అభిప్రాయము తీసికొని తగవులన్నీ ఈయనేపరిష్కారము చేస్తాడు. ఎంతచిక్కుతగాయిదా అయినాసరే టక్కున తీర్చగలశక్తి ఉంది.

ఇంకాఎవ్వరు అరుగుమీందకు రాలేదనుకొంటూ పుల్లయ్య మూడవ చుట్ట అంటించుతున్నాడు. అంతట పూజారిరామయ్య రావిచెట్టుఅరుగు మీద ఇత్తడిచెంబుపెట్టి కుడిచేతనున్న ఆరుఅడుగుల కర్రను అరుగుకు జేరవేసి ఉంగరాలు ఊడిపోయిన చెప్పులజోడును వదలి మూడుసార్లు రావిచెట్టుకు ప్రదక్షిణంచేసి చెట్టుమొదట నిలచియున్న ఆంజనేయ విగ్రహమునకు సాష్టాంగపడి లేచి నమస్కరించి అరుగుమీదపుల్లయ్య ఇంటికి ఎదురుగా కూచుని "ఏమోయి, పుల్లయ్యా, ఈవేళ ఇంతప్రొద్దున్నే లేచావు"అనిఅడిగేసరికి నోటిలోనున్న చుట్టను స్తంభంవెనుక దాచి తనవిచారమును సాధ్యమయినంతవరకు అపుకొని "దండాలు

సామీ, ఏంలేదుమామయ్యగారూ, ఏంలేదు” అంటూ మెల్లగా పుల్లయ్య రామయ్య పక్కకు జరాడు. “ఏమోయ్, మీ పెద్దపిల్ల సంబంధం విషయమయి పెద్దాడనుంచి దరిమిలాస ఏమయినా తెలిసిందా? చాలాఅశ్రద్ధ చేస్తున్నావుసుమా!’ అప్పయ్యకూడా ఊరుకోవడం చిత్రంగావున్నది. ఇంకఆపితే బాగుండదుసుమా, ఏమనుకుంటున్నావో!

“చూస్తూ చూస్తూ అలాగ అంటారేం మామయ్యా? ఎక్కడా కుదరనిదే నేనేమిచెయ్యను?”

“పెళ్లిచెయ్యవలసి వస్తుంది అనే పిల్లని పిన్నమ్మ ఇంటికి తోలివేశాడు, మాబావ మహాగడుసు!” అన్నాడు. అరుగు అవతలవైపుకిక్రింద కూచుని మొహంకడుగుకొంటూ ఉన్న పుత్రయ్య శెట్టి.

“పిల్లాపీచు లేనివాడవు నీకేమి తెలుసును, వెఱ్ఱిమొగానవు” అని శెట్టికి బదులుచెప్పి, “నీయిష్టము వచ్చిన చోట సంబంధం కుదుర్చుమామయ్యా, నేనేమి ఎదురాడను.” అనిరామయ్యను వేడుకొన్నాడు.

“నువ్వు ఆలాగ అన్నావుకనుక, పుల్లయ్యా! నాకు తోచిందేమిటంటే వీరన్నకొడుక్కి ఇస్తేనే.........”

“ఛా, ఛా వాడా” అని బిగ్గరగా అని పుత్రయ్య శెట్టి వినకుండా ఉండాలని రామయ్యదగ్గరగా జరిగి అతని చెవిలో పావుగడియసేపు ఏదో బహు తీవ్రమయిన ముఖముతో చెప్పాడు.

రామయ్య కొంత ఆశ్చర్యముతో విని, “నేనెంతమాత్రం నమ్మను, వీరన్న యేమిటి నిన్నుధిక్కరించడం ఏమిటి. వాడికి అంతధైర్యం ఎక్కడిది? కొంచెము కొంటెవాడు అని నాకు తెలుసును. స్వతహాగా మనిషి మంచివాడే. అయితే వాని అప్పగారి దుర్బోధనమువలన అప్పుడప్పుడు అయోగ్యుడుగా ప్రవర్తిస్తాడు... ...”

"ఈసంగతిలో మీమాట బాగుందికాదు. నేను కళ్లారా చూసి అనుభవించినప్పుడు మీరు నమ్మను అంటే నే నేమి చెయ్యావలెనో తెలియదు." అని వినయముతోనే అన్నాడు పుల్లయ్య.

"నువ్వు నూటు కాదు వెయ్యిచెప్పినా సరే, నేను నమ్మజాలను. నేను ఆతన్ని చిన్నప్పటినుంచి ఎరుగుదును. వాడి నామకరణము మా బాబయ్యగారె చేయించారు. ఆయనతో నేనారోజున వాళ్ళ ఇంటికి వెళ్లాను. నాకు బాగా జ్ఞాపకము."అని రామయ్య అనేసరికి కాపుకు మరికాస్త రేగింది. కాని యేమి అనలేకపోయాడు.

ఆరోజున ఆవూళ్ళో సంత. సంత యీ అరుగుదగ్గరనే జరుగుతుంది. ఊళ్ళో పెద్దమనుష్యూలంతా అరుగుమీద క్రమక్రమంగా చేరారు. వీరన్న పొగాకుబేరంచేస్తున్నాడు. ఆ ప్రదేశమంతా కలకలలాడుతూంది. సలాంసాహేబు రాలేదని చాలామంది వారిలోవారు అనుచున్నారు. ఇంతట్లో హుసేనుసాహేబు, ఆతని పెద్దకొడుకు కనబడ్డారు కొంతదూరాన. ఆతన్ని చూడగానె సంతకు చూడడానికి వచ్చిన పిల్లలంతా "సలాంసాయెబు" అని కేకవేస్తూ అతనిని చుట్టుకున్నారు. హుస్సేను చిరునవ్వుతో "సలాం బాబూ, సలాం" అంటూ కొంతమందిని ఎత్తుకుని ముద్దాడి దింపి కొంతమందిని వంగిముద్దుపెట్టుకొని ఎప్పుడూలేని తొందరతో అరుగుదగ్గరకువచ్చి "సలాం, సలాం" అని రెండుసారులు కేకపెట్టి వెళ్లిపోతున్నాడు.

రామయ్య, సాయెబు, ఇద్దరు ఒక వయస్సువాళ్ళు అవడముచేత వారిద్దరికి అన్యోన్యం ఎక్కువ, "ఏం సాయెబన్నా మాట్లాడకుండ వెళ్ళిపోతున్నావు. నన్నుచూసి రాకపోతే మానిందికాని 'సరిహద్దుపాలందారుడుగదా పుల్లయ్యకాపు. రేపుప్రొద్దున అతని అవసరము నీ

కేదయినా ఉంటుంది. అతని మొగముచూసిఅయినా కొంచెము సేపు ఆగుదూ! "అని రామయ్యా తమాషాకోసం అన్నమాటలకు సాయేబు నవ్వి, "ఆ, అంతా వారుచేసినా సాతూమే. మాకీ బతికేదే వారికోసం పుల్లయ్యాకాఫ్కీ-యేం. అరుగ్ మీంద చెరాయించాడ్ సౌఖర్ భాంచ త్తులుఘాన్యంతింటారు. కష్టాపడి నేను బచ్చా నిన్నాపుదయం మూడూ గంటల్నేపు తవ్వి పుల్లయ్యాకాఫ్కీ పొలాన్కీ-నీర్ పెట్టాల. తూ! యేమిూ కాలం ఇది, సైతాన్ కాలం" అంటూపోతూ ఉన్నాడు.

రామయ్యా చటుక్కున లేచి, "సాయేబు అన్నా, ఒక్కమాట విని వెళుదుగాని కూర్చో, నామాటకాస్త విందూ." అంటేమాట తీసివే యలేక అరుగుమీద ఒక పిఱ్ఱమోపి చంకకింద కఱ్ఱపెట్టి నేలకు ఆను కొని కూర్చుంటూ

"తొరగాసెప్పు అన్నా, బలేపనీఉంది పొలాన్కీ-నీరూపెట్టాలా" అన్నాడు సాహేబు.

"అయితే, పుల్లయ్యాపొలానికి నీవెందుకు నీరుపెట్టావు" అని తత్త రముతో రామయ్యా అడిగాడు.

"పెట్కా యేంచెయ్యాలా? బోదీలోనీర్ పోల్లీ పోల్లీపోతే పుల్ల య్యా నౌఖర్ ఒక్కడూనై, మాదరోచ్ఛత్. చూస్తూ చూస్తూ ముస లీవాళ్లం ఏంచేస్తామ్ లేకపోతే" అంటూ లేవపోతూఉండగా రామయ్యా అతని జబ్బపట్టుకొని, "కూర్చుందూ. కొంచెము సేపు" అనిపుల్లయ్యా మొగంకేసి చూశాడు.

"అన్న, దొంగగాడ్దెకొడుకుల్లాలా" అంటూకఱ్ఱతీసికొనిహడావిడిగా లేచాడు అక్కడనుంచి పుల్లయ్యా. వీరన్న, "ఇంకా బావకి పిచ్చి పోలే దాఏమిటి." అనిసన్నసన్నంగా నవ్వుతూ వదలాడు. ఈమాట వినగానే పుల్లయ్యాకు చుఱ్ఱుమందిగాని ఏమనడానికి తోచిందికాదు.

"రేపు పెళ్లిరోజున చెయ్యవచ్చులే హాస్యాలన్నీ బావగారిని, అప్పుడే మొదలెట్టినావు!" ఇలాగ రామయ్య అనేసరికి పుల్లయ్య కొంచెం చిరు నవ్వు నవ్వాడు.

"వహ్వా, వహ్వా, నాకే తెల్పకుండా నిశ్చయంచేశావు. మీా బచ్చికి పెళ్లి!" అంటూ సాయేబు పకపకానవ్వాడు

"మహా బాగా కుదిరింది సంబంధం" అన్నారు విన్నవాళ్లంతాను.

"పొగాకు ఎన్నిబుట్టలు కావాలో ఇప్పుడే చెప్పాలి. లేకుంటే అప్పటికి తీసుకురావడం కష్టమవుతుంది" అనిచెప్పుతున్నాడు, పొగాకు భీమయ్య.

రామయ్య, పుల్లయ్యని వీరన్ననిపిలచి "సంబంధం స్థిరమయినట్టే, ఇంక మీాప్రయత్నాలమీాద ఉండండి" అని సంబంధం కుదిర్చివేసినాడు.

"మాపిల్లపెళ్లి అయిసకొద్దిరోజులలోనే మూర్తం పెట్టాలి. లేకపోతే కుర్రాడిపెళ్లికి మళ్ళీ పనులు చేసుకోవలసి వస్తుంది" అనివీరన్న అన్నాడు.

"మహాగొప్పగొప్పపనులు చేయించే వాడిలాగే మాట్లాడుతున్నాడు. వీరన్నబావసంగతి పదిరోజుల్లో అతని పిల్లపెళ్లి జరుగడంలో తెలుస్తుంది. కబుర్లు చెప్పినట్టు అనుకున్నాడు." అని నవ్వుతూ "రామయ్యమామా! శెలవిప్పించండి; మాఅమ్మతో ఈకబురుచెప్పివస్తా" నని తిందరలో చెప్పులజోడు మరచిపోయి బట్ట బిగించుకుంటూ పుల్లయ్య ఇంటికి పోయాడు.

# ప్రతీక్ష

పంద్యారం వెంకట సుబ్బయ్య

కదలికం జెంది జలము సల్గడల కేఁగు
పగిదిఁ దిమిరంబు కలవరపాటు నంది
పఱుగులిడి పోయి కసుబంత కరటికాల
వపువినిర్యాత కాంతి లవంబుఁ జొచ్చె.

తన మనోదుఃఖమును బాపుకొని బిసంబు
కులుకు సూపుచుఁ దలయెత్తె గోరుచుట్టు
పయిని రోకఁటిపో టన్నభంగి నివము
కొలఁది జడి తుంపురులవలెఁ గురియసాగె.

వెన్నెలపులుంగుగవ తమ వెత వెలార్చి
మమత దీరగఁ బ్రియసామ్రాజ్య మేలఁ
దలఁచెఁ గాఁబోలు! సాయాహ్న మెలమి నెపుడు
వొప్పదునో యంచుఁ దెన్నులు సూడఁ దొడఁగె.



# ప్రశ్న

నోరినరసింహశాస్త్రి

పేటకు ఒక గొప్ప జ్యోతిష్కుడు వచ్చినాడు. ఆయనకు ప్రశ్నలు చెప్పడంలో అద్భుతశక్తి ఉన్నదట. అదేమిచిత్రమో, అతను చెప్పినది ఏమాత్రం పొల్లుపోకుండ బ్రహ్మవాక్యం వల్లే జరుగుతున్నది. శారదకు మొగపిల్లవాడు పుడతాడని ఆయన చెప్పిన నాలుగురోజులకేగా ఆమెకు పిల్లవాడు పుట్టింది! ఆపిల్లవాడుకూడా పండల్లేఉన్నాడు. మళ్లీ, మంగమ్మకు ఆడపిల్ల పుడుతుందన్నాడు. సుబ్బారావుగారింట్లో సొమ్ము పోతే వాళ్లింటికి మామూలుగా వస్తూ పోతుండే ఒక మనిషి ఎఱ్ఱడిది, ఎత్తుకొనిపోయి వాళ్లయింట్లో ఉత్తరపువైపుచూరులో పెట్టిందని చెప్పినాడు. ఆయన చెప్పినట్లే ఆకంటె కనపడ్డదిగా!

ఆజ్యోతిష్కుని వద్దకు రాత్రిం బగల్లూ తిరణాల ప్రజగా వెళ్లుతున్నారు. మళ్లీ ఆయన కేమాత్రమైనా డబ్బుమీద ఆశ ఉన్నదనా? మహాయోగి! ఎవరుతోచినది వాళ్లు దక్షిణగా తెచ్చి తాంబూలంలో యిస్తేలోపల ఏమున్నదోకూడా కళ్లు విప్పిచూడడు. ఇంత తెచ్చినావు అంత తెచ్చినావని అడగడు. ఆయన పొద్దున నాలుగు గంటలకే లేచి జపానికి కూర్చుంటాడు. దేవీప్రత్యక్షమున్నది. శుక్రవారం పూజలో జున మండుతున్న అఖండము ఆయన మింగుతుండగా అంతా చూచారుగా! పార్వతీశంగారు ఎవ్వరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్లి మూడు నెలలైంది. ఇప్పటికి ఉత్తర మన్నా లేదు. పార్వతీశంగారికి ఇంట్లో తల్లితప్ప ఎవ్వరు లేరూ. ఆయనను నెలరోజులకిందట బెజవాడ స్టేషనులో నలుగురు స్నేహితులతో మాట్లాడుతుండగా ఒక పెద్దమనిషి చూచానన్నాడు కాని ఆయన చూచినప్పుడు పార్వతీశంగారికి మీసాలూ క్రాపింగు

ఉన్నవిట. కాని వెళ్ళిపోయేటప్పుడు ఆయన కవి ఏమీలేవు. ఆయన కాశీలో సన్యసించినాడనిమాత్రం వదంతి. కాని ఆయన సన్యసించడానికి ఏమీకారణం కనబడదు. వెళ్లకముందు ఎవ్వరితోను పోట్లాడిపోలేదు. సంసారంమీద విసుగుపుట్టేందుకు భార్య ఇంకా కాపరానికన్నా రాలేదు. వెళ్లేప్పుడుకూడ పార్వతీశంగారు తల్లితో తెనాలివెళ్లి రెండు మూడురోజులలో వస్తానని చెప్పిపోయినాడు. ఏఅపాయంవల్ల ఎక్కడ ఏమైనాడో అని పాపమాయనతల్లి నిద్రాహారాలు లేకుండా దిగులుపడుతున్నది.

పేటకు వచ్చిన జ్యోతిష్కుని సంగతి పార్వతీశంగారి తల్లికి తెలియవచ్చింది. ప్రతిసంగతీ ఆయన సరిగా చెప్పుతున్నాడని వినగానే ఆమె మనస్సున ఆశాకిరణమొకటి మొలకెత్తింది. ఆమెకు పేటకుపోయి కనుక్కునివచ్చే దిక్కులేరు. పార్వతీశం స్నేహితుడగు వెంకటనారాయణ వెళ్లివస్తేసరి, లేకపోతే తానే స్వయంగా పోవలసి ఉంటుంది. ఆమె దీనమైన ముఖంతో వెంకటనారాయణ దగ్గరకు వచ్చింది "వచ్చి పేటకు జ్యోతిష్కుడొకడు వచ్చినాడట. ఆయన మళ్లీ రెండుమూడు రోజులుకంటె అక్కడ ఉండడట" అన్నది.

ఆమాట అందుకొని వెంకటనారాయణ అన్నాడు: "నేనూ విన్నాను. ఆయన ప్రశ్న చాలా బాగా చెప్పుతున్నాడట? మన పార్వతీశం సంగతి కనుక్కునిరావడానికి తీరికలేక ఇవ్వాళనని రేపని అనుకుంటున్నాను."

ఆ తర్వాత పార్వతీశంతల్లి ఆరోజురాత్రి పేటకు ప్రయాణమయ్యేట్లు వెంకటనారాయణను ఒప్పించి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన తర్వాత వెంకటనారాయణ భార్యతో, "నేను పార్వ

తీశం విషయము ప్రశ్న అడిగేందుకు రాత్రికి పేట వెళ్ళుతున్నాను అన్నాడు.

అతని భార్య నిండుచూలాలు. అప్పుడు భర్త ఊరుకదలడం ఆమె కేమాత్రం ఇష్టంలేదు. కాబట్టి ఆమె "ఇటువంటి ఇబ్బంది సమయంలో ఎట్లా వెళ్ళుతారు? పోనీ, అవసరమైనపనికూడా కాదాయెను! ప్రశ్నలు అడగడానికి ఈ స్థితిలో వెళ్ళితే వెళ్ళండి. దానికి నాసలహా యెందుకు?" అన్నది.

"నిన్ను సలహా అడగడం లేదు. వెళ్లేప్పుడు చెప్పవద్దంటే అలాగే చెప్పకుండా వెళ్ళుతానులే" అన్నాడు వెంకటనారాయణ.

భార్య అన్నది, "నన్ను బెదిరిస్తారా ఏమిటి! మీపార్వతీశంగారు వెళ్ళితే తల్లి ఏం జేస్తున్నది!"

దీనిమీద భార్యాభర్తల కాసాయంత్రము కొద్దిగా ఘర్షణ జరిగింది. చివరకా రాత్రి పేటకు వెళ్లేప్పుడు వెంకటనారాయణ భార్యతో వెళ్ళుతున్నానని చెప్పనుకూడా లేదు.

పేటకు వెళ్ళిచూడగా ఆ జ్యోతిష్కునివిషయము, విన్నమాటలు సత్యములే అని వెంకటనారాయణ ప్రత్యక్షంగా తెలుసుకున్నాడు. పేటలో ఎక్కడ విన్నా జ్యోతిష్కునివిషయం చెప్పుకునేవాళ్లే, ఆయన చెపుతున్న అద్భుతవిషయములకు ఆశ్చర్యపడేవాళ్లే.

రాత్రి ఒకపంచలో నిద్రించి వెంకటనారాయణ మరునాడు పొద్దున స్నానముచేసి, సంధ్యవార్చి పండ్లు తాంబూలమూ దక్షిణ చేతపుచ్చుకొని జ్యోతిష్కు డున్నచోటికి బయలుదేరినాడు. అక్కడ జనులు గుంపులుగుంపులుగా ఉన్నారు. కాని అందులో ప్రశ్నఅడిగే వాళ్ళకంటె చూడవచ్చినవాళ్ళు ఎక్కువ. అతికష్టంమీద వెంకటనారాయణకు జ్యోతిష్కుని దర్శనం ఒంటిగంటకు దొరికింది.

జ్యోతిష్కుడు ఒ
సాక్షాత్సాంబశివుని
వెంకటనారాయ
అడుగుటకు మొదలడు.
ఆయన, ఆరుమాసము

వెంకటనారాయణవ
సీప్రశ్న తెలిసినది. నీస్నే
స్నానం చేస్తున్నాడు. కాని, -
నీసొంతఇంటి విషయము జా,
అన్నాడు.

వెంకటనారాయణకు ఒళ్ళ
శగిరి వెళ్ళేరైలు ఇంకోపా
వెంకటనారాయణ ఇంక భోజ
అతివిచారంగా స్టేషనుకు అతనువ
రైలు బయలుదేరబోతున్నది. టిక్కె
అతను రైలెక్కినాడు.

బండి బయలుదేరింది. అప్పటికే రైలు
వల్ల చాలావడిగాపోతున్నది ఆరోజు. కాని
రాదు.

చివరకు రైలు మంగళగిరిలో ఆగింది. అతను
పిచ్చివానివల్లే పరుగెత్తినాడు. "వచ్చేప్పుడు భార్య వద్ద
చివరకు పోట్లాడి చెప్పనైనా చెప్పకుండావచ్చాను." అ
లుపడుతున్నాడు. స్టేషనులో టిక్కటు కలెక్టరు ఆశ్చర్యం
ఎగాదిగా చూచాడేకాని. టికెట్టు మాత్రం అడగలేదు.

తడు ఆపాదమస్త
కట్టినవి. వాకిట్లో
్ర ఉన సంగతినిగూర్చి
ఇ్ మహావ్యసనం సం
- చెప్పకుండా వెళ్లినం
ాండా వణుకుతూ ఇం

్యను "ఎట్లా వున్నావు?"

ేన్న భర్త తన్ను ఈ ప్రశ్న
స్యపడి "మీరింత భయంతో
ది.

ాని అందుకు మరింత ఆదుర్దాగా
మరింత ఆశ్చర్యమైనది. భర్తకు
డి ఆమె జవాబేమీ చెప్ప లేదు.
ఱు భార్య కేమీజబ్బు లేదని కొంతమటుకు

దు సొంతయింటి విషయము పోయి జాగ్రత్తపడ
వున్నదోఅని భోజనమయినా చేయకుండా స్టేషనుకు
అన్నాడు వెంకటనారాయణ.

నేను చెప్పిందే చెప్పినాడా? ముందు ఇంటిసంగతి చూచు
నెలలతో ఉన్న భార్యను విడిచి ఇక ఎక్కడికీ వెళ్లబోకండి.

అదృష్టంవల్ల ఇక్కడంతా క్షేమంగానే ఉన్నారు. ఇక భోజనానికి లేండి!”

*　　*　　*

ఆరోజు రాత్రి వెంకటనారాయణ భార్య సుఖప్రసవమైంది. మగ పిల్లవాడు పుట్టినాడు.

# తరంగమాలిక

పెద్దిభట్ల పూర్ణశర్మ

అరుణరాగపు మధురకాంతులు
ఆవరించెను ధాతప్రాగ్దిశ
బాలభానుం డుదయ మయ్యెడి
కాలమరుదెంచెన్.

నిదుర లేచె శకుంతసంతతి
నీమధురగానంబు వినుటకు
కూలమున కరుదెంచుచుండిరి
వేలకొలంది జనుల్.

పొరలరమ్మ తరంగమాలిక!
తరుణమయ్యె నిం కాలసింపకు
నీగభీరోదాత్తగానము
నింపు దెసలందున్!

ప్రీతియిసుకను బోసిపోసిరి
పొరు లరికట్టంగం గొందఱు
గంతు లిడుచును దాటం బొమ్మి
కట్ట తెగునట్టుల్!

# చామర్తి రాజశేఖర రావు

## శేషాద్రిరమణకవులు

రాజశేఖరరావు కృష్ణామండలములోని "కస్తల" యను గ్రామమున మేనమామలయింట జనించెను. ఇతనిని గన్న మూడవ దినముననే తల్లి పరలోకప్రాప్తురాలయ్యెను. అగతికముగ నున్న యీ శిశువును నీతని పెదతల్లి యగు రాజమ్మగారు మిగులఁ బ్రేమతోఁ బెంచి పెద్ద చేసెను. రాజశేఖరుని బాల్యమంతయుఁ బెదతల్లిగారి గ్రామమగు జగ్గయ్యపేటయందుఁ గడచెను. కడుపునఁ గన్న బిడ్డలులేమిచేఁ గన్నులఁ గప్పుకొని పెంచుచున్న పెదతల్లి రాజశేఖర రావున కింగ్లీషు చెప్పింపవలయునని గుంటూరున కేగెను.

విద్యార్థిదశలో రాజశేఖరరావు పరుల నాశ్రయించి కాలము గడపవలసివచ్చెను. అతఁడు ఇంటర్మీడియేట్ పరీక్షలో నుత్తీర్ణుఁడగువఱకు గుంటూరులో నుండెను. బి. ఏ. పరీక్షకు మచిలీపట్టణమున కేఁగి యచ్చట మిక్కిలి కష్టపడి చదివి తుద కుత్తీర్ణుఁ డయ్యెను.

రాజశేఖరరావు గుంటూరులో దుగ్గిరాలలోను నొక సంవత్సరము, నందిగామలో తొమ్మిది మాసములు మాత్రముపాధ్యాయ పదవియందుండెను.

బాల్యమునుండియుఁగల కవితాధారను దినదినాభివృద్ధి కావించుకొని యితఁడు విజయధ్వజ మను నవలను, సోమవార మహత్త్వము, విజయనగరరాజ్యస్థాపన మను నాటకములను, చంద్రహాస విలాస మను ప్రబంధమును రచించెను. విజయనగరరాజ్యస్థాపనము మాత్ర మసంపూర్ణముగ నున్నది. మరణించువఱకు నాలుగంకములు మాత్రము

ముగింపఁ గలిగెను. ఇతఁడు చెప్పిన చాటువులు "సాహితి" పాఠకు లెఱింగినవే. అందలి భావగాంభీర్యము, శైలిమార్దవము ప్రశంసా పాత్రములు. రాజశేఖరరావు రచించిన పుస్తకములలో సర్వవిధముల విజయనగర సామ్రాజ్యస్థాపనము శ్రావ్యముగా, మనోజ్ఞముగా నున్నది. ఈగ్రంథ మసంపూర్ణముగా నుండుట శోచనీయము. రాజశేఖరరావు బెజవాడ హిందూహైస్కూలులో స్కూల్‌ఫైనల్ పరీక్షకు వాచరుగా నియోగింపఁబడి, నందిగామలో మార్చి ౨౫ తారీఖు రాత్రి బయలుదేఱి బెజవాడ కేగెను. బెజవాడలోఁ దనపని నిర్వర్తించుకొని ౩౦ తేదిరాత్రి మెయిల్ బండిలో బయలుదేర నెంచిన మిత్రున కాకస్మికముగా వాంతులు విరేచనములు కా నారంభించెను. మరునాఁడు సాయంకాలము ౬ గంటలకు రాజశేఖరరావు పరలోకప్రాప్తి నొందెను.

జూన్ నెలలో మదరాసున కేగి ఎల్. టీ లోఁ జేరవలెనని యాతని సంకల్పము. గతించునాఁటికి రాజశేఖరరావున కిరువదినాలుగు సంవత్సరములు నిండలేదు.



# చంపక పుష్పము

## శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

ఊరికే తమాషాకు నేను చంపకపుష్పము అయితి ననుకో. చెట్టు చివర కొమ్మమీద పెరిగి, గాలి వీచినప్పుడు నవ్వుతో కదులుతూ, కొమ్మ కొత్తగా తొడిగిన ఆకులుమీద నేను తాండవమాడుతూ వుంటే అమ్మా, నీవు నన్ను తెలుసుకోగలవా?

నీవు అంటావు గదా, "బిడ్డా, ఎక్కడున్నావు?" అప్పుడు నాలో నేను నవ్వుకుంటూ కిక్కురు మనకుండా ఊరుకుంటాను.

రేకులు ఎవ్వరికీ తెలియకుండా విచ్చి, నీవు పనులు చేసుకుంటూ వుంటే చూస్తూవుంటాను.

స్నానము చేసి, తడిజుట్టు భుజములమీద పడేలాగున విప్పుకుని, చంపకవృక్షము నీడలోనుంచి నీవు పూజచేసుకోవడానికి తులసికోట దగ్గిరికి వెళ్లేటప్పుడు నీవు పువ్వుల సువాసన అనుభవిస్తావు గాని ఆ సువాసన నావద్దనుంచి వచ్చిందని తెలుసుకోలేవు.

మధ్యాహ్నము భోజనముచేసి కిటికీదగ్గర కూర్చుని, నీవు రామాయణము చదువుతూవుంటే, చెట్టునీడ నీజుట్టుమీదా, ఒళ్ళోనూ పడుతుంది. నాచిన్న నీడను నీవు చదువుతూవున్న పేజీమీద, చదువుతూ వున్నచోట సరిగాపడ వేస్తాను.

నీచిన్నిబిడ్డనీడ అని దాన్ని నీవు తెలుసుకోగలవా? చేత్తో దీపము పట్టుకుని సాయంకాలము నీవు పశువులశాలకు వెళ్ళేటప్పుడు నేను గబుక్కున కిందకు పడి, నీబిడ్డ నయిపోయి, "అమ్మా, కథ చెప్పవు టే?" అంటాను. "ఇంత అల్లరిబిడ్డ వయిపోనావేమి? ఇంతసేపూ ఎక్కడుయి న్నావు?" అని అంటావు నీవు. "నీకు చెప్పను!" అంటాను నేను.

కటి లేదు. రాబోవుజన్మమున నాభర్తకు వలసినంతరూపము, పూర్ణా యుర్దాయము ఈజన్మమందే సేకరించవలె. లేకపోతే ఇట్టిగతి మళ్లీ సంభవిస్తే చేసేదేమిటి?

"అలాగు చేయడంవల్ల తప్పేమిటి? మాతండ్రివంశంలో అలాగ ఎంతకాలమునుంచో చేస్తున్నారు. ఆవంశం నేటికీ చిలవలూ పలవలూ పెట్టి ఎంతో కలకలలాడుతూవుంది. నాభర్తవంశంలో ఎంతకాలం నుంచో యీాగ్రహచార మేమిటి? ఈవంశంలో మాతండ్రివంశపు సాం ప్రదాయము లేకపోవడంవల్లనే యీాగ్రహచారం పట్టిందేమో? ఇది తప్పించవలెనంటే అలాగ చేసితీరవలసిందే! ఆలస్యంచేస్తే లాభము లేదు. కోడలికీ మూాడోనెల గర్భముకూడాను—ఎంత అదృష్టవంతుమ్మా! అనుకునేటప్పటికే తటస్థపడింది భగవంతుడుకూడా నాతట్టు వున్నాడు కాబోలు!"

హనువమ్మ చేట ఎండలో పెట్టుతూవుండగా ఒకతొండ గోడమీాద నుంచి క్రిందకు పడింది. అది గోడమీాద పాకుతూవుండగా కాకిఒకటి వచ్చి దానిని తన్నుకుపోవడానికి ప్రయత్నించగా అది తప్పించుకొని క్రిందకు పడింది. మొగము ఎరుపుచేసింది. హనువమ్మ అది చూసి సంతోషించి ఎక్కడచేట అక్కడవుంచి తక్షణం బట్ట విప్పివేసింది. నగ్నమై ఒకకట్టె చేతితో పట్టుగొని ఆతొండను తరుముకు వెళ్లింది. ఆతొండ గోడ ఎక్కబోయి క్రిందకు పడి చదున్నైన భూామిమీాద పరు గెత్తింది. హనువమ్మ దానివెనక పరుగెత్తుతూ దానిని కట్టెతో కొట్ట డం ప్రారంభించింది. ఉభయులూ పెరడంతా పరుగెత్తినారు. చివరకు ఒకదెబ్బతొండకుమోపుగాతగిలింది. అది వెల్లకిలబడి విలవిల తన్ను కొంటూ ప్రాణాలు విడుచు స్థితిలోవున్నది. అప్పుడు హనువ మ్మ దానితోక పట్టుకొని ఎత్తి, లోపలికి తీసుకొనిపోయింది. ఎవరూ

సాధారణముగా వెళ్లనటువంటి సామానుగదిలోకిదాన్ని తీసుకొనిపోయి తోకకు నులకత్రాడుగట్టి దానిని ఆగదిలో వ్రేలాడగట్టింది. చేటలో గోధుమపిండి పోసి ఆచేట తెచ్చి వ్రేలాడుచున్నతొండకు సరిగా క్రింద వుంచినది. తొండనోటినుంచి చొంగకారుతూబొట్టుబొట్టుగా పిండిలో పడుతున్నది. ఆమె వెలుపలికివచ్చి గదితలుపులు వేసి తాళము వేసి ఆతాళముచెవి వత్తులబుట్టలో పత్తిక్రింద దాచింది. పిమ్మట పెరటి లోకి పోయి మళ్ళీ బట్టకట్టుకొని యథాప్రకారము వడియాలుఎండ బెట్టడము ప్రారంభించింది. "కొడుకు కచేరీకి వెళ్లడమూ కోడలు గదిలో నిద్రపోవడమూసరిగా సమకూడినాయి. భగవంతుడు నాపాల వున్నాడు.!" అనుకుంది.

యదార్థానికి కోడలు ఈచర్యలు కొంతమట్టుకు చూసింది. చూసి తనభర్త కచేరీనుంచి యింటికి వచ్చినప్పుడు చూచాయగా తెలియ జేసింది.

౨

అయిన మధ్వకుటుంబములో పుట్టినాడు భీమసేనరావు. ఈతని తండ్రి కాలముచేసేనాటికి భీమసేనరావుకు ౫ సంవత్సరముల వయస్సు. తల్లి హనుమమ్మకు ఇతడే ప్రథమసంతానము. తండ్రి యితగాడికి భీమ సేనాచారి అని పూర్వాచారసిద్ధముగా పేరుంచినప్పటికీ భీమసేనా చారి ఇంగ్లీషు చదవడం మొదలుపెట్టి మెట్రిక్లేషన్ పరీక్ష ప్యాసుచేసే కాలానికి భీమసేనరావుగా పేరుమార్చుకున్నాడు. అలా పేరుమార్చ డము సాంప్రదాయానికి వ్యతిరేక మెంతమాత్రము కాదని తల్లితో వాదించి ఆమెఒప్పుదలమీదనే చేసినాడు ఆరీతిగా. తల్లి హనుమమ్మ తెలివితేటలువల్ల ఎంతమాత్రమూ డబ్బుకు కొదువ లేకుండా వాళ్ల

కాపురము నడిపించడమే కాకుండా భీమసేనరావు క్రమక్రమముగా మదార్సులో ఇంగ్లీషువిద్య అభ్యసించడముకూడా జరిగించినాడు.

అసలు హనుమమ్మకు ఇంగ్లీషు చెప్పించడము ఇష్టములేదు. కుల మర్యాద ననుసరించి దేవతార్చనమంత్రములు ఇత్యాదులు నేర్చుకొని పూర్వాచారపరాయణుడై తనకొమారుడుండవలెనని ఆమె అపేక్ష. అయినప్పటికీ ఆమె యింగ్లీషుకు ఒప్పుకున్నది. దానికి కారణము లేకపోలేదు.

కుదురెహల్లి అనుగ్రామము బళ్లారికి పదిమైళ్లదూరములో వున్నది. ఆగ్రామములో మధ్వకుటుంబములు మూడునాలుగుతప్ప అంతకన్న అధికముగా లేవు. మిగిలినయిండ్లు చాలామట్టుకు స్మార్తులవే. హనుమమ్మగారిది కుదురెహల్లిగ్రామము. అనగా మూడుతరములనుంచి మాత్రమే వీరు ఈగ్రామమును సొంతగ్రామముగా చేసుకున్నారు. అసలు వీరిది రాజుపాలెము. రాజుపాలెము కుదురెహల్లికి మూడుపరుగుల (కోసుల) దూరములో వున్నది. వీరిపూర్వులు రాజుపాలెము వదలడానికి కారణము— ఆవూరు అచ్చిరాలేదని, అచ్చిరాకపోవడమనగా —భీమసేనరావుముత్తాతగారి ముత్తాతకాలంనుంచీ వీరికుటుంబములో—ఏమిపాపకర్మము వల్లనో ఏమిగ్రహపాటో గాని—ఒకసంగతిజరుగుతూ వస్తోంది. వీరివంశములో ఎవ్వరికీ ఒక్కపురుషుడు తప్ప వేరేసంతానము లేకపోవడమూ ఆసంతానము కలిగిన కొన్ని సంవత్సరములకు తండ్రి కాలముచెయ్యడమూ తటస్థిస్తూ వస్తూవున్నది. ఇలాజరగడానికి కారణము ఊరు అచ్చిరాకపోవడముతప్ప ఇతరము కాదని వీరిపెద్దలు నిశ్చయించి కుదురెహల్లికి కాపురము మార్చినారు. కాపురము మార్చినప్పటికీ ఆయింట్లోసాంప్రదాయము మాత్రము తప్పింది కాదు. నోములునోచినారు. వ్రతములు పట్టినారు.

దూరయాత్రిలు చేసినారు—ఏమిచేసినా ఏమిలాభము లేకపోయింది.

భీమసేనరావుతండ్రి నారాయణాచారి బ్రతికివున్నకాలంలో ఆకోం పకు ఈశాపము తప్పిపోయిందని గ్రామస్థులు అనుకొనేవారూ. ఆయన అంతదైవభక్తిపరుడూ, నిష్ఠాగరిష్ఠుడూ. ఏమైతే నేమి అది తప్పింది కాదు.

గ్రామము మార్చితే తప్పిందిగాదు. ఈశాపమనండి లేదా గ్రహపాటు అనండి ఏమైతే నేమి—కులవిద్య లభ్యసించి దైవ భక్తితో వుంటే తప్పిందికాదు. యాత్రిలు వ్రతములు ఇత్యాదులు ఏమిచేసినా తప్పిందికాదు. ఇంక చేసే దేమిటి? కులవిద్య చదవడం మాని హూణవిద్య అభ్యసిస్తే తప్పుతుందని గ్రామస్థులలో కావలసిన వాళ్ళన్నారు. ఆమెకు బంధువులైన వితంతువర్గ మంతాకూడా అన్నారు. హనువమ్మ వప్పుకోక తప్పిందికాదు. ఆకారణంచేత భీమ సేనాచారి ఇంగ్లీషు చదవడం మొదలుపెట్టినాడు.

## 3

భీమసేనాచారి కుశాగ్రబుద్ధి కలవాడు. ఏపరీక్షా తప్పిపోకుండా అన్నిపరీక్షలూ ప్యాసుఅయి చివరకు ప్లీడరీపరీక్షకూడా ప్యాసుచేసినాడు. ఇతడు బి. ఏ. చదివేరోజుల్లో పెండ్లిఅయింది. కట్నం పుచ్చుకోవడం అతనికి ఇష్టములేకపోయినా. తల్లి లోపాయికారిగా పుచ్చుకొని పెండ్లి నిశ్చయముచేసింది. సాంప్రదాయసిద్ధమైన కుటుంబంలో పుట్టిన కన్యను అతడు వివాహంచేసుకున్నాడు. ఇతని కులసాంప్రదాయము చూసి పిల్లనివ్వడానికి చాలామంది వెనకదీసినప్పటికీ ఇతనివిద్య చూసీ యితనిగుణములు చూసీ చాలమంది పిల్లనిస్తామన్నారు.

భీమసేనరావు మొత్తంమీద మంచివాడని పేరుపొందినాడు. ఎంత యింగ్లీషువిద్య అభ్యసిస్తూన్నప్పటికీ తలకట్టు తీయించలేదు. బొగ్గు బొట్లు పెట్టడం మానలేదు. స్మార్తులయింట ఒకబొట్టుమంచినీళ్లైనా గొంతుకలో పోసుకుని ఎరగడు—వేసవికాలములో గొంతుక ఎండుకు పోయి చస్తూన్నాసరే.

ఇతగాడు దానధర్మములు చేస్తూవుండేవాడనికూడ ప్రసిద్ధి. తోడి విద్యార్థులందరూ రోజురోజూ కాఫీహోటళ్లకిపోయి కానికూళ్లు కుడుచుచున్నప్పటికీ తాను వాళ్లను అనుసరించకవీధులంపట తిరిగి దినముకు రెండణాలచొప్పున బిచ్చగాళ్లకు పంచిపెట్టేవాడు.

ఒకనాడు అతడు ఒకబైరాగిని చూసినాడు. అతడు ఒకగొప్పసిద్ధుడి శిష్యుడట. ఆబైరాగి ప్రతిదినము ముష్టియెత్తి తెచ్చినబియ్యములోసగము—తినకుసరిపోకపోయినాసరే సాధారణముగాసరిపోయేవికావు—వండుకు తిని మిగిలినసగము జోలిలో వుంచుకొని భోజనమైనతరువాత బయలుదేరి వీధులవెంబడితిరుగుతూ చీమలపుట్టలవద్ద కొంచెముకొంచెమువేస్తూఆబియ్యమన్నీ అవగొట్టేవాడు. అది భీమసేనరావుచూచినాడు. మరునాటినుంచీ అతడుజేబునిండా బియ్యము వేసికొని ఎక్కడ చీమలుఅవుపిస్తేఅక్కడ ఆబియ్యం జల్లుతూపోతూండేవాడు. ఇదిచూచి ఇతనిసహపాఠులు ఇతణ్ణి క్రాంక్ అనేవారు. క్రాంక్ అనగా కొంసవెర్రి కలవాడుఅన్నమాట.

ఇతనికి బిచ్చగాండ్లు అంటే ఒకమోస్తరు అభిమానం. ఒకమారు సెలవురోజున ఒకబిచ్చగాడివెనక వాడికి తెలియకుండా బయలుదేరినాడు. ఉదయముమొదలుకొని మధ్యాహ్నమువరకూ వాడివెనక తిరిగి వాడుపొందిన అనుభవములూ వాడుసంపాదించిన బియ్యమూ చూచి

నాడు. పొద్దుగూకువేళకి వాడు ఊరిబయట మఠము చేరి అక్కడ తనకు దొరికినగింజలు ఉడకబెట్టుకొని తిన్నాడు. ఆకలిని అణచడానికి ఆకొద్దిఅన్నము చాలనట్లు భీమసేనరావు చూచి వాడిదగ్గరకు వెళ్లి ఒకఅణా చేతిలో పెట్టినాడు. వాడెంతో సంతోషించి భీమసేనరావును అమితముగా దీవించినాడు. దీవించి పిమ్మట కల్లుపాకదగ్గరకు పోయి ఆ అణాకల్లూ త్రాగినాడు. భీమసేనరావు ఈసంగతిఅంతా చూచి, "బిచ్చగాండ్లకు సంఘ మొనరించినఅపకారము" లనుపేరుతో ఒక వ్యాసము వ్రాసి పత్రికలో ప్రకటింపించినాడు.

ఒకనాడు ఇతడు రైలులో ప్రయాణమై పోతూవున్నాడు. ఇత డెక్కినబండిలో ఒకసంఘసంస్కర్త —చాలా చదువుకున్నవాడట— కూచున్నాడు. అతడు బిచ్చగాండ్లవల్ల ప్రయాణీకులకు గలుగుయిబ్బందులను గురించీ, హిందువుల అపాత్రదానమునుగురించీ బండిలో వారికి ఉపన్యసిస్తున్నాడు. భీమసేనరావు చివరదాకా మాట్లాడకుండా విన్నాడు. ఇంతట్లోకే ఒకబిచ్చగాడు బండిరెక్కి పదములు పాడడం మొదలుపెట్టినాడు. సంఘసంస్కర్త మొగము చిట్లించుకొన్నాడు. భీమసేనరావు జేబులోనుంచి ఒకపావలా దీసి బిచ్చగాడిచేతులో బెట్టినాడు. సంఘసంస్కర్త యితణ్ణి క్రాక్ అన్నాడంటే ఆశ్చర్యమేమిటి?

౪

ఒకనాడు ఒకమధ్వపండితుడు భీమసేనరావుయింటికి వచ్చినాడు. ఆవూళ్లో మధ్వులయిండ్లలో ఎక్కడా వీలులేకపోయిందట. ఆకారణముచేత వీరియింట్లో దేవతార్చనకు అనుకూలముగా వుంటుందేమో అని.

అతిథ అభ్యాగతులకు పూజచెయ్యడంఅంటె భీమసేనరావుకుచాలా ప్రీతి. మధ్వాచారిని దయచెయ్యమని కూచోబెట్టి వారిపేరు వూరు వగైరాలు కనుక్కొని, వా రభ్యసించినవిద్యలు మొదలయినవి కనుక్కొని వారు తనయింటికి రావడంవల్ల తాను ధన్యుడైనట్లు చెప్పినాడు. వారు వచ్చినవర్తమానం భార్యతో చెప్పి యింటిలో తల్లికి కబురు పంపించినాడు. దేవతార్చనాదులకు ఆచార్యులుగారు స్నానముచెయ్య వలెననే వుద్దేశంతో లేచి సమీపములోనేవున్న "హాగేరి" నదికి వెళ్లినారు. హాగేరీనదినే హందిరి అనికూడా అంటారు. భీమసేనాచారి భార్య సైగచెయ్యడంవల్ల ఆమెగదిలోకి వెళ్లినాడు.

"ఆయన భోజనానికి వస్తా రన్నమాటేనా?" అన్నది భార్య.

"సందేహ మేమిటి? నదికిస్నానానికి వెళ్లినారు." అన్నాడు భీమ సేనాచారి.

"నేను చెప్పినమాట మరచినారా?"

"నువ్వు మళ్లీ చూశావా?"

"లేదు."

"మరి?"

"పిండి గదిలోనే వున్నట్టుంది."

"గదిలో వుందా?"

"ఆ"

"తొండ?"

"అది మాయమైంది"

"పిండితోఏమిచేసిందంటావు?"

"ఏమో నాకు తెలియదు. అన్నట్టు నిన్న పెరట్లో ఏవోగుళికలు చేస్తున్నట్టు చూశాను."

"పిండితోనా ?"

"అలాగే తోచింది."

"ఎక్కడ పెట్టిందో తెలుసునా?"

"సామానుగదిలో పెట్టివుండవచ్చు."

"సామానుగది తలుపుతీసి వుందా?"

"తాళము వేసుకుంది"

"తాళముచెవి వున్నదా?"

"ఆమే దాచుకుంది."

"ఎక్కడ?"

"పత్తిబుట్టలో అయివుంటుంది."

"నేను వంటింటిలోకి వెళ్లి మాఅమ్మతో మాటలు చెప్తూవుంటాను. నువ్వు తాళముతీసి పిండీ గుళిగలూ దాచి వెయ్యి."

"అలాగే"

వంటింటిలో హానువమ్మ "దీనికి సందేహ మేమిటి? తప్పకుండా దేవుడు నాపాల వున్నాడు!" అనుకొంటూవున్నది.

కొంతసే పైనతర్వాత భీమసేనాచారి భార్యదగ్గిరికి వచ్చినాడు.

"అయిందా?"

"అయింది."

"అంతా దాచినావా?"

"ఆ."

"పిండీ గుళిగలూను?"

"పిండి తరిగినట్టు తోస్తుంది."

"ఎలా తెలుసును?"

"గుప్పెడుతో తీసినట్టు వున్నది."

"సరిగ్గా చూచావా?"

"ఆ."

"సరే."

భీమసేనాచారిముఖము తీక్ష్ణమైనది. దృఢసంకల్పము చేసుకొన్న వాడివలె కనుపించినాడు.

౫

గుళిక అనగా మాత్ర. విషమాత్రకే గుళికయనుపేరు సాధారణము. గుళిక పెట్టుట అనగా భోజనపదార్థముల యందు మందుపెట్టుట అని బళ్లారిప్రాంతములవాడుక.

బల్లి, తొండముసుగుసరీసృపజాతిలాలాజలమువిషతుల్యమని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. అదిభోజనపదార్థములతో గ్రహించినమనుష్యుడు క్రమక్రమముగా క్షీణించి ఆరు నెలలలో మృత్యువువాతను పడిపోతాడు.

ఇట్టి విషప్రయోగముచేత పుణ్యము సంపాదించవచ్చునని బ్రాహ్మణులలో (ఒక తెగవారి) నమ్మకము. కన్నడదేశములో ఈదురాచారానికి వ్యాప్తికలదు. భోజనముచేసేకాలమున అన్నమంతా పురుగులులాగ కనుపించుననీ అట్లు కనుపించకుండా వుండడానికి సంవత్సరమున కొకమారు ఇట్టిప్రయోగము చేతురనీ కొందరందురు. బాల్యమున భర్తనుబాసిన వితంతువు లిట్టిప్రయోగముచేసి రాబోవుజన్మాన తమభర్తలకు వయోరూపములు సేకరించుకొంటారు. ఈప్ర

యోగముచేత మృతులైనవారి వయోరూపములే తమభర్తలకు వస్త వని వారినమ్మకమూ నేటికీ ఇట్టి దురాచారము కదలని వినికిడి.

హనువమ్మ తండ్రికుటుంబమున నిట్టిప్రయోగములుచేతురని భీమ సేనరావుకు తెలుసును. తల్లితో ఈదురాచారమునుగురించి ఈతడెన్ని మారులో చర్చచేసెను. ఇట్టిపనులవల్ల పాపమేకాని పుణ్యమురాదని ఉపన్యసించెను. హనువమ్మకూడా అతనితోపాటు ఆదురాచారమును ఖండింస్తూనేవచ్చెను. ఆమె కేపాపము పుణ్యమూ తెలియదనినచ్చజె ప్పెను. ఎంతచెప్పినా భీమసేనరావుకు అనుమానము పోలేదు. నేడా అ నుమానము దృఢపడ్డది.

౬

అతిధి, దేవతార్చనాదులు ముగించి దేవుడరుగు దిగి భోజనముకు కూర్చుండబోవుచుండెను. రెండువిస్తళ్లువడ్డించింది హనువమ్మ. వెండిపువ్వు లపీటలు వెండిచెంబులు అమర్చిపున్నవి. భోజనపదార్థాలన్నీ వడ్డన అ యినవి, హనువమ్మ చెయ్యికడుక్కోటానికి పెరట్లోకివెళ్లినది.

"ఆచార్యులుగారూ, దయచెయ్యండి," అని రెండోవిస్తరి చూపి మొదటివిస్తరివద్ద భీమసేనాచారి కూర్చున్నాడు. మొదటివిస్తరి అసలు అతిధి కేర్పాటుచేయబడినది. హనువమ్మ వచ్చిచూచినది. ముఖము మీద వేటువేస్తే రక్తపుచుక్కలేదు.

అబ్బాయీ, లే, లే, రెండవవిస్తట్లో కూచో. తప్పుగాదా వారిని నీ తర్వాత కూర్చోబెట్టడం! ఈమాత్రంమర్యాద తెలియదా? అతిధిఅనగా ఎవరు? మనకుదేముడుతోసమానముగాదా?" అని గబగబ అన్నది.

భీమసేనాచారి పరిషేచనముచేసినాడు. అతిథి అంతకుముందేపరిషేచనముచేసినాడు.

హనువమ్మ రోదనముచేయుచు లోనికి పోయి కూలబడినది. భీమసేనాచారిభార్య తనగదిలో పరుపుమీద పండుకొని గుర్రిడ్డనీరు గుర్రుక్కొనుచున్నది.

మారువడ్డన లేకయే అతిథి, భీమసేనారావు భోజనాలు ముగించినారు.

౭

"నేను చెప్పిన మాట వినరుగా?"

"వినను."

"విరుగుడున్నదని మీఅమ్మగారే చెప్పుచున్నప్పుడు పుచ్చుకోరాదా?"

"అతిథే ఆభోజనము చేసివుంటే విరుగుడు ఇస్తారా?"

"మీరెందుకు పుచ్చుకోరాదూ?"

"సంఘము కోసము."

"నాస్థితినికూడా మీరు మరిచినారా?

"ఏమిస్థితి?"

"నన్నా అడుగుతారు!"

"ఒక్కజీవిసుఖము కోసము లోకము బాధపడకూడదు."

"ఇప్పుడు లోకము బాధ తీరుతుందా?"

"మనసంసారమువల్ల లోకమునకు కలిగేబాధ తీరుతుంది."

"వేరేమార్గము లేదా?"

"ఇది సూక్ష్మమార్గము."

"పోనీ, సంసారము నిలవబెట్టుకోరాదా?"

"ఎట్లు?"

"మళ్లీ నాస్థితినిగురించి నన్నే అడుగుతారేమి?"

"ఇప్పుడు నీకు ఎన్నో నెల?"

"మూడు"

"సరే, సంసారము నిలవబడవచ్చు."

"ఎట్లు?"

"మగశిశువు కలగకూడదా?"

"నన్ను తూలనాడుతున్నారా?"

"లేదు."

"మీరే బోధచేసినారే సతీధర్మము!"

"అనుసరించేవారికే అది."

"నే ననుసరించననా మీవూహ?"

నువ్వే అనుసరిస్తే నాకు మేరలేనిసంతోషము."

"మీకు సంతోషమైతే మీకు సంతోషమైనకార్యము నే చేస్తాను."

భీమసేనరావుభార్య, గదిలో తానుదాచిన గుళికనొక్కదానిని భర్త యెదురుగానే మింగెను. భార్యాభర్తలు కౌగిలించుకొని ఒకరినొకరు ముద్దుపెట్టుకొనిరి. బాష్పధారలతో వారివస్త్రములు తడిసినవి. మృత్యువంటే జనులకు భయము. ఆకారణముచేతనే మృత్యువును తప్పించుకొనుటకు జనులు అనేకప్రయత్నాలు చేస్తూవుంటారు. శాస్త్రజ్ఞులు మృత్యువుతో విరోధముకల్పించుకొని దాన్ని చంపడానికి ప్రయత్నముచేస్తారు. మృత్యువు వారి నెప్పుడూ సిగ్గుపరుస్తూవుంటుంది. అలా చెయ్యడం దానికిసరదా! సాధారణముగా మృత్యువు ఎప్పుడొస్తుందో తెలియకుండావుండి జనులు మృత్యుముఖము ప్రవేశిస్తారు. భయానుభవము, మనస్తాపము ఆకారణముచేత కొంత తగ్గుతవి.

ఫలానాఅప్పుడు మృత్యువు వస్తుందని జనులకు తెలిసివున్నట్టయితే ఎలావుండునో. బెంగపెట్టుకొని మృత్యువురావలసిన దినముకు ముందుగానే జనసామాన్యము మృత్యువువాతపడుదురేమో? ధీమంతు లలా చేస్తారా?

ఈలోకమునందుండి యింకోలోకానికి—ఇంతకన్న సుఖకరమైన లోకానికి—దారిచూపడానికి వచ్చినదూతనుగా మృత్యువునుగ్రహిస్తారే మోక్షీమంతులు. ఎనభైసంవత్సరాలముసలివాడిని ఒకమారు, "ఏంపని చేస్తున్నావు తాతా?" అన్నాను.

"తిరునాళ్లకు మూటాముల్లే సర్దుకుంటున్నాను," అన్నాడు.

తిరునాళ్లనగా రానున్నమృత్యువు.

తిరునాళ్లకు సర్దుకోవడం ఎలా? ఆరునెలలలో రానున్నమృత్యువుకు సన్నద్ధుడగుట ఎలా?

భీమసేనరావూ, అతనిభార్యా యీవిషయమై దీర్ఘాలోచనలు సలిపినారు. భీమసేనరావు తనయావదాస్తిని అమ్మివేసినాడు. తల్లిని పుట్టింటికి పంపించివేసివాడు. హంద్రీనదీతీరమున విశాలమైనతోటను కొన్నాడు ఒక్కొక్కవృక్షముఛాయను ఒకచిన్నగుడిసెచొప్పున సుమారు ఇన్నూరుగుడిసెలు వేయించినాడు. భార్యతోగూడా తా నచ్చటికి పోయి చెరియొకగుడిసెయందు కాపురముపెట్టినాడు.

స్నేహితులతో ఈవిషయ మాతడుచర్చించినప్పుడు స్నేహితులు ఊరుమధ్య నొకభవనముసృష్టించి అందులో సమస్తసౌకర్యముల నేర్పాటుచేయుమని చెప్పినారు.

“బీదవారికి భవనము లేల?” యని భీమసేనరా వూహించినాడు.

... ... ... ... ... ...

* * * *

కొన్నాళ్ల కా తోట బీదజనులతో, భిక్షుకులతో, కుంటివారితో, గ్రుడ్డివారితో కలకలలాడుతున్నది. చెట్లపై సంచరించి కలరవములు చేసే పక్షులపలుకులతో ఈదురదృష్టవంతులగుమానవుల సంతోష వాక్యములు మిళితములవుతున్నవి. హంగేరీనది ఈపక్షులకూ ఈమానవులకూ సేవచేసి ఉప్పొంగుతున్నది.

ఉదయము మొదలు అస్తమయమువరకు ప్రతివాడు ఏదోయొకపని సంతోషముతో చేయుచున్నాడు. చాపలల్లువారు, బుట్టలల్లువారు, నూలుతీయువారు, నేతనేయువారు, చెట్లబెంచువారు, పాటలూపదములూ కట్టువారు, పాడువారు.

రాత్రి చంద్రుడు, తనరణముల చెట్లయాకులమధ్యనుండి ప్రసరింప జేయుచున్నతరిని హంగేరీనది మర్మరధ్వనులతో వీనులకు విందొనసగు కాలమున, నాప్రశాంతనిశాసమయమున విహంగకూజితములతో బాటు, క్షుద్రమానవకంఠనిర్గతములై హరినామసంకీర్తనములు మిన్నుముట్టుచుండును.

... ... ... ... ... ...

* * *

సాయంసమయము. ప్రకృతి విషాదమును వెల్లడిజేయుటకు ముసుగు దాల్చినదోయన్నవిధమున పొగమంచు తోటనావరించెను. హంగేరీ నది తనగతి నాపెను.

నదీతటమున నొక్కచితిపైనున్న భార్యాభర్తలకాయముల దనకీలల నావరించి హుతాశనుడు దేదీప్యమానముగ వెలుగుచుండెను.

ఆకీనజనుల హృదయాంతరాళముల భేదించి వచ్చిన హాహారవములు మంటలతోఁగూడ మిన్నంటెను. ఒక్కసంసారము తరతరములనుండి సంతరించిన కళంక మానాడు భస్మమయ్యెను!

# ఉదయ లక్ష్మి

చింతాదీక్షితులు బి. ఏ., ఎల్. టీ.

సొంపుగాఁ దూర్పున సుముహూర్తమందుఁ
బట్టుచుండెఁ బ్రభాతపూర్ణబింబాస్య!
స్వాగత మిడుచుండె సర్వలోకంబు
కనుఁడదె ప్రాగ్దిశఁ గనులపండువుగ!
పసపుతో మింటిపై బాగుగా నలికి
కుంకుమతో సమకూర్చిరి ముగ్గు.
పూలు రేకులు విప్పి పుష్పాళ్ళతోడ
నుదయలక్ష్మినిఁ గొల్వ నూహించుచుండె
గూండ్లలోఁ బక్షులు కువకువ మనుచుఁ
గలరవంబులతోడ గానంబు సేయఁ!
గంటాల సవరింపఁ గడఁగుచునుండె
నుదయలక్ష్మినిఁ గొల్వ నూహించుచుండె!
చన్నీట వాయువు జలకంబు లాడి

పుష్పాడి మెయినిండఁ బూసికొన్నాఁడు
ఉదయలక్ష్మినిఁ గొల్వ నొప్పియున్నాఁడు.
వనలక్ష్మి గొప్పయాహ్వానంబు సేయ
సర్వవిధంబుల సలిపె యత్నములు.
ముత్యాలసేసలు ముదముతోఁ జల్లఁ
బత్రాగ్రములమీఁదఁ బదిలంబు సేసె
మంచిమంచి రకాల మంచుబిందువులు.
ధరణిపైఁ బఱచె రత్నంపుఁగంబళులు
తోరణాల్ చివురుల తోడుతఁ గట్టె
మింటిపై నొక్కచో మేఘకన్యకలు
చేరిరి హారతి చేతఁ బట్టుకొని.

# దేవదాసి

## ౧

ఆమె దేవదాసి. దేవునకు మనోరంజనము చేయుటే యామెపని. ప్రత్యూషమున దేవుఁడు నిద్ర మేల్కొనుట యామె నూపురశింజనమువలననే; మధ్యాహ్నమున దేవునకు భోగని వేదనము సార్థకమగుట ఆమె తనూలలితకంపముననే; లీలాయిత హస్తములతో నామె గంధమాల్యము లొసఁగుటచేతనే దేవతా ప్రసాధనము సమాప్తమగును; అర్ధరాత్రమున తదీయ మృదుకంఠరగుంజనముననే దేవునకు సుషుప్తిసామ్రాజ్యప్రాప్తాంతమే తెంచును.

హారతి యిచ్చువేళ దేవుఁడామెవైపు చూచుచుండును. ఆయన వదనము ప్రసన్నమై మందహాసోజ్జ్వలముగా నుండును.

లోపాలోపములమాట యామెకు పొడకట్టదు. దేవకార్యములయం దెన్నడైన లోపముజరుగునా?

* * * *

తానెచ్చటినుండి వచ్చెనో ఆమెకే తెలియదు. ఒకానొక గూఢ ప్రణయాకర్షణము ఆమెను స్వర్గభ్రష్టను గావించెను; ఏదోభయసంజాతమగు మానవసమాజతిరస్కార మామెను దేవాలయసోపానములపైఁ బడవైచి యుంచినది. ఆవిషయము లంతర్యామియు ప్రియశిః దేవాలయవృద్ధార్చకుఁడును ఎరుగుదురు.

కైశోరలబ్ధమగు లలితకళను యౌవనప్రారంభమునం దామె దేవుని చరణములకే సమర్పించెను.

స్వర్గామృతము లిప్తమై యున్న దామెకంఠమున; పారిజాత సుమము వ్యాప్తమై యున్న దామె దేహయష్టియందు; లలితబాహుభంగిమయం దున్నది విశ్వప్రణయము; చరణనూపురములందు మ్రోగుచున్నది సృష్టితాళము.

అనాఘ్రాతప్రసూన పరిమళమువలె నామెహృదయమున నొదిగి యున్న పవిత్రత నంతర్యామి మాత్రమె యెఱుఁగును.

ఆమె సౌందర్యముతోఁ గూడి దాక్షిణ్యనసముపలెతీవ్రమైన మాదము ముసలి పూజారిమాత్ర మెఱుఁగును.

౨

రాసోత్సవమున సంగీతలీలయందు నర్తకి తన్మయత్వము నొంది

యుండెను. అతీతయుగపు సమ్మేళనక్షణమ్ము స్మృతిద్వారము తెలుచు కొని నేఁ డే తెంచినది.............

ఆమె విలోకించినది. చంద్రికిరణోజ్జ్వలమగు రాత్రి, నూపుర ముఖరిత మగు యమునా వేలాభూమి, గోపికానేత్రములందలి సం తృప్త దృష్టి, దేవతాదీప్త ప్రసన్నముఖము! ఆ రేయి విశ్వమం దెచ్చ టను అసంతుష్టి లేదు; కేవలము మహత్తరమైన సమ్మేళనపు శాంత మధురిమ విరాజిల్లుచుండెను. సృష్టిలో నది విశ్రాంతిముహూర్తము— పూర్ణము, స్థిరము, అక్షుబ్ధము!

పూజారి కంఠస్వరముచే నామె స్వప్నము భగ్నమైపోయెను: "వనితా, ఇట్టి భావముతో నున్న నీఁకసాగదు!" నర్తకి సంభ్రాం తయై యిట్లనెను: "ప్రభూ, అపరాధమేమైనఁ జేసితినా?"

"అపరాధము కాదు, లోపము. దేవునకు తృప్తి కలుగునట్లు చేయు చుంటివి, కాని దేవుని పాదకమలములకు భక్తిని సమర్పించిన మాత్ర మునఁ జాలదు."

"మఱి యేమి చేయవలెనో సెలవిండు!"

"తనుమనోధనములతో దేవుని పూజింపవలెను. నీవొకటిమాత్రము చేయుచున్నావు. దానివలన దేవునకు తృప్తి సంపూర్ణముగాఁ గలు గదు. ఆపూజ అసంపూర్ణము......నీకు ధనము లేదు, రూపమున్నది. నీవు శరీరము ధారపోసి, లోపము పూర్తిచేయుటకు ధనము నార్జింప వచ్చును."

నర్తకియొక్క చేతమనసు పూజారి యింగితమునకు బదులు పలుకలేదు. భావము గ్రహించినప్పు డామె దేహ మొక్క సారిగా కొయ్యబాఱెను.

"ప్రభూ, ఆంతరంగిక దైవమునకు వ్యథ కలిగించునది బాహ్య దైవమునకు తుష్టి కలిగించునా?" అన్నది దేవదాసి.

పూజారి నిస్సంకోచముగా నిట్లనెను: "ఆంతరంగిక దైవము మిథ్య; తద్వాణి మాయావాణి. బాహ్యదైవముసత్యము, స్వయంప్రకాశము!"

అటుపిమ్మట కొంచెమాగి యాతఁడు తీక్ష్ణస్వరముతో నిట్లు పలికెను: "పాపాత్మురాలా, ఈమాత్రము గ్రహించలేవా? దైవము నీకు రూపమిచ్చినది తనసేవకోసమే. నిజముగా దేవున కేలోపము లేదు. ఇది కేవలము నీపరీక్షకు, ఇది నీముక్తికి సోపానము."

దేవదాసి డగ్గుత్తికతో, "ప్రభూ, ఒక్కరాత్రి నా కవకాశము దయచేయుఁడు!" అని పలికెను.

* * * *

అర్ధరాత్రిమున మందిరములో నర్తకి హృదయకవాటము తెఱచి ఉద్వేగముతో దేవుని చరణములపై వ్రాలెను..."హే అంతర్యామీ, మదీయ జాగ్రద్దేవతా, మదీయ ధ్యానసర్వస్వమా, నాతో మాటలాడుము. నారీధర్మము విసర్జింపనియెడల సేవాధర్మము విఫలమగునా? నీకు సంతృప్తి కలుగదా?...ఇదియేనా నీయభీష్టము? ఇదియేనా నామోక్షమునకు సోపానము?"

శిలావిగ్రహము పలుక లేదు. నిశ్చలముగా నుండెను. దేవదాసి ప్రశ్నమున కేసమాధానము రాలేదు.

* * * *

ప్రభాతమున దేవదాసి మందిరము వెలుపలికి వచ్చి, చూచునప్పటికి పూజారి వాకిట నిలిచియుండెను. అప్పుడామె క్లాంతస్వరముతో, "ప్రభూ, దేవుని యాదేశము నా కేమియు లభించినది కాదు," అనెను. పూజారి మందహాసముతో నిట్లనెను: " ఓసీ మూర్ఖురాలా, దేవుడు

మాట లాడునా? దేవునియాదేశము నానోటివెంట వచ్చును. మర్త్య లోకములో నే నాయనప్రతినిధిని."

"అయిన యెడల అట్లే కానిండు," అని దాసి ఉదాసీనభావము తోఁ బలికెను.

*　　*　　*　　*

సృష్టిక్రమము సరిగా పూర్వమువలెనే నడచుచుండెను... లోక ములో నెచ్చటను పరివర్తనము జరుగలేదు. నర్తకీహేమనూపురము లయందుమాత్రము నడుమనడుమ తాళము తప్పుచుండును.

ఇంతే!

## వత్సల వలపు

నాయని సుబ్బారావు

చెప్పె మాయత్తచేతిలో చేయివైచి
నీకుమారున కిచ్చెద నాకుమార్తె
ననుచు మును నాన్న నేఁడు పేరాసఁదగిలి
తోసిరాజనె చేసినబాసలన్ని.

ఆసయను కత్తికోత సత్యాంకురంబు
ముక్కలై పేరులేకపోవుటకు నేమి

కాంచఁడేమొ మామనసులఁ గట్టివైచు
ప్రణయబంధమ్ము నరుకుళ్ళుపడుట యకట!

పాలబుగ్గల చిన్నారిప్రాయమందు
నంతికోద్యానవాటి నవ్యక్తమధుర
మైనయనురాగ మూర నన్యోన్య కంఠ
సీమఁ గిలించితిమి సుమదామములను!

హృదయమున నరలేనికూరిమి సెలంగ
ప్రియుఁ డొసంగినవలపుల విరిసరమ్ము
చిత్తపేటిక దాచి రేకొత్తకుండ
రాగరసమునఁ దడిపెదఁ బ్రతిదినమ్ము!

ఆప్రణయదివ్యకుసుమమాల్యంబు నేఁడు
నాదుజనకతృష్ణాప్రభంజనుఁడు బఱపు
వేఁడిగాడ్పుల వలపునుపీడి వాడి
మాడిపోవలెనంట తేన్మహిమయేమొ!

తండ్రులందఱు మాయజూదమున నోడి
కాలవశమున నడవులపాలు గాగ
బ్రదుకు తెరు వేరుపడని దౌర్భాగ్యు డనుచు
మేనయల్లునిపై కూర్మి మానఁదగునె?

ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మిఁ జేపట్టువాఁడు,
లక్ష్మణకుమారుఁ డనునుబలాటమునకు
పిన్ననాటనుండియుఁ బెంపుఁగన్న యనుఁగు
తోడఁబుట్టువందలిప్రేమ మీఁదురాదె!

సంపదలవార్ధి నన్నుఁ దేలింపనెంచు
నాశయమ్మున సాగుతృష్ణాఖ్యవల్లి
పావనప్రణయైక జీవనముఁ గోరు
నాదుకుత్తుక కురితాడు గాదె తలఁప!

ఏమిశాశ్వత మీభూమి ప్రేమయొకటి
దక్క తెలిసియు గగనసౌధములఁ గట్ట
వలెనె! కావడికుండలు కలిమిలేము
లనెడువాక్యమ్ముఁ బాటింపఁడయ్యె నయ్య!

భోగభాగ్యమ్ములకు రాజ్యమునకు నగునె
వలపు మేనత్తకొడుకుపై నిలుపు టరయ
ప్రేమసౌరభమును బంచిపెట్టు దివ్య
కుసుమ మని తలఁ దాలుపఁ గోరిగాక!

ప్రత్యూషస్సున కలకలారవము లెసఁగ
జలజబాంధవు నిదుర మేల్కొలుపుఁ బులుగు
లేమిగోరి కావించు నాయిష్టకార్య
మంతరంగాంచిత ప్రణయమునగాక!

ఎచటనుండియొ యామని నేగుదెంచి
మావిచిగురులతోఁబాటు భావకిసల
ములును రాగిల్ల గీతమ్ము లొలుకుపికము
కోర్కె యేముండి ప్రకృతిపై కూర్మిగాక!

భీషణాకృతి పిడుగులు విసరుచున్న
చెవులుచిల్లులువోవ గర్జించుచున్న

కాలమేఘమ్మునంటియే క్రాలుచుండు
వలపుబలిమినిగాదొకో కలికిమించు!

పరిణయరథమున కేకచక్రమగు మెఱపు
నైజమిటులుండ నమృతనిష్యందియైన
చందమామను మక్కువ జాలువార
రోహిణీతార కోరిచేరుటకునేమి!

చందురునకుఁ గళంకంబు సాకుజెప్పి
నల్లమబ్బులయాచ్ఛాదనంబు జెప్పి
పరివిమలానురాగమునకు స్వస్తిజెప్ప
చుక్కకేమొకో మోహంపుజొక్కుగాక!

బాల, సుకుమార, నిరుపేదవరుని చెట్టఁ
బట్టి యడవులఁ గష్టాలుపడుట జూచి
కన్నకడు పెట్లు సహియింపఁగలదు దుఃఖ
వేదన యటంచు దలఁచుట వెఱ్ఱితనము!

సౌకుమార్యంపుప్రోవైన జాజితీవ
కఠినవృక్షమ్ము బిగియార కౌగిలించి
పాకిపోవుచు తనదుసంబరముఁ దెలుపు
పువ్వునవ్వుల దినదినమ్మును వెడల్చి!

అంటినం గందుతీగల నవనిజముల
కంటఁగట్టెడు పనిసేయునపుడుగూడ
ప్రకృతికనుల నానందబాష్పములె గాని
వేడికన్నీరు వెడలుటేనాఁడుఁ గనము!

అమ్మయునునాన్న యరచేతులందు దాల్చి
వెన్నముద్దవిధానఁ బెంచిరంట
ప్రేమబలమున నిప్పు డీవెన్నముద్ద
కష్టములవహ్ని గ్రాగుట కిష్టపడియె!

వహ్నిఁగ్రాఁగక కమ్మనివాసనలకుఁ
బుట్టినిల్లగునేయి కాబోదు వెన్న
ఆపదలపేరు విన్న భయంబుజెందు
వనితల పతివ్రతాత్వంబు వాసిగనునె?

జీవనము బిచ్చమున, నివసించునిల్లు
వల్లకా డింక వేషలావణ్యరేఖ
నరయరా దట్టిశివునకర్ధాంగియైన
చెలివలపుబావిలో తెన్ని నిలువులోఁతొ!

అడవులంబడి యిడుములు గుడువవలసె,
ప్రాతవేలిక నైపథ్య రచన కయ్యె,
కాంతుఁ డెడఁబాయఁగనె—దమయంతి నేఁడు
నిఖిలభువిని చిరస్మరణీయ గాదె!

సత్యవంతుఁ డేడాదికి జచ్చునన్న
బెదర కతనినె మదిఁగోరి పెండ్లియాడి
ప్రియుఁడు చావనీ—చావదు ప్రేమయనుచ
విశ్వమునఁ జాటిపోయె సావిత్రి యొకతె!

ఆకస మ్మెక్కి స్వర్గము నరయనేర్చు,
నరకమున సంతసపుబండి నడుపనేర్చు,

లోకమంతయు దాసమై ప్రాకనేర్చు,
నిజము ప్రేమకంటెను వాంఛనీయ మెద్ది?

చంద్రసూర్యులు, నక్షత్రసముదయమ్ము,
పుడమియును, నాకమును, నధోభువనములును,
ప్రేమసూత్రమ్మునం గ్రుచ్చి విశ్వకర్త
గళమునం దాల్చుముత్యాలు గావె తలఁప!

బావయును నేను జతగూడి వనవిహార
రచనఁ బ్రొద్దులుపుచ్చుచు ప్రకృతిగురువు
పాదములఁ బట్టి నేర్చినప్రణయగీత
మాలికల వల్లెవేయక మనుటయెట్లు?

హృదయపుస్తకమం దదికింపఁబడిన
ప్రేమగీతాలపుటఁ జింపివేయు టెట్లు?
చిరుగు వెంబడి పైకెగజిమ్ము రక్త
మ్మునఁ గలసి ప్రాణము ల్లేచిపోవకుండ!

చిత్రఫలకంబునందు నచ్చొత్తినట్టు
లంటియున్న బావయ్యనెయ్యంపురూపు
చెరిపి ముక్కుమొగమ్ముగుర్తెఱుఁగరాని
వానిజిత్రింపఁ జేతులువచ్చు నెట్లు!

పూలదండ కంఠములకుఁ బొందుఁగూర్చ
ప్రేమపాశము ల్లమ్మెఁ బెనచివైవ
కరములు కరమ్ములం జేర్చి కలికివాలుఁ
జూపుల నివాళు లొసఁగితి సుందరునకు!

వరున నుపహారముగనిడ్డ వలపుఁజూపు
పరునివదనమ్ముపై నెట్లు పాఱఁగలదు?
చింతయనుసూదిపోటులఁ జితుకకనుల
నెట్టనెత్తురుబాష్పమ్ము లెగయకున్నె!

## ఏడ్పు - నవ్వు

ము. న. - బి. ఏ.

౧

నే నెందు కేడ్చితిని?

నిన్నటిరేయి సుధాకరునకు బంగారువలయ ముండెను. నేఁడది లేదు. చంద్రుఁడు మేఘావృతుఁడై యున్నాఁడు. అందుల కేడ్చితిని.

*

మున్నీట హోరారు మను తుపానులో నావ అలలపై నుయ్యాల లూగుచుండ నావికులును యాత్రికులును అఱచేతప్రాణము లుంచుకొని తీరముఁజేర్పుమని ప్రార్థనలు చేయుచుండఁ జూచి విచారపడితిని.

*

నిన్నటిరోజున యౌవనసుఖంబు లనుభవించితిని, అప్పుడే యెన్ని సంవత్సరములు జాఱిపోయినవి! ముసలితనము వచ్చినది. ఆ యౌవనస్మృతి నాకు ఖేదకారణ మయినది.

ఒంటిగా నర్ధరాత్రిమున వీథులవెంటఁ దిరుగుచుంటిని. గవాక్షములనుండి వెలుఁగు ప్రవహించుచుండెను. ఆకసము నీలముగ నుండెను. మేఘుఁడు గర్జించుచుండె. అంతయు భయంకరముగా నున్నది. అయిన నేమి? ఆయాకాశములో నున్న తారాప్రపంచములోనికిఁ బోయి విహరింపఁ జాలనైతినిగదా యని విచారము. భావప్రపంచమునకును, నా సూక్ష్మశరీరమునకును బాంధవ్యమున్నది. నే నక్కడివాఁడనే యని తలఁచితిని. మరెందుకు విచారము? మేఘమునై త్రిలోక సంచారము చేయలేకపోతినే యని. గాలినై ప్రియురాలి ముంగురులు మెలమెల్లనఁ గదల్పలేకపోతినే యని. విహంగమునై ప్రియురాలి గవాక్షముముందు గొంతెత్తి పాడి,ఆమె నానందడోలికలనుయ్యాలలూగింపలేకపోతినేయని.

*

రాత్రివచ్చి కిలకిల నవ్వుచున్న నాచిన్నికూనను తనకౌఁగిటఁ జేర్చి, చీఁకటులు జాఱువఱకును తానే కాపాడెదనని చెప్పెను. నాపూ నేత్రములు మూసికొనిపోయినవి. హృదయము నీరయినది.

*

గులాబిపువ్వు విచ్చి ఘుమఘుమలు వెల్లివిరియుచుండెను. ఆపుష్పమును చేతులతో కాడనుండి లాగితిని. రక్తము స్రవించినది. అయ్యోయని విలపించితిని.

## ౨

నే నెందుకు నవ్వితిని?

పసికూనలు మాటిమాటికిని కన్నులుమూసి నవ్వుటంజూచి నే నవ్వితిని. ఆమందహాస మర్థము లేనిదా లేక భావపూరిత మైనదా! ప్రపంచమువిూఁది నిరసనభావమును జూపుచున్నదా!

*

గులాబిపూవును జూచి నవ్వితిని. ఎందుకు? ఓసి పిచ్చిగులాబీ, నీసౌందర్యమును జూచుకొని గర్వింపకుము. ఎండెక్కినతోడనే నీయందము డఁగిపోవును. నీరెక్కలు రాలును. నీమొగము తెల్లవాఱును. పూమిన్ననని గర్వింపకుము అని.

*

తేటీ, మాటిమాటికిని నీ వాపూఁబోటిపై నేల వాలెదవు? విడువఁజాలక దానిని పలుమాఱు ముద్దిడెదవు?—పూరసమును ద్రాగి మైమఱచి చంపకమును గదియఁబోవుచున్న తేటిని జూచి నవ్వితిని.

*

ఇం కేల నవ్వితిని?— నోట తాంబూలము వేసి, యాలపాటలు పాడుచు పల్లెనుండి పట్టణముఁ జేరుచున్న గొల్లపిల్లనుజూచి.

కోకిల కూకూయనుచుండఁగా తానుకూకూయని పరిహాసించు కాపు పడుచును జూచినవ్వితిని.

*

తానుపాడుచున్న పాటలో లీనమై గాయకుఁడు తన్మయత్వము నొంది తల నూచుటఁ జూచి నవ్వితిని.

*

ప్రియురాలిని వీడి విరహబాధచేఁ దెలివితప్పి ఉన్మత్తుఁడై మేఘసందేశ మంపుయక్షుని జూచియు; ఎడమకాలి దెబ్బతిని, దిమ్మరిల్లి, తెప్పిరిగొన్న సత్యభామాప్రియుని జూచియు నవ్వితిని.

*

నడిరేయి నక్షత్రము లొకదానితో నొకటి "ఏమినిశ్శబ్ద మీనిశీథము!" అన్నమాటలు విని నవ్వితిని.

సముద్రతీరమున కూరుచుంటిని. అలలు దొరలివచ్చి, గట్టును దాకయత్నించుచున్నవి, బలము చాలదు. ఆశాభంగము గలిగినను వానిపట్టుదలఁ జూచినవ్వితిని.

*

ఊరువెలుపల నొంటరిగా పూలుగోయుచున్నది ప్రకృతికన్య. అద్భుతముగా అలంకరించుకొన్నది, చక్కనిపూలుగోసి దండ గుచ్చినది. "ఆపూదండ యెవరికి పిల్లా?" అంటిని. "నీకోసమే!" అని పుష్పమాలికతో నా మెడ నలంకరించెను. నవ్వక యేమిచేయను?

పకపక నవ్వితిని!

# ఇంద్రధనస్సు

కొప్పర్తి నారాయణ, బి. ఏ., ఎల్. టీ.

చూడవేనాతల్లి చూడవేమమ్మా!
కొత్త చిత్రము వచ్చె కొండమీఁదదుగో!

ఔను ఎంచక్కుంది ఔనౌను అమ్మా
నన్నెత్తుకో వచ్చే నే నందుకొంటా,

ఎంతముద్దొస్తూందో ఆ పెద్దగిలక!
ఆగిలక నాకిస్తె అందరూ చూసి
నాకియ్యి నాకియ్యి నాకియ్యమంటూ

బతిమాలు కొంటారు    పాప లందరును
నన్నెత్తుకో ఎటే    నే నందుకొంటా !

దేవుడిది ఆగిలక    దరికి పోలేవు
నీచిట్టి చేతులకు    అంద దాగిలక.
పోవ వీలూ లేదు    తోవలూ లేవు
ఆవైపు మేఘాలు    అల్లుకొన్నాయి.

జేజేలు దేవుడా    జేజేలు నీకు!
నీగిలక బాగుంది    నాకియ్య వయ్యా.
మంచి గులాబీలు    మందారపూలు
నీల గోరింటాలు    నీలాంబరాలు
గరిక నారింజలు    గన్నేరుపూలు
అన్నిటితో కట్టావు    అందముగ గిలక !

ఆగిలక నాకియ్యి    అది చేత బట్టి
పప్పులూ బెల్లాలు    బాగుగా తింటూ
పాటలు పాడుతూ    పాపలకు చూపి
అన్నివీధుల వెంట    ఆడుకొంటాను!



# నేను పెద్దవాడ నైనాక !

రెండెద్దులూ ఒకబండీ కొంటాను. ఒక కొరడా కట్టుతాను. దానికి పువ్వులు కడతాను. ఎద్దుల మెడలనిండా గంటలు కట్టుతాను. ఎద్దులను బండికికట్టి కొరడా చేత్తో బుచ్చుకొని చల్ చల్ అని తోలుతాను. పొద్దున్న మొదలుకొని సాయంత్రిందాకా తోలితోలి కొండలవతలికి వెళ్లిపోతాను. కొండలవతల నక్షత్రాలూ అవీ ఉన్నాయి. వాటితో అక్కడ ఆడుకుంటూ కూచుంటాను. నాన్నలాగ ఎప్పుడూ కచ్చేరీకి వెళ్లను.

నేను పెద్దవాడ నయినాక !

పేద్దనిచ్చెన ఒకటి చేయిస్తాను. ఆనిచ్చెన భూమిలో పాతుతాను. ఆనిచ్చెనఎంతో పెద్దది. అదిఎక్కి ఆకాశందగ్గిరదాకా వెళ్లుతాను. వెళ్లి ఆకాశాన్ని ముట్టుకుంటాను. నిచ్చెనచివార నిలబడి నక్షత్రాలని కోస్తాను; కోసి జేబులో వేసుకొని ఆడుకుంటాను. ఎప్పుడూఅక్కడే వుండిపోతాను, కిందకురెప్పుడుదిగిరాను.

నేను పెద్దవాడ నయినాక!

ఎన్నో రూపాయిలు నాపెట్టినిండావుంటాయి. ఆరూపాయిలన్నింటితోటి సెనగపప్పు, కారప్పూసా కొనుక్కుంటాను. నాన్న కారప్పూసకొనుక్కోడానికి రోజూ ఒకడబ్బేగాని ఇవ్వడు. ఎవ్వరికీపెట్టకుండ అంతా నేనే తినేస్తాను. అమ్మ కారప్పూస ఎవరికీపెట్టనివ్వదు. నేను ఆవుదూడలకీ కుక్కపిల్లలకీ మాత్రము పెట్టుతాను.

నేను పెద్దవాడ నయినాక!

ఇంటిచుట్టూరానూ పెరట్లోను అన్నీ పూలమొక్కలు నాటుతాను. రోజూ రెండుపూటలా వాటికి నీళ్లు పోస్తాను. అవి పువ్వులు పూస్తాయి. ఆపువ్వులన్నీ దండలుగుచ్చి మెళ్లో వేసుకుంటాను,

నేను పెద్దవాడ నయినాక!

ఒకవాచీ కలమూకొనుక్కుంటాను. వాచీఎప్పుడూ తిప్పుతూకూచుంటాను. కలంతో ఎప్పుడూ వుత్తరాలు రాస్తూవుంటాను.

నేను పెద్దవాడ నయినాక!

## సంగీతము - మాధురి

పెద్దిభట్ల పూర్ణ శర్మ

ఫలసుధామాధురిని గ్రోలి పాదపమున
పాడెడి శకుంత మొకటి శ్రావ్యంపు ఫణితి.

సుమరసంబును రసవత్తరముగఁ జేయు
చుండె ఝుంకారమున నలిసూన వనిని

కూన రాగాన పాల్దీయు గొల్లపిల్ల
గోపయస్సుల మాధుర్యిఁ గూర్చుచుండె.

ప్రణయరాగము నిరతంబు పాడి సుకవి
దాని కొదఁగూర్చుచుండె నత్యంతరసము!

# నిద్రాభంగము

నాయని సుబ్బారావు

పండువెన్నెల వెల్లువపైఁ దేలఁగ
మింటిచుక్కలు మిలమిల మెఱయుచుండ
పండుకొని నిన్ను తలపోయుచుండునప్పు
డప్రయత్నమ్ముగా కూర్కుపట్టె నేఁ!

ప్రేయసీ! తావకీనాస్యవిధుకు మారుఁ
డస్మదీయమనోగగనాంగణమున
వలపు సుధలోని తేటలు చిలికిచిలికి
పెట్టు చిరునవ్వు వెన్నెల పేరిముగ్గు!

ప్రణయినీ! స్వప్నవారిధిపైన లేచు
నీవియోగ కథాలహరీవిలోల
పంక్తులావలి దరినుండి వచ్చివచ్చి
నాహృదయతీరముఁ జేరి నాట్యమాడు!

మోహినీ! ప్రేమహాలికమూర్తి చేత
చక్కగా దున్నఁబడిన నా స్వాంతభూమి
నీ వలపువానచినుకులఁ ద్రావిద్రావి
అవ్యయావ్యక్తభావ సస్యములు మొలచు!

సుందరీ! నఖరోచులఁ గ్రందుకొనఁగ
ప్రేమమారుతస్పర్శఁ గంపించు నాదు

చిన్ని తలపుతీగెల సరిజేసిచేసి
హృదయవీణకుఁ జైతన్య మిత్తువీవు!

బాల! నీ చెక్కుగుంటల ప్రణయరసము
సగము విరిసిన పెదవుల సందునగవు
రెండు జతగూడి డెందమ్ము గుండెనుబికి
పొరలి నాకనురెప్పల మూతలొత్తు!

# పరిణయాహ్వానము

నాయని సుబ్బారావు

తేటనీరున్న కొలఁకున నెలుదేరి
సారసము సౌరభము నెదజల్లు కరణి
ప్రేమరస పూరితమ్మైన నామనమున
నీవలపు గమ్మతావులు నింపరావె!

తీగయూఁచుఁ గులుకు తెలిమల్లెపూవ! నీ
కవని రాలిపోవునతయేల?
నెత్తిమీఁదఁ దాల్చు నీ ప్రియుఁడున్నాఁడు
గాలితేజినెక్కి కదలిరమ్ము!

పైదలి! ప్రావృడాంబుధర పంక్తులునింగి జనించినంత శర
పాదరహాసదీధితులు పైకొనుచున్నవి; నామనంబు ప్రే
మోదయ రమ్యమై వెలయుచున్నది నీతనుకాంతివిభ్రమ
శ్రీదయితాళికొమ్మెఱుఁగు చెన్నున తళ్కుమనంగ రావుగా!

సాంధ్యరాగమ్ము పశ్చిమాశాముఖమున
బర్వె యెఱ్ఱనిత్రోవ లేర్పఱచెఁ బుడమి

పాదకాంతులు దిక్వ్యాప్తి బాటఁజూప
ఆయరుణ మార్గములవెంట నడుగువెంతె!

ముడుచుకొనియున్న హృదయంపు మొగ్గవిరియ
వలపు తేనియయిదె జాలు వారుచుండె
అమరగానమ్ము వర్షించు భ్రమరకాంత!
పూవులోపల నివసింపరావదేమి?

ఆకసమ్మను పందిరి నల్లుకొనిన
నిగ్గు వెన్నెల లతలెల్ల నేడుపూచె
తారకా పుష్పములు తళత్తళలఁ బఱపి
హృదయముఁ గరంచుచున్న దిందీవరాక్షి!

మనము చకోరదంపతులమై తెలివెన్నెల బూహాకాల్వలం
జనిచని తారకాకుసుమ సౌరభవాహినిఁ దోఁగికోసి తె
చ్చిన విరులన్ సరమ్ములు రచించి పరస్పర రాగ ముద్రగా
ప్రణయిని! రెండుమేనులకు బంధముగూర్చెద మేగుదెంచవే!

ఇరుగెలంకుల చేయూతయీయ మెఱుపు
కన్నియలు, చల్లగాలి మార్గమ్ముఁజూప
ధరకు, డిగియెదే నీకయి తిరుగుచున్న
తూనిగమనమ్ము చల్లగా వానచినుక!

నీకు హారతియీయగాంక్షించి నాదు
స్వాంతమను పళ్లెరంబున వలపు గప్పు
రంబు వెలిగించి చూతు మార్గమ్ము వంక
నను నిమేషమ్ము నీరక కమృతమూర్తి!

ఎప్పుడేదాని జనుదెంతో యిచటికంచు
నరయుచుందుఁ గవాటమ్ములన్ని దెఱచి
వెనుకపాటుగవచ్చి వాకిలులు మూసి
చెప్పకొమ్మన చిఱునవ్వుఁజిలుకఁగలవె!

## తల్లిఋణము

చింతా దీక్షితులు బి.ఏ., యల్. టి.

తల్లికడుపులఁ బుత్రు లెందఱో జనించి
తల్లిఋణమును దీర్ప యత్నములు చేతు
రందు కొందఱె సత్కీర్తి నందఁగలరు!

యశము గల్గిన లేకున్న హాని లేదు.
తల్లి మనయత్నములకు ముదంబు గాంచి
పెద్దవారలతోఁ బాటు పిన్నవారిఁ
గూడ ప్రేమతోఁ జూడ చేకూరు సుఖము.

ఒకఁడు సత్కృతులొనరించి యొప్పగూర్చు
వలయు క్రొత్తయలంకారముల నొసంగి
హాయలు దెచ్చును తల్లికింకొక్కసుతుఁడు
వచ్చియును రాని మాటలు పలికి యొకఁడు
ఎంతయో తల్లికొసఁగూర్చు సంతసంబు
ఉజ్జ్వలంబగు మణులఁ దానొకఁడు దెచ్చి
మణికిరీటంబునం దుంచి మాన్యుఁ డగును
గులకఱాలను భక్తితోఁ గూర్చి కూర్చి
తల్లిపాదాలకడఁ బెట్టు తనయుఁ డొకఁడు.

పలుకు బొమ్మను నే తల్లి? వారియెడల
మక్కువను జూపకుండనే? మాకుల సియ
శక్తి యొందఱ కుంచుదు? భక్తి లేదె!

ఊహా పాటువేగ సూహా పుట్టినచోట
తిరిగితిరిగి పూలు తెచ్చినాఁడ
తావిలేని యడవిపూవులో! సౌరభ్య
ములుకు తోటపూలో! తెలియరాదు.
ముదముతోడఁ దల్లిఁ బూజించి పూలతో
ఋణము కొంత దీర్ప నెంచినాఁడ!

## ర క్తాం జ లి

శ్రీ శేషాద్రి రమణకవులు

దమ్మళ బ్రహ్మాజిదానవుచేత
జల్లెపల్లిక్షేత్ర సంగ్రామమందు
వంచక వృత్తిచే వధియింపఁబడిన
కోదసునాయక తలగుండు గండండు
జిలుగుపల్లి రణక్షేత్రవిహారి
శ్రీమత్ప్రతాపరాట్సేనాగ్రయాయి
సింగభూనాథుండు చేసెశాసనము
జనకునాదేశంబు సాధింపవలయు
మొగలూరు దుర్గంబు ముందుఁ జేరితిమి
చెంజెర్ల భూమికిఁ జేరవచ్చితిమి
వారెవచ్చెడివారు వైరిభూపతులు

కత్తికి కొక్కొక్క కంఠంగా జీల్చి
పట్టుండీరక్తంబు బానలనిండం
జొచ్చి రానీకుండీ సోమవంశజుల
పొడవ్వుండీ చంపుండి పోవనీయకుండి

పద్మనాయకులార పదుండు ముందునక
కమ్మ సోదరులార కాల్కదల్పకుండు
తెలుంగు సైనికులార త్రిప్పకుండురము
చాలు చాలింపుండీ సంగ్రామమింకం

బొలియింపంబడిరి నూర్వ్వరు రాచ దొరలు
వెన్నిచ్చు బంటుల వెడలి పోనిండు
పదుముగ్గురను రణబలి డ్చి తెండు
పుటుకలు నెముకలు ప్రోవుగాంజేసి

నడిమికిం దెగంగోసి నంజుడుదీసి
వండుండీవివిధ పక్వంబులుగాంగ
మిగిలిన రాజుల మృతకళేబరము
లన్నింటింజీల్చి రక్తంబుపుల్ చిలికి

కొయ్యగానుగులోనం గూర్చి త్రిప్పుండు
రండుబోసంబెల్ల రాశిగాబోంసి
వండిననంజుడు వైవుండీదాన
ఏగుండి మీరందఱెవరికి వారు

తండ్రీ! సింగావనీధవ పుణ్యమూర్తి
రాజరక్తంపుం దర్పణమందు కొనుము
నినుదునిమించిన నేల తెంద్రెల్ల
కదనంబునను నాదుకత్తిచేందెగిరి

నూర్వురరాజుల నూత్నరక్తంబు
వేడివేడిగనుండె నెచ్చగాకుండెఁ
బరమందు నీయాత్మ పరితృప్తిఁ బొంద
సద్భక్తితోడ నంజలినిండ గొనఁగు
రాజరక్తంపుఁ దర్పణమందు కొనుము
శాకినీకాళీపిశాచలోకేశ
బేతాళమైలారు ప్రేతసర్వస్వ
మనసంబునందున్న మాయాదిశక్తి
ఆరగించుటకు మీరందఱురండు
రణబలి రాజ మారణబలియిద్ది
రణబలి విజయకారణబలి యిద్ది
రణబలి పితకుఁదర్పణబలి యిద్ది
తృప్తినొందితె పితృదేవుడా నీవు
తృప్తియయ్యెనె మాతృదేవతలార
అమవస చీఁకటి యర్ధరాత్రమున
మనసంబునందున మంత్రపూతముగ
అనుజునితోడ శాస్త్రాను సారముగ
తర్పణంబొసఁగితి ధన్యుఁడనైతి
రేచెర్ల గోత్రుండు రిపువిదూరుండు
సింగభూపాలుండు చెప్పినయట్టు
లాచరించితిని కృతార్థుఁడనైతి

* * * *

అనపోతనాథుఁడ నాంధ్ర భూవిభుఁడ
విజయభార్గవరామ విఖ్యాతయశుఁడ

పిల్లలమఱ్ఱి శ్రీబేతాళనాథ
వంశపరంపరా భరణాయితుండ
తండ్రి యాజ్ఞాపింపఁ దమ్మునితోడ
అరులఁ జెండాడి కృతార్థుండవైతి

---

## విప్రయోగి

(షెల్లీకవి పద్యముల కనువాదము)

రూపనగుడి నారాయణరావు

చిన్ని నెలయేళ్ళు నదులను జేరఁబాఱు
నదులు సంగమ మందు సంద్రంబునందు
అలరు నెత్తావి మిళితమౌ ననిలమందు
ఎద్దియును లేదు పృథివిఁ బ్రత్యేకముగను

ప్రకృతిచేతనె యిలలోని వస్తుచయము
లొండొకటితోడ నెడఁగూడి యుండుఁ గాన
నొంటిమెయి నేను నినుఁ గూడకుంట యేల
ఉవిద యుండెడ నీదు సంయోగమునను

పర్వతము లెల్ల దివిని జంబనము సేయు
ఊర్మికాపంక్తు లొకటిపై నొకటి వ్రాలు
పుష్పవదనమ్ము భ్రమరంబు ముద్దుగొనును
వల్లరులు సమాశ్లేషించుఁ బాదపముల

అతి●ము పృథ్వి నంతయు నాదుకొనును
చంద్రకరము లాశ్లేషించు జలధి పొంగ
ఇట్టి చుంబనాశ్లేషము లేమిసేయ
లేమ! నను నీవు ముద్దిడ లేకయున్న

# జీవిత దర్పణము

సూపనగుడి నారాయణరావు

ప్రేమ మొసగును ప్రేమంబుఁ బృథ్విలోన
వినయమున వినయంబు సంజనిత మగును
క్రోధ మొంతయుఁ గ్రోధముం బ్రోదిసేయు
తనరు జీవిత మొక్కయద్దంబు పగిది

మనతలంపులు మనగువర్తనము లెల్ల
బరిమకనెడి దర్పణంబునఁ బ్రతిఫలించుఁ
గావునను మనోవాక్కాయ కర్మతతుల
శుద్ధముగ నుంచుకొనుటయే శుభకరంబు.

---

## జండా!

కొప్పర్తి నారాయణ; బి. ఏ. యల్. టి.

ఆఫీసరుగారి పెళ్లానికి నడుమునొప్పిగావుందని కబురు తెలసి ఆయన మూడుగంటలకే ఇంటికిపోవడముచేత శ్యామలరావు ఇవాళ పొద్దు ఉండగానే వచ్చాడు ఇంటికి. చల్లగాలిలో కూర్చోడానికి మేడపై డాబామీదానికి ఎక్కారు, తానూ భార్యా చిట్టినీ.

భార్య : " రోజూ ఇక్కడ సాయంత్రం కూచుంటే ఎంతో బాగుంటుంది."

శ్యామ : " ఆ! యెంతో ప్రాణానికి హాయిగా ఉంటుంది."

చిట్టి : " హాయ్, హాయ్! కాదూ!"

భార్య : " రోజూ పొద్దుండగా రాకూడదూ, ఇవాళకిమళ్లే!"

శ్యామ : " ఇవాళఅంటే ఆవిడధర్మమూఅంటూ"

చిట్టి : " నాన్నా! నాన్నా! జండా!

" ఏమిటి?"

" జండా, జండా, అదిగో చూడిండా!

" ఏదే, కనపడడంలేదూ?

" అయ్యో, అదిగో బాగా చూడు.

" ఏమోనే! నాకుకనబడడంలేదూ?

" అమ్మా, నువ్వుచూడు ...... నీకుకనబడిందీ?

" లేదు, ఎక్కడ?

" అయ్యో, కనబడింది, అదవే!

" కనబడందేనా!

" చూడు నాన్నా, అమ్మ! నీకు తెలిసిందికాదూ?

" ఆఁ, తెలిసిందమ్మా?

" అదేమిటీ, అదీ?

" ఏది?

" రాళ్లు, కొండ!

" అవునే, పెద్దకొండ! ఎలాగుందో!

“ అన్నా, నువ్వ్ చూడూ, కొండ.

“ అవును, చూసానేం.

“ దానిమీద జండా అదుగో! ఎలాఆడుతూఉందో!

“ జండా చూపించమ్మా! అన్నాడు శ్యామలరావు

“ అదిగో, ఆడుతుంది, అదీ! నీకు తెలియదూ?

“ తెలియదమ్మా

“ నాకు తెలుసు కాదూ?

“ ఊఁ.

“ నేపెద్దదాన్ని, నాకు తెలుసు.

“ ఏమిటి తెలియడం! నాకు కొంచం చెప్పవూ అని అందుకొన్నది తల్లి.

“ మేఘాలు! పరుగెత్తిపోతున్నాయి.

“ ఆఁ, మేఘాలా! అవునవును, ఇంతసేపూ నేచూడే లేదు; అమ్మకి చూపించూ!

“ ఊఁ, అమ్మకొద్దు మేఘాలేం, పరుగెత్తి పరుగెత్తి పరుగెత్తి పోతాయికాదూ?

“ ఏం, ఎందుకు పరుగెత్తిపోతాయో! (భార్యతో) చూడవే దానిఊహ!

“ నాన్నా, నాన్నా! నేచెప్పనుపో!

“ ఏం? ఏం? చెప్పవూ! అమ్మా, చెప్పవూ?

“ అమ్మతోటి మాటాడుతున్నావూ.

“ లేదులే, మరిచిపోయాను. అవిగోనే, మేఘాలు ఎలాపరిగెత్తి పోతున్నాయో!

" ఆడుకుంటున్నాయి! అంది చిట్టినవ్వుతూను

" ఆఁ, ఆడుకుంటున్నాయా! అవునే.

" ఊఁ, దాగుడిమూతాలు.

" ఆఁ ఆఁ, ఎవరితోటి?

" గాలి! గాలీ! యెరగవూ? దానితోటి

" (ఎత్తుకు ముద్దెట్టుకొని) నీకన్నీ తెలుసునే! గాలితోటి మేఘాలు ఆడుకొంటున్నాయి!

" నాన్నా, నాన్నా! గాలి పట్టుకోడానికి వస్తుందీ! ఆమట్టుకు మేఘాలు పారిపోతాయి. అమ్మా, నీకు తెలిసిందీ!

" తెలిసింది, జండాఏది; జండా అన్నావూ?

" అయ్యో! తెలివి? (మేఘాలువేపు చూపించి) అదేజండా, కాదూ నాన్నా!

" అవునమ్మా అవును.

" కఱ్ఱఏదీ? అని తల్లిఅడిగింది.

" అదే! కొండమీద పాతేశారు. దానిచివ్వర మేఘాలు కట్టేశారు. ఆపాళంగా మేఘాలాడుకుంటాయి,ఇంచక్కా!

" ఎవరు పాతేశారో, చిట్టీ! ఆజండా! అన్నాడు శ్యామలరావు.

" ఏమోనమ్మా, నాకు తెలియదు.

" ఆఁ, తెలుసునూ; నాకు చెప్పవ్!

" నాకు తెలియదే! చంపుతావూ!

" ఆఁ ఆఁ, చెప్పవూ? నిన్నెత్తుకున్నానుకాదూ?

" అమ్మకి చెపుతావు.

" చెప్పనమ్మా, చెప్పనులే
" అమ్మను దూరంగా పొమ్మను మరి.
" మనమే వెడదాం దూరంగా (అంటూ చిట్టిని తీసుకు వెళ్లాడు.)
" ఇక్కడ చెపితే అమ్మకి వినబడదు, కాదు నాన్నా?
" వినబడదు.
" (నవ్వుచు) వినబడదు, అమ్మకి!
" ఎవరుపాతారు ఆజండా? ఈమాట చెప్పు, చెప్పవూ?
" దే...వూ...డూ. అని చేతులు జోడించి దణ్ణం పెట్టింది.
" ఆఁ దేవుడా!
" నాన్నా, నన్ను దింపు. మనం ఆడుకుందాం.
చిట్టి తండ్రిచంక నుండిదిగి తల్లి దండ్రులతోటి ఆడుకుంటూ ఉంది.

---

# ప్రేమ

(అనువాదము)

చింతా దీక్షితులు బిఏ, యల్ టి.

సంసార మెన్నికష్టాలఁ గూర్చినను
ఉద్యోగకార్య మెంతో చెడ్డదైన
సతియన్న నీప్రాణసమమని యున్న
నామెతో నట్లు నీ వానతీవయ్య!

పరిణయ మనుదివ్యబంధ మేవేళ
నుభయుల బంధించి యున్నదటంచు
సౌఖ్యాల కామె యాస్పదమని యున్న
నామెతో నట్లు నీ వానతీవయ్య!

కాలము విపరీత గతి సంచరించి
కష్టము లామెను గారింప, నీవు
ప్రేమింతునని చెప్పి ప్రేమింపవయ్యా!
ఆమెతో నట్లు నీ వానతీవయ్యా!

ఒక కాలమందు ''నాయొప్పులకుప్ప
మన్మనోహారిణి, మానిని యంచుఁ
జెప్పితి విపు డట్లె చెప్పుమనంచు
నామెతో వేగ నీ వానతీవయ్యా!

ఒకముద్దు నందగా నువ్విళ్లు గొంటి
వొక కాలమందు నాయువిదకు నిచ్చు
ముద్దులే ప్రేమకు ముద్రలటంచు
నామెతో వేగ నీ వానతీవయ్యా!

ఆమెపై నీప్రేమ యమృతశూన్యంబు.
ఏస్థితియందు నున్న నిది నిక్కువంబు,
దాచెద వేల నాతరుణి యుప్పొంగు
ఆమెతో వేగ నీ వానతీవయ్యా!

ఆమెను విడనాడు టది యెంతముప్పొ!
ప్రణయము దూలాడ నది యెంత తప్పొ!
నీ వెఱింగితి వంచు నిక్కువ మంచు
నామెతో వేగ నీ వానతీవయ్యా!

ప్రాప్తకాలమె నని యామెఁ బరిభవింపకుము
ప్రేమ పోయిన దంచు, వెఱ్ఱిజెందకుము

ప్రేమింపు మామీద ప్రేమను బొందు
మా మెంతో నిట్లు నీ వానతీవయ్య!

ఆమెను సుఖ పెట్టు మామీఁద నీవు
సుఖముల నెన్నెన్నొ చూరలాడెదవు
కాంతల యంతరంగంబు గ్రహించి
ఆమెంతో వేగ నీ వానతీవయ్య!

నీ వామె వాఁడవు నిక్కువమంచు
ఆమె నీయది యంచు నది నిజంబంచు
తామ్రాక్షరము లేల తలపెట్టుదయ్య!
ఆమెతో నట్లు నీ వానతీవయ్య!

అశ్రద్ధతో నామె నరయఁబోకయ్య!
బాగుగాఁ జూచిన, పరమశీలంబు
లలన చూపును; అమూల్యంబామె నీకు
ఆమెతో నట్లు నీ వానతీవయ్య!

---

# వృక్షము

చింతా దీక్షితులు బి. ఏ., యల్. టి.,

వారి నమ్మించి వీరల పరువు దీసి
కొండెముల చెప్పి ధనమును గూడ బెట్టి
కలుషహృదయుఁడఁ గానేల? కలుగురీతిఁ
జలువ గలనీడ నిచ్చు వృక్షంబనగుదు!

---

# కష్టసుఖములు

చింతా దీక్షితులు బి. ఏ., యల్. టి.,

అనుభవించిన కష్టాల నరయుచుందురి,
అనుభవించిన సుఖముల నరయ రెవరు;
కష్టములు లేని సుఖములు గలుగ వెపుడు,
పరికృతదశఁ జూని చింతలపా లగుదురు,
కాని, రానున్న సుఖములఁ గాంచ లేరు.
కాలగర్భంబులో నున్న కష్ట మెంతో
కాలగర్భంబులోని సుఖం బదెంతో
యెవరు చెప్పసమర్థు లీయవనియందు?

---

# అన్న

చింతా దీక్షితులు బి. ఏ., యల్. టి.,

దేశదేశంబులందును దిరిగి సతినిఁ
దల్లిదండ్రులఁ జెల్లెండ్రఁ దగిన బంధు
సమితిఁ గాంచగనగును, నేసరణినైన
చన్న భ్రాతను గాంచగా శక్యమగునె?
తమ్ముఁడా యని మెల్లన దరికిఁ జేరి
చేతితో జుట్టు దువ్వుచుఁ జిన్నినవ్వు
మొగముపైఁ దాండవం బాడ ముద్దులాడు
భ్రాత పోవుట కుడిచేయి భగ్నమగుటె!

---

# పుస్తకాలు వ్రాయడం

(రవీంద్రుడు)

నీవు నాన్నగారు చాలా పుస్తకాలు వ్రాస్తారని చెపుతావు. కాని వారు వ్రాసేది నాకేమి తెలియడంలేదు. వారెప్పుడూ నీకు చదివి వినిపిస్తూనే వుంటారు. కాని నిజంగా దానిఅర్థం నీకు తెలుస్తూందీ? నీవు నాకెంతమంచికథలు చెపుతావుకదా! అమ్మా! నాన్నగారలా ఎందుకని వ్రాయలేరో నాకాశ్చర్యమవుతుంది. వాండ్లమ్మ ఆయనకు రాచకుమార్ల కథలూ దేవకన్యలకథలూ రాక్షసులకథలూ యెప్పుడు చెప్పనేలేదా! నాన్నగారవన్నీ మఱచిపోయినారూ!

నాన్నగారికి పుస్తకాలు వ్రాయడమంటే చాలాసరదా! ఎప్పుడు నీవువెళ్లి వందకేకలేస్తేనేగాని ఆయన స్నానానికే లేవరు. నీవెప్పుడు అన్నం కూరలు చల్లారిపోతయ్యేమోనని కనిపెట్టుకు కూర్చుంటావు. ఆయనెప్పుడు వ్రాసుకుంటూ కూర్చొని అన్నీ మఱచిపోతారు.

నేనెప్పుడు నాన్నగారిగదిలోకి ఆడుకోవడానికి వెళ్లినా 'అల్లరిచేస్తున్నావు' అని నామీద కేకలేస్తావు. నేనేమాత్రము చప్పుడుచేసినా 'నాన్నగారు వ్రాసుకొంటున్నారని తెలియదా'! అంటావు! ఎప్పుడూ వ్రాయడం, వ్రాయడం ఒకటే వ్రాయడం, ఏమిటీచిత్రం.

నేను నాన్నగారి కలంగాని పెన్సిలుగాని తీసుకొని ఆయన వ్రాసినట్టుగానే అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, అనినాన్నగారి నోటుబుక్కుమీద వ్రాస్తూంటే చూచి వెంటనేఎందుకనో నన్ను కొట్టొస్తావు. నాన్నగారు వ్రాస్తూంటే ఏమీమాట్లాడవు.

నాన్నగారు ఎన్నికాగితాలమీద పిచ్చిగీతలు గీస్తూన్నా నీవు చూచినట్లేవుండవు. నేనొక్కకాగితం పడవచేసుకోడానికి తీసుకొన్నా నాఅంటే ,అబ్బా! ఏమిచిలిపివాడవురా! అనివిసుగుకొంటావు నాన్న గారు తావులికి రావులు గీతలు గీస్తూ లే నికుబాగానేవుంది.

---

## జన్ వెస్లీయుపదేశము

చింతా దీక్షితులు బి ఏ., యల్. టి.,

చేయగల మంచి నంతయుఁ జేయుమయ్య
చేయగల రీతు లన్నిట జేయుమయ్య
చేయగల తావులందెల్లఁ జేయుమయ్య
చేయగల కాలముల నెల్లఁ జేయుమయ్య
చేయగల వారలకు నెల్లఁజేయుమయ్య
చేయగల్గిన యన్నాళ్ళు చేయుమయ్య!

---

## పుష్పోపదేశము

చింతా దీక్షితులు బి. ఏ., యల్. టి.,

పొంజుల మధుర సంపద నంది యుండు
మని గులాబి నచించు; నరవింద మనుచు
నిర్మలభావ మన్నిటఁ జెందుమనుచు;
కష్టాల నన్నిట గడపుకొమ్మనుచు
చిక్కని చేమంతి చెప్పును గడిమ;

ఉన్నంత ప్రజ కిచ్చి యూరుకొమ్మనుచు
దేవకాంచన ముపదేశ మొసగ్చు;
ఎండ వానల గణియింపక సంత
సము చెందు మని పల్కు స్వచ్ఛమౌ తుమ్మి.

---

## ప్రేమసందేశము

కొప్పర్తి నారాయణ, బి. ఏ., ఎల్. టీ.

ఎద్దాని నాచెవు లింపార వినునో
ఎద్దాని నాకను లెలమిఁ గనునో
సౌందర్య విజ్ఞాన సంపదల్ చూపు
ప్రకృతియం దవి యెల్ల భాసిల్లుచుండు
నవి ప్రేమసందేశ మందించు నాకు!

---

## ఉద్దేశము

కొప్పర్తి నారాయణ, బి. ఏ., ఎల్. టీ.,

ప్రేమపూరిత సుహృదయ ప్రేరణమున
సల్పి నది యిచ్చు సుఖమును స్వల్పమైన:
కృతిని మోద్దేశమునఁ బుట్టు కృత్య, మెంతొ
ఘనముగాఁ దోచి నాశంబు గలుగఁజేయు.

---

## ఒట్టె

కొప్పర్తి నారాయణ, బి. ఏ., ఎల్. టీ.

మింటి తారల నెంచనేఁ గంటితోడ,
చిట్టి! నీయూహ లెన్న ముక్కంటివనెమొ!
నిల్పు మేవేళనకఱకు నెమ్మనమున,
చెందు నినుఁ గీర్తి తారలనెంపఁ గోట్లి.

---

## చిట్టె

కొప్పర్తి నారాయణ, బి. ఏ. ఎల్. టీ.,

మేఘముల్ దివిఁ గాఱు గ్రమ్మినను గాని,
వాత పోతము వెల్లెడఁ బర్వుచున్న,
చెక్కు చెదరదు ని కేళి చిట్టి తల్లి!
ముజ్జగంబుల ఱేఁడు నీపజ్జ నుండ,
భయము లేదమ్మ, రవ్వంత భయము వలదు,
దైవ తేజంబు నీలోన దనరియుండ!

---

## చిట్టీ!

కొప్పర్తి నారాయణ, బి. ఏ., ఎల్. టీ.,

శుకమువలె నుండు మేవేళ సుఖముగాను,
నెమ్మదిని బొంకుమీ పావురమ్మురీతి,
చుఱుకు చూపుము తుమ్మెదకరణిఁ, దాన
నంద తెత్తి ముద్దాడుచు రమ్మ నిన్ను!

(అనువాదితము.)

# ఋషికన్య

(కుసుమధన్వి)

పూతమావుల తావి లేతగాలులకు
పడుచుచెంచెత పాడు వలపుపాటలకు
ఉదయరాగములతో నిదురమేల్కొనగ
నిదురలో ముంగురుల్ చెదరిపోయినవి.

జడలోన ముడిచిన జాజిపూదండ
మెడలోన వైచిన అడవిగన్నెరు
చేతులంగట్టిన చేమంతిపూలు
పరిమళమ్ములుపీడి వడిలిపోయినవి.

దివ్యమానులు జేయు దేవపూజలకు
కుసుమముల్ ఫలములు గొనితెచ్చియీను
చెక్కిళ్ళు చెమరించి చిక్కిపోయినవి
కటికినేలను కాళ్ళు కందివాడినవి.

ఉదుటంజూపుల చిన్ని బెదురుజింకలను
పదునుటాలమకుశల్ చిదిమిపెట్టగను
యిగురుగ చేతులవేళ్ళు లెత్తబారినవి.
చెమటకుంకుమబొట్టు చెఱిగిపోయినది.

నీయలంకృతులిట్టు పోయినప్పటికి
ఋషికన్య! నీశోభ యాటువోలేదు.
వెలిదమ్మిపూదేనె అళులుద్రావినను
తమ్మిసౌరభ్యంబు తఱిగిపోనట్లు.

---

౧౬౫

# ఆంధ్ర వాఙ్మయచరిత్ర విమర్శనము

౧

## ప్రస్తావనము.

ఆంధ్ర వాఙ్మయముయొక్క ఉపచయాపచయముల నుపలక్షించినవారై సర్వదా తదభివృద్ధినే యాకాంక్షించుచు మనయభివందనములకు గుఱియైన ఇప్పటిపెద్దలలో అభిప్రాయ భేదము లున్నట్లులు పొడగట్టుచున్నవి. కొందఱు ఆంధ్ర వాఙ్మయమునకివి ఉచ్ఛ్రాయము నొనగూర్చిన దినములనియును, జనసామాన్యమునందింతటి విద్యాప్రబోధ మేయుగమునందును కలుగలేదనియును ముక్తకంఠముతోఁ బ్రశంసించుచు, నందులకు తార్కాణగా నిప్పుడు బయలుదేరుచున్న నాటకములు నవలలు చరిత్రములు వాఙ్మయ చరిత్రములు విమర్శనములు కథలు హాస్యరచనలు ప్రబంధములు మున్నగు వానిని ఉదహరించుచున్నారు. మఱికొందఱు "స్థూలదృష్టులకు ఈ సంఖ్యాబాహుళ్యము ఒకవిధముగా పరిపుష్టతగా తోఁచినను కొంచెమంత సూక్ష్మబుద్ధితో పరికించువారలు ఆంధ్ర వాగ్దేవికి ఈ పరిస్థితులు వ్యాధి సంసూచకములనియును ఆమె యొడలియందు ఏమాత్రమును ఆరోగ్యచిహ్నమగు రక్తప్రసరణమున్ననది లేక పోవుటయేగాక ఆస్థానమునందు వాపు ఆక్రమించి ఆమెను ప్రాణసంశయదశకు గొని వచ్చెననియును కనుక ఈ వాపునుజూచి పుష్టతయనుకొనుట తెలివి లేమియనియును, ఇందులకు ముఖ్యకారణము ప్రస్తుతకాలమునందు ప్రబలియున్న దుష్టప్రబంధములేయనియు వచించుటయేగాక తొల్లిటి వారుదహరించిన గ్రంథసంచయమునే వీరు నుదహరించి -- ఇంతటి నైనను తగినట్లుగా పండితభిషక్కులు భాషా చి త్సకుపూనుకొననిచో

గతజలసేతు బంధనమగుననియును దేశీయులను హెచ్చరించుచున్నారు. ఇంకొక్క తెగవారున్నారు. వారికి తగినంతటి ఆదరము లేనందుననో నిరాదరము కలిగినందువలననో బెల్లముకొట్టిన రాలవలె నిశ్శబ్దముతో నుపేక్షించి యూరకొనుచున్నారు. నిగ్రహానుగ్రహములు లేని వీరి పక్షమును మేము నుపేక్షించుచున్నాము.

పైని పేర్కొనిన ఇరువాగులవారును ఆంధ్రవాగ్దేవి కభ్యుదయ పరంపర నిరంతరముగ కొనసాగవలయునని కోరువారే. తమకు వీలున్నంత వఱకు - చేతనైనంత వఱకును - ఏదోయొక రీతిగ - నాలుగు మండనములతోనో - పదిమండనములతోనో - గ్రంథజాలమును సేకూర్చి సర్వదా భాషాదేవి పాదపద్మములయందు సమర్పించ దలంచుచున్నవారే. సమర్థులే! ఈవిషయమునందు కొంచెమైనను సంశయము లేదు. కాని ఈసందర్భములలో వీరుగనంబఱచు పాక్షికములగు నభిమానములును - పదార్థవిమర్శమునందలి స్వీయపరకీయములను మతభేదములును - అన్నిటినిమించిన మొగమోటమియును - వీరియుపదేశములందలి సారమును కొలుచుటకు వీలులేకుండ - ఆంధ్ర సారస్వతమును సంసేవింపవచ్చు చిన్నలకు అడ్డుపడి - వారిని కర్తవ్య పరాఙ్ముఖులనుగ చేయుటయేగాక తప్పుత్రోవకు సైతమీడ్చుచున్నవి. ఈవిలేఖకునియుద్దేశము పాఠక ప్రపంచమునంతను దిద్దితీర్చుటకాదు. గాని మన యీపెద్దలు నిస్సారములును నిర్గుణములును అగు పదార్థములను - "తాము నిష్పాక్షికముగ నభిప్రాయమిచ్చెదరని వారనియును నిస్స్వార్థపరతతో వాగ్దేవి నుపాసించువారనియును" నమ్ముచున్న లోకులనమ్మికలకు విరుద్ధముగా - అతిశయోక్తులతోను ప్రోత్సాహ వాక్యములతోను - అనుపాదేయములగు ప్రశంసా సహస్రములతోను నింపి - జడివానను గురియించి - ఏవిధముగా యువకులను వారి యు

త్సాహమును నెప్పుత్రోవల బట్టించుచున్నారో తెలుపుటయే ఈ విలేఖకుని యుద్దేశము.

ఈయుద్దేశమును కార్యరూపమున రూపించుటకే ప్రస్తుతము వంగూరివారి ఆంధ్రవాఙ్మయ చరిత్రమును ఆలంబనముగానుంచుకొని ఆంధ్రవాఙ్మయ చరిత్ర విమర్శనమను పేరితో కొన్ని లేఖల (పదింటికి తక్కువగాకుండ) నిందు వ్రాయదలంచితిని. ఇందులకు ఆంధ్రవాఙ్మయ చరిత్రమునే యేల ఆలంబనముగా గొనవలయునని ప్రశ్నించు సోదరులుండక పోరు. కాని వారికిం సమాధానము.

వెనుక పేర్కొనిన ఇరువెలుగులగు మనపెద్దలును (అనగా ఆంధ్రవాఙ్మయముయొక్క నిరంతర శ్రేయోభివృద్ధులే మాయాదర్శపథములని చెప్పుకొనుచు, తత్సంసిద్ధికై అహర్నిశము పాటుపడుచున్నామని లోకులకు నచ్చజెప్పు పెద్దలు,) వంగూరివారి ఈవాఙ్మయ చరిత్రమునుగురించి, అభిప్రాయ భేదములకు తావులేకుండ, అనగా సమానాదరాభిమానములతో ముక్తకంఠముగ బ్రశంసించినారు. భూమికలను వ్రాసినారు. గ్రంథవిమర్శనములను గావించినారు. పరిషత్సభలలో బహూకరణ తీర్మానముల గావించినారు ఆ తీర్మానములను కార్యరూపమున గారవింపలేదని ఆడంబరములను చేసినారు. చేయుచున్నారు. నామాట యెట్లున్నను - వారిభావము చొప్పున ఎంతటి యత్కృష్టగ్రంథమో కాకపోయినచో, నిరంతరము భిన్నాభిప్రాయముల స్థానములగు వీరు, ఇట్లేల ముక్తకంఠముతో ఏకవాక్యముగ దీనిని ప్రశంసించుట కలుగును? కనుక ఈయొక్క గ్రంథమును స్థాలీపులాకన్యాయము ననుసరించి విమర్శించినచో ప్రస్తావనారంభమున పేర్కొన్న పెద్దల వాక్యములలోగల నిజమును, ఆంధ్రవాఙ్మయ చరిత్రలోగల యంతస్సారమును చక్కగ తేటబడ

గలదు. ఇంతయేగాక యువకులమును, ఇప్పుడిప్పుడే కన్నుతెఱచి గ్రంథావలోకనముచేయ బూనుకొన్నవారమును, అగు, మనకు - ఒక్క గ్రంథమునైనను - శ్రద్ధాభక్తులతో - సత్యాన్వేషణ తత్పరతతో - చదివిన ఫలము చేకూరునుగనుక - అనగా నుభయఫలసిద్ధులు లభింపనున్నవి గనుక నీగ్రంథమును ప్రకృతము విమర్శన పీఠము నెక్కించుచున్నాను. మనకీపట్టున విమర్శ గ్రంధము అగు వాఙ్మయ చరిత్రయందు సంగ్రథితములగు విషయముల యొక్కయును, విద్యానిధులనదగు మనవారు దీనిని మెచ్చుకొన్న గుణములయొక్కయును అన్వేషణమును యుక్తాయుక్త వివేచనమునకు మాత్రమే ప్రధానముకాని గ్రంథకుని వ్యక్తితోగాని తక్కిన విషయములతోగాని మనకెట్టి సంభంధమునులేదు. ఇందులకైమున్ముందు మనపెద్దలు ఈగ్రంథమును గురించి ప్రకటించిన యభిప్రాయములను సూచీకటాహన్యాయమున నొకటి రెండిటినిటఁ జేర్కొందును. చదువరులు అప్రస్తుతములను కొనక చక్కగ వీనిని గమనింతురుగాక.

"వాఙ్మయచరిత్ర సంఘశాస్త్రసంబాధిగా వ్రాయఁబడియుండుట శ్లాఘనీయమైనవిశేషము. అనేకస్థలముల సుబ్బారావుగారు నూతనయోజనముల ప్రయోగించి క్లిష్టార్థములకు నవ్వాయము నద్భుత భంగికల్పించియున్నారు. ఇవి ముత్తెముమీద వెట్టియూహలకు జేరినవిగాక విమర్శనపద్ధతి ననుసరించిన దృఢసత్వములుగానున్నవి - ఈ వాక్యములు - ఆంధ్ర వాఙ్మయమునకు నేడుగదా సరియైన చరిత్ర లభించినది - అని పొంగుచు పొరలుచు తన్మయావస్థనందిన కట్టమంచి రామలింగారెడ్డి ఎం. ఏ. కాంటాబు గారివి. కాంటాబుగారు ఆంధ్ర వాఙ్మయ విమర్శకులలో ఖండితముగ విమర్శించువారని అసాధారణ ప్రజ్ఞానిధులని, పేర్గాంచినవారు. ఆంధ్రాంగ్లకర్నాటాది బహుభాషా

కోవిదులు. రసికులు. ఇట్టివీరువ్రాసినయుపోద్ఘాతంలోని 'వెఱ్ఱియూ హాలకు జేరినవిగాక' అనువాక్యము జ్ఞప్తినుంచుకొనదగినది." ఈగ్రంథము సర్వవిధముల ఉపాదేయముగనున్నది. ఇట్టిగ్రంథము ఈభాషకు చిరకాలము నుండవలసి యున్నది. భాషాకల్పవల్లికి దీనికన్నముందు పుట్టినకవిజీవితములు కుసుమములుగాను, ఇదిఫలముగాను భావింప వచ్చు మాదివ్యదృష్టియుంబో నేతద్గ్రంథము ప్రాక్తనవాఙ్మయము నందు ఇటుపిమ్మట పెక్కింటి నద్భుతములను గోచరింపజేయును. గ్రంథము బహుగుణము దీనినిబహూకరించువారు కృతార్థులు". ఈయభిప్రాయము వ్రాసినది వేదం వెంకటరాయశాస్త్రులుగారు. వీరు ఆంధ్రులకు సుపరిచితులు, మహామహోపాధ్యాయులు సుప్రసిద్ధులైన విమర్శకులు. ఇదివరకు - అనగా ప్రసన్నరాఘవ నాటకము విమర్శనచేసినది మొదలు ఇప్పటివఱకు - ఆంధ్రభాషకు ప్రమాణభూతముగనుండతగిన వాఙ్మయము నేర్పరించినవారు. సంస్కృతాంధ్ర హూణభాషల గడుపాఱద్రావి గట్టని త్రేన్చిన మహామహులు. మల్లినాథునికి బిమ్మట నంతటివాడని పేరొందిన వ్యాఖ్యాత. మొగమోటమిలేకుండ నభిప్రాయమును చెప్పుటలో నద్వితీయులని వీరి యెడల ఆంధ్రులకభిమానము మెండు. ఇట్టివీరి - "దివ్యదృష్టియుంబో నేతద్గ్రంథము ప్రాక్తనవాఙ్మయమునందు పెక్కింటినద్భుతముల గోచరింప జేయును -- అను వాక్యము ముఖ్యముగ పేర్కొనదగినది.

"మీయాంధ్ర వాఙ్మయ చరిత్రమును జదివితిని ... ... ... మీరు వాఙ్మయమును పట్టుదలతో సంగ్రహించి అచ్చుపడిన గ్రంథములను అచ్చుపడనివానిని ఓపికతో జదివి సుసంబద్ధమైన వాఙ్మయ చరిత్రమును ఆంధ్రులకొసంగుట యెంతయు శ్లాఘాపాత్రము. ఇదివఱకుం గవులచరిత్రముగలదుకాని వాఙ్మయచరిత్రము లేదు. ఆకొఱత

దీరుటకు మీరు యత్నించి మాకృతజ్ఞతకు పాత్రులైతిరి."

ఈఅభిప్రాయము నిచ్చినవారు కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు, వీరును ఆంధ్రవిమర్శకులు. సుపరిచితులు. మోమోటమును లక్ష్యముసేయక సత్యము చెప్పెదమని కంకణము గట్టుకొన్నవారు. ఇట్లని ఆంధ్రులందఱిచే విశ్వసింపబడినవారు. మహోద్దేశములు గలవారు. ఇట్టివారు ఈ వాఙ్మయచరిత్రమునకు సుసంబద్ధమైన అను విశేషణము వాడుట మిగుల ప్రశంసింపదగినది.

"మీరనుసరించిన మార్గము ప్రకారము తెలుగు వాఙ్మయమును దిలకించిన వానిలో బ్రథమ గ్రంథమగు మీవాఙ్మయ చరిత్రమును జూచి మిక్కిలి యానందించితిని...........తెలుగు వాఙ్మయవృద్ధి వైశాల్యముల నొక్కదృష్టిలో దిలకించు మీగ్రంథము మీలో గొప్పశక్తి లీనమైయున్నట్లు వెల్లడించుచున్నది.................."

ఈవాక్యములు మానవల్లి రామకృష్ణ కవిగారనుగ్రహించినవి రామకృష్ణకవి మాయెఱిగినంత వఱకును నిందాస్తుతులను లక్ష్యము చేయువాడుకాడు. తనకు మంచిదని తోచినచో - ప్రపంచమంతయును ఏకమై పడద్రొట్టినను సఱకుసేయక కార్యమునకు గడంగువాడు. ఇట్టివీరు ప్రశంసించిన ఈవాక్యములలోని "తెలుగు వాఙ్మయవృద్ధి వైశాల్యముల నొక్క దృష్టిలో దిలకించు మీగ్రంథము"—అనిన వాక్యములు ముఖ్యముగ గమనింపదగినవి.

ఈక్రిందివాక్యములు వేటూరి పండితుడు వ్రాసినవి. "అనిదంపూర్వమైన మీయాంధ్రవాఙ్మయ చరిత్రమును జదివితిని. సంతోషించితిని. ఇదివఱ కెవ్వరును బ్రవేశింపని మార్గమున బ్రథమమున బ్రవేశించి ఆంధ్రభాషాయోషకు విభూషగామీరు సంతరించిన ఈగ్రంథము

ఆంధ్రలోకమున వ్యాప్తి జెందగలదని విశ్వసించుచున్నాను.” ఈ అభిప్రాయప్రదాత ప్రాచీనుల చాటుపద్యముల సేకరించి కూర్చిన నాటినుండి ఆంధ్రవాఙ్మయమునం బరిచితి గాంచుచున్నవారు. వీరు వ్రాసినవానిలోని కెల్ల - ఆంధ్రభాషా యోషకు విభూషగా - అన్న వాక్యము ముఖ్యముగ స్మరింపవలసి యున్నది.

పేరుమాత్రమేగాక, తిట్లకుభీతిల్లి “వ్యాః” అనిమెచ్చుకొన్న పత్రికాధిపతులు, స్తుతులకుబ్బి సూక్తుల పల్కిన సుధీవరులు, పుస్తకములోనున్న దేమో చదువక యె చాట భారతములతో అద్వైత వేదాంతమును గుణియించినపెద్దలు, మున్నగు నవేకులిచ్చినట్టి, గ్రంధకర్తచే ప్రత్యేకముగా నచ్చొత్తింపబడినట్టి ప్రశంసాపత్రములు, పెక్కులున్నవి. వానినన్నిటిని వదలి, ఉన్నవానితో రంగస్థలమునుతీర్పం బ్రయత్నించెదము.

మాచదువరులకు ఆంధ్రవాఙ్మయ చరిత్రము గుణించిన మనపెద్దలయొక్క యభిప్రాయములను గొన్నింటిని మచ్చుజూపితిమి. ఇటుపైని పరిపర్శనమున నుపక్రమించి దూషణ భూషణాదిఫలము నెంతమాత్రము నపేక్షింపక విమర్శనమును సాగింపవలసియున్నది. కాని కార్యములను నిర్వహించుటలో సాధారణముగా పురుషుల మానసములు రాజస తామసాదిగుణములకునికిపట్లు కావలసి వచ్చును. దాన చతుర్విధములగు పాపములు గల్గునని పెద్దలందరు ఆపాపచతుష్టయము ఇయ్యది:—

పారుష్య మనృతంచైవ పైశున్యంచాపి
సర్వశః। అసంబంధ ప్రలాపశ్చ
వాఙ్మయం పాప ఉచ్యతే.

ఈవిమర్శనసందర్భమునందు ఆర్యజనపూజ్యులు నిర్దేశించిన ఈ పాపచతుష్టయమునకు నేను గురిగాకుండునట్లుగా పరమేశుని ప్రార్థించుచు పాఠకులయును పత్రికాధిపతులయును అనుజ్ఞ నర్థించి, ప్రకృత కార్యమును నిర్వహింప బూనెదను. పైమూరు నుండియును యథోక్తముగ, యథాశక్తిగ, ఆంధ్రవాఙ్మయ చరిత్ర విమర్శన వ్యాసములను పాఠకులకు సమర్పించెదము.

తత్త్వవివేచకుఁడు

---

* ఈవ్యాసవిలేఖకుల నభిమతము ననుసరించి పేరును ప్రకటించుట మానినందులకు పాఠక మహాశయులు మమ్ము క్షమించెదరుగాక.

విలేఖకుల యభిప్రాయములతో సంపాదకుల కెట్టి సౌకర్యమును లేదు.

సా॥ సం.

---

## జోలపాట

అబ్బాయినీచేను యేమిపండింది
రాజనంపండింది లక్ష్మిగోరింగ

పాపకర్మడిచేను యేమిపండింది
పల్లేరుపండింది పదటగలసింది

ఊరిచుట్టూచేను వుంచకురఅన్న
ఊళ్లోనువియ్యమ్ము పొందకురఅన్న

ఊరుచుట్టూచేను కాకుల్లపాలు
ఊళ్లోనువియ్యమ్ము జగడాలపాలు

# రాటము పాట *



వారానికొక్కటు నేనొడకినాను
వారంచుకోకల్లు నేగట్టినాను

దినానికొక యేకు నేనొడకినాను
దినుసుదినుసుకోకల్లు నేగట్టినాను

కదురాడినచోటకరువుల్లులేవు
కలుగుచుఅన్నంబు కడుపునిండగను

కాటకంబును బాపగాటంబెగాని
కడమపనులతోటి కలుగదన్నంబు

యేకుల్లువొడుకుడీ యెంకమ్మలార
యేటేటమీకొచ్చు హెచ్చులాభంబు

మాచేలోపత్తెట్టి మే మొడికిననూలు
మాకుబట్టలునేసె మాసాలిజగ్గన్న

అందమైనకమ్మల్లు మందమైననేత
అదికోరుచున్నారు అందరూనేడు

* ఇది ఎవరో పూర్వులు వ్రాసినపాట. పల్లెటూళ్లలో ముసలమ్మల నోళ్ల నుండి యిప్పటికిని వినఁబడుచున్నది నవీనవిద్యావంతులు మహాత్మునితత్త్వమునిప్పటికి అర్థము జేసికొనలేకయుండగా, ఎన్నిశతాబ్దముల క్రిందటనో దానిని గ్రహించి ఆచరణలో పెట్టిన ఆంధ్రుల ప్రతిభ వర్ణనాతీతము.

సా॥ సం.

# అదృష్టము



వరహాపురపు నారాయణానికి యిప్పుడు పదహారేళ్లు వయస్సు. ఆతనికి ఎనిమిదోనెల వచ్చేసరికే తండ్రి కృష్ణబ్రహ్మం పోయినాడు. నారాయణం తండ్రి కొంచెము మర్యాదాగలకుటుంబీకుడే కాని ఆయన డిస్ట్రిక్టు కోర్టులో నాజరుపని చేస్తూన్నప్పటినుంచీ కూడ, ఆయనకు డబ్బుయొక్క విలువ తెలిసేదికాదు. బ్రాహ్మణ సమారాధనలు చేయించి హరికథలు చెప్పించి, ఇంకా ఏవో దానధర్మాలు తనయిష్టము వచ్చినట్లల్లా చేస్తూండేవాడు. భార్యరంగమ్మ అనగా మన నారాయణం తల్లి ఎప్పుడు భర్తమాట కెదురుచెప్పి యెఱుగదు. భర్తకు ఊరికే ఆతిథులను అభ్యాగతులను తీసుకురావడంపని రంగమ్మ కూరికే వండిపెట్టడంపని.

'వండనలయదు వేవురువచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌనతనిగృహిణి'

అనిపెద్దనగారు మనుచరిత్రలో చెప్పినమాట రంగమ్మకుబాగా వర్తిస్తుంది. యీలా దానధర్మాలు చేయడంవల్లనే చాలా ఋణాలు పెరిగిపోయినయి. కృష్ణబ్రహ్మం బ్రతికున్నాళ్లు యెవ్వళ్లూయిచ్చిన బాకీలు అడిగియెఱుగరు. ఆయనపోయిన కొద్దిరోజులలోనే బాకీదార్లంతా మూగి కృష్ణబ్రహ్మం పెద్దలు సంపాదించిన ఆస్తిఅంతాకూడా చిల్లిగవ్వలేకుండా వేలంవేయించుకొని పోయినారు. రంగమ్మఅన్నగారు రామారావు డబ్బుకలవాడే. ఆయనభార్యా వేంకటసుబ్బమ్మ మాత్రము చాలా గడుసుదని వాడుక — అందువల్లనే రంగమ్మతను తన కొడుకు నారాయణంకూడా వచ్చి 'నా యింట్లోవుండమని రామారా

వృత్తాంతచెప్పిన వెనకతాను డిప్యూటీకలెక్టరు జగన్నాథరావు పంతులు గారి ఇంట్లో వంటకత్తెగా కుదిరి అప్పటినుంచి నారాయణానికి పదియేళ్లువచ్చేదాక కాలంగడుపుతూ వచ్చింది. కాని దురదృష్టవశాత్తు ఆమె కూడా కాలంజేసింది - అప్పటినుంచి రామారావే నారాయణాన్ని తన దగ్గరుంచుకొని చదువుచెప్పిస్తూవచ్చాడు. ఇప్పటికి నారాయణం స్కూల్ ఫైనల్ పరీక్షప్యాసయినాడు. వేంకటసుబ్బమ్మ కిదంతా చూస్తే కష్టంగానేవుంది. కాని రామారావుకుమాత్రం తనకుమార్తె సరళను నారాయణానికియిచ్చి వివాహంచేదామనికూడా మనస్సులోవుంది.

౨

“(పిల్లదానిసంబంధంమాట ఏమిఆలోచించారు కారుగదా! తేపు శ్రావణమాసానికి పిల్లకు పదకొండేళ్లుకూడా దాటిపోతున్నయి. ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా ఏమనుకుంటున్నారో మగవారికి మీ కేమి తెలుస్తుంది)” అన్నది వెంకటసుబ్బమ్మ పెనిమిటితో. రామారావు నవ్వుతూ ‘మేనమామ పట్లోయిల్లుకట్టుకుంటాడునాకేం’ అన్నాడు ‘మీకిప్పుడు నవ్వులాటగానేవుంటుంది సరిగా నెత్తిమీదకొచ్చేటప్పటికిగాని తెలియదు. అప్పటికేదో కక్కుర్తికి వేదో పోయేవాడికోయిచ్చి ము డేయవలసి వస్తుందేమో అని కూడా నాకుభయంగా వుంది’ అన్నది వేంకటసుబ్బమ్మ యింతలో నారాయణం కాలేజినుంచి వచ్చాడు. భార్యాభర్తలిద్దరూకూడా ఎందువలనో ఆకస్మికంగా సంభాషణ మానేసి ఏమీఎఱుగనట్లుగా వూరుకొన్నారు.

౩

‘ఇక మా బావ నాకెట్లా బావ కావడ పడనుకొంటాను; నిజంగా

నన్ను మాబావకివ్వడం మానాన్నకిష్టమే మాఅమ్మేపడగొట్టింది. ఇన్నాళ్లూ చదువుచెప్పించి, పదిహేనురోజు లయిందోలేదో మాబావ తాలూకాగుమాస్తాగా ప్రవేశించి - యికనీదారి నీవుచూచుకో నాయనా అని పూటకూళ్లింటికి పంపేశారు. అచ్చంగా యిది మానాన్నకుపుట్టిన బుద్ధిగాదు. మాఅమ్మపోరుపడలేక అట్లాచేసుంటాడు. నన్నుమాబావకివ్వడం సుతరాం మాఅమ్మకిష్టంలేదు. అందుకనే ఇట్లాజరిగింది' అనుకొంటూ బిక్కమొగమువేసికొని గదిలో కూర్చుంది సరళ.

వేంకట సుబ్బమ్మ వచ్చి

ఏమే యీలాకూర్చున్నావు - ఇట్లారా అమ్మా! ఎవరో నిన్ను పెళ్లికూతురు చూపులు చూడడానికి వచ్చారట. ఇవాళ నీవు బళ్లోకి వెళ్లబోకు. అనిగదిలోనుంచి తీసుకువెళ్లింది.

౪

**రామా:** యీవచ్చిన నారిపాటివారు రెండువేల రూపాయిలు కట్నము నడుగుతున్నారు. యింకా ఎంతలేదన్నా వారడిగే లాంచనాలన్నీ జరిపేటట్లయితే ఒకవేయిరూపాయీలు అదనంగా అవుతాయి. పైగా అయిదు రోజులూ పెండ్లిచేయడానికింకా ఒకవెయ్యి వెయ్యిన్నర రూపాయిలు కావలసియుంటాయి. ఇదంతా ఏమిటి మననారాయణానికేయిచ్చి ముడేదామనుకొంటున్నాను. ఏమంటావు?

**వేంక :** సరే! మంచి సంబంధముకావాలి డబ్బూఖర్చుకాకుండా యుండాలంటే ఎలాకుదురుతుంది! డబ్బుఖర్చక్కరలేదుకదా అని ఆస్థిగీస్థీలేని మేనల్లుడికిద్దామనుకుంటున్నారేం? అంత

కన్న ఆడపిల్లకావు. గొంతుకకోసివేయటం మంచిది తరు వాత మీఇష్టం.

రామా: అదృష్టముంటే ఆతనే సంపాదించుకొంటాడు. బాగా ధనవం తుడికిస్తేమాత్రం అదృష్టంలేకపోతే అమ్మాయి సుఖపడు తుందా?

వెంక : ఏమిటో పరమవేదాంతం - ఏమో నాకేం తెలియదు - పెళ్లి అయిన తర్వాత ఏమిజరుగుతుందో బాగా ఆలోచించుకొని మాత్రంచేయండి

ఈమాటలు వినగానే రామారావు కేమియుతోచక ఏదోఆలోచిస్తూం డగా వాకిట్లో పంతులుగారూ? అనిఎవరో పిలచినట్లుగావుంటే వా కిట్లోకి వెళ్లాడు.

ఐదునిమిషాలకు గబగబానవ్వుతూ ఒకవార్తాపత్రిక పుచ్చు కొని పెండ్లాం దగ్గరకు వెళ్లి పత్రిక వేంకటసుబ్బమచేతికిచ్చాడు— వేం కట సుబ్బమ్మకు వద్దన్న కొద్దికనబడేచోట తాటికాయలంతేసి అక్ష రాలలో అదృష్టము అనే శీర్షికక్రింద 'వరహాపురపు నారాయణ మూర్తిగారు మిథునాపురములాటరీలో విజయముపొందినారు. ఒకలక్ష రూపాయిల విలువగల మేడ భూమి వారి స్వాధీనముచేయబడును. వివరములుముందు వ్రాసెదము' అసఅసోసియేటెడ్ ప్రెస్‌వారి తంతీ వార్త కనుపించింది. వేంకటసుబ్బమ్మకుకూడా సంతోషానికి మేరలేక పోయింది. ఔను అదృష్టంముంటే సరిఅన్నది ఆమెకూడా. తన మే నల్లుడు తానువద్దంటూన్న కొద్దీవేసిన యీలాటరీనిగురించి రామా రావుకు జ్ఞప్తియేలేదు. ఇప్పుడు దానిమూలాన యింతపెద్దఆస్థి రావ డంచూచి తనలో తానెంతో ఆశ్చర్యపడుతున్నాడు.

౫

'ఏమండీ! నేనంటేఎంతో ప్రేమగావున్నట్లేవుండి చివరకు మావాండ్లు పిల్లనిస్తామనే సరికి మీకుబిగువు ఎక్కువయి మీరుకట్నాలకోసం బేరాలుపెట్టారే?' అన్నది సరళనవ్వుతూ!

'నేనందుకోసము కట్నమడుగలేదు. మీవాండ్లు నాకుగాదు పిల్లనిస్తానన్నది నాకేదిన్నిచ్చిచేదామనుకున్నట్టుంటే మొట్టమొదట నాకాస్తి లేదని సందేహించేవాళ్లేకాదు. తరువాత అదృష్టవశాత్తు నాకుసంక్రమించినలాటరీఆస్తి జూచియిచ్చారు. అందుకోసమని మా టపట్టింపుకోసం అట్లాఅడిగానుకట్నం' అన్నాడునారాయణం.

'కాదుగానండీ మీకోసం నేనుమాత్రం ఎంతైనా త్యాగం చేసేదాన్నేనండీ?' అన్నది సరళ సిగ్గుతో.

'కాపురానికివచ్చి రెండునెలలైనప్పటికీ నాకోసము నీకుసహజంగావుండే సిగ్గునే త్యాగంచేయలేకపోయినావుగాని ఇంకేంత్యాగం చేస్తావు? ఈమాటలకేమిలే ఇప్పటికికూడా నురదృష్టవశాత్తు, అయిశ్వర్యంపట్టినట్లుగానే ఆకస్మికంగా నాకు పేదఱికం తటస్థించిందా అంటే మీవాళ్లుమళ్లీ నిన్నెక్కడ లాక్కొంటారో నాదగ్గరనుంచని నాకుచాలా భయంగావుంది' అన్నాడు నారాయణం.

'ఊ! ఏమండీ మీమాటలు. అంతా! చిత్రం! అనినవ్వుతూ తటాలున లోపలికి బోయింది సరళ.

---

సాహితి

# మధుర మాలిక

చెమ్మగిలు చెక్కిలిం జేయిఁ జేర్చి వలపు
వనలు సాగిన కాటుక కనులఁదోఁగు
దిగులుచూపులంతో బిక్కమొగమువైచి
పోమొదవదేల! యీపూవుఁబోఁదలనిడ!

పండువెన్నెల యిసుమంత పైనఁబడిన
గాజువాఱునె నీమేని జాజితీవ!
పూవురెమ్మలఁ గదలించి బుగులుకొనెడు
బాలపవనాహతికిఁ దాళి; యేల? భయము!

ఒంటరిగ నిట్టు నడిరేయి నుండనేమొ,
పసిడిమైఁగప్పు నీ మేలిముసుగునుండె,
మధురలజ్జాభినయముల నధరపల్ల
వమ్ము విప్పిచెప్ప నొకింత వలను పడదె?

జాఱిపోయెడు క్రొవ్విరి సరమునేని,
సంస్కరింపవు నీశిరోజములయందు,
తలిరుబోణి! నీకీపరధ్యానమేమొ
నయ్యొ? ఎలజవ్వనం బెంత కైనఁదగును.

# భీష్ముడు

## ౧ శంతనుడు

ఓతుహినాంశుచారు వదనోజ్జ్వల ! మారుడు తెల్లవోవు నా
నాతలవెంట్రుకల్ ముసలినాళులు చేరువయయ్యెనంచుఁ బ్ర
ఖ్యాతముచేయ నోవరయ గాఁదొడగెన్ నవయౌవనోద్ధబా
లాతరుణోన్మిషన్నవ విలాసరసాబ్ధిః భోగదూరమై

మూఁగుశరన్నవాంబుదసమూహము పర్వతదేహపంక్తిపై
పోగయినంతలో ముసరిముంచుజాపగలోనఁ గామినీ
భోగపువాంఛలున్ మునిగిపోయెను పుత్త్రుడు తెప్పకొయ్యగా
నాగకయున్న దేహికలడాగతి యేయొకయొడ్డుచేరగన్

నిపున్ చూచుచునుంటిగాదె గడచెన్ నీలాలకామద్వయః
ప్రావిర్భావము పుత్త్రిలేద్వ్వాదు మహాభాగీరథీపుణ్యా పం
థావిద్యోతిత తుంగభంగ సరిగంతర్లీనుడైనార, ఆ
శావైఫల్యము నీదుసాహసమునన్ చాపంది రేకేత్తెమన్.

ఆనీలంబులు నాగులాబిప్పు రేకందంబులాబాల సం
తా నోర్వీజపలాశరమ్యములు చావా! మత్పూరాజన్మ పు
ణ్యానేకంబులకున్ ఫలంబులు విలాసాతుంబులున్ మోవియున్
లేవవ్వల్ ననునేనెచంపుకొని నట్లేయూసుతున్ విడినన్.

ఈమాటలవలనిఫలితము
చామా యెఱుగుదును గమ్యజయసుందర లీ
లా మదగజగమనము నీ
యామవ్వపు నడకలందు నేచూడనికన్.

# గంగ

మానసమయంబు నీవలన మానవనాయక! జాతిపోయె నీ
తనయుడవీవు శాత్రవవితాన భయంకరుఁ జేసి తెచ్చెదన్
వినుజగదేకపావనిని నేను సురాపగఁ గారణాంతరం
బుననినుఁ బొందితిన్ గలిగెఁ బో ఫలముల్ గురువంశమండనా

అని యదృశ్యయయ్యె నని మిషనది తోడ
ననుగుపుత్రుఁగొని మహానురాగ
రసపరీతహృదయ రమ్యాంబుజాతమై
శంతనూర్వీపతి విచారమంద

౨

త్రిజగదారాధ్యుడైనట్టి త్రిపురవైరి
సాంద్రధూమజటావనీ జనితమైన
ఈనదీకుల్యభాగమ్ము లేలొ? యిట్లు
గ్రీష్మవేళాకృశీభూత భిన్నదక్షి
ణాపథతరంగిణీ ప్రీణనమ్ము సలుపు
మిగులనదె పిపాసాయాత మృగవితాన
ముఅక వాహిని పైతట్టు నరయుచుండె
చనిసుదీర్ఘవేణీ ముక్తసైకతంబు
వారిత్రిగుంహో వాహినివచ్చునేమొ
యనుభయంబున దీనంబులైనకనుల

భూమిపతి కిరీటాంచలంబునఁ బొనర్చి
నట్టినగిషీపనిం బోలెనదిగొ! యేదొ
రమ్యమై కానవచ్చె దూరంబునందు

కాదెవఁడొ ధనుష్పతి మహాకాండపటలి
దివిషదాపగనిట్లు బంధించినాడు
వాఁడెయీవచ్చు నాచిన్న వాఁడెవాఁడు
ఆసాబగుచిన్ని కరముల నంద మొలుకు
చున్న యదిర కోదండంబు చిన్నియంప
పొది బుజంబున, నామోముపో కళావి
హీనముం జేసెజాబిల్లిలోనిసొగసు

తండ్రిరా వ్రాయి రమ్ముపుత్రిముఖదర్శ
నంబునోచని యీవృద్ధ నరపతికిని
దృఢపరిష్వంగసుఖము సంధింపుమయ్య!

ఏమహాభాగ మీతల్లి! యెవఁడునోఁచు
కొనియె నీతండ్రియగుటకు! — కుర్ర! — తగుర?
యింతవినయంబు — దశరథనృపతిదక్క-
పుడమి లేఁడయ్యె నీవంటికొడుకుఁబడయ
తనయ! ఎటనేర్చితివిర! కోదండవిద్య
తండ్రి! నీతండ్రి యెవరు? నితల్లియెవరు?
తెలియఁజెప్పుము ——— భాగీరథీసరివంతి

అహాహా! నాజన్మసార్థకంబయ్యె; తండ్రి!
రమ్ము, చిరవియోగార్త దుఃఖమ్ములైన
నాశరీరాంగములు నీదునవ్యగంధ
సారశకలశీతల పరిష్వంగసుఖము
చేత తేలింపుమన్న! నీచేతిమీఁద
నిదె! మొరగ నీగదయ్య నీ వృద్ధజనకు

'తాతా! నీకిదియేమి సం[illegible]మును నా తాత్పర్యమున్ విన్మునా భ్రాతల్ కోసము బ్రహ్మచారినయి యావజ్జీవమున్ నిక్కమీ రీతిన్ బుచ్చెదజీవయాత్ర! యిదుగో బుత్రుంబులున్ చంద్రద జ్ఞాతాప్తుండును సాత్వికసభికులున్ సామంతులున్ మంత్రులున్'

త్రిపథగ కన్నబిడ్డ గడిదేరిన చొక్కపువింటిజోదు సం
ద్రిపురోదవోని కంఠమున ధాత్రిజనుల్ వినసీగతిన్ మహా
శపథముచేసినంతన నిశాతతీ క్షాంతతః దాల్చెవాయువ్రా
ర్ధ్వపుసరణంబునన్ బొలిచెధారుణినిశ్చలతన్ దలిర్చగన్

ఎంతసాహసము నీవేమి ఘోరమ్మను
నంత తొందరపడె శంతనుండు
అజ్ఞాతపూర్వ మహాశ్చర్య మనుభూతి
దశనందినట్లయ్యె దాశరాజు
భీష్మునివంక నివ్వెఱపోయి శూన్యతా
మయదృక్కులనుచూచె మత్స్యగంధి
ఉప్పరంబెగసిపో చప్పట్లుచరచియం
దఱు కేక లిడిరిసదస్సులెల్ల

అభ్రగంగాపగా శీకరాతి శీత
లానిలంబులువిసరె సంతానవల్లి
కాలతాంతస్రజంబులు కప్పిపుచ్చె
యౌవనముతొంగిచూచు ప్రియంపుభీష్ము

# ఆంధ్ర వాఙ్మయచరిత్ర విమర్శనము

౧

## కృత్యాద్యవస్థ

(వెనకటి సంచిక తరువాయి)

మేము పరిశీలించినంతవరకును కాల్డువెల్లుగారి ప్రణాళికను కాదనుటకు వీరి గ్రంథమునందలి ఈక్రిందివాక్యములకన్న మరేదియుచు సప్రమాణమగు ఖండనగ్రంథము కానవచ్చుటలేదు. ఆఖండనమిది.

"దక్షిణభాషలయందలి భాషాసంప్రదాయములు వాక్య క్రమము ప్రకృతిప్రత్యయ సంబంధమైనమార్పులు సర్వనామములు కొన్ని కృదంత స్వరూపములు నొకేవిధమగు పద్ధతిని జనించినట్లును అట్లుపుట్టిన రూపభేదము లుత్తర హిందూస్థానమునందలి గౌడభాషల సంప్రదాయముల కించుక భేదముపొంది యున్నట్లును మనకే కన్పట్టుచున్నది. కాని తల్లి భాషయగు సంస్కృత భాషతో నార్యావర్తమునందలి పోలికలకంటె భేదములధికములు కావు"— 16 - 17 పేజీలు.

కాని ఈమాత్రపు నాల్గు మాటలతోటి ఖండన గ్రంథముచే కాల్డువెల్లుగారి వాక్యములు పరాస్తములు కాజాలవు. ప్రస్తుతమున కప్రస్తుతములైనను కావలయునని కదలించిన కారణమునకైనను-ఆ ఒకేవిధమగు పద్ధతియెట్టిదో పోలికలకంటె భేదములధికము లెట్లుగావో సాధ్యమైనంతవరకు సప్రమాణముగ సంగ్రహపద్ధతినైనను వివరింపవలసిన బాధ్యత మన ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులపై నిలచియే యున్నది.

ఆంధ్ర భాషాస్వరూపమును ఈవిధముగా నిర్ణయించి పిమ్మట ఆంధ్ర భాషానామమును గూర్చి చర్చింపదొరకొనుచున్నారు.

"భాషానామము:— మనభాష కాంధ్రభాషయనియు తెలుగు భాషయనియు తెనుగు భాషయనియును నామాంతరములు. ఈభాషమాటలాడుచున్న దేశ

మును వేంగిదేశమని కొందఱందురు. కాని వేంగియనుపదము ఆంధ్రశబ్దమునకు బర్యాయపదమనుకొనుట పొరబాటనితోచుచున్నది. వేంగిదేశమాంధ్ర దేశములో నొకభాగముకాని వేంగిదేశమాంధ్ర దేశముసర్వమును కాదు'' 18 పేజీ.

ఆంధ్ర భాషానామనిర్దేశము చేయఁబూనిన వీరిలేఖిని అంతలో దానిని వదలి దేశస్వరూప నిర్దేశము చేయనుపక్రమించుటను అట్లుంచి-(శాఖాచంక్రమణము వెన్నతో బెట్టినవిద్యయైనందున నట్లుంచియని వ్రాసితిమి.) భాషానామ నిర్దేశమున వీరు ప్రదర్శించెడి ప్రకర్షతనే మనము కనిపెట్టవలసియున్నది. మనభాషకు ఆంధ్రభాష-తెలుగుభాష తెనుగు భాషయని మూడుపేరులున్నవని వీరు నిర్దేశించి నప్పుడు ఈ పేర్లకుగల పౌర్వాపర్యమును (అనగా ఏపేరు ఎప్పటినుండి వాడుకలోనికి వచ్చినదో) దానినే యేగ్రంథములలో నెట్లెట్లు వాడియున్నారో-అందుగల సాధుత్వాసాధుత్వము లెట్టివో వానివలన మన ఆంధ్రవాఙ్మయమును గుఱించిన చారిత్రికలేవి వెల్లడియగు చున్నవో మున్నగు వానిని యథోచితముగనైనను చర్చింప నిశ్చయింపవలసి యుండగా వీనినన్నిటిని వదలి-వేంగీ దేశపుతోక పట్టుకొని ప్రకరణాసంబంధములగు చర్చలకు పరుగెత్తి వానినైనను తెల్పిచెప్పఁజాలక-ఆంధ్ర దేశపు ప్రాచీనకాలమునందలి పరిమితివిపుల పరిశోధనమున నిర్ణయింపవలసి యున్నది. ఇందుకొఱకు కర్ణాటక తమిళ మహారాష్ట్ర గ్రంథములేమి చెప్పుచున్నవో తెలిసికొనవలసి యున్నది. అని యిట్లు 'వలసియున్నదిపై వలసియున్నదులను' వ్రాయుటకేమంత వలసియున్నది.

''తగవులేకుండ జూపుటలకు (అనగా ఆంధ్రదేశపు సరిహద్దులివి యనితగవు లేకుండ జూపుటకు) దెలుగక్షరములలో వ్రాసిన తెలుగు భాషావిషయములున్న మొదటి నిదర్శనము యుద్ధమల్లుని శాసనమేయైనను నింతకు బూర్వము తెలుగు లిపికాని తెలుగు గ్రంథములుగాని లేకపోలేదు'' 22 23 పేజీ.

ఈవాక్యములు కొంతవఱకు న్యాయ్యములే మిక్కిలి ప్రాచీనమైన వాఙ్మయపు చరిత్రమును వ్రాయబూనిన బుద్ధిమంతులు పదార్పణము చేయవలసిన సుపథమే ఇయ్యది. కాని ఇట్టి నిశ్చయము తమకున్నను - అనగా తగవులేకుండ ఆంధ్రదేశపు సరిహద్దులివియని జాఫుటకు తెలుగక్షరములలో వ్రాసిన తెలుగుభాషా విషయములున్న నిదర్శనములగు యుద్ధమల్లాదుల శాసనములు చక్కని సాధనములను నిశ్చయముతమకున్నను - ఆమార్గముననుసరించియే - అనగా దొఱకినంతవఱకు శాసనవాఙ్మయమునో తద్గ్రథితమగు నితరాధారములనో ఆయాకాలములందలి భాషానుశాసనములగు వ్యాకరణ గ్రంథముల లోగల నిబంధనములనో లేక తత్సంబంధములనో ఆధారముగా గొనియే - ఆంధ్రభాషాస్వరూపమునుగాని ఆంధ్రభాషా నామనిర్ధేశమును గాని చేయుచు బూర్తిచేసినచో నెంతో బాగుగనుండెడిది గాదా! ఎట్లయిననేమి! ఏశాఖాచంక్రమణమునోచేయుచు హిమకూటమునుండి త్రికూటమునకు త్రికూటమునుండి హిమకూటమునకు లగ్గలుపట్టుచు కొట్టికోలాహలము జేయుచున్నవీరు చివఱకు మఱల స్వస్థత నలవఱచికొనినట్లు ఈక్రిందివాక్యములు తెల్పుచున్నవి —

"అట్టివి (అనగా 450 సంవత్సరములేకచ్ఛత్రముగా బాలించిన ఆంధ్ర వాఙ్మయమును తెలుపుశాసనములు) మాగధి మహారాష్ట్రపైశాచీ మొదలగు భాషలలో నెందున్నవో కనుగొనలేమైతిమి. బౌద్ధజైనమతప్రాబల్యము గలకాలమునందీ దేశచరిత్రమును దీనియందు ప్రచారమొందిన వాఙ్మయచరిత్రమును దెలిసికొనుటకు మనము పాళీచీనా సింహలభాషల నభ్యసించి యందేమికలదో గనుగొనవలసియున్నది. ప్రాకృతభాష లభ్యసించి యాంధ్రభాషకెద్ది చేరువదైనదో నిర్ణయింపవలసియున్నది. బౌద్ధజైనాశ్రయములగు నమరావతి గుడివాడ పిఠాపురము తాటిపాక మున్నగు ప్రదేశములయందలి భూములందవ్వి శాసనములు నాణెములు విగ్రహములు తెలుగు మాతృభాషగాగలవారు పరిశోధింపవలసియున్నది". (23 పేజి).

కాని, తగినంతటి యుపపత్తులను ఎట్లయిననేమి ఆర్జించి ఇప్పటికి

ఒకదేశమునుండి తాళపత్రములు కట్టలుకట్టలుగా కట్టికట్టి విప్పి - తలక్రిందుగా - వాఙ్మయ పరిశోధన చేయుచున్నామని చెప్పుకొనుచున్న మన గ్రంథకర్తలు ఊహాశక్తులనేలపాటింప లేదు. తెలుగుమాతృభాషగాగలవారు గాకయేనా? ఈరీతిగా ఆంధ్రభాషా స్వరూప విచారణమునువలెనే ఆంధ్రభాషానామ నిర్వచనమునుగూడ నీలున్నవి - పత్రములు భరించినట్లు 'వలసియుండుటలు'ను నింపి పూర్తిచేసి ఇకమిగిలియున్న తెలుగు లిపియొక్క స్వరూపమును విమర్శించుటకు పూనినారు.

"నాయూహచే బహిష్కృతములలో నొకటియైన యాంధ్రభాషయు లిపియు నవీనభాషయగు సంస్కృతముకంటెను దేవనాగరలిపికంటెను ప్రాచీనములని తలంచుచున్నాను. నాయల్పపరిశ్రమకు దట్టిన న్యాయాభిప్రాయములను నేనింతవఱకు తెలిగిన విషయములను బట్టి చెప్పుచున్నాను. ఇది సిద్ధాంతింపగలనా లేదా యను విచారము ప్రస్తుతము నాదికాదు."

ఏవస్తువును గుఱించియైనను ఇతరసమభావమును ప్రకటింపవలసివచ్చినప్పుడు అట్టితరతమభావప్రదర్శనమునకు తగియున్న ప్రమాణములను - అట్టిప్రమాణములు లేనియప్పుడు తనను విశ్వసింపజేసిన కారణములనైనను వక్తలు నిర్దేశింపవలసియుండుటయును నిర్దేశించుచుండుటయును ధర్మముకదా. అట్టివేవియును నిరూపింపకయే నిరంకుశులగు శాసకులవలె - నోటిమాటలతో ఆంధ్రభాషయును లిపియు నవీన భాషయగు సంస్కృతముకంటెను దేవనాగరలిపికంటెను ప్రాచీనములు - అని డాబుచేయుట వాఙ్మయచరిత్రకారునికి న్యాయ్యమా? ఆంధ్రభాషయొక్కలిపి - అనగా ఆంధ్రలిపి - దేవనాగర లిపిని ఆధారముగాగొని యేర్పడినదన్న వారు విజ్ఞాన సర్వస్వరచయితలు. వారా విషయమును నిరూపించుటకై అప్పకవి తనలక్షణగ్రంథమునందు నిర్దేశించినలిపి సంజ్ఞాబోధకము

గుపద్యమునుబట్టియును చాళుక్యుల శాసనస్థమగు లిపిస్వరూపమునుబట్టి యును అతిప్రయాసతో నిరూపింపగలిగినారు. ఆంధ్రదేశమునందున్న ప్రజాసామాన్యమింతదనుక ఆ క్రమము సరియైనదే అని విశ్వసించుచు న్నారు. స్థితిఇట్లుండగా నాయభిప్రాయమిది. ఇదేన్యాయాభిప్రాయము అని నిరాధారముగా నిశ్చయింపదొరకొనుట ఒక్కనీరికేతగియున్నది. వాదిచెప్పినదంతయును కాదనియేవాదింప నిదిరిన స్థాణుమూర్తికైన ను పెద్దలయెదుట యీవాదమును బలపరచుకొనుటకైనను తనకుగల సాధకబాధకములను వివరింపకతప్పదు. అయినను అట్టివిచారణమాత్ర ము వీరిదికాదట. కాని కాదనుటమాత్రమువీరిదేనా? విమర్శకస్థాన మునమండుటబట్టి వీరితోబాటు మనమును శాఖాచంక్రమణముల నొనర్పవలసివచ్చినదేకాని వేఱుకాదు. ఇంతవరకునుచేసిన చర్చలవల న ఒక్కవిషయముననైనను మనగ్రంథకర్తలకు స్థిరాభిప్రాయములేద నియును ఉపక్రమ్యమని వీరనుకొనువిషయమునకును ఉపక్రమించెడి విషయమునకును తత్సమర్థనమునకై కొనివచ్చు ఇతర గ్రంథకర్తల వాక్యములకును ఎట్టిసంబంధము నుండదనియును స్పష్టమైనది. దీని నింతట నిలిపి వాఙ్మయచరిత్రము వ్రాయుటకువర్పఱచుకొనిన చారి త్రికయుగములను శీర్షికగల వ్యాసముననున్న విషయముల కొంచె ము చవిజూడవలసియున్నది. ఏలయనగా అవియేకృత్యాద్యవస్థయను ఈవ్యాసమునకు ప్రధానలక్ష్యములు. ఈక్రిందనుద్ధృతమైన గ్రంథభా గములు వాఙ్మయచరిత్రమును వ్రాయుటకు గ్రంథకర్తలేర్పరుచు కొన్న విధానమును ఆవిధానము నేర్పఱచుకొనుటకై వారొనర్చిన శ్రమమును దీర్ఘదర్శితయును స్పష్టముచేయుచున్నవి.

“వాఙ్మయచరిత్రము ననేకవిధముల విభాగింపవచ్చును (1) కవిజీవితములం దు వాఙ్మయస్వరూపమునుబట్టి పురాణకవులు ప్రబంధకవులు నని విభాగించియు న్నారు. (2) కవిచరిత్రమునందు కాలానుసారము వరుసగ వ్రాసియున్నారు. ఇవిగాక మఱికొన్ని పద్ధతులున్నవి.

ఈ సువిభాగములు సరిగా వారిదివరకు ఆదరించినవే. అయిన నను గ్రంథకర్తగవాఙ్మయ చరిత్రములువ్రాయుచున్న వారికి ఈవిభాగ ములగానచ్చునట్లు మరికొన్ని పద్ధతులున్నవి, అని చెప్పినవాక్యము సూచించుచున్నది. స్థూలదృష్టికి ఈవిభాగద్వయము వేర్వేరుగా గాన వచ్చినను సూక్ష్మదృష్టికి రెండునొక్కటియే; పురాణకవులు ప్రబంధ కవులు అనివిడదీసినను లేక శతాబ్దులచొప్పున విడదీసినను మొత్తము మైన చరిత్రమునందు కూర్పవలసినచ్చు ప్రధానవిషయములు అనగా పరివర్తనవ్యావర్తనములు, నివర్తనపరివర్తనములు, ఉన్మేషనిమేషములు, మున్నగుసమస్తము కాలానుసారము లేగాని వేరుగాదు. కనుక పరిస్థితి ననుసరించి విచారణసేయబోయినను కాలవినిర్ణయమును తజ్జనితవిని మయము మున్నగునవి ప్రధానములుగాక తప్పదు. అయినను గ్రంథ కర్తకు అనభిప్రేతమగు ఈవిధానమును మనకేల గనుక! మనము ఆ తర్వాతిపద్ధతులనే విచారించెదము. గ్రంథకర్త చెప్పిన ఆమరికొన్ని పద్ధతులలో నిదతొల్లిటిది.

“(1) రాజపరంపరల ననుసరించి యేయేరాజుల పరిపాలనమున నేయేవా ఙ్మయమెట్లభివృద్ధినొందెనో చూపవచ్చును. కాని ఒక్కకాలమునందే ఆంధ్ర దేశము వివిధభాగముల ననేకరాజులు చిన్నప్రభువులు భాషలబోషించియున్నా రు. కొందరుకవులు రాజపోషణములేనివారున్నారు. అరాజకదినములున్నవి. అం దుచేత నొకసూత్రమునకీపద్ధతిలోబడదు.”

తుమ్ముకొనుటయు దీవించుకొనుటయునైనది. కాని ఈప్రశ్న మునుమార్చి యీవిధముగా వైచికొనినచో బాగుగానుండెడిది. ఆంధ్ర వాఙ్మయముయొక్క ప్రాథమికస్థితిని తెల్పగలసాధనములేవి? వాని కాలములో నేయేరాజులపాలన మేయేరీతిగ నెంతెంతవరకు నుప యోగించినది? అని ఇట్లుచర్చించినచో ఉన్నంతలో చోళాదుల శాసనాదిసాధనములవలన గొంతకుగొంత ప్రాథమికస్థితి తేలుటయే

గాక రాజులపరిపాలనక్రమముకూడ ఒకరీతివ్యవస్థకువచ్చియుండెడి దేమో! సరి! అట్లైననేమి? ఈమాత్రమున ఆపద్ధతిలోఁబడదని మనము త్రోసిపుచ్చము. తర్వాతివిధానమిది.

"(2) జైనవీరశైవవైష్ణవ అద్వైతమత వ్యాప్తిననుసరించి వాఙ్మయాభివృద్ధి సూచింపవచ్చును. కాని ఆ దేశమందలి మతవిప్లవచరిత్రమింకను నిర్ణయము కావలసియున్నది. ఏశతాబ్దమునందే మండలమున నేరాజేమతమవలంబించెనో, ఏయేమతము లేయేకాలములయందు వృద్ధిక్షయములనందినవో ... ... ... ... సునిశ్చితమై యుండలేదు. అది ముందు నిర్ణయించినగాని యీపద్ధతినవలంబింప వీలుకనబడలేదు. ... ... ... ... ఇట్లనేకన్యాక్షేపములున్న వీని విచారణకుదిగిన నే నేపనియుఁ జేయలేనివాఁడనగుదునను భయమున నీపద్ధతికూడ విడువవలసినవాఁడనైతిని." (31 పే.)

"సముద్రముగా డిగ్గుదునని వచ్చినకుఁగమున్న పాఱిమినరినోట్లకే నేమనకాల్తుపుచ్చుకొందును" అన్న న్యాయవాది వాక్యములనివి జ్ఞప్తికి తెచ్చుచున్నవి. ఎన్నోతరతరములనుండి పడుచు లేచుచు-పఱుగు వారుచు కూర్చుండుచు - హెచ్చుచు, తగ్గుచు కుంటుపడుచు కొనలు పర్వుచు-వచ్చుచున్న వాఙ్మయమునకుచరిత్రము వ్రాయఁబూనినచో ఎన్ని అన్యోన్యాశ్రయములు కాక-ఎన్ని అగమ్యగోచరములుగాక ఎన్నెన్ని అనవస్థాదోషములు పుట్టక—ఊరక వాఙ్మయచరిత్రము వ్రాయుట పూర్తియగునా? దీని నిట్లుంతము. ఈ క్రిందివాక్యములు మఱొక విధానపువి—

"(3) దేశభాగముల ననుసరించి కాని ప్రస్తుత మండలముల ననుసరించిగాని మఱియొక విధముగ వ్రాయవచ్చును. కానియిదికూడ సులభసాధ్యముగాదు. ఇప్పటి మండలములకును పూర్వపునామములకును సమన్వయింపవలెను. పైగాఁ బోతన జన్మస్థానము తిక్కన జన్మస్థానము నాచనసోముని జన్మస్థానము నిట్టివిషయములింకను విమర్శించుకొని భాషావిశేషములేయే దేశములయందేయే శతాబ్దములయందేయే భాగములనెప్పుడెట్లు వాడుకలో నున్నవో నిర్ణయించుకొనవలయును. ఆపిమ్మటఁ గవులజన్మస్థానములు భాషలబోషించిన రాజాస్థానములు నిర్ణయింపవలెను. ఇదికూడఁ బ్రస్తుతము సులభముగ దేల్పగలిగినదికాదు. ఒకవేళసాహసించి యెవ్వరయిన నిర్ణయించి

నను మండలాభిమానముచే పలు నిగళులు ఖండన గ్రంథములును బయలుదేరి వృథా వాదములు పెరుగకపోవు. అందువలన నిదియు క్షేమకరమైన మార్గముగాదని విడిచితిని. (32 పేజి).

ఇప్పటికి ముచ్చటగా మూడు విధానములు నిర్దిష్టములైనవి. మఱియు గ్రంథకర్తయే స్వయముగా సాధక బాధకములను చర్చించి తేల్చిచెప్పుటచేత భ్రష్టములునైనవి. ఉన్నదానిని చర్చించుటయే ప్రధానముగానుంచుకొన్న మా లేఖినిచే అనిర్దిష్టములు నస్పష్టములని సుదూరమున విస్పష్టములునైనవి. మఱియిక అట్లయినచో అనుసరింపదగు విధానమెయ్యది? కరణీయమెయ్యది? అని జిజ్ఞాస కలుగుచున్నది. కలుగగా గ్రంథకర్తయే దానిని నిర్దేశించుచున్నాడు. చిత్తగింపుడు—

'ఇంక నిష్లేశులమాలనను సరించి ప్రాగ్వాఙ్మాణికవులని తత్త్రియాకవులని విభాగింపవచ్చును. ఇన్నివిధములవారినిగొని చర్చించినగాని మనవాఙ్మయచరిత్రము సంపూర్ణముగా నేరదు. అందఱు తలయొకపనిచేసినగాని - యనేకబుద్ధిమంతులు చర్చించినగాని - సత్యము వెలికిరాదు.''

ఆంధ్రదేశమునందున్న గ్రంథకర్తలందఱు విమర్శకులందఱు తలయొకపనిచేసినచో చర్చించినచో - ఆచర్చలన్నిటిని ప్రత్యేకప్రకరణములక్రింద సుస్పష్టముగ వ్రాసి వీరికందిచ్చినచో - అప్పుడు - నిస్సందిగ్ధముగా - ఆంధ్రవాఙ్మయచరిత్రమును నిరూపించియిచ్చెదరు. ఈ పనిని గ్రంథకర్తలు చేయనిచో వీరును నిస్సందిగ్ధమగు ఆంధ్రవాఙ్మయచరిత్రమును ఈయరు. అంతవఱకుదీనితో నిమగ్నోన్మగ్నత నొందవలసినదే. దీనినట్లుంచి ఈచర్చవలన తేలుచున్నదేమో చూతము. ఆంధ్రవాఙ్మయచరిత్రమును రచించుటకై ఇంతటిప్రాతిపదికము - లేక కృత్యాద్యవస్థను - పొందగా చివరకు వారికికుదిరిన సంకల్పస్థిరత - అథవా కార్యవినిశ్చయము - ఇదియని ఈక్రిందివాక్యములు తెల్పుచున్నవి.

''నాకుతోచినంతలో సులభమార్గము నుపయోగకరము ననుకొనిన కవిజీవితవి భాగమును ననుసరించితిని. * * * * ప్రస్తుత స్థితిగతుల ననుసరించి నాకిదియే క్షేమమార్గముగ దోచినది. అదిగాక పురాణములు ప్రబంధములు ద్విపదకావ్యములు ననియొక్కొక్కవిధమైన వాఙ్మయస్వరూపము ననుసరించి దాని వృద్ధిక్షయముల జర్చించుట యుపయోగకరమని యట్లొనర్చితిని. పూర్వ మాశ్యమికాధునిక కవులను విభాగము కొంతవఱకు మంచిదే కాని యీవిభాగము నకు హద్దులు శాశ్వతమైనవికావు.,,

ఈ విధముగానేదోయొక విధముగ - పాపమెంతయు ల్లోలక ల్లోలావస్థనోబడి కృత్యాదిని ఏర్పరచుకొనినారు. దీనితో రెండుప్రకరణములు ముగిసినవి. వాఙ్మయమననేమి అను ప్రశ్నముతో నారంభమైన తృతీయప్రకరణము ఎట్టివాడుకవి! ఏదికావ్యము! అనుచర్చతో ముగియుచున్నది. మన కృత్యాద్యవస్థా విచారణముకూడ దీనితో బాటుముగియకలదు. కావున అందులకుముందుగా సూక్ష్మరీతిని వా రొనర్చిన వాఙ్మయశబ్ద నిర్వచనమును అందువారుచూపిన గ్రాంథిక విజ్ఞానమును ఆపిమ్మట వారుచేసిన కావ్యస్వరూపమును గొంచెముగ గమనింపకతప్పదు. ఈక్రిందివాక్యములు వాఙ్మయశబ్ద వ్యుత్పత్తిని రూపించుచున్నది.

''వాఙ్మయమనగా వాక్కులతోగూడుకొనునది యనవచ్చును. మయట్ప్రత్యయము వికారార్థమే నందువచ్చునని వ్యాకరణము. వామనశివరామాప్తుడు మయప్రత్యయమున కాంగ్లేయార్థములిట్లు వ్రాసెను. (Made of, full of, Etc) స్వర్ణమయమనగా స్వర్ణవికారమని వైయాకరణులయర్థము. స్వర్ణవికారమన స్వర్ణాలంకారమైనట్లే వాఙ్మయమనగా వాగ్వికారము లేదా వాగలంకారము అనునర్థమున మనవారీ పదముపరంపరగల గ్రంథజాలమునకు పర్యాయపదముగా వాడు చున్నారు.

ఈవాక్యములలోని వాక్కులతో గూడుకొనునది వాఙ్మయము అను వ్యుత్పత్తిశ్రేష్టతను అట్లుంచినను - స్వర్ణవికారమన స్వర్ణా

లంకారమైనట్లే వాఙ్మయమన వాగ్వికారము లేదా వాగలంకారము- అను నర్థము చాలశ్లాఘ్యముగ - మఱల మాటాడిన శ్లాఘ్యతమముగ - నున్నది. బలే! వీరియుత్పత్తిప్రకారము ఆంధ్రవాఙ్మయమనగా ఆంధ్రవాగలంకారము. దానిచరిత్ర ఆంధ్రవాఙ్మయచరిత్ర. ఎంతయుపజ్ఞాన్వితమగు నర్థము!! పిమ్మట ఈక్రిందిమాటలు వీరుద్దేశించిన వాఙ్మయస్వరూపము నింకను స్పష్టముగావించుచున్నవి.

"ఇక వాఙ్మయమనగా నెద్దియని చూచుకొందము. ఒకజాతి తన భాషలో తన కవీశ్వరులవలన నిర్మించుకొనిన కావ్యపరంపరలకే సారస్వతము వాఙ్మయమను మాటలు చెల్లును. కాని నిర్జీవములగు గ్రంథములు వాఙ్మయము కాజాలవు. భావకాని పదజాలముకాని వాఙ్మయము కాదు. కేవలవాగ్వికారములగు వాక్యములుండు లక్షణగ్రంథములు శాస్త్రములుకూడ వాఙ్మయము కాజాలవు. వాఙ్మయము నిర్జీవమగు గ్రంథసముదాయము కాదు. కావ్యజాలమునకే వాఙ్మయ గౌరవము చెల్లును."

ఎంతహృదయవైశాల్యముగల లక్షణనిర్వచనమో [illegible] నిర్ణయింపవలసియున్నది. వీరిమాటల ననుసరించిన [illegible] వాఙ్మయపేటికనుండి శాస్త్రములను లక్షణగ్రంథములను చివరకు వీరి వాఙ్మయచరిత్రమును గూడ తీసి దిబ్బమీదికి గిరవాటు పెట్టవలసినదే కాదా! ఇదియా వాఙ్మయ నిర్వచనము! ఇదియా హృదయ వైశాల్యము?

ఈ విధముగా వీరు వాఙ్మయమనగా కావ్యజాలమే అని యొక అభూతకల్పనము చేసికొనుటబట్టియే కావ్యమనగా నేమి యని ప్రశ్నించుకొని - "ఎట్టివాడు కవి? - ఏది కావ్యము?" — అను శీర్షికతో శాఖాచంక్రమణమును చేయవలసివచ్చినది. ఈసందర్భముననే - అనగా వాఙ్మయమనగా కావ్యజాలము - కవి చేసినది కావ్యము - అని కావ్యస్వరూపమును నిర్దేశింపవలసివచ్చిన సందర్భముననే సంస్కృత లాక్షణి

# అభిసారిక

దువ్వూరి రామిరెడ్డి

గాలియలుగుల, నెవరికోసము
ఓ బాలికా!

కదలి వచ్చితి వీ నిశీథమున?
కాలియందెలు ఘల్లుమనకనో
ఓ వలపురాణీ!

కేలఁ గైకొని మెల్లనడిచెదవు!
పులుగుతుటుము తటాన చనుచు
ఆ జాగూర్కి పాళులఁ

బలుక, వెఱపున దెసలు చూచెదవు;
నిలిచి యేమని యాలకించెదవు;
నీయడుగు సడికే

యులికిపడి 'యెవర' నుచు మఱలెదవు.
తెల్లవెన్నెల నీడ కూర్చుబు
మైపూంతనిగ్గులు

తెలియరావని యూహసల్పెదవు.
నీవు నడిచెడి బాట యెల్లెడల
వ్యాపించు గంధపుఁ

దావులెట్టుల కప్పిపుచ్చెదవు?
ఓ ముగ్ధరాలా!

నీ విహారము బయలు పఱచెదవు!

—౨౧౬

## మాతృభూమి

కొలచలమ కృష్ణసోమయాజులు, ఎం.ఏ., ఎల్.టీ.,

నాజన్మదేశము, నాప్రియసీమ
యనుచుఁ జెప్పితి, నెదనుంచుమమ్మ
ఎచటికేగినగాని, యెద్దిశఁగాని
ఎన్నఁడుగాని, యెప్పుడైనఁగాని
ఇది దేశమిది కాల, మిఁక నాదటంచు
ఇసుమంతయేని, యీప్సితముండదనిక
తపనంబుతోడఁ బెనఁగు చిత్తముతోడ నిన్ను
కాంక్షలుదీరఁ గన్నులఁ గొల్తునమ్మ,
పొడచిన దానిగాఁ బొందుచు శ్రమల
పడమట కొండదాఁ బరుగు భానుఁడు
మెఱసెడులోయ మొత్తములంట వోడి
కరము వెన్నాడు, కన్నులఁ గాంచనోపు,
కాని నాజన్మమెత్తిన గట్టు నరయు
నార్ద్రరాగాంశువుల నలసతఁ గరఁగు

## ఒకే పద్యము

దేవులపల్లి కృష్ణశాస్త్రి, బి.ఏ.,

పక్షినని పాడఁగలనని ప్రణయవీధి
నిత్యలీలావిహారముల్ నెఱపుదు నని
రెక్కములఁ దూల్చి బంధించి పంజరాన
గానమును బ్రాణము హరింపఁ బూనినారు!

# పౌర్ణమాసి

కొత్తపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రులు.

మింటఁ దారా శశాంకులు మేలసంగఁ
గరఁగి పోసిన బంగారు కాంతు లీనఁ
గనుల కింపితమై చల్లదనము దోప
రంగు మీఱంగ జ్యోత్స్న తరంగలించె.

చంద్రకిరణ ప్రసారిత చ్ఛవుల వితులు
మేలు బంగారు గజ్జెల మెలఁ గనుల
ప డు వొసరించె నుద్యాన వనమునందు
దివ్యసౌరభముల నెల్లదిశలఁ జల్లి

శ్రీ శుభావహ హార్ద్యాగసీమఁ జెలఁగి
చెలియ లెందఱో యటఁ జేరి కొలుచుచుండ
జీవరత్నముఁ దనరాముఁ జేరఁ దీరి
యున్నతానందలీల ముద్దాడుఁ దల్లి.

బాలుఁ డేలనొ యూఱకే డిగ్గంగఁ దొడఁగెఁ
దల్లి ముద్దాడఁ బోవ ముద్దొల్లఁ డతఁడు
రెండుచేతులఁ జాచి యాపండు దెచ్చి
పెట్టు మని అచ్చుసేయు నాపిల్లవాఁడు.

పండు పండని ముద్దుగఁ బల్కుచుండె
బొమ్మ నిమ్మని పసి నేలఁ బొరలి యేడ్చెఁ
జిటుకు చిటుకని తల్లిఁ గొట్టుటకు మరలె
పాప! మెఱుఁగదు కౌసల్య బాలుకోర్కె.

లాలి లాలీ యటంచు లాలనము సేసె
బాల యేడ్వకు మని చనుఁబాలు గుడిపె
ముద్దు బిడ్డఁడు దనకన్ను మూదుల విడఁడు
గాని చందమామను జూపి కనలుచుండె.

"చాలదూరము మనకును జందురునకును
చందురుఁ గోరకు, చారు భూషణము లిత్తు.
చందమామను మించు వజ్రాలఁ దెత్తు
నాడుకోవయ్య వీనితో నందముగను!"

ఒల్లఁడా భూషణావళి యెల్ల నేదియు
ధారధారగఁ జెక్కిళ్ళఁ గాఱె నీరు.
హా! మా బాలు గ్రహమొండు పట్టె ననిరి
చెలులు మంత్రించిరే గాని ఫలము లేదు.

అంతఁ గౌసల్య యత్యంత చింతఁ జిక్కి-
విన్నవించె మహారాజుఁ బిలువనంపి
జనపతి ప్రయత్నములు నిష్ఫలము లయ్యె
మంత్రి ధీమంతుఁ డొక యుక్తి పన్నెఁ దుదను

"రామ నీ కేమి కావలెరా! వచింపు
తెచ్చి యిచ్చెద నిపుడె నీయిచ్చకొలఁది."
"పండు దెచ్చిమ్ము పో చందమామఁ దెమ్ము
ఆడుకొంటాను కావలె నదియె నాకు!"
"తెచ్చి యిచ్చెద నాకేమి యిచ్చెదయ్య?"
యనుచు నా బాలు ముద్దాడఁ జనగ, నతఁడు

"ఈను, ముద్దీను, పండు దెచ్చివ్వకున్న"
ననుచు గునగున తా దూరమునకుఁ జనిరెరు
కాలియందెలు మ్రోయ గల్‌గల్లు మనుచు.

నిగ్గుటద్దంబు దెప్పించి నేర్పుమీఱ
"అందుఁ జూడుము చూడు నీచందమామ"
యని యమాత్యుండు వల్క నాతని మనస్సు
పరమసంతోషభరితమై పరఁగ నంత
నంకమునఁ జేర్చ కొమరు ముద్దాడె రాజు.

# సృష్టిక్రమము

నోరి నరసింహ శాస్త్రి, బి, ఏ.,

అగ్గణ్ణసుత్తములో సృష్టిక్రమకథ, ఈవిధంగా ఉన్నది.

* * * * *

చాలా కాలానికి ఈ లోకము లయమొందే సమయము వస్తుంది.

జీర్ణ కర్మ ప్రారంభించి వృద్ధిపొందుతుండగానే లోకము లోని జీవతరంగము ఆగిపోతుంది. అంతట జీవకోటులు తేజోమయులైన దేవతల నివాసస్థాన మగు ఆభస్సర బ్రహ్మలోకంలో పునర్జన్మ ఎత్తుతారు.

అక్కడ జన్మించేవాళ్లకు స్థూలశరీరా లుండవు. వాళ్లు అలఘు

భోజనం భుజించరు. వా ళ్లానందమయులు. వాళ్లకు వేరే వెల్తురుతో నవసరం లేదు. వాళ్ల దివ్యశరీరాలే మహనీయమైన తేజస్సు వెద జల్లుతూ ప్రకాశమానంగా నుంటవి. ఆకాశంలో వాళ్లు సంచారము చేస్తుంటారు. మహాసంతోషంతో వాళ్లు అక్కడ అతిదీర్ఘ కాలు ఏలుతారు.

అతిదీర్ఘ కాలానికి ఈలోకము తిరిగీ పరిణామము పొందే సమయము వస్తుంది. నెమ్మదిగా పరమాణుసంయోగము ప్రారంభించగా సృష్టిక్రియ మారంభిస్తుంది.

ఈలోకము జీవులకు నివాసయోగ్యమైన స్థితికి వచ్చినప్పుడు ఆ భాస్వరలోకవాసు లక్కడ నుండడం మాని ఇక్కడ జన్మిస్తారు.

ఈవిధంగా అవతరించిన వాళ్ల జన్మ ఆత్మేచ్ఛాపరిణామమే. వాళ్లు ఆనందమయజీవులు. వాళ్ల దివ్యశరీరాలు చూడ సుందరములై పరిపుష్టి కలిగి కాంతిమంతములై ఉంటవి.

ఇట్టి సుఖావస్థలో వాళ్లతిదీర్ఘ కాలము గడుపుతారు.

భూమి ఇంకా జలరూపంగానే ఉంటుంది. దానిలో అప్పుదార్ధమే ప్రధానంగా ఉండేది. అప్పు డంతటా నీరంధ్రమైన అంధకారము తప్ప ఏమీ ఉండదు.

సూర్యుడూ చంద్రుడూ వాళ్లకు కనపడరు. నక్షత్రమండల మంటే ఏమో ఆదివ్యదేహులెరగరు. నక్షత్రాలు కనపడవు.

అప్పుడు రాత్రిగాని పగలుగాని ఉండదు. కాలమే ఉండదు. వాళ్లకు పగలేమిటో రాత్రి ఏమిటో, ఋతువులేమో సంవత్సరా లే

మో ఏమాత్రమూ తెలియదు.

ఆ దివ్య సుందరరూపులు ఆనందమయులై ముగ్ధులుగా ఉండేవారు.

స్త్రీపురుషభేదము వాళ్ళెరగరు. స్త్రీపురుషజ్ఞానానికి వాళ్ళమనస్సులలో స్థానములేదు. ఇతడు పురుషుడూ ఇది స్త్రీ అని వారు తెలుసుకోలేరు. ఈజ్ఞానమింకా వారికి కలగలేదు.

సత్త్వము అనే సామాన్యనామముతో ఈ దివ్యరూపధారులు వ్యవహరింపబడుతుంటారు.

* * * * *

నెమ్మది నెమ్మదిగా భూమిని ఆచ్ఛాదించిన జలరూప మదృశ్యమై ఆస్థానంలో బంగారువర్ణముగల పాలమీగడవంటిఉపరిభాగ మేర్పడ్డది.

అంతట పాలమీగడవంటి ఈ భూతలముతనుంచి మధురమైన ఒక దివ్యగంధము ఆవిర్భవించ నారంభించింది.

ఆ మీగడ భాగము దివ్యుల అమృతమువంటి రుచి కలది. అది మధుపములు లేని మధుకోశమువలె మధురమైనది.

ఈ మధుగంధ మాఘ్రాణించి తమ దివ్యకాంతులతో ఆకాశము వెలిగిస్తూ సంచరిస్తూ ఉండగా వాళ్ళ మనస్సుల్లో ఈ మీగడ తేనెవంటి పదార్థ మేమో తెలుసుకొనవలె ననే ఒకానొక విచిత్రమైన వాంఛ పొడమింది.

తమ మనసు తీర్చుకోడానికి వాళ్లు కొద్దిగా మీగడవంటి ఆ మృత్తికను వేళ్లతో తీసికొని తమ నాలుకలమీద పెట్టుకున్నారు.

వెంటనే జిహ్వా ఆ తియ్యటిరుచి తెలుసుకున్నది. అంతట వాంఛ వాళ్ల మనస్సుల్లో అంకురించింది.

ఇట్లా తియ్యటి మృత్తిక రుచిచూడడంతో మానవులకి తుచ్ఛ వాంఛ అంకురించింది.

తియ్యటి మృత్తిక తినడ మారంభించిన పిమ్మట వాళ్ల దేహాల దివ్యకాంతు లదృశ్య మైనవి.

వాళ్ల దేహకాంతు లదృశ్యము కాగానే వాళ్ల చుట్టూ అంధకారము ఆవరించింది. వాళ్ల కంతట భయము పుట్టింది. వాళ్లందరూ కలిసి "వెల్తురు కల్గును గాక!" అని ఘోషించినారు. వెంటనే వాళ్లకు సూర్యకాంతి కనపడ్డది.

మళ్లీ, సూర్యకాంతి కనపడకపోగానే వాళ్లకు భయం వేసింది "వెల్తురు కల్గును గాక!" అని వాళ్లు మళ్లీ ఘోషించినారు. వెంటనే వాళ్లకు చంద్రకాంతి కనపడ్డది. ఈ రెండు కాంతులూ వాళ్ల కేకకాల మందే కనపడ్డవి.

అంతట వాళ్లు నక్షత్రములనూ నక్షత్రరాసులనూ చూడగలిగినారు. పిమ్మట వాళ్లకు పగలేమో రాత్రియేమో తెలియవచ్చింది. ఋతువుల క్రమమూ సంవత్సరమానమూ వాళ్లకు తెలియవచ్చింది.

ఇట్లా చాలాకాలము ఆ తియ్యని మీగడవంటి మృత్తికను మానవులు తింటున్నారు. ఇంతలో లోకమభివృద్ధి పొందుతూనే ఉన్నది.

కొందరు మానవుల చక్కని శరీరవర్ణము పోసాగింది. అంతట వర్ణభేదము పుట్టింది.

వాళ్లల్లో తమ దేహకాంతి చెడిపోనివాళ్లు వర్ణభ్రష్టులైన వాళ్లను చూచి అసహ్యించుకో సాగినారు. అంతట మానవునిలో గర్వము పుట్టింది.

గర్వము మానవునిలో పొడచూపగానే భూమియందలి తియ్యని గంధము మాయమైంది.

భూమిలోని తియ్యదనము పోయిందని తెలియగానే వాళ్లందరూ ఒకచోట కూడి "అయ్యో! మనకా మాధుర్యము పోయింది! మన కా మాధుర్యము పోయింది!" అంటూ తమ దుఃఖము వెళ్లబోయ సాగినారు.

ఈ విధంగా మానవుడు తన కిక తినడానికి తియ్యటి వస్తువింక లేకుండా పోయిందని తెలుసుకున్నాడు. కాని ఇంతలో వాళ్లకుభూమిలో నుంచి నాచువంటి పదార్థమొకటి పుట్టడం కనిపించింది,

ఆ నాచుపదార్థము పుట్టగానే భూతలము మీది ద్రవస్వరూపము పూర్తిగా మారిపోయింది.

భూతలము పొడినేల ఐనది. మానవుడు చాలాకాలమువరకూ భూమిలోనుంచి పుట్టుతున్న ఈనాచు పదార్థము తినసాగినాడు.

అంతట మళ్లీ రెండవసారి వర్ణభ్రష్టత కన్పించినది. వాళ్లముఖాల లోని చక్కదనము నాశనమైంది.

తమవర్ణము చెడిపోనివాళ్లు వర్ణము చెడిపోయినవాళ్లను చూచి అసహ్యించుకో సాగినారు.

ఇట్లా అంత కంతకు మానవునిలో గర్వము వృద్ధిపొందగా తనంతట తానే పుట్టుతున్న ఆ తినదగిన నాచు పదార్థము అంతరించింది.

ఆ నాచు పదార్థము బదులు ఆ పొడినేలమీద ఒక విధమైన వరి ధాన్యము పుట్టింది. వాళ్లంతట ఈ సుగంధముగల ధాన్యము తిన సాగినారు.

వాంఛా, గర్వమూ, మెట్టవరిధాన్యము తినడమూ వృద్ధిఐన కొద్దీ స్త్రీత్వము యొక్కయూ పుంస్త్వము యొక్కయూ సూచనలు కన్పించినవి.

ఉభయులకునూ ఒకవిధమైన వాంఛ పుట్టింది. వాళ్లంతట ఒకళ్ల నొకరు అపూర్వరీతిగా చూచుకో సాగినారు. పురుషుని వంక స్త్రీ చూడసాగింది. స్త్రీ వంక పురుషుడు చూడసాగినాడు.

ఇట్లా ఒకళ్ల నొకరు చూచుకోవడంవల్ల స్త్రీ పురుషుల హృదయాలలో కామ మేర్పడ్డది.

ఈ కామము అభివృద్ధికాగా వాళ్లకు సంయోగవాంఛ కలిగింది. ఆ వాంఛ సఫలమైంది.

ఈ సంయోగము వాళ్లు ఏకాంతముగా నిర్వర్తింపక పోవడమువల్ల, అది ఇతరులు చూచినప్పుడు వాళ్లమీద బురదమన్నూ బూడిదా గోమయమూ విసిరివేసి "మానవులై పుట్టినవాళ్లు మానవులైన వాళ్లతో అటువంటి కార్య మెట్లా చేస్తారో నబ్బా!" అనేవాళ్లు.

కాని కాలము గతించిన కొద్దీ ఆకార్యములోని అధర్మమేమో వాళ్లు మరిచిపోయినారు. ఆకార్యము చేయడానికంతట వాళ్లు ఇళ్ళు కట్టుకోసాగినారు.

కొంతమందికి బద్ధకము కల్గసాగింది. "నేను రెండుపూటలా ధాన్యము తీసుకరావడమెందుకు? అదినాకు వృధా శ్రమే" అనే బుద్ధిపుట్టి ఒకడు రోజెల్లావచ్చే ధాన్యము తెచ్చుకోసాగినాడు.

ధాన్యము నిలవ ఉన్నవాడి దగ్గరకు ఇంకొకడువచ్చి "అన్నా, ధాన్యం తెచ్చుకోడానికి పోదామా?" అన్నాడు "నాకుకావలసినది ఉన్నది. నేను వెళ్లనక్కరలేదు" అన్నాడు ధాన్యము నిలవఉన్నవాడు.

అంతట ఆ రెండవవాడు "నేను మాత్రము ఇతనివలే ఎందుకు చేయకూడదు!" అని వాడు కూడా రోజుకు కావలసింది నిలవచేసినాడు ఈ విధంగా మానవుడికి నిల్వ చేయడంలో ఉన్నలాభము తెలియ వచ్చింది. ఇట్లా నిల్వ చేయడంతో బియ్యపురుచి మరికాస్త తగ్గిపోయింది.

అంతట మానవులు "మనము ధర్మమునుండి తొలగిపోయినాము" అంటూ సభలుచేయ సాగినారు. మనదివ్యస్థితిలోనుండి పతితులమైనామని వాళ్ళు పల్క సాగినారు. మన మిక అశ్రద్ధగా నుండరాదు; మనము పోధముచేయవలెను అని వాళ్లనుకో మొదలుపెట్టినారు.

అంతట వాళ్ళు "ఇది నా భాగము, ఇది నాభాగము" అన సాగినారు.

అందులో ఒకడు తన భాగము దాచుకొని ఇంకొకడి భాగము అతనికి తెలియకుండా తెచ్చుకున్నాడు.

వాణ్ణి మిగిలినవాళ్ళు పట్టుకొని, "నీవుచేసినపని మంచిదికాదు" అని అటువంటి పని మళ్లీ చేయరాదని బోధచేసినారు.

వాడొప్పుకొనిపోయి మళ్లీ అపనే చేసినాడు.

అంతట అతనికి కొంతమంది బోధించినారు. మరికొంత మంది అతన్ని పిడికిళ్లతో గుద్దినారు.

మానవులు దొంగిలించడ మెక్కువయిన కొద్దీ ఆ నేరస్థులను వాళ్ళు శిక్షించ మొదలుపెట్టినారు.

పాపిష్టి తనమూ దుష్కృత్యములూ ఎక్కువకాగా వాళ్ళు మళ్లీ సభచేసి ఇట్లా అనుకున్నారు.

"మనకు న్యాయాధిపతిగా ఉండి తప్పు చేసినప్పుడు శిక్షించి అవసరమైనప్పుడు కోపించడానికి ఒకణ్ణి మనమంతా కలిసి ఏర్పాటు చేసుకుందాము!"

వాళ్ళు బలశాలియై చూడ సుందరుడైన ఒకడి వద్దకు వెళ్లి "ఓ ఉత్తమపురుషుడా, నీవు మాకు సన్మార్గము చూపుము నీకు మా ధాన్యములో భాగమియ్యగలము" అన్నారు. అందు కతడు ఒప్పుకున్నాడు.

మానవు లిట్లా కూడి బహిరంగసభలో అతన్ని ఎన్నుకొని అతనికి "విరాట్పురుషుడు" అని పేరు పెట్టినారు.

---

## 'అలలిత సృష్టియెట్టిదో'



అలలిత సృష్టియెట్టిదో పాలకడలి
యందుఁ గెరటాలు లేవఁట, యందు నెంత
వంకొనిగిన హృదయంబు వరకెగాని
పాలుపొంగవటేమెంత బాలునకుచు.

అలలిత సృష్టియెట్టిదో పాలకడలి
యందు జలజంతువులె లేవఁటైనఁగాని
పాలుతిండిగఁ బెరిగెడి ప్రాణులైన
నెదుగునో యేమిచిత్రమో యెవ్వఁడెఱుఁగు.

అలలిత సృష్టియెట్టిదో అందుమీఁద
పాపసెల్లా వరచి నిద్ర పట్టకున్నఁ
బట్టినట్లు నటించఁ బల్వరచునట వె
ప్రిధిత హోగ్యాంతరంగేశుఁ బద్మనాభు



# నేతి గిన్నె

గాడేపల్లి అనంత రామమూర్తి

నాలుగుగడియలు ప్రొద్దెక్కినది. భర్త బయలుదేరి బజారునకు బోయిన వెంటనే వీరమ్మ వీధితలుపు గడియవైచి లోనికిబోయి వంటకు వలయు ప్రయత్నములొనరించుకొనుచుండెను. అంతలో వీధితలుపు వద్ద నెవరో పిలుచుచున్నట్లు వినబడుటవలన నామె యెవరు వారనియడుగుచువచ్చి తలుపు తెఱచెను. అపుడొక సేవకుడు "అమ్మా! పంతులుగారు కూరలు పంపించినారు. కచేరికి పెందలకడ బోవలయునట వంటవేగముగ జేయుమన్నా" రని చెప్పెను. వీరమ్మ పంతులుగారేమి చేయుచున్నారని యడుగగ నేయిబేరమాడుచున్నారమ్మా! తప్పేలా యడిగితెమ్మన్నారు. నెయ్యి కర్పూరమువలెనున్నది. చౌకగనే గిట్టునట యనిచెప్పుచు మూడుపుంజీల వంకాయలక్కడబోసెను, వీరమ్మ యావంకాయలెత్తి పడమటింటబోసి యొకగిన్నె తెచ్చియిచ్చి నెయ్యి చౌకగనున్నయెడల దీనినిండ దెమ్మనుము. వంట యొక యరగంటలో నైపోవునని చెప్పుము. అని వానిని బంపి వీధితలుపు మరల గడియవైచి తొందరగ వంటచేయ నారంభించెను. అంతలో వీధితలుపు తట్టుచున్నట్లు వినబడగ నామెవచ్చి తలుపు తెఱచెను. అపుడు సుబ్బారావు పంతులు లోనికివచ్చి పంచెకొంగు మూటవిప్పి కూరలు వెలిపెను.

వీర — మరల వంకాయలే తెచ్చినారేమి! నెయ్యేదీ!!

సుబ్బా - నేతికేమిత్తొందర? యెల్లుండి యాదివారము సంతలో కొనెదను. ఇపుడు చేతిలోడబ్బులేదు.

వీర -- మీచేతిలోడబ్బున్న దెపుడు కర్పూరమువంటి నెయ్యి చౌకగవచ్చినపుడు కొనుటమానుకొని యెపుడోకొందుమనందు కేమి? మీ చంచలచిత్తమెరుగుదువు. గిన్నె తెమ్మనునప్పటికున్న బుద్ధి తెచ్చుసరికి మారిపోయినది. ఏమైననన్న డబ్బులేదని పెద్దకారణ మొకటిగల్పింతురు. ఇందుకే మన సంసారమిట్లు దిగతీతలోనున్నది,

సుబ్బా - నిసాదింపుమాటలు నాకర్థమగుటలేదు. గిన్నె తెమ్మనుట యేమి? కర్పూరమువంటి నెయ్యి చౌకగవచ్చుట యేమి?

వీర -- సరే! గడియకిత్రితము మీరు వంకాయలు పంపిన మనిషిచేత నేతిగిన్నె యిమ్మని కబురంపలేదా! నెయ్యిబాగున్నదని చౌకగానున్నదని వాడునాకు చెప్పలేదనుకొంటిరా!

సుబ్బా - ఆ! గిన్నెయిచ్చితివా యేమి?

వీర - అట్లు తెల్లబోయెదరేల? మొన్నమీరుకొన్న మూడర్థసేర్ల గిన్నె యిచ్చితిని, వాడు మీకగపడలేదా?

సుబ్బా - కొంపదీసినావు! వాడెవడో దొంగ. నేనెవ్వరిచేత కబురు బంపలేదు.

వీర -- హాస్యమాడుచున్నారు! వాడుదొంగయైన వంకాయలుగూడ తెచ్చియిచ్చునా?

సుబ్బా - ఏడిచినావు! హాస్యమేమిటి. వాడెవడో గజదొంగ. నిన్నిట్లు మోసబుచ్చుటకే వాడు మూడుకాసులవంకాయలుగూడ తె

చ్చియిచ్చి యైదురూపాయిల క్రొత్తగిన్నె పట్టుకొని పాఱిపో యినాడు. వాడుపోయియెంత సేపైనది? వాడెట్లుండును? యే వైపు బోయినాడు?

వీర -- ఒకగడియసేపైనది. మీరు కచేరికి పెండలకడబోవలయు నని యు వంటవేగముగ జేయవలయుననియు మీరుచెప్పమన్నా రనికూడ వాడుచెప్పినాడు. కావున నేనాతొందరలో వానిని సరిగగుర్తించనైనలేదు. కాని—నెత్తిమీదనుండి పంచ యొ కటి కప్పుకొనియున్నాడు. పాతికేండ్లుండునేమో; మొగము సరిగ గనబడలేదు. కంఠస్వరము కీచుగనుండును. మీకచేరి బంట్రోతెవడో గాబోలు ననుకొంటిని. నేను వెంటనే తలు పు వైచికొనుటవలన వాడేవైపు బోయినదియుగూడ జూడ లేదు.

సుబా - సరే! నీవింటివద్ద భద్రముగనుండుము. నేనీచుట్టుప్రక్కల జూచివచ్చెదను.

అని చావడిలోని చిలుకకొయ్యకున్న లాంగ్ కోటులోని ఫౌన్ టెన్ కలమును, కాగితమును, దీసి జేబులోనుంచుకొ ని సుబ్బారావు పంతులు పరుగుపరుగున వీధిలోనికిబోయెను దుక్కవంటి క్రొత్తగిన్నె చేతులార బోగొట్టుకొంటినని వి చారింపుచు వీరమ్మవీధితలుపు భద్రముగ గడియవైచి భర్త తెచ్చిన వంకాయలు పడమటింటబోసి వంట ముగించు చుం డెను. అంతవీధితలుపు తట్టుచున్నట్లు వినబడుటచే నామె వచ్చి తలుపుదీసెను. అపుడిరువదేండ్ల యీడుగల నల్లని కు ఱ్ఱవాడొకడు గుమ్మముపైనిలుపబడి "అమ్మా! సుబ్బారావు పంతులుగారిల్లిదేనా?,, యనియడిగెను.

వీర -- అవును. నీవెవరి కుఱ్ఱవాడవు? ఎందుకువచ్చితివి?

కుఱ్ఱ -- నేను కచేరిలో నౌకరీకి తిరుగుచున్నానమ్మా! సుబ్బారావు పంతులుగారు బజారులో గనపడి—యిప్పుడెవడో యిక్కడకు వంకాయలు తెచ్చియిచ్చి గిన్నె పట్టుకొని పోయినాడట, ఆవంకాయలలోని దొకటియు, పంతులుగారు తెచ్చిన వంకాయలలోని దొకటియు, మిమ్మడిగి తెమ్మన్నారు. దొంగదొరకినాడు. పోలీసుస్టేషన్‌కు తీసుకొనిపోవుచున్నారు. ఈవంకాయలు పోలీసువారికి చూపవలయునట

వీర -- గిన్నె వానివద్దనున్నదా?

కుఱ్ఱ - ఉన్నది. బరంపురము గిన్నెవలెనున్నది బరువుగానున్నది. మూడర్ధసేర్లు పట్టవచ్చును.

వీర -- ఆ! ఆగిన్నె!—నీపేరేమి?

కుఱ్ఱ - అప్పలస్వామి

వీర -- ఓరీ! నీవుమాయిల్లెఱుగని క్రొత్తవాడవుగదా! పంతులు గారు నిన్నేలబంపిరి?

కుఱ్ఱ - అమ్మా! రెండువంకాయలకొఱకు దొంగనై వచ్చితినను కొనుచుంటిరా యేమి! మీకునమ్మకమున్న నీయుడు. లేకున్న బోయెదను; ఈ యెండలో పంతులుగారే వెనుకకువచ్చి వంకాయలుతీసికొని మరల స్టేషన్‌కు బోయెదరు. వారు సెలవిచ్చుటచేత చేతులు కట్టుకొనివచ్చితిని గాని లేకున్న నాకీ బాధయేల!

అనియాతడు వెడలిపోబోవగ నుండు ముందు మనుచు వీరమ్మ లోనికిబోయి పడమటియింటిలోని వంకాయ యొకటియు వంటయింటిలోని వంకాయయొకటియు దీసి అప్పలస్వామికిచ్చినమిత్తము వీధిగుమ్మముపద్దకు వచ్చునరికతడు

లేదు. వానిపై నిష్కారణముగ ననుమానించినందుకు గోపమువచ్చి వెడలిపోయెనని విచారించి తలుపు భద్రముగ గడియనైచికొని గృహకృత్యములు నిర్వర్తించుకొనుచుండెను. మఱికొందుగడియలకు సుబ్బారావుపంతులు తలుపు గొట్టగా వీరమ్మవచ్చి తలుపుదీసెను. ముచ్చెమటలతోనతడు లోనికివచ్చి చావడిలోని చాపమీద గూరుచుండి చొక్కా విప్పుకొనుచుండెను.

వీర -- గిన్నె యేదీ?

సుబ్బా - నీచేతులార ధారాదత్తముచేసిన గిన్నె మరల దొఱకునా! వాడెవడో, యెట్లుండునో, యేవైపు బోయెనో, యేమియు దెలియదు. ఎన్నివీధులు తిరిగినను నాగిన్నెతో నెవ్వరు గానరాలేదు. తుదకు ప్రాణమువిసిగి పోలీసువారికి రిపోర్టిచ్చి వచ్చితిని. ఈ చొక్కా చిలుక కొయ్యను దగుల్చుము.

వీర -- (పుచ్చుకొని) ఎమిచిత్రమైనమాటలు! మీరు దొంగను పట్టుకొని పోలీసువారికి వప్పచెప్పుచున్నట్లు మీకచేరీలో నాఖరీకి తిరుగుచున్న యప్పలస్వామి చెప్పలేదనుకొన్నారా! గిన్నె యేల తేలేదో చెప్పుడు.

సుబ్బా - అదేమిటి! మాకచేరీలో అప్పలస్వామియెవడూ లేడే!

వీర -- మీరిందాకా వంకాయల నిమిత్తము బంపలేదా! అవి పోలీసువారికి జూపవలయునని కబురంపలేదా?

సుబ్బా - ఆ! యిట్లుచెప్పుచు మరల నెవడైన దొంగవచ్చెనా యేమి? యీమారేమైన నిచ్చితివా?

వీర లేదు. వీడును దొంగయేనా? నేననుమానించి తఱచి యడుగగ కోపగించివాడు వెడలిపోయినాడు.

సుబ్బా - చిత్రమైన దొంగతనములు బయలుదేరినవే! ఇంతటినుండి

నాచీటిలేకుండ నెవ్వరికినేమియు నీయవలను. తెలిసినదా!

వీర — సరే!

సుబ్బా - వీడెవడో లోనికిరాలేదుగద:—ఆ చొక్కా జేబులో ఫౌన్ టెన్ కలమున్నది. జాగ్రత్తగదీసి కోటు జేబులో పెట్టుము-ఆచిలుక కొయ్యనుండు లాంగ్ కోటు, పట్టుపాగా, యేది? ఇంట్లో బెట్టినావా?

వీర — అయ్యో! ఔను. యేవీ? నేనుతీయలేదు.

సుబ్బా - ఆ! కొంపముంచినావు. ఆకోటు జేబులో కచేరీ ట్రెజరీ తాళములు కూడా వున్నవి. నిన్న దొరవద్దకు వెళ్ళినపుడు నా సర్టిఫికెట్లకట్టకూడా క్రిందిజేబులో పెట్టుకున్నాను. అన్నట్లు వాచీ!— పాతికరూపాయల వాచీగూడ దానిలోనున్నది. ఆవాచీయును ఆపట్టుపాగాయును నిన్నకచేరిలో దొరతో సందర్భము ఫోటోతీయించుకొనుటకు వెళ్ళినపుడు వెంకటరావునాయుడు వద్దనుండి యెరువుగూడ దెచ్చికొంటిని. ఇపుడేమిదారి!

వీర — అక్కడికని నే ననుక్షణము దలుపు గడియవైచియే యుంచుచుందునుగాని తీసి యేమరుపాటుగానుండను.

సుబ్బా - అయితే యెట్లుపోయినవి? ఇపుడు నేను వీధిలోనికి బనుగెత్తు నప్పటికున్నవి. నేను వీధిలోనికి బోయినపిదప నేమేమి జరిగినదో సరిగా జ్ఞాపకము చేసికొని చెప్పుము.

జరిగిన వృత్తాంతమంతయు వీరమ్మ వివరముగ జెప్పగావిని సుబ్బారావు పంతులిట్లు బలికెను. సరే; నీవు వంకాయలు తెచ్చుటకు లోనికిబోయినపుడు వీధితలుపు తెఱచియే యున్నదిగనుక వాడా సమయమున వీటిని సంగ్రహించి పారిపోయినాడు. వానియెత్తును నదియేమైయుండును. ఏమైననేమి! నాకొంపమునిగినది. ఆతాళము చెవు

లు పోయినయెడల నాయుద్యోగమునకు భంగము వచ్చును. వెంకట రావునాయుడుకు దండుగగూడ నిచ్చుకొనవలెను. సొమ్మెట్లుదెత్తు నెమిసేయుదు నని సుబ్బారావుపంతులు విచారముతో నిట్టూర్పువిడ చెను. అపుడు వీరమ్మ విలపించుచు "ఇంతకును నాలోపమే కారణము నామెడలోని యీపదమూడు పిల్లకాసులు తెగనమ్మి యెవరిసొమ్ము వారికిచ్చివేయుడు. మీరిట్లు బెంగ పెట్టుకొన,, వలదని పతినూరా ర్చెను. "నీవేమి చేతువు: మనదురదృష్టమిట్లున్న" దనుచు లేచి సుబ్బా రావుపంతులు పోలీసుస్టేషన్‌కు బోయి యావద్వృత్తాంతము రిపో ర్టువ్రాసి యిచ్చెను. అజాగ్రత్తగ నున్నందుకు వారు సుబ్బారావు పం తులును కొంతతడవు మందలించి మొదటి రిపోర్టును, రెండవ రిపో ర్టును, నొకేనేరమునకు చెందినట్లా? వేఱు వేఱు నేరములకు చెంది నట్లా? యనివారిలోవారు కొంతతడవు చర్చించుకొని తుదకు లేచి వ చ్చి నేరముజరిగినస్థలము పరీక్షించి చోరి యాస్థివివరములన్నియు వ్రాసికొని మీకెవరిమీద ననుమానమున్నదని యడిగిరి. మాకెవని మీద ననుమానములేదుగాని మొదటిదొంగయు రెండవ దొంగయు నొక్కడో లేక యొకేజట్టులోనివారలో యైయుందురని తోచుచున్న దని సుబ్బారావు పంతులు పలికెను. పోలీసువారీయభిప్రాయముతో నేకీభవింపలేదు. పిదపవారు నేతిగిన్నె దొంగ తెచ్చిన వంకాయలు పట్టించుకొని స్టేషన్‌కు వెడలిపోయిరి. మఱికొన్ని దినములకు సు బ్బారావు పంతులు వీరమ్మకాసులు విక్రయించి వాచీయును పట్టు పాగాయును కొని వెంకటరావుకిచ్చివేసెను. ట్రెజరితాళములు పోగొ ట్టినందుకతడు తొలుత సస్పెండుకాబడి రెండు మాసములైన పిదప దిగువ యుద్యోగములోనికి మార్చివేయబడెను. చోరీజరిగిన యారు మాసములైనపిదప చోరీయాస్తిగాని నేరస్థుడుగాని కానరాలేదని వ్రాయబడిన పత్రిక మాత్రమొకటి పోలీసువారు సుబ్బారావు పంతులుకు దయచేసిరి.

———

## ఆంధ్రభాషాపోషకులకు విజ్ఞప్తి

రాజమహేంద్రవరమునగల గవర్నమెంటుకళాశాలలో సంస్కృతోపాధ్యాయులుగ పనిచేసి ౹అయిదుసంవత్సరములక్రింద కీర్తిశేషులైన మాతండ్రిగారగు ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు వారి జీవితాంత్యవత్సరములలో, సంస్కృత భారతమును నిర్వచనముగ నాంధ్రీకరించిరి. ఆదిపర్వాది మొదటి నాలుగైదుపర్వములు, యుద్ధపంచకము, స్వర్గారోహణాదిపర్వములను మొత్తముమీద సుమారు 12 పర్వములను పూర్తిచేసిరి. ఈయాంధ్రీకరణకాలమందే కవిత్రయమువారి యాంధ్రీకరణములోని స్వల్పలోపములను దిఙ్మాత్రముగ చూపుచు "భారతఫక్కి" అను పేరుగల గ్రంథమువ్రాసి, పిఠాపురమున కొంతకాలముక్రిందట ప్రచురింపఁబడుచుండెడి "కవిత" యను మాసపత్రికలో ప్రకటించిరి. వీరు తమ భారతమునకు "ఆంధ్రవ్యాస భారత నవనీతము" అనియు, అందలి పర్వభాగములకు "భార"లనియు పేరిడిరి. కవిత్రయమువారిచే నాంధ్రీకరింపఁబడక విడువఁబడిన సంస్కృతములోని కథాఘట్టములను వీరువిపులముగ నాంధ్రీకరించిరి. కవిత్రయమువారాంధ్రీకరించిన భాగములలో విపులముగ నున్నవానిని వీరు సంగ్రహముగ నేవ్రాసిరి. వీరి భారతములో నేభాగముల నైనగాని లేక అంతయు ప్రత్యేకముగగాని, ముద్రింపించి ప్రకటింపఁబూను కొను లక్ష్మీపుత్రులను, భాషాభిమానులను ప్రార్థించుచున్నాము. ఈగ్రంథమును అచ్చువేయింపఁదలచు యౌదార్యహృదయులు, యీగ్రంథమును గూర్చి ఈ క్రింది వారికి వ్రాసి అన్నిసంగతులు తెలిసికొనఁగోరుచున్నాము.

అడ్రెసు:—ఆకుండి వ్యాసేశ్వరుఁడు
"శ్రీశాంతవ్యాసనికేతనము"
ఆర్యాపురం, రాజమండ్రి.

ఇట్లు విన్నవించు విధేయులు,
ఆకుండి వ్యాసేశ్వరుఁడు
ఆ. వేంకటశాస్త్రి

# ఆంధ్ర జ్యోతిషాలయము.



(1) జాతక చక్రముయొక్క నకలుగాని (2) పుట్టినతేది, జననకాలఘంటలు లేక గడియలుగాని (3) మాకు ఉత్తరము వ్రాయుసమయము ప్రస్తుతవయస్సుగాని, మాకు పంపించినయెడల, జాతకునియొక్క రూపము, స్వభావము. శరీర దారుఢ్యము, ధనసంపాదన, సోదర సోదరీవృద్ధి, మాతృసౌఖ్యము, భూలాభము భూవ్యయము, వాహనసౌఖ్యము, వివరముగా పుత్రపుత్రికా సంతానవృద్ధి, శత్రు వృద్ధిరోగము, ఋణము, కళత్రము, కళత్రముయొక్క ఆయుర్దాయము, జాతకునియొక్క ఆయుర్దాయము పితృసౌఖ్యము, భాగ్యము, ఉద్యోగము, జీవనము, లాభము వ్యయము మొదలగు సంగతులును వ్రాసి రు. 1-0-0 కి పంపెదము. యిదినచ్చినయెడల మహాదశాంతర్దశలు గల పూరా జాతకము ఆయుర్దాయము ఆఖరువరకు ప్రతి సం॥రఫలములతోను వ్రాయబడును. పూరాజాతకమునకు రు. 5-0-0 లు అగును. ముందురెండురూపాయిలు అడ్వాన్సుపంపవలెను మిగిలిన రు. 3-0-0 లకు విపిగాపంపబడును.

జన్మనక్షత్రముయొక్కటి మాకుపంపినయెడల ముందుజరుగబోవు 1 సం॥ర ఫలము నెలలవారీగా వ్రాసి రు. 1-0-0 కు విపిగాపంపెదము.

# మహాభృగు సంహిత.

ఇదియొకగొప్పనాడీ గ్రంథము యిదిపూర్వకాలమున మహర్షులచే వ్రాయబడినది మనభరతఖండమందు జన్మించిన ప్రతిమానవుని యొక్క జాతకము జననములగాయతు ఆయుర్దాయము ఆఖరువరకు జరుగు ఫలితములన్నియు శ్లోకపూర్వకముగా వ్రాయబడియున్నవి లక్షలకొలది జాతకచక్రములున్ను ఆయాచక్రముల ననుసరించి ప్రతిమనుజునియొక్క జాతక ఫలితములున్ను వ్రాయబడియున్నవి. జన్మ సం॥రం తారీఖు జననకాల ఘడియలు జాతక చక్రము మాకు పంపినయెడల వారి చక్రము వెదకి వారిచక్రము ననుసరించి వ్రాయబడిన ఫలములు వ్రాసి వి పి గా పంపెదము. జాతక చక్రము వెదకుటకు రు 1-0-0 ఫలిత శ్లోకములు వ్రాయుటకు రు 1-0-0 శ్లోకములకు తెలుగు అర్థమువ్రాయుటకు రు 1-0-0 మొత్తం మూడు రూపాయలు అగును శ్లోకములకు అర్థము అక్కరలేని వారికి రెండు రూపాయిలు మాత్రమగును. పోష్టుఖర్చులు వేరు.

ఆకెళ్ల వేంకటశాస్త్రి, దైవజ్ఞుడు,

గోపాలపురం, కొత్తపేటపోస్టు,

గోదావరి జిల్లా.

# బాల్యము

చింతా దీక్షితులు బి.ఏ., ఎల్. టీ.,

నిష్కళంకమై పూజ్యమై నిరుపమాన
సౌఖ్యముల కాలవాలమై సంస్కృతిఁ గల
కష్టములు గోచరింపక క్రాలుచుండు
బాల్యమే జీవయాత్రకుఁ బట్టుగొమ్మ.

ఆశపై నాశ లెన్నియో యౌవనప్రభ
నాశ పీడక జీవితయాత్ర సలుపు
నెండమావులఁ గనిపాఱు మృగముకీతిఁ
ప్రాణి యీలోకమున స్వప్నఫలముగాంచు

"బాలకా! జీవయాత్రలో ఫలము గలదె?"
"అడుగకుము నన్ను, నే నాట లాడవలయు"
"బాలకా, సుఖ మెచ్చోటఁ జాల గలదు?"
"అడుగకుము నన్ను, నే నాట లాడవలయు"

"కష్టముల్ పొందుచుంటి, నీకష్టచయము
వాసి గ్రైకెక్కు టెట్టులు బాయకుండ?"—
కష్టములో సౌఖ్యములో నాకుఁ గానరావు,
అడుగకుము నన్ను, నేనాటలాడవలయు."

బాల్య మరుగుట, యౌవన ప్రాయ మబ్బు
సరణి గోచరములు గావు — సంజకెంపు
మాసి చీఁకటైవచ్చెడి జాడదిరిగను
తెలి, తెలియనియట్టులు చెలఁగుచుండు

శ్రీరస్తు

# ప్రేమ—కాంతిమ్మ

(కుందేటి వెంకటేశ్వరరావు)

"ప్రేమంటే ఏమిటో తెలిసేదికాదు నాకు మొదట-దానికోసం ఎన్ని చోట్లో వెతికాను-చుట్టాలిండ్లు వెతికాను బంధువులిళ్లు వెతికాను-స్నేహితులిళ్ళు వెతికాను-అన్ని చోట్లా తిరిగాను-ఎక్కడా కనపడలేదు నాకు-దాని రూపకమూ తెలియదు-పేరా అంతకన్న తెలియదు-అని సుబ్బారావు అరుగుమీద కూర్చుని మాటామాటా వచ్చి గౌరీపతితో అంటుండగా, "పేరుకూడా తెలియదుటోయి-ఇప్పుడేగా అన్నావు "ప్రేమ" అని ఎంతవగలమారిగా మాట్లాడుతావు అన్నాడు గౌరీపతి సుబ్బారావుతో.

"ఆ - మరిచిపోయినా-పొరపాటున మాటామాటా చెప్పడంలో మరచిపోయి అన్నాను" అని అంటుండగా "మళ్లీ మరచిపోయినానంటున్నావే?" అని గౌరీపతి సుబ్బారావును ప్రశ్నించాడు "అబ్బ! యిదేమరి ఏమిచెప్పినా తప్పుపట్టిస్తావే మాటమాటికి అట్లాఅయితే నేను వెళ్లిపోతా" అని సుబ్బారావు అంటుండగా గౌరీపతి "ఇకఅనను లే చెప్పుమరి" అన్నాడు.

"అయితే విను-దాని రంగా అంతకన్న తెలియదు-ఎత్తా అసలే తెలియదు-నేనెప్పుడు చూడలేదు" "నీ వెప్పుడూ చూడకపోతే ప్రేమని పేరెట్లా తెలిసింది నీకు?" అని అడిగినాడు గౌరీపతి సుబ్బారావుని.

"ఎట్లా తెలిసిందంటే చెప్తావిను-ఇదివరకోసారి ఆడుకొంటూ-ఆడుకొంటూ-కాంతిమ్మ వదినగారింటికి వెళ్లాను. ఇంట్లో ఎవ్వరూ లేరు-ఆవిడ ఒక్కతే ఉంది లోపల తలదువ్వుకొని, కాటుక-బొట్టు-పెట్టుకొని-తెల్లని చీరగట్టుకొని పూలజాకెట్టు తొడుక్కొని అద్దముదగ్గర నిల్చి మాటిమాటికి తనచక్కదనాన్ని చూచుకుంటూ-నవ్వుకుంటున్నది,"

"అంతందంగా ఉంటుందేమిటి! చిన్నప్పుడెప్పుడో చూశానుగాని మళ్లీ చూడనేలేదు" అని గౌరీపతి అంటుండగా, సుబ్బారావు, "అవును చక్కని చుక్కలాగుంటుంది – ఆజాకెట్టుచూస్తే – ఆకాశానచుక్కలు జ్ఞాపకమొచ్చాయి– ఇదంతా గుమ్మముదగ్గర నిల్చొని తొంగిచూస్తున్నా – ఇంతలో ఎవరైనా వస్తున్నారేమోనని వెనక్కి తిరిగిచూశాను. అప్పుడే పొద్దుకూకుతూ ఉన్నది. సూర్యుడాకాశంలోనే ఉన్నాడు. వెళ్లిపోలేదు. అదేం గమ్మత్తోకాని – ఇంటిముందరెవ్వరూలేరు – పూలచెట్లుతప్పితే; అప్పుడొక అమ్మాయి గభాలున బైటకొచ్చి నాకళ్లుమూసింది. అప్పుడు నాగుండె గుభేలుమంది. చేతులతో తడిమిచూస్తే గాజులుతగిలాయి చేతికి– అప్పుడు – ఓహో! కాంతమ్మ వదిన కాబోలనుకొని, 'కాంతమ్మవదినా! ఎందుకు కళ్లుమూశావు' అని అడిగాను.

"నేను కాంతమ్మ వదినను గాను" అన్నది ఆ అమ్మాయి అప్పుడు! ఇదేమిటా అనుకున్నాను – ఎందుకంటే – కాంతమ్మ కాకపోతే – ఇంకా ఎవరూ లేరుగా అక్కడ! కంఠంకూడా కాంతమ్మ కంఠం వలె లేదు. కొంచం మారినట్టు కనుపిస్తుంది." అని చెప్పుచుండగా, "అప్పుడేమిచేశావు నీవు" అని గౌరీపతి అడిగాడు.

"అప్పుడా – నేనా – ఏం చేశాననుకున్నావు — చెపుతా విను మరి – నాకు వళ్లంతా చెమటబట్టింది – ఏమీతోచడంలేదు – చేతులతో తడిమి ఏమైనా సరేనని నీవు కాంతమ్మ వదినవే అన్నాను. అప్పుడామె "కాను" అన్నది. మరి "ఎవరు నీవు?" అంటే, "కనుక్కో" అన్నది. ఎవరవు చెప్పమని చేతులుపట్టుకున్నా, అదేమిటోగాని ఆ చేతులుపట్టుకుంటే నాకు – ఏమిటోగా ఉంది. చెప్పడానికి చేతకాదు. అది సంతోషమో – దుఃఖమో – చెప్పలేను – విషయానందమో – బ్రహ్మానందమో – ఏమిటో – ఇంతలో, "నేను కాంతను" అన్నది. ఇంతేగదా చేతులు తియ్యి అన్నాను. ఆమె తీసింది. అంత ఇద్దరము కలిసి పూలచెట్ల దగ్గరికి వచ్చాము. అప్పుడే సూర్యుడస్తమిస్తూ ఉన్నాడు – రంగుమారింది – అకస్మాత్తుగా – ఏమిటో – పచ్చని రంగులాగా – బంగారంవలె అయిపోయింది. కాంతమ్మ నాదగ్గరే ఉంది. ఒక్కసారి ఆమె ముఖంవంక చూశా – బొట్టూ – కాటుకా – తప్పితే – ఏమీ కనబడలేదు – కాంతమ్మ కాంతి సూర్యకాంతి ఒకటేగదా అనుకొన్నాను. అప్పుడు తెలిసింది నాకు రంగు మాదిరి రంగు ఉంటుందిగదా అని."

సుబ్బారావు ఈలాగున వర్ణించడం చూస్తే గౌరీపతి మధ్య మధ్య ఎందుకో

గాని "అట్లాగా! అట్లాగా! అంత అందంగా వుంటుందా! ఎన్నేళ్లుంటాయి ఆమెకు" అని ఒళ్ళు తెలియని సంతోషంతో అడిగాడు.

అప్పుడు సుబ్బారావు, "పదకొండేళ్ళుంటాయి. ఇంకా మా మామయ్య యింటికి రాలేదు - అప్పుడు కాంతమ్మ "నావంక చూస్తావేం - దిష్టికొడుతున్నావా" అని బుగ్గమీద చెయ్యివేసింది. ఆముద్దుతో తెలిసిపోయింది ప్రేమంటే ఏమిటో-" అని చెప్పబోతూ వుండగా, గౌరీపతి, "బుగ్గగిల్లిందా?" అని ప్రశ్నించాడు. "గిల్లలేదు - ముద్దుపెట్టుకుంది - అప్పుడు ముద్దు లేనిజన్మ వట్టిజన్మ అని తెలిసిపోయింది - ఒళ్లు గలవరపడిపోయింది. ఆహా! హా! ఏమని చెప్పతాను - నిజంగా కాంతమ్మ అంటే కాంతమ్మ అదేగాని ఇంకొకరు లేరు. ఆ అందం - ఆ చక్కదనం - ఆ నేర్పు - ఆ చమత్కారం - దానిదగ్గరేగాని ఇంకొకరిదగ్గర చూడబోము. అప్పుడు నాతో, "బావా" అన్నది కాంతమ్మ.

ఇంతలో పొద్దుకూకింది - నాలుగువైపుల చీకటిపడ్డది. ఎవ్వరూ - లేరెక్కడ - మేమిద్దరము తప్ప - ఎటుచూసినా నిశ్శబ్దంగావుంది. నేనేమీ మాట్లాడలేదు. కాని కాంతమ్మమాత్రం ఒక పువ్వుతీసి, నాచేతిలోపెట్టి, నాచెయ్యి ముద్దెట్టుకుంది - అంతట నేనేమి చేస్తున్నానో కూడా నాకు తెలియదు. నేను నేనేనా అనుకున్నాను. చీకటి కాదూ-మరి - ఏమీ కనబడడం లేదు - గాఢనిద్ర పోయేటప్పుడు ఎట్లా ఉంటుందో - అట్లావుంది - అంతా మరచిపోయినా, కండ్లు మూతలు పడినవి. అట్లాంటి సమయంలో - ఆ అందానికి - ఆ సంతోషానికి - ఆ అతిశయానికి - ఆ తమాషాకి - ఆ గమ్మత్తుకి మితమే లేదు.—అంతే లేదు.

ఇంతలో చీకటిపడ్డది. ఆకాశాన నక్షత్రాలు తప్ప ఏమీ కనబడడం లేదు - నాలుగువైపుల చల్లగాలి వచ్చింది - ఒకవైపు పూలవాసన - ఇంకోవైపు ప్రేమవాసన - ఒకవైపు నీలాకాశము - ఇంకోవైపు నక్షత్రకాంతులు - ఒకవైపు నిర్మలాకాశము - ఇంకోవైపు నిర్మలహృదయం - ఒకవైపు శీతలవాయువు - వేరోవైపు హృదయవేదన - ఒకప్రక్క శీతలవాయువిహారము - మరోవైపు బాలబాలికా విహారము - ఒకవైపు బాహ్యాకర్షణము - ఇంకోవైపు హృదయాకర్షణము - ఒకవైపు వాయుతరంగములు - ఇంకోవైపు భావతరంగములు. ఒకవైపు యుక్తవయస్సు - ప్రేమచూపులు మృదుశరీరము - కోమలహస్తం - అంగరంగ వైభవము - ఇంకొకవైపు చల్లగాలి - పూలవాసన - నేను" అని అంటూవుండగా "నీమాటలు

నాకేమి అర్థం కావటంలేదు - ఇదేమివర్ణన - చెప్పిందే చెపుతున్నావు - అర్థం కాని ది - ఎట్లావర్ణించాలో కూడా తెలియదే - నేనే చూసివుంటేనా ఎట్లావర్ణించే వాడినో. నక్షత్రమండలంలో చంద్రబింబంలాగావుంది దానిమెడ అని చెప్పక పోయినానూ—'' అని అన్నాడు గౌరీపతి.

''సరేలే - ఎట్లాగో ఒకఅట్లా నాకుతోచినట్లు చెపుతానువిను - సరి. ఇట్లాంటిసమయంలో గాలి ఎక్కువయింది. కాంతమ్మ అంతకిత్రితమే పెట్టివచ్చిన దీప మారిపోయింది - కాంతమ్మ ఇల్లంతా నల్లుపైపోయింది - అదంతా గొందుకు చీకటి లో నేనుకూడా నల్లుపై పోయినా - ఇంతలో వాకిటితలుపు చప్పుడయింది - మా మామయ్య వస్తున్నాడు గామ నసుకొని కాంతి ఇంట్లోకి పారిపోయింది. వెంటనే నేను దొడ్డితోవను ఇంటికి వచ్చేశా. అప్పటినుంచి అదేమి ప్రేమో గాని - నాకు తెలియకుండా - నాకంటికి కనబడకుండా - నాతో చెప్పకుండా నన్నుమావేధిస్తున్నది - అన్నముతిననీయదు ఆనాడా ప్రేమ ఎంతఇష్టం గలదైందో ఈనాడంతశత్రువైపోయింది. అందుకనే గామన ''తనమిత్రులె శత్రులు'' అని అంటారు పెద్దలు -ఎంతమహిమా -గారడీవాడికిమల్లే ఆడిస్తున్నదే! ఇంద్రియాలకు చలనంకలిగితే ఇంతేకాబోలు కర్మం-ఈప్రేమను తెలిసికొని జయించడానికి అనేక తిప్పలు పడుతున్నా - స్వాధీనం అయ్యేయోగం కనపడలేదు, అదేపాకర్మమోగాని అప్పటికి ఇప్పటికి నాకుకనబడకుండా వేధిస్తూనేయున్నది. కాస్తదానిజాడతెలిస్తేనా! దానిపసపట్టను. దాని నిజగుణం ప్రపంచంలో చాటైనా- అగరే! ఏమి తమాషా, ఎంతఆకర్షణ— '' అని చెపుతుండగా, ''ఇప్పుడు నీదగ్గర—'' అనిపిదో గౌరీపతి అడుగబోవుచుండగా, మోహనరావు, సుబ్బారావుని కేకవేసి వీధికేసి వస్తూండటం చూసి వీరిద్దరుకూడా అటుకైపరుగెత్తారు.



# చెలికాండ్రు

కె. హెచ్. వి. యస్. నారాయణ, బి.ఏ., ఎల్.టి.,

అమ్మా! చూడవె, ఆడుకొనుటకు
పిలచు చున్నవి, వెళ్లివచ్చెద.

1 ఆకులల్లల లాడుచున్నవి
చేతసైగల జేయుచున్నవి ॥ అమ్మ ॥

2 పిల్లగాలులు మెల్లమెల్లన
తాకిపోవును త్వరగరమ్మని ॥ అమ్మ ॥

3 ఆకసంబున ఆతురతతో
మెలగుచున్నది మేఘమల్లదె ॥ అమ్మ ॥

4 చెట్టుమీదనె పిట్టలున్నవి
రమ్మురమ్మని రవము సేయుచు ॥ అమ్మ ॥

5 నాదు రాకకు నమ్మకముతో
ఎదురుచూచుచు ఇనుడు మింటను ॥ అమ్మ ॥

6 చెఱువులోపలి చిన్న కెరటము
కదలుచున్నది ముదముచూపుచు ॥ అమ్మ ॥

7 ఘుమ్ముఘుమ్మను కమ్మతావుల
పొల్పుజూపుచు పువ్వులెంతయు ॥ అమ్మ ॥

8 ఇంతమందియు ఎంతసేపూ
వేచియుండిరో ప్రేమతోడుత! ॥ అమ్మ ॥

9 వీనిజేరక నేనుమాత్రము
ఇంటనుండుట ఏలఅమ్మరో ॥ అమ్మ ॥

# చెంచు దంపతులు

చింతా దీక్షితులు బి.ఏ., ఎల్. టి.,

నల్లమల కొండలలో సంతతము ప్రవహించు సెలయేటికి సమీపమున నున్న చెంచుగూడెములో లింగడు కాపురముచేయుచున్నాడు.

లింగడింతదనుక తల్లిదండ్రులవద్దనే నివసించువాడు. పెండ్లి చేసుకొని కొన్ని నెలలేయైనది. తానును భార్యయు వేరుగా నిల్లొకటి యేర్పాటుచేసుకొని కాపురము చేస్తున్నారు.

భగవంతుడు పెంచిన దట్టమగు చెట్లులక్రింద నిర్మింపబడినది వీరి గూడెము. ఒక చెట్టుక్రింద వలయాకారముగ వెదురు బద్దలతో చిన్న గుడిసెలు సొంతముగా కట్టుకొని అందే దంపతులు కాలక్షేపము చేసుకొనుచున్నారు. వర్షాకాలమందే ఆయింట పడుకొనుట తమవస్తువు లుంచుకొనుటకును, వంట చేసుకొనుటకుమాత్రమే ఆయిల్లు సాధారణముగా పనికివచ్చుచున్నది.

లింగనిభార్యపేరు ఈరమ్మ. వీరిప్రేమగాథ నాగరకుల ప్రేమగాథలవంటిదే. వారిహృదయానుభవములే వీరివిని. చిన్నతనమున చెట్లనల్లుకొన్న తీగల నుయ్యాలలుగా చేసుకొని వారూగుచుండువారు. ప్రాతఃకాలములందిరువురు కలిసి కొండల దిరుగాడుచు, పక్షుల వేటాడుచు వేటాడినజంతువుల నారగించుచు సాయంకాలమున కింటికి దిరిగివచ్చువారు. ఇరువురు నొక్కబడిలోనే చదువుకున్నారు కూడ. చదువులయ్యా బడికిపోయినప్పుడల్లా యిచ్చేపప్పులను వారిరువురు నొక చెట్టుక్రిందకూచుని తినేవారు. బడికి పోవువారికి దొరతనమువా రిచ్చుబట్టలను వారు కట్టుకొని బడికి పోవుట మాని

తిండికై వేటాడబోవువారు. బడి విడుచునప్పటికి వారి కలవడిన విద్య అక్షరముల గుర్తించడమే. ఈ అక్షరములను పేరి గీతల నయ్యవారేలనేర్పుచున్నాడో వారికిబోధపడలేదు. హిందూదేశములో పలు జాతులకువలెనే వీరికి పరిష్కృతము కావలసినది విద్యకాదు — తిండి! విజ్ఞానము కాదు — కట్టుబట్ట.

ఈరమ్మకు యౌవనము పొడచూపినది. లింగనికి హృదయము పరిభ్రమించినది.

ఒకనా డిరువురు కలిసి తేనెపెగలు ద్రాగుటకు కొండయంచులకు బోయినారు. లింగడు కొండ యెక్కినాడు. ఏటవాలుగానున్న కొండక్రింద ఈరమ్మ నిలబడి చూచుచున్నది. లింగడు ఒకబండ చివరకు వచ్చి బండక్రిందితట్టు లోభాగమున నున్న తెట్టెను వెదురుకర్రతో పొడిచినాడు. ఈగలు ఝుమ్మని ఒక్కచూరు లేచినవి. తెట్టె క్రిందపడలేదు. లింగడు ఈగలబాధకు తాళలేక క్రిందకు వచ్చినాడు. ఈరమ్మ మొగము చిట్లించుకున్నది.

కడచినదినము తినినయాహారమేగాని వారికాప్రొద్దు తిండి లేదు. ఉభయులకును ఆకలి బాగుగా వేయుచున్నది. తేనె త్రాగి మైనము తినవచ్చు ననుకున్నారు. గాని సాధ్యపడలేదు. లింగడిమనస్సు చివుక్కుమన్నది. ఈరమ్మ కొండక్రింద పొగబెట్టడానికి ప్రయత్నము చేయుచున్నది. అట్టిపని అడవికి ప్రమాదమని ఆమెకు తెలియదు. లింగడికి తెలుసును. ఒకమాను "కరిగాడు" అలుగు విడిచినాడు. అది అడవిలో ఎక్కడనో పడిపోయి కానవచ్చినది కాదు. నాడా అడవిని కాల్చివేసే అలుగును సంపాదించినాడు. దొరతనమువా రందు కాతనిని శిక్షించినారు.

పొగ పెట్టవద్దని ఈరమ్మతో లింగడు చెప్పి ఎరల కొండ నెక్కినాడు. ఈరమ్మకూడ ఆతని వెంట బోయినది. ఇద్దరును బండచివరకు వెళ్లినారు. లింగడు బండమీద సాగిలబడి ముందుకు జరుగుచు పోయినాడు. ఈరమ్మ ఆతనిచేతి నొకదానిని గట్టిగా పట్టుకున్నది. లింగడు బండచివరకు పోయి దేహమును వంచి రెండవ చేతితో తేనెతట్టును బట్టి ఊడబెరికినాడు. ఈరమ్మ లింగడిని వెనుకకు లాగినది. ఇద్దరును ఒకరి నొకరు చూచుకొని నవ్వుకొన్నారు. తేనె తట్టు దొరకినది. కాని ఇద్దరదేహములు ఈగకాటులవల్ల గాయము లైనవి. ఆకుపసరు ఒంటికి పూసుకొని తేనె తట్టు పట్టుకొని వారొక మడుగు దగ్గరకు పోయినారు. ఒకచెట్టుక్రింద కూర్చున్నారు. చీకటి పడినది. చంద్రుడుదయించినాడు. పొడలు పొడలుగా వెన్నెల అడవి యంతట పడినది. తాండ్రపువ్వులు అడవిని సువాసనలతో నింపుచున్నవి. పక్షులు చెట్లమీద కిల కిల లాడుచు గోలచేయుచున్నవి. ఇద్దరును ఆ చెట్టుక్రింద ఆ తేనెపెరను తినుచున్నారు. ఈరమ్మ ముక్కలు చేయుచు ఒక్కొక్కముక్కను లింగనినోటి కందిచ్చుచున్నది. లింగడు ఈరమ్మ దేహమును నొప్పిపోవుటకై నిమురుచున్నాడు. తినికడుపు నిండ నీరుదాగినారు. ప్రపంచ మిప్పుడు వారికి సుఖమయమయి తోచినది. లింగడు ఈరమ్మ గాయములకు చల్లనినీరు రాయుచున్నాడు. ఈరమ్మ లింగనిదేహము చల్లని నీళ్లతో కడిగినది.

ఆ చెట్టుక్రింద ఆమడుగుగట్టున ఆ వెన్నెలపిలికలమధ్య ఆ యువవురు ఒండొరుల కౌగిలి జిక్కి ఒక్కముద్దు పెట్టుకున్నారు. అడవిలో సువాసన అధికమైనది. విహగరుతముల మనోహరత్వ మతిశయించినది. చంద్రిక మిక్కిలి ప్రకాశవంతమైనది.

౨

ప్రతిదినమును అడవులలో దిరిగి దొరకిన చిన్న జంతువులను తేనెతట్టులను, చెంచుగడ్డలను దినుచుండువారు. కొత్త దినములలో ముచ్చట యిది. ఆ దినములలో ఒక్కొక్కప్పుడు తిండి దొరకక పోయినప్పటికిని వారు లెక్క చేయువారు కారు. క్రమక్రమముగా నితర చెంచులకువలెనే వారును కష్టపడి కూలి సంపాదించుకొనవలసి వచ్చినది. లింగడు వెదురు కొట్టుట, బద్దలక్రింద వాసిసి చీల్చుట యిట్టిపనులను చేయుచు దినమున కారణాలవంతున సంపాదించుచు న్నాడు. ఈపని వీరికి దొరతనమువా రేర్పాటుచేసి తమయుద్యోగ స్థులచే రోజుకూలి యిప్పింతురు.

ఈరమ్మ అడవులలో తిరిగితిరిగి, దొరికినంత, తెగలిగినంత చింత పండు, కుంకుడుకాయలు, షీకాయ, చారపప్పు మున్నగువస్తువులు దెచ్చి దొరతనము వారిందుకై యేర్పాటుచేసిన యుద్యోగస్థులకు తూనికప్రకార మమ్మి కొన్నియణాలు సంపాదించుకొనుచున్నది.

ఈగడించిన ధనమును వారు పట్టణములకు దీసికొనిపోయి బియ్య ము ఉప్పు మున్నగు వంటవస్తువులు బట్టలు, విల్లులకమ్ములు, కొనుట యందు వినియోగింతురు.

దొరతనమువా రీవర్తకమునకు దొరకొనుటకు ముందు చెంచు లీవస్తువులను పట్టణములందలి కోమట్ల కమ్ముచుండెడివారు. కోమట్లు మిక్కిలి చౌకగాకొని ధనవంతు లగుచుండెడివారు. ఇప్పుడు దొరత నమువారు చెంచుల బాగుపరుప నుద్దేశముతో ఆవ్యాపారమును తామే జరిగించుచున్నారు. ఆనాటిచెంచులస్థితికిని ఈనాటిస్థితికిని

భేదములేదు. ఎప్పుడును వారు తిండికిని బట్టకును లేక కష్టపడుచుం డవలసినదే.

పుష్కలముగ తిండిపెట్టగల అడవులకు పిల్లలై జంతువులు, చెంచువాండ్రు నితరఅడవిమనుష్యులు జనించినారు. జంతువులకు కడుపునిండ తిండిగలదు. ఆ అడవికడుపున బుట్టిన మానవులకు తిండి లేదు. వారికల్లిదా, యీపక్షపాతము? తోడిమానవుల దౌర్జన్యమా యిది?

దంపతులిద్దరును వసంతకాలమున మామిడిచెట్ల నాశ్రయించి ఆ చెట్లిచ్చు కాయలతోను పండ్లతోను పొట్ట నింపుకొనువారు.

చెంచువాండ్లకు ఆవులు బఱ్ఱెగొఱ్ఱెలు విశేషముగా నుండును. అవియే వారియాస్తి.

లింగడికి భార్యకూ కలిసి పది ఆవులున్నవి. అవికూడ వీరికి క్షున్నివారణము చేయుచుండును.

ఒక్క సంవత్సర మీరీతిగా వారు జరపినారు.

ఒకనాడు లింగడు వెదురుకొట్టుటకు పోయి సాయంత్రి మగుసరికి తిరిగివచ్చినాడు. అప్పటి కింకను ఈరమ్మ యిల్లు చేరుకోలేదు. ఈరమ్మ వచ్చి వంటచేసి భర్తకింత పెట్టి తానింత తినవలెను. లింగనికి ఆకలి వేయుచున్నది. ఆమె యింకను రాలేదు.

వాడు మరల బయలుదేరి ఈరమ్మ సాధారణముగా వచ్చుబాట నుబట్టి మెల్లగా పోవమొదలుపెట్టినాడు. ఒక్కచోట ఆమె కని పించినది. ఆమె ఒక చెట్టుక్రింద భూమికి కొంచెమెత్తులో అడ్డముగా

వ్యాపించిన ఒకచెట్టుకొమ్మమీద కూర్చున్నది. తానానాడు సంగ్రహించిన వస్తువులమూట నొక్కచో పెట్టినది. ఆమెవక్షము నాచ్ఛాదింపవలసిన పైటకొంగు జారి కొమ్మపై పడియున్నది. ఆమె కెదురుగా ఒకచెంచువాడు కూర్చుండి ఏమియో చేయుచున్నాడు. ఆమె ఆతనివైపు చూచుచున్నది. అతడుండుండి ఆమె కేదియో అందిచ్చుచున్నాడు.

లింగనికి ఒళ్లు మండినది. విల్లును తీసినాడు. చెట్టుచాటుననుండి ఆచెంచువానిని బాణముతో కొట్టబోయి మానినాడు. తలవాల్చి యింటివైపు బట్టినాడు. ఇట్లు చేయుట చెంచులలో అస్వాభావికమే. కాని లింగనికి అనుమానముమాత్రము తట్టినది. అనుమానము నిజము కాకపోతే అతనికి కొంతనాగరకము కద్దు.

భార్యపై భర్తకును, భర్తపై భార్యకును కొన్ని సందర్భములలో అనుమానము పుట్టుట నిజమైనప్రేమకు చిహ్నమని కొందరందురు.

లింగడు తనభార్యపై దృఢమైనప్రేమ వహించినాడన్నమాట వాస్తవము కాని ఆతనిమనస్సులో అనుమానము పుట్టినమాట కూడ వాస్తవమే. ఆనాటినుండియు ఆతనిముఖమున నుదహాసము కనుపట్టలేదు.

ఈరమ్మ రాత్రి యింటికి వచ్చి వంటచేసినది. లింగ డామెతో మాటాడలేదు. ఆమెచేయుపనులలో తడబాటు కలుగుట నిజమా? ఆతని యనుమానమా? ఇంతయుంబలి త్రాగి గుడిసెకు బయట ఆతడు బట్ట వేసుకు పండుకున్నాడు. గుడిసెవాకిలి కెదురుగా ఆమె పండుకొని నిదురపోయినది. లింగనికి నిదురపట్టలేదు. ఆనాడువలెనే

చంద్రుడు ప్రకాశవంతముగ వెలుగుచున్నాడు. సువాసనలు కొట్టు చున్నవి. పక్షులు పాడుచున్నవి.

లోకము దుఃఖమయము మనుకొన్నాడు లింగడు.

## 3

మనస్సునకు తగిలినగాయము-లను కాలము త్వరలో మాన్పు చున్నది. లింగనిమనస్సు కొంతవరకు నిర్మలమైనది కాని పూర్వ సరణి రాలేదు. అప్పుడు పనులు లేనికాలము. ఎవరికి వారు తిండికై తడవులాడుచుండిరి. ప్రాతఃకాలమున నీచెంచుదంపతులు బయలు దేరినారు. ఉరిత్రాళ్లను గ్రహించినాడు లింగడు. వెదురుబుట్ట చేత ధరించినది ఈరమ్మ. కాలిబాట ననుసరించి వారిద్దరు చల్లగా మాట లాడుకొనుచు కొంతదూరము పోయినారు. అచ్చట వెదురు పొదలు దట్టముగా పెరిగినవి. అడుగుపెట్టుటకు వీలులేని ఆపొదలలో కీచుమను శబ్దములు. అల్లంతదూరమున ఆకసమున పక్షులాడుచు భూమికి దిగుచు పైకి లేచుచున్నవి. కడచినరాత్రి జీవము (పెద్దపులి) ఒక జంతువు నారగించినచోటని యని వారిద్దరు నను కొన్నారు. వెదురు పొదలు వ్యాపించి కొండనంతయు గప్పినవి.

ఆవెదురుపొదలలో బడి దారి చేసుకొనుచు వారుపోయి నారు. ఒక్కచో పొదలు దట్టముగా నున్నతావున లింగడు ఉరులొ డ్డినాడు. ఈరమ్మ వెన్నువేసినవెదురును ఇంకొకవెదురుతో వంచి కత్తితో దానిని నరికినది. ఇద్దరును ఆవెదురువెన్నును సంగ్రహించి ఒకపొదమాటున నీడలో కూర్చుని వెదురుబియ్యమును తినమొదలు పెట్టినారు. సూర్యుడు క్రమక్రమముగా వేడియెక్కుచున్నాడు. మనో

వ్యధకు కారణమైన యూహాలను వెళ్లబుచ్చిన యెడల ఆమనోవ్యధ కొంత తీరును,

లింగడు ఈరమ్మకేసి తీక్ష్ణముగా జూచుచు ఆమెయిచ్చు బియ్యముకు గ్రహించక 'బయిగాని" గూర్చి సంభాషణము మొదలుపెట్టినాడు బయిగాడు. ఆనాడుసాయంకాలము ఈరమ్మకడ గూర్చున్న చెంచువాడే. ఈరమ్మకు క్షణక్షణము తొట్రుబాటు అతిశయించినది. ఆతనిప్రశ్నల కుత్తరము చెప్పలేకపోయినది. తనకౌగిలిలో నాతని జేర్చి సముదాయించినది. లింగడు కొంతతడ వూరుకున్నాడు. ఆమె చేయునుపచారములకు సంతుష్టిజెందినాడు. తనయనుమానము నిజము కాదేమో అనుకున్నాడు. ఆమెతో సంతోషముగ మరల మాటాడ మొదలుపెట్టినాడు. ఉరులలో జిక్కినకుందేటిని వారు గ్రహించి బయలు ప్రదేశమునకు బోయి అక్కడ దానిని కాల్చుకొని తిని యిద్దరు నిల్లుచేరుటకు బయలుదేరినారు.

లింగనికి కొంతఊరట కలిగినది. కాని యింకను మనస్సును కలవరపరుచు కారణములు లేకపోలేదు. ఆతడు సాధువు. ధైర్యశాలి. అనవసరముగ వైరములు పెట్టుకొనుటయు అడవులందు పారాడు నప్పుడు విపత్తులను కొనితెచ్చుకొనుటయు అతనినైజము కాదు. ఆమె సాహసకార్యములు మెచ్చుకొనుస్త్రీ. గురితప్పకుండ అలుగును విడువగలసామర్థ్య మామెకు గలదు. అట్టిసామర్థ్య మున్నయితరులయెడ ఆమె కభిమానము ప్రాణమును లక్ష్యపెట్టక ఎంతటి సాహస కృత్యమును జేసిన అంతగా నామెమెప్పును పొందవచ్చును, లింగని పై ఆమెకు అనురాగ మున్నది. సాహసకృత్యములు సల్పు యితరుల యెడలకూడ ఆమెకభిమానముకద్దు. బయిగా డందొక్కడు.

లింగ డామెతో బయిగానిగూర్చి ప్రశంసజేసి నప్పుడు ఈర మ్మ ఎంతటితొట్రుపాటు చెందినప్పటికిని సమయస్ఫూర్తి వదలక స్త్రీకి సహజమగు వన్నెచిన్నెలసహాయముతోను, నటనలతోను, తన వలపుసహాయముతోను లింగనికి నూకటగొల్పినది. కాని ఆమెమన స్సున కొకదుర్గ పట్టుకొన్నది. తాను ప్రేమించుపురుషునకు తనపై అనుమానము కల్గుట ఆమె కసహజముగా తోచినది. తా ననుమా నము కలుగునట్లు నడచుకొన్నప్పటికి తాను ప్రేమించుచున్న పురుషు న కీషన్మాత్రము తనపై ననుమానము కలుగరాదని ఈస్త్రీ తలంచి నది లింగనిపై ఒకవిధమగు కోపము కల్గినది. లింగడు చూచుచుండ గనే అతనిమనస్సునకు నొప్పి గల్గునట్లు ప్రవర్తింపదలచినది. ఆలోచిం చినకొద్దీ ఉక్రోషము పెంకెతనము కల్గినవి. ఒకరితో నొకరు మాటా డకుండ వెళ్లుచుండగా కొంతదూరమున బయిగాడు కానవచ్చినాడు. వాడొకబండమీాద నొకదుప్పిని పడవేసి యుంచి అలసట దీర్చుకొను చున్నాడు. ఈరమ్మ ఆతని మొదట గాంచినది. తరువాత లింగడు చూచినాడు. ఇంటికి పొమ్మని లింగనితో చెప్పి తాను బయిగానితో వత్తునని చెప్పి అక్కడ ఆగకుండా బయిగానిని ఆమె కలుసుకున్నది. లింగడింటికి పోవుచున్నట్లు నటించి ఒకచెట్టువెనుక నిలబడినాడు. తనవద్ద ఉరితాళ్లుతప్ప వేరాయుధములులేవు. బయిగానివద్ద దబ్బ అలు గులు కలవు. సాహసించుట మంచిదికా దనుకున్నాడు.

ఈరమ్మ బయిగాని ప్రక్కను కొంతవరకు మాటాడక కూర్చున్న ది. వాడు తనపై వేసిన చేతిని తీసివేసినది. చీకటిపడుచున్నది. బయి గా డేమేమో మాటలు చెప్పి ఆమెను నవ్వించినాడు. లింగడు ఆన వ్వుచూచినాడు. బయిగా డామెచేతికి విల్లు ఒక అమ్ము ఇచ్చినాడు. ఆమె ఒకచెట్టుపై కూర్చుండి కనబడికనబడని ఒకపులుగును గురిపెట్టి

కొట్టినది. ఆపులుగు క్రిందబడినది. బయిగా డా మెను బలవంతమున నెత్తి కౌగలించుకున్నాడు. ఆమె కోపముతో ఆతని తోసివేసినది. బయిగాని నచ్చట వదలి చర్రున నింటివైపు పోసాగినది. బయిగా డా మెను వెంటనంటినాడు. ఇద్దరును మరల వెనుకకు బోయి ఆబండమీా దనే కూర్చున్నారు. చీకటిపడినది.

లింగ డాకౌగిలింత చూచి తలవంచుకొని ఆఅడవిలో పరిభ్రమిం చుటకు మొదలుపెట్టినాడు.

౪

ఆచీకటిలో దారితెన్ను తెలియక తిరుగాడుచున్న లింగని కేల యీాదుఃఖము? తనయూహాలో తాను తప్పు చేయలేదుగదా. ఇతరులు చేసినతప్పులకు తానేల పశ్చాత్తాము జెందవలెను. తనవిల్లితరు లుప యోగించిన తాను వగచునా? తన అలుగులితరులు వాడుకొన్నట్ల యితే తాను దుఃఖపడునా? తనయావులను తాను ముద్దాడుబిడ్డలను ఇతరులు లాలించిన తాను ఖిన్నుడగునా? ఇప్పుడుగూడ అట్లేల యుండరాదు. ఈదుఃఖము జంతువులకు నైజమా? ప్రతి జంతువు నకును యిట్టినిసర్గ భావము గలదు. మానవునం దిట్టిభావమేనా వుంటే? వంశము పావనముగా నుంచుకొనుట భావ ముపయోగించు నని నాగరికులు చెప్పుమాట వాస్తవమా? ఇట్లుండుట మంచిదా చెడ్డదా? పుణ్యమా పాపమా? ఈసహజగుణము పుణ్య మెట్లగును? పాప మనుటకు మన స్సొప్పుకొనదే! తా నేల యితనులస్వేచ్ఛ నరి కట్టవలెను. తా నెన్నడు నిట్టితప్పుల చేయలేదా? తాను తప్పొనర్చి నప్పుడు త న్నట్లు దూరుకొని దుఃఖించినాడా? తానుచేసినదిమంచిదే

యితరులు చేసినది చెడ్డదీ అగునా యిట్టికార్యము? మంచిదైనను చెడ్డదైనను తాను మానవుడు, మానవు డొక జంతువు, జంతువులకు సామాన్యమగు నీభావము తనకును గలదు. తా నిట్టికార్యమును సైప లేడు. అతని హృదయము ఒక్కమారు విచ్చిపోయినది. ఆ నిశీథ సమయమున ఆకారడవిమధ్య ఆ కిరాతునిమనస్సును కలవరపరచిన యూహ లిట్టివని చెప్పనలవి కాదు.

మరునాఁడుదయము అడవిలో కట్టెలు కొట్టుకొనుటకు వచ్చిన ఒక లంబాడీ స్త్రీ ఒకబండ ప్రక్క రూపముచెడిన మానవ కళేబరము నొకదానిని చూచినది, దానిప్రక్క పెద్దపులి కాలిజాడల నామె గుర్తించినది.

గూడెమున కానాఁడురాత్రి లింగఁడు రాలేదు. ఈరమ్మ రాత్రింతయు మేలుకొని వేచియున్నది. ఆతఁడు రాలేదు, ఉదయమే బయలుదేరి కానవమంతయు వెదకినది. ఆతనిజాడ ఎక్కడను కానరాలేదు-కడచినదిన మామెచేసిన తొందరపనిని గూర్చి పశ్చాత్తాపము జెందమొదలుపెట్టినది. పశ్చాత్తాపముతో బాటు తా నింపగా చేయవలెనా అనుకోపముకూడ ఆమె నావరించినది.

తాను నిర్దోషి కాదా? తా నొనర్చినత ప్పేమి? అన్నమును కుక్క ముట్టుకపోయిన అన్నమునా కొట్టుట కుక్కనా? తినరానిమాంసమును ఒకమారు తింటే దానినిబట్టి అన్నముపై నిష్టము లేదనవచ్చునా? ఆమె కాతనియెడల విశ్వాసము లేదా? వలపు లేదా? ఇతరుల యెడల ఆమె చూపునది అభిమాన మగును గాని వలపు గాదే! ఆనా డా మడుగులో నిలుచున్నప్పుడు వనలక్ష్మి సాక్షిగా ఆమె యాతని కర్పించినహృదయమును మరల నితరుల కియ్యలేదు. ఆనా

టికిని నేటికిని మార్పు లేదే? అట్టిచో ఆతడేల ఈమెను తెగడం
లెను? తన కాంతనిమెడల ప్రేమ లేదా? వున్నది. ఆమె తప్పుదారుల
బట్టినదా? లేదు. ఇతరులబిడ్డను ముద్దాడినంతమాత్రమున తనబిడ్డపై
తనకు ప్రేమ లేదనవచ్చునా? ఇది పాపమా? పాపమైన నీపాపము
తనహృదయములో నెంతప్రకాశవంతముగ దీపింపనేల? నూతన
సౌఖ్యముల నాశపెట్ట నేల?

మానవుడు చేసినశాసనముల తెన్ను తెలియని ఆచెంచెత మన
స్సేమేమో యూహలకు పాలుపడినది.

పరస్పరవిరోధములగునూహాల నూహించుచు నాకిరాత్రి కాన
వచ్చిన అడవిమనుష్యుల ప్రశ్నించుచు ననురాగపాశములచే నీడ్వ
బడి కాననముగు ప్రమ్మరుచున్నది.

ఆసుగాలిస్త్రీ ఆమెకు తటస్థపడినది. ఆవార్త విన్నది. సూర్యుడు
నడిమింట నిప్పులు గ్రక్కుచున్నాడు. ఎవ్వరును గుర్తింపలేని ఆమా
నవకళేబరము నాచెంచుకాంత గుర్తించినది.

* * * *

కుంకుచున్న సూర్యుని ఎర్రనికిరణములు ఆనాటిసాయంకాలము
పాతాళగంగచిరుతయలలపై తేలియాడు మన్న యొక స్త్రీకళేబరమును
కప్పినవి. నీరు ద్రాగుటకు వచ్చినఒకజింకపిల్ల ఆశవమును వింతగా
జూడ మొదలుపెట్టినది.

---

# విప్రవీరుఁడు

పెనుమత్స. వెంకటరత్నము.

కరమునందు సితాసిభాసిల
నురుపరాక్రమ మాత్మనొలయఁగఁ
గదనమొనరింపంగ వెడలెను
ఖడ్గతిక్కన్నా;

ఇరుకెలంకుల యోధనిచయము
వరుసగా స్తోత్రములసేయుచుఁ
బరఁగుచుండఁగ, ఖడ్గతిక్కన,
కరముభాసిలెను;

కదనరంగము భీకరంబయి
గ్రాలుచుండ నరాతిసేనలు
వరుసఁదీరిచి, దనరుచుండి ర
వార్యశౌర్యమునన్.

సమర దుందుభిమ్రోసె నొక్కట
పరసఁగల విహఁగప్రతానము.
దుందుభిధ్వానమ్ము విని భీ
తిం దనర్చఁగనూ;

ఖడ్గతిక్కన, కత్తిఁజేఁగొని
కాలుప్రోలికి నంపుచుండెను
సమదవారణ నిచయపరిష్కృత
శాత్రవోత్కరమున్

సమరధారుణి పీన్గుపెంటల
సమదశాత్రవ రక్తధారలఁ
గనుట కెంతయు భీతిఁగొల్పుచు
దనరుచూనుండెన్;

ఈవిధంబున శత్రురాజిని
నెత్తురంజంపుచుఁ దనర్చెను,
ప్రళయకాలా భీలదండధ
రావతారమనన్ -
శాత్రవుల బాణాగ్నిరోచుల
విప్రవీరుని సేనయంతయు,
మాడిపోవుచునుండె మిడుతలు
మాడిపోవుగతిన్
సేననంతయుఁ గోలుపోయియుఁ
జిన్నవోవడు ఖడ్గతిక్కన,
విరతదీప్తుల సంధ్యఁబరఁగెడి
ఖరకరుని పగిదిన్ —
అంత తిక్కన యెర్రఁబారిన
యాననంబునఁగారు ఘర్మజ
లంబులం జేలాంచలంబునఁ
దుడుచుకొని మగుడన్ —
వీరరస మెదవెల్లివిరియఁగ,
భీరతం గదనంబొనర్చెను,
భారతీయుల వేడినెత్తురు
పాఱినాళములన్ -
శత్రువీరులనెల్లఁ జంపుచు
నెత్తుటేఱుల పాఱఁజేసెను;
కాని యొక్కం డేమిసేయుం
గలఁడు శాత్రవులన్

# నా కవిత

(సర్వియా దేశపు కవి జోవన్ డూసిన్ పద్యముల కనువాదము)

చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టీ.

ఛాయపోలిక చల్లని చలువ నిచ్చి
బాసి తేఁదు శిలామయ ప్రతిమరీతి
మౌనవృత్తియె వ్రతముగాఁ బూనియుందు;
కవిత! వింతిల సల్పెడి కన్య వీవు!

కొందఱకుగీత మొకకొంత కులటరీతి
భ్రష్టమై వీథులందునఁ బాడుచుందు;
గాజుపూసలు నీ కలంకారములుగఁ
గూర్పనెన్నటికిని; దీర్ఘకుటిలకుంత
లములఁ దురుమను బచ్చగులాబిపూలు
బ్రతుకు మభిమానముగ; నెదు పజ్జఁ జనకు,
పరిష్కృత జనంబులం గని పాఱిపొమ్ము;
లజ్జగల్గి వర్తింపుము; లలన! నీదు
నగ్నతయె దివ్యమనుమాట నమ్ము మమ్మ!
స్వచ్ఛమై యీశ్వరరహస్య సహితమైన
వస్త్రము ను మాత్రము ధరించు— వలదు వేఱు!

# తిక్కన ప్రశంస

(గిరి కుమార)

గతపడిన యాంధ్రరాజ్య
ప్రతీతి చొరనీదు నీదఃపలుకు సొబగునన్
వ్యతిరేకార్థంబుల మా
మతి ప్రతిభ మాటువడి ప్రమాదిల్లుటచే.

తెరల నెత్తెదు దింపెదు తెరలు పొరలు
చున్న నీవాఙ్నదీవారి యొఱపుమిగిలి
యస్మదాదికశిష్య హంసాలిముక్కు
కొనల తడుపుచు తా ముంచుకొనుచు మునరు.

కడమవానికి నటులుంచి గడుసుదనము
ధర్మమున కావగింజంత తలగకుండ
నీ మహాసృష్టి ధర్మజు నీతియొకడె
నన్ను మఱగించుకొన్నది నాడునాడు.

పలుకు విఱుపులని, తెలుగని,
అలఘుశ్రీరాజ్యనీతియని, పాంచాలీ
వల దుద్భ్రాభంగమ్మని,
యలికిడి రావచ్చు చాలదని యాగునటన్.

నీకవిత మున్గినది మొదల్ నీనినాల
మనుమసిద్ధి రాచరికపు మహిమలందు
తగిలిన మనంబు పూర్వాంధ్రధరణినాథ
బహుళరాజ్యంపు శ్రీకి నివ్వాళిపట్టు.

# స్వాతి కార్తె

నాయని సుబ్బారావు

అతిపిపాసావ్యథామతిమైన శుక్తి
తక్కుకార్తులవాన తాపోపశాంతి
కరము కాదోయన్న జ్ఞానమ్ములేక
స్వాతివర్షోదయ సౌభాగ్యమెంచె

స్వాతిమేఘమ్ములోపలి వానచినుకు
ముత్తెపుం జిప్పలో మునియుచుం జేరి
మాఱిపోయెను ప్రేమ మహనీయశక్తి
తళతళలాడు క్రొందళుకుముత్తెముగ

నింగిపందిరినల్లు నీలాంబువాహ
వల్లీమతల్లిక ప్రసవించుకాంతి
పుష్పమంజరియన భూనభోంతరము
మిఱుమిట్లుగొన స్వాతిమెఱుపుదయించె

ఏదీవియందో వసించుబలాక
సంతతుల్ చంచలాసతి రాగ మెఱిగి
మల్లెపూరేకుల మాడ్కి వ్యాపించి
తెలికాంతి సౌరభమ్ములుజిల్కె దిశల

అభ్రనాయకరత్న మనురాగరసము
వర్షరూపమ్మునం బ్రవహింపం జేసి
ముంచె భూరివియోగమునం గుందికుదిం
వసివాళ్వాడిన వసుమతీసతిని

చిత్తమోహనుఁడు వర్షించిన ప్రణయ
మధురసుధాధార మనసారఁగ్రోలి
నాయికశ్యామల నవశాద్వలాంకు
రమ్ములఁ పులకాంకురమ్ములు నెరపె
ప్రణయ కోపావేశభరమున లోని
జలమను వలపు బాష్పస్వరూపమున
మాయించి శుష్కించిపోయిన సరసి
తిరిగిన సౌందర్యస్ఫురణ భాసిల్లె
అవ్యాజరాగరసాలోలయగుచుఁ
జిరుతరంగములను కరపంకజములఁ
దనుఁదేర్పలేని చింతను సొమ్మసిలిన
తటసుందరుని తట్టితట్టిలాలించె

## త్ర యు ణ ము

"వాసవప్రస్థుఁడు"

"ఇంక సంగీతమును బాడు టెపుడు పికమ?"

ఇపుడు పాడుట పికమున కింపు గాదు!
శిశిరఋతువున గానముసేయు మనుచు
నెంత బలవంత పెట్టిన నేమి ఫలము?
నడివసంతమ్మునందు నానంద మధుర
గానమొనరించును బికంబు కంఠమెత్తి
వినెడువారలకోసము వెదకఁబోక
స్వీయసంగీత లహరిలోఁ బికవరంబు
దివ్యసమ్మోదభరమునఁ దేలియాడు!
దివ్యసమ్మోదలహరిలో తేలియాడు

# జనని

**పంద్యారం వెంకట సుబ్బయ్య**

అరవింద విరోధిఁ గన్న సా
గరముం బోలె మొగంబు విచ్చి సి
పురసమ్మద మేర్పడంగ నూ
తరో! వీక్షింతు వితండు గన్పడన్.

కరుణం గని నీవు ప్రోవఁగాఁ
బెరుగంజాలితిఁ బిన్ననయ్యుఁ ద
ల్లిరో! నీపద పల్లవాశ్రవా
నిరతిన్ముక్తిని నేను పొందనే!

నినుఁదక్క మఱొక్క దేవతం
జనునే కొల్వఁగ?ఁ జాలఁబండు చే
నును వీడి వనాళి గొడ్డలిం
గొని వృక్షంబులు గూల్చి వెట్టినే!

నినుఁగూర్చి తలంచి కొంతసే
పునకు న్నిద్దురవోవు కోర్కెతోఁ
గనుదోయి మొగుడ్చ స్వప్నమం
దున నీరూపమ తోఁచుఁ గంటికిన్

ప్రియమారఁగఁ గన్నబిడ్డపై
దయ నుంతైనను దాల్పదేన్ ఘృణా
మయ! యీతని కీజగంబుపై
భయమే మున్నది? పాఱఁజూడుమా!

# సందేశము

విదురుడు నీవు నెఱుఁగుదురు
గద యీ కొట్టమ్ములోనఁ గౌరవపతి మా
యెడఁ గుమ్మినట్టి మాటలు
ముదుకడు మాయయ్య తెలియుబో తెలియుదుబో

నిజము వచించెదవిను మిం
ద్రజుధనువునుగాని పవనతనయు గదనుగా
నిజయ మొసగునని నమ్మను
త్రిజగత్పతి యితని ధర్మదేవత దక్కన్.

ఇంతయేటికి వచియింపుచూ పెదతండ్రి
కొడుకుతో సంధికూకొనుమటంచు
కాదేని భాగయోగ్యత గల్గు మమ్మిట్లు
లడవికి పంచిన దట్టులుంచి
అభిజాత్యము గల్గునంగన మానభం
గము చేయఁబూనిన కొఱుతనము
ఆవేళనోటికి నష్టులేదనఁబోత
రించిన యాపోకిరీతనమ్ము
మరచిపోగలేను నాయెద మండుచుండె
పొచువడని నిప్పుకయు వోలెపుట్టరాని
హాలహాలము పుట్టినది యన్వయంబునందు
త్రిశయమును చూచితీరియవదలునసుము.

ఒకటికి నొక్కడై హృదయమూచెడు భావములెల్ల దేవనా
యకసుతు గాండివమ్మసలె యక్కఱలేదని చెప్పుమింక గం
గకొడుకులో ధనుర్ధరులొకర్ణులా లక్షలుగాదు కోట్లకై
పరికటిత యుద్ధభూమికిని రమ్మను ధర్మమెనెగ్గి తీరెడిన్
నా మాటలని చెప్పుమా మంద భాగ్యుండు
కడునక్కసును వెళ్ళగ్రక్కెననుచు
నవ్వులెన్ను సుయోధన జగత్పతి యొకింత
కాలమ్ములోఁ దేలగలడునిజము
దక్కడుపో భారత కుటుంబమునకింత చేటు తెచ్చినతన జీవితమ్ము
అడియాసగాని యెవ్వడు నెగ్గి నాడిట్టి
పనులుచేసిన యట్టివాఁడు మున్ను
సాధుసజ్జనసంతాప జనకమైన పనికులాక్షయుని యార్యవచనమున్న
దదివ్యథాయేల యగునటులైనయెడల
శ్రుతులుస్మృతులేటి కవికంఠశోషగాక

---

## చమత్కారము

చిన్నతనంలో కలసి చదువుకొన్న యిద్దరుస్నేహితులు చాలారోజులకు ఒకహోటల్‌లో కలుసుకొన్నారు. ఒకతను రెండవ వానిని క్షేమసమాచారాలు అడుగుతూ...

'ఏరా! ఏమన్నాబిడ్డలా నీకు' అన్నాడు.

'ఒకకొడుకు' అన్నాడతను. 'ఎన్నియేండ్లు' 'ఏణ్ణర్థం'

'పేరేం పెట్టినావు' 'వెంకట్రామయ్యరా! ఏదోపూర్వపుపేరు.'

"విచారమొందుకోయ్. అంతపాతపేరయితే క్రాపింగుపెట్టవోయ్. దోషంపోతుంది."

# వియోగిని

(విశ్వనాథ సత్యనారాయణ)

అది వైశాఖబహుళము. ఎండలు మాడిపోవుచున్నవి. ఆయమిత్ర మధ్యమున నామె తెల్లనిచీర పెట్టెలోనుండతీసి కట్టుకున్నది. నగలన్నియు నొడలినిండ నలంకరించుకున్నది. పూర్ణిమనాటి సాయం ప్రాచీమండలోదయ చంద్రబింబముంబోలె నెఱ్ఱని యామె దైన్య మధురమైన వదనమున నెఱ్ఱని కాసియంత కుంకుమబొట్టు కొట్టవచ్చినది.

చిన్నబిందె పుచ్చుకుని యూరిబయలి మామిడితోపు ప్రక్కగా బ్రవహించు సెలయేటివద్దకు నడచినది. ఆ నడకలో మాధుర్యరసము చిలుపలెత్తినది.

వసంతుడు చెట్లను లతలను కౌగిలించుకున్నాడు. ఆసెలయేఱు పాడుచుండె బాడుచు నూత్నయౌవన పురుషునిచూచి సిగ్గుపడు జవరాలి చిగురుగొంతువలె సన్నగిల్లినది. కాని ఝరితగ్గలేదు.

ఆమె బిందెనానుకొని నీటియొడ్డున కూర్చున్నది. ఆమెమీద సవిధమాకందచ్ఛాయలు పడుచున్నవి.

ఆమె హృదయము కొట్టుకొనుట యాగినదా? ఆమె మొగమున సంతోషమా యది? ఆమె యచ్చట గడియసేపున్నది. మామిడితోట కాపలావాండ్ర కేకలచటికి వినవచ్చుచున్నవి.

ఆమెలేచినది. ఇంటికిమరలినది. ఏటికడ కూర్చున్నప్పుడామె కట్టిన కోకకుచ్చెళ్లు మోకాళ్లవరకు తడిసినవి.

ఆమె యింటికేగి యొకడొక్కడు నగలన్నియునొలిచి పెట్టెలో పెట్టినది. ఆ తెల్లనిచీరవిప్పి నల్లచీరకట్టుకున్నది.



# పిల్లవాళ్ళే నయం

(టాల్‌స్టాయి యనుకరణ)

శ్రావణమాసం. పెద్దవర్షం కురిసి వెలిసింది. కృష్ణమూర్తిగారి యింటిముందు ఒక చిన్న పల్లంలో నీళ్లునిలచినై. కృష్ణమూర్తికి నాలుగేండ్లు. అతని సావాసగాడు సీతాపతి ఐదేండ్లవాడు, ఇద్దరు 'ఓరేయ్! ఆనీళ్లలోదిగి ఆడుకుందామా' అనుకున్నారు. 'లాగు తడిస్తే మాఅమ్మ కొట్టుతుందని' కృష్ణమూర్తి లాగువూడదీసినాడు. సీతాపతీ లాగువూడదీసినాడు. చొక్కాలు పైకిపట్టుకుని యిద్దరు చెరియొక వైపునుండి దిగారు. కృష్ణమూర్తికి చీలమండల లోతువచ్చింది. అతను 'నాకు భయమేస్తోందిరా' అన్నాడు. సీతాపతి 'పరవాలేదులే నెమ్మదిగా నడచిరా' అన్నాడు. ఇద్దరు మధ్యకెళ్లి చేతులు చేతులుపుచ్చుకొని గంతులేసేరు. తరువాత మళ్లీ అటూ యిటూ పరుగెత్తారు. కృష్ణమూర్తి ఆడుకున్నంతసేపూ ఆగకుని చేత్తోనీళ్లెత్తి సీతాపతిమీద చిమ్మాడు. సీతాపతి చొక్కాఅంతా బురదైంది. సీతాపతికి కోపంవచ్చి కృష్ణమూర్తిని ఒక చెంపకాయకొట్టి బురదలో పడేశాడు. ఇంతలో కృష్ణమూర్తితల్లివచ్చింది. కృష్ణమూర్తిఒళ్లంతా బురదైంది.

ఆవిడ—'ఏమిటిరా! యిది'

కృ—సీతాపతి నన్ను చెయ్యాలని చేశాడు ఇట్లా.

కృష్ణమూర్తి తల్లి సీతాపతిని ఒక చెంపకాయ కొట్టింది. అతను బిగ్గరగా బజారంతా వినబడేటట్టు ఏడిచాడు. అదివిని సీతాపతితల్లి వచ్చింది. సీతాపతితల్లీ కృష్ణమూర్తి తల్లీమాటమీద మాట మాటమీద మాట పెద్దపోట్లాటలోకి దిగింది. ఇంతలో మగవాళ్లు వచ్చారు. వాళ్లూపోట్లాట అందుకున్నారు. అంతకంతకు పెద్ద తగువుఅయింది. చేతులూ చేతులూకలియటం కాడికివచ్చింది.

కృష్ణమూర్తి అమ్మమ్మకు అసలు పోట్లాటంటే భయం. ఆవిడవచ్చి యెంత వద్దన్నా ఆపునలిముండమాట యెవరువింటారు.

పోట్లాట యింకా ఎక్కువైంది. కృష్ణమూర్తీ సీతాపతీ ఈలోపుగా మళ్లీ కలసి ఆపల్లంలో నీళ్లకి బజారులోకి కాలవ తవ్వారు చిల్లపెంకులతో. అందులో చిన్న కాగితం పడవచేసి వేసి దాన్ని తోలుకొస్తున్నారు. ఆకాలువ వీళ్లందరూ పోట్లాడేచోటుకి వచ్చింది. అప్పుడూ ముసలమ్మఅంది,

‘మీకుబుద్ధిలేదు. ఎవళ్లకోసంమీరు పోట్లాడుతున్నారో వాళ్లిద్దరు పోట్లాట మరచి మళ్లీకలసి ఆడుకుంటూ ఉన్నారు. మీరేమో కొట్టుకు చస్తున్నారు.’

ఆపిల్లవాండ్ర నవ్వుమొగాలూ ఆటసరదాచూస్తే వాళ్లందరికీ సిగ్గేసింది. ఆ పిల్లలు వీళ్లవంకేచూడ్డంలేదు. వాళ్లాటేమో వాళ్ళేమోగావుంది. సీతాపతి తండ్రి సీతాపతిదగ్గరకు వెళ్ళి

‘ఏమిటిరా! నాయనా’ అన్నాడు నవ్వుతూ ముద్దుగా.

కృష్ణమూర్తి ‘పడవ ఒడ్డుపట్టింది ఒడ్డుపట్టింది’ అంటూ దాన్ని తోస్తూంటే అతని తల్లి ఎక్కడలేని ముద్దువచ్చి యీబురదఅంతా కోకకవుతుందన్నా లేక వచ్చి ఎత్తుకుని ముద్దుపెట్టుకుంటూ ఇంట్లోకి వెళ్లింది.

ఎవళ్లదారినివారు నవ్వుకుంటూ సిగ్గుపడుతూ వెళ్లారు.

అందులో ఒకాయన అన్నాడుగదా!

‘పెద్దవాళ్లందరూ పిల్లవాండ్రకుమల్లే అయితేగాని స్వర్గానికర్హులుకారు.

ఆకాశంలో తెల్లని చిన్నచిన్న మేఘాలన్నీకలసి అంతకంతకు నల్లపడుతున్నై. మళ్లీవర్షం మూసుకువస్తోంది.



# సాహితి

## ఎదురురాక

కొంచెమాలస్యమైన నేమించుకంత
యొలుకు చిఱునవ్వు చెంపలకోరగిల్ల
నూత్నవత్సర యోగ్యమనోహరత్వ
మొసగు వేసాన 'సాహితీ' యెదురువచ్చె

ఈనవాషాఢమున నెచ్చటేరినావు
వేపపూతలు సీమంతవీథియందు
ముడివయిచి జటాగ్రపునడుమసరిగ
తుఱిమి నావెంత యందపు తునకవీవు

ముదిమి యూహాలపండిత మూర్తినిన్ను
పట్టి పసిబాలవని తల నెట్టుగాక
కుంకుమపుఁబూవు సొబగులు గుబులుకొన్న
చిగురు నిసోగతనములు సొగసికోక

బహువిధ పరిమళ ప్రసవ ప్రణీత
నూతనాంజలి, మెత్తనిచేతి వ్రేళ్ల
కనుగుణముగాఁ గూర్చితివమ్మ యుంగ్రి
మదిమెటది పుష్యరాగమ్ము తొడిగినావు

ప్రసవభావాభిరామమా పైటవిసరు
గాడ్పులనెత్తోచె స్వర్గసౌఖ్యముల మలుపు
ఈశరీరాంగములవంపు లెంతరుచులు
ప్రణయభావపుటారతి పట్టినాము

—శితా

# శారదానృత్యము

విశ్వనాథ సత్యనారాయణ.

జలజకింజల్క కషాయకంఠమున రాగము ప్రస్తరించె బాలమధుపమ్ము
తరుణ మాకందంపు తలిరుగిరుకుపోయి పాడెపంచమ పల్లవమ్ము పికము
కాశ్లేయవిమల శీకరశేఖరముల చల్లనిగాలి జల తరంగిణీనదించె
యమునాతట త్రస్తసమదరాధాసతీహృదయ కోరకము పరిమళించె

పార్వతీజాని వోలెపాపంబు నెల్ల
కంఠసీమ గదించిలోకశుభగీతి
పాడు సత్కవియమునాశైవాలినీత
రంగ రమ్యగీః ప్రముదితారంభములను.

శిశిరాంశు విమలరోచిర్మయూఖాపాంసులాధర సాంధ్యరాగ స్రోతస్వినులను
కాదంబినీశ్రవఃకలిత కల్హారపూజితముతో సెలయేటి వితతులందు
నైశ్చల్య నిశ్వాసనాధుడౌ మునిరాజు చిన్ని జాబిల్లి భ్రూసీమయందు
అఖిలవిహంగ విహారయోగ్యమ్మైన వైశాల్యమున్న ద్యోపథమునందు

శారదానాట్య మంగళచారుచరణ
కంజరేఖాంకితంబులుగా నవచ్చు
చలితచైత్రనదీ ముక్తసైకతముల
తరుణముగ్ధ సారంగిపాదములు వ్రాలె.

అభ్రగంగాధునీచుంబియైన నైజ
తుంగభంగతరంగాల పొంగెజలధి
శారదాదేవి మంజీర సరళిఘల్లు
ఘల్లురవప్రమోగినదిలయక్రమముతోప.



# తల్లికొఱకు

కమ్మతావులు జిల్కుసుమమ్ములేరి
కట్టినసరమ్ము దల్లికిఁగానుకవెట్టి
తత్కృపాలోకనామృతధారఁగ్రోలి
నిండుభక్తిని మాతృసన్నిధికినేగి ॥

జననిపాదాబ్జములకు వందన మొనర్చి
"కష్టపడి యేరికూర్చిన కమ్మపూల
మాలఁగైకొను మియ్యదిచాలదేని
హృదయసుమమైనఁగోసి నీకిత్తునంటి ॥

అమృతమయమూర్తియైన యయ్యమ్మపలుకు
పలుకునను దేటచిరునగవొలుకఁబలికె
"ప్రకృతినియమమ్ములన్నియు బాడు వెట్టి
మూర్ఖుఁడా యొంటివచ్చితె పూజసేయ ॥

భూమిఁబ్రాకెడు సన్ననిచీమమొదలు
అఖిలలోకాధినాథు పర్యంతమరయ
నాత్మకుసుమవికాసరహస్యమైన
ప్రేమసౌరభమునఁ గదంబించుఁజూడు ॥

ప్రణయనవ్యరసార్ద్రతాభాగ్యహీన
శుష్కహృదయోపహారంపు సొంపటంచు
ప్రేయసీదేహలతకల్లు వెట్టలేని
కఱకుచేతులఁగ్రుచ్చితే విరిసరమ్ము ॥

— శ్రీ ౧

హృదయసరసుఁ డొల్కాడు ప్రేమరసము
కన్నులనుతీరముల తరంగములనెరప
దంపతులు భక్తినిచ్చు పూదండలేరి
కంఠమునఁదాల్తుఁ గుతుకమ్ముగ్రిందుకొనఁగ ।

"తల్లి! మహాప్రసాద" మని
తత్పదపద్మయుగమ్ము బాష్పపుం
జల్లులనోలలార్చి నిను
సమ్మదమోడ్చితిఁ గన్నులింతలో
నుల్లమునూపు నాశయుప
యోధరఘూర్ణన మధ్యమందు వి
ద్యుల్లతికామతల్లివయి
తోఁచితివాక్క్షణమ్ముకోమలీ!॥

ఆత్మఁదోఁచినచిత్త మోహానిని నిన్ను
జెంతఁగనునాసఁగనువిచ్చి యంతలోనె
మాయమైననిన్నెదు కనుపాయనమ్ము
సంగ్రహించినపక్ష్మమ్ము జారవిడచి॥

చుక్కలుండెడు లోకాలఁజూచినాడ
నరసితినిమిన్నుమన్నేక మైనచోటఁ
గాంచితిపయోనిధి నితరంగముల వెనుక
డెందమునఁగాని నిన్ను నేనెందుఁ గాన॥

అమ్మకని కాన్క దెచ్చిన యలరుదండ
వక్షీరమ్మున వసివాళ్ళువాడుచుండె

ప్రణయపీయూష ధారాస్రవంతివీవు
శీకరమ్ములఁ దనుపవిచ్చేయ వేమి॥

దివ్యానురాగ సందీపితాలింగ న
మ్మునఁ దనూలత లైక్యమనుభవింప

విమలభక్తి రసాతివేలసంపత్సూచ
కమ్ములైన పులకాంకురములు నిగుడ

మాతృపాదజలేజ మకరందమజ్జన
మ్మున శిరస్సులకుఁ బావనతగలుగ

చరణాగ్రభూమి సాష్టాంగ ప్రణామక్రి
యా శేష పారవశ్యమున నలరి

నాల్గుచేతులుమోడ్పు పుణ్యదినమందుఁ
గరుణ మొలయ చల్లనికడకంటిచూపు
లందు నాట్యమ్ముసల్పునవ్యాజమైన
యమ్మ సదనుగ్రహముఁగోర వా లతాంగి॥





# సత్రైకాలపు నాయెంకి

నండూరి వెంకట సుబ్బారావు.

నీతో సెపుంటాను నాయుడు బావా
నీమాట యింటాను నాయుడు బావా
పరువులేమికావాలె సంతనపిల్లా, నువ్వు
మరమమిడిసి మనసియ్యి నాయుడు బావా
సక్కదనముకేమిత్తు సంతనపిల్లా, నువ్వు
సల్లగుండు పద్దాక నాయుడు బావా
ఏడనే నీకాపురమో యెల్తురుపిల్లా, నీ
నీడలోనే మేడగడత నాయుడు బావా ॥నీతో సె॥

# రైలుస్టేషన్ లో

ఇద్దరు పెద్దమనుష్యులు బెజవాడ రైలు స్టేషనులో యెదురుబడి యిదివరకు వారిద్దరికి వుండుకున్న వ్యవహారాల విషయమును గురించి మాట్లాడుతూ మాట్లాడుతూ పోట్లాటలోకి దిగినారు. బాగాపెరిగింది. నలుగు రైదుగురు వాళ్లచుట్టూ చేరినారు. వారిద్దరూ—

‘ చాలా పెద్దమనిషివయ్యా?

‘నువ్వా చాలా పెద్దమనిషి వే! (ఈలోపుగా ఒకడు పదేండ్లవాడు ఏమీ ఎరగనట్టుగానుంచుని అందులో ఒకాయన కొంగున డబ్బు విప్పుతున్నాడు).

‘ చాలా తెలివి గలవాడవయ్యా?

‘ నువ్వా చాలా తెలివిగలవాడవే? చూస్తూన్న వాళ్లల్లో వకాయన ‘ నవ్వుతూ దొంగను చూపించి ‘ మీరిద్దరూ కాదయ్యా తెలివిగలవాళ్లు. తెలివిగలవాడు వాడూ, అన్నాడు. అందరూనవ్వారు. ఆయనకుకోపం వచ్చింది. దొంగమళ్లీ కనపడలేదు.

(కొత్తపల్లి సుబ్బన్నాచార్యులుగారు)

## కోర్కె



అడవిగాచిన వెన్నెల యడవిలోన
పూచివెదచల్లు కమ్మనిపూవుతావి
ననుభవించుచు నేకాంతమున చెలంగి
యలరు యోగియౌటెపుడు లభ్యంబొనాకు

## ఋణమా! పెనువ్రణమా



ఋణముగాదది కార్చిచ్చుకణముగాని
కణముగాదది యతిఘోర రణముగాని
రణముగాదది కడుపెద్ద వ్రణముగాని
వ్రణముగాదది మన యవగుణముగాని

## కపిలధార

గీతానందసుధార సోజ్జ్వలరుచిరీకీర్తి ప్రతాపోద్ధతిన్
పూతోదంచితమయ్యె నీనులెలమిం బుణ్యంబు నేకూర్తె, నం
పీతిం గన్నులనీరుగ్రమ్మె ననిలోద్వేలాంచవీణాశ్రుతిన్
పాతఃకాల మరీచికోజ్జ్వలములై భాసిల్లెధారాంబువుల్

---

తిరుపతిసమీపమున నీధార (Waterfall) గలదు. ఇది యొకనాడచ్చటగూర్చుండి వ్రాసినపద్యము  కొ॥ సు॥

# గిరికుమారుని ప్రేమగీతాలు



## 49

కడుపవిత్రమైన యీకార్తికంపు
నవదినాంతపువేళఁ గైతవపులింద
పూజలకు పూలబుట్టచేబూనిపోయె
దివిగో! యిదికూడకలుపుకోవే! లతాంగి!

కనులకాటుక తీర్చితివిని మృగాక్షి
జాఱుముడివేసితివిని పచ్చనగుపట్టు
కోకతాల్చితి రుద్రాభిషేకమునకు
పోయెదనయేమి చెప్పవేపూవుబోడి

నేడు సోమవారము చంద్రనిటలభాగ
ఇదిగో మాయమ్మ మడిబట్టనెండవేయు
నేనువచ్చెదగుడిలోకి నిలుపుమింత
అర్ధనారీశ్వరునికయి యర్చలొసగ

# 63

ఈ విలాసాధిక జ్యోత్స్న మెండమండి
పవలు, తొలిసంజ రేకలు పర్వునంత
మధురసీమంతిని చాస్యమందహాస
వాసనల్ జిమ్ము వెన్నెలల్ గాసె! బళిర!
చూచుచుండ విలాసపుచూపులోద వె
కన్నగవ చిట్టచివరి భాగములయందు
చిగురుపుట్టమ్ములూచు నీచిన్నిగాలి
ముద్దుటిల్లాలి నర్మోక్తిముర్మురించు
కపురపుంపొల్ల వెన్నెలకాల్వలందు
తేలియాడు తరంగవీథికలనడచు
నాప్రియ భావరాజహంసీప్రయాణ
మమృతమాధుర్యపుం దోవలంటినడచె

———

## 25

గడుసుదానవె నవ్వేదుగాని చెప్ప
వొక్కమాటకు నీవు ప్రత్యుత్తరమ్ము
ఔర! సత్యనారాయణ వ్రతమునాడు
పిల్లనవ్వేటికది చెప్పు పీటలపయి

ఏదొకలవచ్చెనని చెప్పితింతవరకు
నెంత ప్రార్థించినను చెప్ప వెంతదాన
వింతకోపమ్ము వచ్చెనయేని నాకు
తళుకు చిఱునవ్వు సందుల దాగుకొందు

తెలివియున నిట్టులుండగావలయు, చెప్ప
వద్దులే కలమాట యెవ్వడిక నడుగు
వెలదినవ్వులు బిగియించి వేసికొనుచు
వేసికొనుచున్న జడయేల విప్పెదిట్లు

---

# 30

అల్ల మధుమాసమున రసాలాగ్రశాఖ
ప్రణయరాగమ్ము పంచమస్వరమునందు
నాలపించిన పికకన్య యది మొదలుగ
నింతవరకును వినిపించ దేమి సేతు

మధురమధుమాసమింక రామానెనేమొ
ముసవుమాకందమది యింకపూయదేమొ
ప్రేమయెఱిగిన వని పుల్కరించదేమొ
కోకిలాంగన తానింక కూయదేమొ

లలితములు మన్మనఃశాద్వలస్థలములు
ప్రణయ సారంగివానిపై పరువులెత్తు
తమ్మినస రేకుమడచు నీతరుణమైన
కొఱుకచాలదు శాద్వలాంకుర మొకండు



# టాల్స్టాయి దొకకథ



మిగుల పురాతనకాలమున దయావంతుడును మంచిగుణముల కునికిపట్టునైన యొకమహానుభావు డుండెడివాడు. జగమ్మునను న్న సద్గుణములలో నాయనవద్దలేనిదిలేదు. ఆయనకనేకులు బానిసలున్నారు. వాండ్రు ఆయననుచూచి గర్వపడునారు. తరుచుగా నిట్లనుచుండెడివారుగూడను.

'ఈలోకములో మాయజమానికన్న మంచివాడులేడు మమ్మాయన చక్కగా పోషించును. అన్నముపెట్టి బట్టలిచ్చును. మాకు తగినపని మాకుచెప్పును. ఆయనకు కోపములేదు. ఒక్కకఠినపు మాటైన నాయన నోటివెంటరాదు. ఆయన, తమ బానిసలను పశువులవలె చూచు నందరివలెకాదు. తగునా తగదా యని విచారించకుండ శిక్షించుచు నెప్పుడు నొక మంచిమాటయేని మాటలాడకుండ. ఆయన మనోవాక్కాయముల మామంచినేకోరును. మాకింతకన్న నేమి కావలయును.'

ఈరీతిగా నాబానిసలు వారియజమానుని పొగడుకొనుచుందురు. సైతానిదిచూచినాడు. యజమానియు బానిసలు నింతయన్యోన్యముగానుండుట వానికిగిట్టలేదు. [1] సైతాను 'ఏలెబ్' అనుబానిసను తనవైపుకు త్రిప్పుకొని తక్కిన బానిసలను వ్యసనపరుపుమని వాని

1 క్రైస్తవుల మతములో సైతాను దేవునకు విరోధి. అందుచేత నన్ని మంచి పనులకు నాతడెదురు.

కాజ్ఞాపించెను. ఒకరోజున బానిసలందఱు సావకాశముగా కూర్చుండి తమయజమాని గుణములు పొగడుచుండగా ‹‹ఏలెబ్›› ఇట్లన్నాడు.

‘మనయజమానిని గురించి యంతయెక్కువగా జెప్పికొనుట తెలివితక్కువ. మనమతడు కోరినపనియెల్ల చేసినచో సైతానుకూడ దయగానే యుండును. మనయజమానిని మనముసరిగా కొలుచుచున్నాము. ఆయనను మనము సంతోషపెట్టుచున్నాము. ఆయనదేనిని గురించియైన ననుకొనకముందే మనమాపని చేయడము. ఆయన యూహాలన్నియు ముందే గ్రహించుదుము. దయగానుండక మఱి యెట్లుండును? అయినను చూచెదము. ఎప్పుడును ఆయనను సంతోషపెట్టుటకు బదులు కొంచెము అపకారముచేసి కోపము తెప్పించిన నెట్లుండునో. ఆయనయు నందరివలెనే యుండును. అందరికన్న కూడ చెడ్డగాఁ బ్రవర్తించును.’

తక్కినవారందరు ‹నెలేబ్’ చెప్పిన దొప్పుకొనలేదు. చివరకు పందెములు వేసుకొన్నారు. తనయజమానికి గోపము తెప్పించెదనని ఏలెబ్’ పట్టుదల అట్లుచేయలేకపోయిన సెలవుదినములలోనిచ్చు క్రొత్తబట్టల తనోడునట్లును గెలచెనా తక్కినవారు తమవి యతనికిచ్చునట్లు నొప్పుకున్నారు. పైన తమయజమాని యతనికేదైన నపకారము చేసినచో వారందరు నతనిపక్షమవలంబించునట్లును వానిని కారాగృహమునునుంచినచో నతనివదలిపెట్టునట్లునుకూడ నొప్పుకున్నారు మఱునాడుప్రొద్దుననే తనపనితాను చేసెదననివాడు ‹ఏలెబ్’.

‘ఏలెబ్’ గొల్లవాఁడు. అతని యజమానునకు మంచిధరగలవై జాతిగలవి గొఱ్ఱెలుచాలాయున్నవి. వాన్నిమీదనితడు నియమితుఁడై అవియున్నచో నతనియజమానికి మిక్కిలియిష్టము.

మఱునాడుదయమున నతనియజమాని యెవ్వరినోకొందఱి నతిథులను తనగొఱ్ఱెలను చూపించుటకు తీసుకునివచ్చినప్పుడు 'ఏలెబ్' తనతోడివారితో 'చూడండి ఇప్పుడీయనకు గోపము తెప్పించెదను' అన్నట్లుగా కన్నెగుర వేసినాడు.

తక్కిన జానిసలందరును పోగయిద్వారములనుండియు కోటడిమీదనుండియు తొంగిచూచుచున్నారు. 'సైతాను' ప్రక్కనున్న చెట్టొకటియెక్కి తన సేవకుడు వానివిధ్యుక్తమెట్లు నిర్వర్తించునో చూచుచున్నాడు. యజమాని యతిథులకు గొఱ్ఱెలను, ఆడగొఱ్ఱెలను పొట్టేళ్లను చూపించుచు దొడ్డిచుట్టును తిరిగివచ్చెను. అన్నిటిలో మంచిపొట్టేలొకటియున్నది. దానిని చూపింపవలయుననుకొనినాడు. 'అన్నియుమంచివియె. కాని యన్నిటికన్న మంచిదొకటున్నది. వంపుతిరిగినకొమ్ములది. అమూల్యమైనది. అది నా నేత్రాంజనము' అనిఆయన యనినాడు.

కొత్తవారిఁజూచి గొఱ్ఱెలుబెదరి నాల్గువైపులకు చెదరిపోయినవి. అందుచేత వారామంచిపొట్టేలువంక సావకాశముగ చూచుటకు వీలులేకపోయినది. ఆమందమరల నిలబడువరకు, నేరెవ్వరో నచుకొనకుండనట్లు జరిగినట్లుగా దానిని బెదరగొట్టినాడు. మంద మరల చెదరిపోయినది. చివరకు యజమానికివిసుగుపుట్టినది.

ఆయన 'ఏలెబ్'తో నిట్లన్నాడు. 'నాయనా! ఏలెబ్! ఆవంపులుతిరిగిన కొమ్ములది మనపెద్దపొట్టేలు. దానిని పట్టుకోఅమ్మా.'

యజమాని యిట్లనినాడోలేదో 'ఏలెబ్' సింహమువలె మందలోఁ జొరబడి యా యమూల్యమైన పొట్టేలుమీదదూకి యున్నినా బిగించిపట్టుకుని యెడమకాలు వెనుకది మోటుగాపట్టుకుని ానికన్నులయెదుటనే దాని నడుమునటువ్రాపి విఱిచివేసినాడు.

అదియు నెండిపోయిన చెట్టుకొమ్మవలె నేలకునిగిపోయినది. పాటేలు కాలువిరిగిపోయి యదికూలిపోయినది. పాటేలు ఎడమకాలు కొంకర పోవుచుండగా 'ఏలెబ్' దాని కుడికాలుపుచ్చుకుని మెలివెట్టినాడు. అతిథులు బానిసలు హా! హా! అనినారు. చెట్టుమీదసైతాను సంతోషించినాడు.

యజమానిమొగము పిడుగువలె భయంకరమైనది. భ్రూలత నల్లనై ముడినడ్డది. ఆయనతలవంచుకొనినాడు. మాటలాడలేదు. చూడవచ్చినవారును బానిసలు ముగ్ధులైనారు, ఏమియగునో. కొంచెముసేపు తూష్ణీభావమునయుండి యజమాని యేదియోబరువు సడలించుకొన్నటుల నోడలు విదిలించుకొనినాడు. తలయెత్తి స్వర్గమువంక దృష్టినిలిపి కొంచెమున్నాడు. అంతలో నతనిమొగమున ముడతలుపోయినవి. మందహాసముతో 'ఏలెబ్' వంక దృష్టినిగుడ్చి యనినాడు.

“ఓఏలెబ్, ఏలెబ్! నీయజమాని నాకుగోపము తెప్పించుమని నిన్నునియమించినాడు. కాని నాయజమాని నీయజమానికన్న బలవంతుడు. నీవన్న నాకుగోపములేదు, నీయజమానికే గోపము తెప్పించెదను. నేను నిన్ను దండింతునని యనుకొనుచున్నావు. నీకు పారిపోవుదమనియున్నది. కాని యిటుచూడు నేను నిన్నేమియు నను. నీకు స్వాతంత్ర్యముకావలయును గనుక వీరందరుసాక్షులుగ నీకు స్వాతంత్ర్యమిచ్చితిని. నీయిచ్ఛవచ్చినచోటికిపొమ్ము. నీసెలవు దుడుపులుకూడ తీసికొనిపొమ్ము.”

దయావంతుడైన యాయజమాని తనయతిథులతో నింటికి వచ్చినాడు. కాని సైతాను పండ్లుపటపట కొరికికొనుచు చెట్టుపై నుండి క్రిందపడినది. అది యధః పాతాళమునకుంబోయినది.



# కర్ణధారి



(దువ్వూరి రామిరెడ్డి)



౧

సంజెచీఁకటి దెసలఁ జక్కనలమెను ;
గాఱుమబ్బులు చుక్కగములఁ గ్రమ్మెను;
ప్రబలవేగానఁ దుపానువీచెన్
అకసము గీకసం బావిలింపన్
గర్జించెమేఘాలు కంపమెత్తన్
నటియించు భైరవు జటలాకోనాన్
నురుగుగ్రక్కుడు కడలితరఁగగుంపుల్
చెలియలికట్టపైఁ జిందులాడన్
ఉన్మత్తప్రకృతి నృత్యోత్సవంబుల్
మింటిని మంటిని మేళవింపం
గడిమి విడువకు కర్ణధారీ!
పడవనడపుము భయముదీఱీ.

౨

వడిసముద్రంబునఁ బడితినంచుఁ
జడివాననిలువంగఁ జాలనంచుఁ
వడిగండ్ల 'బాంబులు' పడునోయంచుఁ
గటికిచీఁకటిఁ గన్నుగాననంచుఁ
ఒంటినైతిని సాయముండదంచుం
బరిపరివిధముల భావింపంగ
ప్రాణసంశయమున భావింపఁగ
సమయంబుగాదిది జడచిత్తుఁడా!
చినిగిన తెఱచాప చెఱఁగులెల్లఁ
సవరించి యాత్మవిశ్వాసంబునం
గడిమివిడువకు కర్ణధారీ!
పడవనడపుము భయముదీఱి.

3

పుడమిఁ బ్రాఁకెడు చిన్ని పురుగు వోలెఁ
గష్టనిష్ఠురవిధి కాలిక్రిందఁ
బడిచిందుచిందుఱై ప్రాణమేదఁ
బుట్టలేదోయి యేపురుషుఁడైనఁ;
గ్రిందికిదింపకు కేతనంబుఁ;
సెర్చిలైటులు వోలెఁ జీకట్లలోఁ
మెఱసెడిఁ జూడు క్రొమ్మెఱుఁగుడీఁగల్;
దారిఁ జూపెడు ధ్రువతారపైనఁ
మిణ్కుమిణ్కన వెల్గు మేఘాలలోఁ
జీవనదీపమై చెలఁగు నాసఁ
మలపకె పాథోధి మధ్యంబునఁ
గడిమి విడువకు కర్ణధారి!
పడవ నడపుము భయముదీఱి.



# ఆంధ్ర వాఙ్మయ చరిత్ర విమర్శనము

## ౨ చరిత్ర రచనము



యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ యన్న గీతావాక్యము సర్వవిషయములందును ప్రచురముగల దివ్యవాక్యము. అందునను భావనాశక్తికి విషయీభూతమగు వాఙ్మయ విషయమునందు అమోఘము. ఒక్క వాఙ్మయమే గాదు భావనాశక్తికి లక్ష్యముగా దగిన ప్రతిపదార్థమునందును ఇయ్యది మూడురూపుల దీర్చినట్లు ప్రతిఫలించుచుండును. కనుక వాఙ్మయచరిత్రము వ్రాయబూనిన ఆరాధకుడు స్వారాధ్యదేవతను సర్వవిధముల నౌదార్యమును వెల్లడింపనువగునట్టి పరిస్థితులతో స్వాంతఃకరణమున భావింపవలసియున్నది. ఆరాధ్యవస్తువును సపరికరముగ సాంగముగ మనఃఫలకమున నిలిపి తద్రూపమును త్రికాలాబాధ్యముగ- నిరంతరముగ- నిర్ఛిద్రముగ- నెలకొనునట్లు చేయుటయే భావనయనుదానికియర్థము. కాని యారాధకుడు ఆరాధ్యరూపమును భావనచేయుటయందు ఏమాత్రము భ్రమప్రమాదములకులోనైనను- అథవా సత్యేతరములగు త్రోవలంబడినను- విపరీతఫలము చేకూరును. కనుకనే ఆరాధకుడు వ్రతియై నియమవంతుడై స్వత్స్వరూపదిదృక్షువై యుండవలయునను నియమమును పెద్దలేర్పఱచి యున్నారు. ఇయ్యది స్థూలదృష్టుల కుపరిహాస్యముగ గన్పట్టినను సూక్ష్మదృష్టులగు నంతర్వాణులకు మాత్రము యదార్థమేయని తోపక పోదు.

వెనుకటివ్యాసము చివఱను - అనగా కృత్యాద్యవస్థ యను మొదటి వ్యాసము చివఱను - మనవాఙ్మయ చరిత్రకారుడు భావించిన వాఙ్మయస్వరూపమును పరికించియున్నాము. అనగా కృత్యాద్యవస్థ యను మొదటి వ్యాసము చివరను - మనవాఙ్మయ చరిత్రకారుడు భావించిన వాఙ్మయస్వరూపమును పరికించియున్నాము. అనగా వాఙ్మయస్వరూపమును నిర్ణయించుటలో వీరుప్రదర్శించిన ఔదార్య

మును స్థూలదృష్టిని లక్షించితిమి. కాని అడుగులోనే హంసపాదియనునట్లుగ వీరు చేసిన వాఙ్మయస్వరూపభావనయే చాల సంకుచితము. అనుదారము. అపరిపక్వము. అసమగ్రము. అసంభావితము. లక్షణగ్రంథములైనను లక్ష్యగ్రంథములైనను దృష్టాంతములైనను దార్ష్టాంతికములైనను పదములైనను పాటలైనను పద్యప్రబంధములైనను గద్యప్రబంధములైనను గేయములైనను ధ్యేయములైననుచరిత్రములైననుకాకున్నను- ఇంతయేల సమస్తగ్రంథములకును వాఙ్మయమునందు చేరుటకుదగినట్లుగా-చరిత్రకారుడు లక్షణనిర్వచనమును-అథవాస్వరూపనిరూపణమును భావింపవలసియున్నది. మనవారు వాఙ్మయమును వాగ్దేవీస్వరూపమునుగా నిర్దేశించిఆభేదమునధ్యవసాయించి ఆమహాదేవిని నుతించియున్నారు. సాధారణలగు తల్లులకేతమసంతానము ప్రయోజకమైనను అప్రయోజకమైనను వీడనాడుటకు బుద్ధిపుట్టదు. ఇట్టిస్థితిలో విశ్వజననియైఅమ్మలగన్న యమ్మయై - వెలుగొందెడి వాగీశ్వరికి తన సంతతివారి వాఙ్మయము పట్ల పక్షపాతదృష్టిగాని ప్రయోజ కాప్రయోజకత్వబుద్ధిగాని పరిహార్యా పరిహార్య భావముగాని యుండుననుటను విశ్వసింపదగినది మాత్రము కాజాలదు. కనుక మన చరిత్రకారులు వాఙ్మయస్వరూపమును భావనచేయుటలో దూరదర్శితనేమాత్రమును ప్రదర్శింపలేదనుట సత్యము. ఇందువలన అనగా వాఙ్మయస్వరూనిరూపణలో సంకుచితమగు వీక్షణమును కనఁబరచుటవలన - చరిత్రరచనమునందు సైతముసంకుచితావస్థయే యేర్పడినది. ఏలయనగా క్షేత్రమెంతటి పరిపక్వదశనుగాంచినను తొలుత ఆవాపమునఁబెట్టిబీజములను చల్లునో ఆబీజము లేకదా కాలక్రమమున నంకురించి-పల్లవించి-వ్రేళ్లుపాతి-మహావృక్షమై పూచికాచి పిదప బీజానురూపముగా ఫలించుట గల్గును; కనుక ఈవ్యాసమునందు మన ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారుడు చరిత్రరచనమునందు గన్పరచిన సంకోచభావమును తత్సాధుత్వమును దాననేర్పడిన పరిస్థితులు ఇందువిచారింపబడును. కావుననే ఈ రెండవవ్యాసమునకు చరిత్రరచనమని పేరుంచితిమి.

'వాఙ్మయచరిత్రము సంఘశాస్త్ర సంబంధిగా వ్రాయఁబడియుండుట శ్లాఘనీయమైనవిశేషము' - అనిరామలింగారెడ్డిగారు పీఠికలో చెప్పినవాక్యమునుబట్టి

ప్రస్తుత మీచరిత్రము - అనగా ఆంధ్రవాఙ్మయ చరిత్రము - సంఘశాస్త్ర సంబంధిగ వ్రాయ బడియున్నదనియును ఇట్లువ్రాయుట శ్లాఘనీయమైన విశేషమనియును తేలుచున్నది. కాని జంతుశాస్త్రము వృక్షశాస్త్ర సంబంధిగా వ్రాయబడుటయును కావ్యశాస్త్రము కపాలనిర్మాణ శాస్త్ర సంబంధిగా వ్రాయబడుటయును ఆధ్యాత్మికశాస్త్రము - అనగా వేదాంతశాస్త్రము - కామశాస్త్ర సంబంధిగా వ్రాయబడుటయును జీవశాస్త్రము భూగోళశాస్త్ర సంబంధిగా వ్రాయబడుటయును పాశ్చాత్య విద్యాప్రాభవ ప్రదర్శన సందర్భమున నొకవేళ శ్లాఘనీయమైనచో కావచ్చును. పరంతు - ప్రాచ్య విద్యావిశారదుల సంప్రదాయమునందు మాత్రము ఇట్టి యాచరణము అప్రాచ్య మనిపించు కొనకతప్పదు. ప్రాచ్యులలో నింతవఱకు నిట్టివిపరీతబంధము అనుకరింప బడలేదు సరికదా దీనిగలుగగల వైశిష్ట్యము గూడ నంతగమాకు గోచరింప కున్నది. అయినను రెడ్డిగారు కన్పెట్టిన యీద్వారముననే చరిత్రరచనమునందు మన గ్రంథకర్తలు వివరించిన సంకోచ వికోచములను సాధ్య సాధుతలును తత్త్వములగు సారాసారములను విమర్శించుకొనుటకే మనమును పూనుకొనదగును. ఇకను వాఙ్మయచరిత్రము సంఘశాస్త్ర సంబంధిగా వ్రాయబడినను, (అనగా సాంఘిక వర్తనములు తత్కారణములు తజ్జనితఫలములు, మున్నగువానిని వివరించుచు వ్రాయబడినను) లేక తత్త్వశాస్త్ర సంబంధిగా వ్రాయబడినను, ప్రప్రధానమైన యంశము వాఙ్మయము గనుక వాఙ్మయ పరిణామముల యాథార్థ్యమునే విరివిగవర్ణించుట యుచితముగనుండునేగాని అందులకు విరుద్ధముగ సంఘపరిణామమునే సగమునకు పైగా వర్ణించి సారస్వత పరిణామక్రమమును రూపింపక చల్లగా జారవిడుచుట మంగళసూత్రధారణమును సుఉచిన వివాహకరణమును తలపింపజేయును. అయినను వస్తుతత్త్వాన్వేషిని నాకు తత్ప్రచలనము ననుసరించియే తత్త్వములగు లోపములు వెల్లడింపవలసి యుండుటచేత గ్రంథకర్తల ననుసరింపక - తప్పదు. ఆంధ్రవాఙ్మయచరిత్రమునందు నాల్గవ ప్రకరణము మొదలుకొని [గ్రంథకర్తృభిప్రాయము ననుసరించియే] తొమ్మిదవ ప్రకరణము చివఱవఱకుగల గ్రంథభాగము మాత్రమే

చరిత్ర రచనమను ఈవిమర్శన వ్యాసమునకు లక్ష్యమని తొలుత గుర్తించుకొన మాపాఠకులను అర్థించెద.

గ్రంథభాగములకు పెట్టబడిన శీర్షికల పేరుల ననుసరించి చూచినచో ఈ యైదు ప్రకరణములలోను దాదాపు ఏబదివిషయములకు పైబడినవిషయములు సాంఘికశాస్త్రసంబంధిగా నిరూపింపదొడగినట్టు తోచును. కాని గ్రంథమును ఉద్ఘాటించి చూచినచో ఒకవిషయమైన విమర్శనార్హమైనదిగ గన్పట్టకపోవుటయే గాక ఎప్పటికప్పుడు తప్పించుకొను ననువైనగొండ్లెములవలె "ఉండవలయును. చేయవలెను. కావలెను. పోవలెను. రావలెను." మున్నగు అనంతములగువలెనులతో నిండియుండును. అట్టివలెనులలో క్రిందివాక్యములతో ఆంధ్రవాఙ్మయము యొక్క ప్రాథమిక స్వరూపపరిచయము అరంభింపబడుచున్నది.

"ఆంధ్రులు మనదేశమును పాలించినప్పుడును పల్లవులాంధ్రదేశము నేలినప్పుడు నాంధ్రులలో బౌద్ధమతము వ్యాపించియుండవలెను. * * * * ఆకాలమునందు పాలిభాషతో సంబంధముగల ప్రాకృతములలోగాని యాంధ్రభాషయందుగాని కొన్ని బౌద్ధగ్రంథములు వ్రాసియుందురు. * * * * అశోకుని వంటి మతవ్యాపకుడు వేయించిన శాసనములుకూడ నాతడు దేశభాషల సాహాయ్యముననే హిందూదేశముననేగాక సింహళ బ్రహ్మదేశములయందును చీనా జపానులందును బౌద్ధమతవ్యాప్తినొనరించెనని తెలుపుచున్నవి. అట్టియెడ నానాడు వ్రాయించిన ఆంధ్రభాషాగ్రంథములు నశించినవని నమ్మవచ్చును. ఇది శంకరుని నాటి బౌద్ధజైనమత వాఙ్మయ నిరూపణము;" ఆ. వా. పేజీ 49

ఈవాక్యములు ఆంధ్రులు మగధదేశమును పాలించిననాటి ఆంధ్రవాఙ్మయము అధికమగునున్నతిని గడించి ఉత్తమోత్తములగు గ్రంథములు సైతము రచింపబడ దగినంతటి- లేక రచింపబడినంతటియభివృద్ధికి వచ్చియుండెడిదని నిర్ణయించుటకై వ్రాయబడినవి. మఱియును ఇట్లే అనగా బౌద్ధమతము వైష్ణవమతము బ్రాహ్మణమతము అను మున్నగు మకుటములతోగూడ - ఆయామతముల

ప్రచార కాలమునందు ఆంధ్ర వాఙ్మయ మెట్టిస్థితిలోనున్నదో సూచించుటకు కాంబోలును కొందరు కొంతగ నూహాప్రపంచమును సృజించిరి. కాని తగినంతటి యాధారములనుగాని ప్రమాణమునుగాని ప్రదర్శింపనందువలన నిర్హేతుక జాయమాన మాహాత్మ్యముగల రెడ్డిగారివంటివారికి "క్లిష్టాగ్రములకు నన్వయము నద్భుతముగ కల్పించియు"న్నట్లు తోచినను మాకుమాత్రమట్లు తోచుటలేదు.

చరిత్రరచనము సేయునప్పుడు సంపూర్ణతలేక ప్రభ్రష్టస్వరూపముగల గ్రంథరాశిగల వాఙ్మయముపట్ల - రూపనిర్ణయమును చేయు సందర్భములలో - కొంతవఱకు నూహాప్రపంచముపై నాధారపడుట తప్పనిసరియైనను అట్టియూహల కాధారలేశమైనను లేనిదే - కేవలమూహాప్రపంచముపై నాధారపడుట మంచిపద్ధతి కాదు. యోగ్యమును కాదు. పైగా నన్నయ్యకు పూర్వయుగమునందలి వాఙ్మయస్వరూపమును నిరూపించుట - ఇప్పటికిని [అనగా నామరూపములు కూడలేకుండ అప్పటివాఙ్మయము విభ్రంశమై పోయినదనుకొనుచున్న ఈకాలమున గూడననిభావము] లీలగా దిగ్దర్శనమాత్రముగానైనను - సందర్భలేశములు లేకపోలేదు. అట్టివానిని ఓపికతో నన్వేషించి బయలుపెట్ట వలసినది చరిత్రకారుని ధర్మము.

ఏవాఙ్మయమునందైనను (గ్రంథాధారములు లేనప్పుడు) ప్రాచీనస్వరూపమును రూపింపజాలిన పరికరములు రెండువిధములుగ నుండును. మొదటిది ఆకాలపు శాసనములు లేఖనములు మున్నగునవి. రెండవవిలక్షణ గ్రంథములు. నన్నయకాలమునను నన్నయకు పూర్వమునను గల యుద్ధమల్లుడు మున్నగువారి శాసనములు మొదటి పరికరముల కుదాహరణములు. ఈపరికరములను పూర్ణముగా నార్జించి అందు నిబద్ధమైన వాఙ్మయము ఎట్టెట్టివిధములతో నేయేలక్షణములతో నేయేరీతుల విలసిల్లుచున్నదో విమర్శించి ఆపైని తదాధారమున నేర్పడుచున్న భాషాక్రమమును వీలున్నంతవరకు సలక్షణముగా రూపించి అటుతర్వాతను ఆపునాదిపైని ఊహాప్రపంచముతోనో లేక మరియొకవిధముననో సిద్ధాంతము నేర్పరుపవలసియుండుట మొదటివిధము. ఈవిధముగ నిదివరకే పరిషత్తువారును ఇతరులగు పెద్దలును కొందరు కొంతగ పనిజేసియే యున్నారు. వీరును

ఆమార్గముననే - అజ్ఞాతయుగము వాఙ్మయ చరిత్రమును రూపించుటలో ననుసరించి యుండిన యుత్తమముగా నుండెడిది. ఇక రెండవమార్గము లక్షణగ్రంథములలో గల వాఙ్మయలక్ష్యములను అనుసరించి ప్రాచీనవాఙ్మయమును నిరూపించుటయైయున్నది. ఈమార్గము మొదటిదానికంటె కొంచెము సులభతరము. క్రొత్తగ అప్పటి కప్పుడు లక్ష్యలక్షణనిరూపణమును చేసికొననవసరము లేకుండ ఏదోయొకక్రమము ఇందునిరూపింపబడి యుండుటచేత వీనినాధారముగ చేసికొని ప్రాచీన చరిత్రము నన్వేషించుటకు వసతులెక్కువగ ఈలక్షణగ్రంథములలోనుండును. కాని ఈసందర్భమునందు ఆకాలపు లక్షణగ్రంథములు మాత్రము కలవా? యను ప్రశ్నము రాకతప్పదు. లక్షణగ్రంథములు ఆట్టె లేనిమాట నిజమేయైనను ద్విపదకావ్యములు మున్నగు పూర్వాపూర్వమగు వాఙ్మయమును చదువునప్పుడు కొన్నికొన్ని ప్రాచీనచరిత్రల బోధింపగల యంశములుకన్పట్టకపోవు. ఇంతియుకాక సంస్కృత వాఙ్మయమునందును ప్రాకృత వాఙ్మయమునందును గల లక్షణగ్రంథములు మనకీవిషయమున అమూల్యమగుసాయము చేయగలవు. కాని మనముమాత్రము విసుగుదలలేకుండ పరిశ్రమింపవలసియుండుట మాత్రము ముఖ్యము. ఇట్టిపరిశ్రమమునకు ఏమాత్రము ప్రాల్మాలినను ఫలము ఇప్పటి వాఙ్మయచరిత్రమునందువలెనే పూజ్యముగాక తప్పదు.

ఈసందర్భమునందు అనగా నన్నయ్యకు పూర్వమునగల వాఙ్మయచరిత్రము నన్వేషింపవలసిన విధానమునందు - సూచీకటాహన్యాయముగా చిన్ని యుదాహరణమును వ్రాసెదను. ఇయ్యది చూడుటకు చిన్నదయ్యును ఆదర్శమున మిన్నముగక తప్పదు.

జాతులమాత్రాంశ సంధానగణవి
నీతులుగాయని నియతికగ్నైర
సియును "బ్రాసోవా" యను యతిర్వాయ
నయుజెప్పు ఛందోవిని హింశోక్తిగాన

ప్రాసమైనను యతిపైపడినయైన
దేసిగానిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండగ ద్విపదలురచియింతు

ఈవాక్యములు పండితారాధ్య చరిత్రమునందలివి. పండితారాధ్యుని కాలమునాటికి దేశీయములగు ఛందోలక్షణాదులను తెలుపునట్టి లక్షణగ్రంథములు అనేకములుండెడివనియును అవియన్నియును సంస్కృతభాషయందు (1)జాతయః (2) నియతిగణైః (3) ప్రాసోవా (4) యతిర్వా—అనియిట్లు చక్కని చిన్న చిన్న సూత్రములతో గూర్పఁబడి యుండెననియును దెలియుచున్నది. ప్రాకృత భాషలోనున్న పింగళ ఛందను ఛందోవిచితి (ఇయ్యది మాయొద్దనున్నది) అథో లక్షజఫక్కిక మొదలగు ఛందోగ్రంథములందును ఆంధ్రభాషను గురించి సంస్కృతమున వ్రాయఁబడిన వ్యాకరణములు లక్షణగ్రంథములందును కూర్పఁబడిన సూత్రములవలన, ఆకాలపు భాషాలక్షణములును కొన్నికొన్ని యందచందములును తెలియవచ్చుటనిక్కము. కనుక ఈ ద్వివిధములగు పద్ధతులను అనుసరించి పరిశ్రమించినచో ప్రాచీనఆంధ్రభాషా స్వరూప నిరూపణమును తదనుసారముగ నాంధ్రవాఙ్మయ చరిత్రరచనమును చేయనగుపడెడిది.

కాని ఇంతకును గ్రంథకర్తకుగల భావన వేఱుగనున్నది. ఆయనభావన ననుసరించి ఆంధ్రవాఙ్మయమనగా పద్యనిబద్ధమగు నాంధ్రప్రబంధాదికము. కనుకనే ఆయన వాఙ్మయచరిత్రమును రచనసేయునప్పుడేమి చరిత్రసాధనములను శాసనాదుల యాధారమున నన్వేషించునప్పుడేమి- విశేషముగా- పద్యనిబద్ధమైన శాసనవాఙ్మయమున్నదా లేదా యను భావనతోనే పరిశోధనల గావించి నాడేగాని- వాఙ్మయమునందు గద్యమునకు పద్యమునకును పాటకును పదమునకును గేయముల కును ధ్యేయములకును వ్యాఖ్యానములకును అన్వాఖ్యానములకును సమముగ స్థానమున్నదని భావించికొనలేదు అట్టిభావనయే గ్రంథకర్తదృష్టిలో లేనప్పుడు అనగా గ్రంథకర్తభావనయే వేఱైనప్పుడు ఇక సిద్ధియును [అనగా పర్యవసానము] ను

వేఱుగ పరిణమించుటలో ఆశ్చర్యములేదు. పద్యనిబద్ధమైనదే వాఙ్మయమని గ్రంథకర్త యభిప్రాయమైనట్లు ఇదివరకే మొదటి వ్యాసమున రూపించితిమి. ఇకనిట సంగ్రహముగా ఆయభిప్రాయమును సమర్థించుకొనుటకై గ్రంథకర్తచేసిన కృషిని కొంత ప్రదర్శించెదము. ఈక్రింది సందర్భమందులకొక యుదాహరణము.

“ఇది శిలాశాసనము. క్రీ. శ. 890 ప్రాంతములఁ బుట్టినది. శ్రీ రామయ్య పంతులుగారిది నన్నయ్యకు పూర్వపుదనియేకదా నిర్ణయించిరి. ఇందలి పద్యములు మధ్యాక్కరలు. వీని నన్నయ యెక్కువగ వాడియున్నాడు. ఇకనన్నయకు సమకాలమునఁబుట్టిన పద్యముల జూపెదను. ఈక్రింది సీసమాలిక [అనగా శ్రీశకు నేందులు భూపతిపైశైల యనునది] దీర్ఘాసిశాసనము నందున్నది. ఇది చాలవరకు నన్నయ సీసనియమముల బోలియున్నది. ఆం. వా. చ. 154 పేజి.

ఈ సందర్భమునుబట్టి గ్రంథకర్తయొక్క ప్రయత్నము పద్యనిబద్ధమగు వాఙ్మయము నన్వేషించుట శాసన వాఙ్మయమును గ్రహించుటయేకాని మొత్తమున [పద్యగద్యోభయాత్మకముగ సమన్వయించి చరిత్ర రచనసేయుటకు మాత్రము కాదని స్పష్టమేకదా ఇకదీని నింతట వదలి గ్రంథకర్తచేసిన సాంఘిక మతానుసారమగు చారిత్రిక రచనమునే పరిశీలింతము.

వెనుకటి పుటలలో సంఘశాస్త్రసంబంధిగ వీరి చరిత్రరచనారంభ స్వరూపము కొంచెము ప్రదర్శింపబడినది. అందు శంకరునినాటి బౌద్ధజైన మతవాఙ్మయ నిర్మూలనము (అనగా పేరుమాత్రము) గురించిన గ్రంథభాగము ప్రదర్శించితిమి. ఇటుపై ప్రదర్శింపబడెడి గ్రంథభాగములు తక్కిన మతసాంఘికములకు సంబంధించినవి. ఇందలిసారమును మాపాఠకులే స్వయముగా కనుగొనగలరు.

‘బౌద్ధమతమునుండి జైనమతము పుట్టినదని చెప్పుదురు. దానిసత్యమెట్టిదైనను జైనుల కాలమునందును దక్షిణదేశమునందలి దేశభాషలన్నిఁటియందువలెనే ఆంధ్రమునను జైనవాఙ్మయము వ్యాప్తినొంది యుండవలసియున్నది.

ఆ. వా. పే. 50

కన్నడదేశమునందేకాక యాంధ్రదేశమునందలి రాజులుకూడ జైనులైరి. కాకతీయులు కొందరు చాళుక్యులును జైనులైరని చరిత్రలే నుడువుచున్నవి. * * * మధుర పాండ్యరాజులు జైనులు [ఆధారమేమి?] ఘూర్జర దేశము జైనాక్రాంతమైయుండెను. ఇది యంతయును పదునొకండవ శతాబ్దారంభస్థితి. అప్పటికి [11 వశతాబ్దారంభమునకు] కంచిలోనున్న పల్లవులు ఒరయూరు తంజావూరులు లోనున్న చోళులునుగూడ బ్రాహ్మణమతావలంబకులై జైనులకుఁ బ్రత్యర్థులుగ నుండిరి [ఇది స్వవచోవ్యాఘాతము దెచ్చుటలేదా?] ఆ. వా. పే 51-52.

అప్పటకి ఆంధ్రరాజులలో [అనగా నాంధ్రదేశమును విష్ణుకుండినులు సాలంకాయనులు పల్లవులు పాలించు నాటికి] కొందరు బౌద్ధజైనమతప్రియులు లేక పోలేదు. ఆరవశతాబ్దమునకు పూర్వము ఈ దేశము బౌద్ధజైనాక్రాంతమైనను పిమ్మట నున్న పూర్వచాళుక్యులు బ్రాహ్మణమతప్రియులైరని చెప్పవచ్చును [అనగా నర్థ మేమి?] ఆ. వా. పే. 54-55.

అరికేసరివంటి కొందఱు చాళుక్యరాజులు పశ్చిమచాళుక్యుల రాజ్యమగు కల్యాణపురమునకు వేంగిదేశమునుండి కవులను తీసికొనిపోయినట్లును 9-10 శతాబ్దములలో వేంగిదేశమునుండి జైనమతప్రవిష్టులైన కొందఱుకవులు కర్నాటదేశమునకు వలసపోయినట్లుండుటచేతను [ఎచ్చటనున్నది? ఆధారమేమి? చూపవలదా?] పూర్వచాళుక్యులు వేగిదేశమునకువచ్చిన కొంతకాలమువఱకు వారు జైనుల జోలికి బోవకపోయినను 8-9-10 శతాబ్దములలో శంకరాగమనమునకు పిమ్మట జైనుల కొత్తుమకల్గించినట్లు మనము సంపూర్ణముగ నమ్మవచ్చును.

ఆ. వా. చ. 55 పుట.

కాని ఈవచ్చులు ఏయాధారమున వచ్చినవెచ్చులో రూపింపవలసిన భాగము చరిత్రకారునిపై నిలచియేయున్నది. దీనిని వారెప్పటికైనను నిర్వహింపక తీరదు. పింగళిసూరన గ్రంథములపై కొంతలోపములను కొండంతలుగా నొనర్చి కవిత్వతత్వనిగారణలు సాగించినపెద్దలకు-నిరాధారములై గాలిలోగట్టిన మేడమె

ట్లువలెనున్న ఈయోజనలు వెఱ్ఱియూహలకు జేరినవి గాక విమర్శనాపద్ధతి ననుసరించిన దృఢసత్యములుగా దోచుటమాత్రము తప్పక ప్రశంసింపదగినది!

జైనమత విజృంభణ కాలమునందలి ఆంధ్రవాఙ్మయమును గురించిన చరిత్ర వివరణము పుక్కిటిపురాణములతో ముగిసినది. ఇకను ఈ క్రింద నుద్ధృతములైన గ్రంథసందర్భములు శైవమతప్రచారకాలమునందలి వాఙ్మయమును గురించినవి.

"వీరశైవమతము బౌద్ధమతమువలె నతిశీఘ్రముగ దేశమునందన్ని భాగములయందును వ్యాపించెను. ఈజయప్రాప్తికి గారణము వీరశైవ వాఙ్మయమంతయు సులభమైన 'జాను తెనుంగు'లో వ్రాసియుండుటయే. స్త్రీలు బాలురు పామరులు గూడ జదువుట కనువైన పాటలు పాండిత్యముకాని సాహిత్యపరిశ్రమముకాని యవసరము లేకుండ జదివి గ్రహింపగల ద్విపద కావ్యములును సులభశైలిని మతవ్యాప్తియే యుద్దేశముగనుంచుకొని ప్రవాహభాషలో నీగ్రంథములు వ్రాసియుండుటచేత నీమత మతిశీఘ్రకాలమున వ్యాపించినది. ఆ. వా. పే. 62.

ఈవాక్యములలో బౌద్ధమతమువలెనే వీరశైవమతమును దేశమునందన్ని భాగములలోను అతిశీఘ్రముగ వ్యాపించినదట ఇది యథార్థమే. అనగా శీఘ్రముగ వ్యాపించినమాట యథార్థమే. కాని బౌద్ధమతము వ్యాపించిన విధమును వీరు స్పష్టపరచియుండినచో దానివలెనే ఇదియును అనుట యుక్తము. మఱియును ఆమతమిట్లు వ్యాపించినది ఈమతమట్లు వ్యాపించినదన్నంతమాత్రముతో ఆకాలపు వాఙ్మయమును గురించిన చరిత్రలేఖనము పూర్తికాజాలదు. సూక్ష్మముగనైనను, స్థూలముగనైనను అనుమానికముగనైనను ఈవిధమగు ప్రమాణమును ఉల్లేఖింపవలసియున్నది. అట్లుగాక స్త్రీలు బాలురు పామరులుగూడ జదువుట కనువైనపాటలు ప్రవాహభాషలో వ్రాయబడినవన్నంతచేత తాత్కాలిక వాఙ్మయచరిత్రలేఖన సంపూర్ణతనొందజాలదు. కనుక గ్రంథకర్త గ్రంథదృష్టాంతములను జూపి ఆయా కాలమునందలి వాఙ్మయపు చరిత్రను నిర్దేశింపవలసియున్నది. మనచరిత్రకారు డట్లు చేయలేదు. కాని ఆకాలపు (అనగా శైవమత కాలపు) వాఙ్మయచరిత్రను

సలక్షణముగ రూపింప వీలయిన సోపానాంశములు అనేకమున్నవి. ఇందులకు క్రిందివాక్యములు ప్రమాణములు.

మదిమబ్బిసంసార మాయాస్తవంపు
పదములుతుమ్మెద పదముల్ ప్రభాత
పదములు పర్వత పదములానంద
పదములు శంకరపదముల్ సివాళి
పదములు తాళేశుపదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు సంజ
వర్ణన మతి గణవర్ణన పదము
లర్ణవఘోషమ ఘూర్ణిల్లుచుచుండ.

పం. ఆ. వా. చరిత్ర.

శైవమత ప్రచారకాలమునం దిట్టిపదములనేకమున్నట్లును పండితారాధ్య చరిత్రమునందలి పైవాక్యములను బట్టియును నవచోళచరిత్ర నవనాథచరిత్ర మున్నగు శైవగ్రంథములలోని సందర్భములను బట్టియు నూహించుటకు మాత్రమేగాక పైని పేర్కొన్న పదములలో రెండువంతులు ఇప్పటికిని లభించుచున్నవి. (నాకిటీవల 'సంసారమే మాయ' అను మకుటముతో నున్న రెండువేల చరణములు గల పాట యొకవృద్ధురాలివలన వినుట తటస్థించినది.) తుమ్మెదపదములు గొబ్బిపదములు వెన్నెలపదములు మున్నగునవి యక్షగానములలో కనబడుచున్నవి.

జైనబౌద్ధమత ప్రచారముగల కాలమునందలి - జైనబౌద్ధనిర్మితమగు - వాఙ్మయము నశించినదనుకొని వదలివేసినను శైవమతప్రచారమునందలి వాఙ్మయము ప్రస్తుతముపలభ్యమానమగుచుండుటచేత ఈ వాఙ్మయము ఏయేరీతుల నేయే విధములనెన్నెన్ని పరిస్థితులలో నభివృద్ధిగాంచినదో దిగ్దర్శనముగనైనను స్పష్టము చేయవలసినది ముఖ్యముకాదా? అయినచో చరిత్రకారు లేల చేయలేదు? ఇందులకు కారణము సులభముగ గోచరించుచునేయున్నది.

శైవమత ప్రచారసందర్భమునందువలెనే వైష్ణవమత ప్రచారకాలమునగూడ గేయములు మున్నగు ఛందోభేదములలో సాంధ్రవాఙ్మయ మభివృద్ధినొందినట్లుగ సూచనలు మాత్రమేగాక ప్రత్యక్షముగ గొంతవాఙ్మయము నిప్పటికి నిలచి యున్నది.

ద్విపద చిన.

శ్రీరమాలోల యాశ్రితమానిపాల ఘో
రాసురసంహార కుదాద్రితిధీర ?

భ

ధారాధరశ్యామ ధర్మాభిరామ మా
రారిసుస్నేహ మాయాద్రిమోహ

నాకుంగరక్ష చంచత్కృపావీక్ష నీ
రేరుహాధ్యక్ష నిర్ణ...శిక్ష

కారుణ్యమయశీల కరుణాలవాల సా
రారికాంతాగర సమ్యత్కుటార

లాలి ద్విపద మహార్ణవ మేలుకొలుపు
నప్పగింతయునల్కయు హారతియును
జో లకీర్తన సీసంబు జూర్ణికలను
వినుతిజేసెద పదకొండువిధ్ధ పాటల

ఇయ్యది రామానుజ పన్నపమున్న శిక్షికతో కొండపల్లి కాగితములలో వ్రాయబడియున్న ప్రతిని ఒకపల్లెటి సాతానులయొద్ద చూచితిని. అందుపైని పేర్కొనబడిన పద్యము మాత్రమేగాక అందువ్రాయంబడిన క్రమముననే రామాయణ గాథయంతము పదునొకండు విధములగు గేయఛందస్సులతో కూర్పబడి యున్నది. ఇట్టులు వివిధములగురూపములతో వివిధములగు రేఖలతో విలసిల్లుచు

క్రమాభివృద్ధి నొందిన వాఙ్మయముయొక్క చరిత్రము సాధారణముగా సాంగముగ సక్రమముగ రచింపబడవలసియుండుట ముఖ్యముకాదా? అట్టి వీగ్రంథమునందు కూర్పబడియున్న వోలే వోయనుటకు సహృదయులగు పాఠకులే ప్రమాణ గాగలరు. ఇక నీవిషయము నింతటితో వదలిపెట్టుచు 'కాలమహిమ] [వాఙ్మయాభివృద్ధి' 'అజ్ఞాతయుగము,] అనుశీర్షికలతో చేసిన, చర్చలను ఒకటి రెంటిని ప్రదర్శించి అటుపైని ప్రజ్ఞాతియుగపు వాఙ్మయ చరిత్రమును విమర్శించుకొందము.

"అజ్ఞాత యుగమునందలి కావ్యములెట్టివో చెప్పలేము. ఉన్నవని చెప్పు కావ్యములు లక్షణ గ్రంథములు. ఈయుగమునందు భాషా సంప్రదాయము లనేక బుద్ధిమంతులు పరికించు చుండిరని తోఁచుచున్నది,,

ఆ. వా, చ. 108. పే.

ఈ వాక్యములవలన చరిత్రకారుఁడు అజ్ఞాతయుగము నందలి లక్షణగ్రంథములు మిగిలియున్నవని యొప్పుకొనుచున్నాడు. ఇయ్యది కొంతవఱకు సత్యప్రియతను చాటుచున్నది. మంచిదేకాని లక్షణగ్రంథము లున్నవని నిశ్చయమైనప్పుడు తదాధారముగ ప్రాచీనమగు నాంధ్రవాఙ్మయ స్వరూపము నేల వివారణ సేయ లేదో తెలియకున్నది.

" పురాణయుగములో నన్నయకాలము- అనగా 11 వ శతాబ్దము నాటికి కావ్యరచనము మతవ్యాప్తి కొనరించిరి.]

(ఆ. వా. 108. పే.)

12 వ శతాబ్దములో నన్నెచోడుడు బద్దెనలవంటి రాజకవులుండుట కిదియే యరణము (అనగా రాజుకవుల నాదరించుట కావ్యములను వ్రాయించుట వ్రాయుట కీర్తికరము అని తలంచుట) అని చెప్పవచ్చును.

ఆ. వా. 109. పేజీ

యిట్టివారు అనగా బయ్యన్న భాస్కరుడు తిక్కన్న కములనాభామాత్య చూడామణి బోటివారు 12, 13 వ శతాబ్దప్రాంతముల కవులు. వీరు సాధారణ

కవులుకారు అనగా కేవలకవులుగారు. ఆకాలమునందసాధారణ మేధావంతులని విద్యాధిభిక్షులని దేశరక్షకులని పేరుగాంచిన మహాత్ములే కవులైరి.

ఆ. వా. చ. 109. పే

ఇయ్యవి ఆంధ్రవాఙ్మయ చరిత్రమునందలి అజ్ఞాత యుగమునందున్న వాఙ్మయమును చర్చించుచున్న యాదర్శవాక్యములు. వీనివలననే అజ్ఞాతవాఙ్మయమును గురించిన వీరివిమర్శనలు పాఠకులకన్నులకు మూర్తీభవించుచున్నను ఈసందర్భమునందు మఱొక చిన్నవిషయమును గమనింపనిదె విచారణాంతిగమునకు పోవుట అంతన్యాయముకాదు.

"తెలుగుదేశమునందు బుట్టిన - తెలుగుమాటలాడగల - తెలుగువారు స్త్రీలైన పురుషులైన గల్పించినది తెలుగుకవిత్వమగును. అంతనఊకేల వారూహించిన తలపులు వారుపొందిన భావములుకూడ నాంధ్రవాఙ్మయచరిత్రకు కథకంగము లే. అట్టి తలంపులు భావములును గద్యమునగానిండు పద్యమునగానిండు పదములగానిండు పాటలగానిండు - కూర్చినది వాఙ్మయము."

ఆ వా. 122.

ఈమాటలు మెచ్చదగినవి. వాఙ్మయ చరిత్రకారుని వంటివారు నడువవలసిన మార్గమిదియే. కాని మనగ్రంథకర్తకు ఈభావములు - ఈయాదర్శవాక్యములు సుస్థిరములైనట్లులేదు. కాక తాళీయముగా నింతటి యౌదార్య సమన్వితములగు వాక్యములను వ్రాసినచేయియే మఱిరెండు బంతులక్రిందికి దిగసరికి ఏమి వ్రాయుచున్నదో గమనింపుడు.

"ప్రత్యక్ష నిదర్శనములవలన క్రీ. శ. 8వ శతాబ్దమునుండియు వాఙ్మయమున్నట్లు తెలియుచున్నది 10వ శతాబ్దమునుండి కనబడచున్నది. * * * అంతకు బూర్వచరిత్ర నజ్ఞాతము. దానికైనకథలు లేకపోలేదు."

ఆ. వా. 122 పేజి.

మారినది భావము. 8వ శతాబ్దినుండి యున్నట్లు తెలియుచున్నదని వీరన్న వాఙ్మయము [వీరిభావము ప్రకారమే చూ. ఆ. వా. 152-158] పద్యకవిత్వమును

గురించినది. 6వ శతాబ్దికి పూర్వమే అధమము ఒకటి రెండు శతాబ్దులనాటికే వాఙ్మయముండనిచో 6వ శతాబ్దినాటికి పద్యధోరణికి రాజాలదుగదా అట్టిస్థితిలో ఎట్లును "తెలియుచున్నదని" మాత్రమే వ్రాయవలసివచ్చినప్పుడు ఇంక నాల్గు శతాబ్దులు వెనుకకే యేలజరుగరాదో దురూహ్యము.

ఇంతకును చెప్పవచ్చిన విషయమిట్లున్నది. వీరీపైవాక్యములను వ్రాసిన పిమ్మట భౌతిక కళానిధి చెప్పినకథలోనికి గంతులువైచినారు. భౌతిక కళానిధియను నది బెంగుళూరినుండి 4. 5. ఏండ్లక్రితము టి. సుబ్బరాయశాస్త్రిగారు ప్రకటించిన తెలుగు మాసపత్రిక. అందు ఆంధ్రవాఙ్మయమును ఎన్నిగాయములనుండి ఎందరెందరో ఆచార్యులు ప్రవర్తింప జేయుచున్నట్లు వ్రాయుచు విశ్వేశ్వర భట్టాచార్యులను వారురచించిన భాషాముకురమునుండి పద్యముల నర్థసహితముగా ప్రకటించినారు. వానిని కవిచరిత్రకారులగు కీ. శే. వీరేశలింగము పంతులుగారు, ఆంధ్రచరిత్రకారులు, హిందూ మహమ్మదీయ చరిత్రనువ్రాసి ప్రస్తుతము ఆంధ్ర వాఙ్మయ విమర్శకులలో నొక్కరని పేరెన్నిక గాంచిన లక్ష్మణరావుపంతులు మున్నగువారు విమర్శించి అంతగా విశ్వాసముగాదని రూపించినారు. కనుక- అనగా ప్రపంచమంతయును కాదన్నది గనుక - వీరికానని రూపింపవలయునని యుత్సాహమున్నట్లున్నది. మంచిది. అది కొంతవఱకు సుగుణమే. కాని కానని రూపింప దలచుకొన్నప్పుడు - అట్టిగ్రంథములు కల్పితములని వాదోపవాదములు జరుగుచున్నప్పుడు - సత్యచరిత్రాన్వేషకులగు వీరుచేయవలసిన పనియేమి? స్వయముగా - తాము ఆసుబ్బరాయ శాస్త్రులు గారియొద్దకు బోయి ఆప్రాచీన గ్రంథములున్నవో లేదో కనుగొని యున్నచో బయలుకు తెచ్చి ప్రత్యక్షముగా ప్రదర్శించి కాదన్నవారిచేత నౌననిపించ వలసియున్నది. అట్లుచేసిరా? లేదు. మఱి వీరుచేసినదేమియని ప్రశ్నించెదరా? అట్లయిన ఈక్రిందివాక్యములు జదివిన సమాధానము రాగలదు.

'ఈపత్రిక ప్రకటించిన శ్రీసుబ్బరాయ శాస్త్రిగారిని నేనొకసారి చూచితిని, వారుపన్యసింపగ దణుకులో వినియుంటిని. * * వారిమాటల యందు నాకు విశ్వాసముండెను. అనగా - ఇవి పత్రికలు - యీనగుమ గవుల

చరిత్రమును దిరిగి ముద్రించి ప్రకటించిన శ్రీ. రా. వీరేశలింగము పంతులువారికి వారికోరికపై నిచ్చియుంటిని. * * కానివారవి పరిశీలించిరో పరిశీలింప కపోయిరో * * * ఇవియన్నియు మనయిప్పటి పండితుల కల్పనములని కొట్టివేసినారు. మనభాష యెరవముకంటెం బ్రాచీనమైనదని చూపుటకిట్లు మన వారు కల్పించిరిగ్రంథములని తాముస్వయముగ జూచినట్లు నిర్ణయించినారు. "శ్రీ పంతులుగారి కలము నిరంకుశముకదా! వారి యభిప్రాయమునకు సరిపడని వారందఱు నసత్యవాదులని గ్రంథస్థమొనరించుట వారికి నైజమైపోయినది. ఇది చరిత్రకారునికి గొప్పలోపము." ఆ. వా. 143 పేజి.

వీరేశలింగము పంతులుగారు ఆగినుండి అంతినుకడుకు ఒక్కరీతిగ చరించి నారు. ఏవిషయమునైనను ఆయన కంటితోజూడనిచో - అత్రాపి ఇట్టి అభూత పూర్వవిషయములలో తగినంత ఆధారము గోచరింపనిచో - సుతరాం - నమ్మరు. నమ్మజాలనని బహిరంగముగ జెప్పునంతటి దృఢాభిప్రాయులు. అట్టిచరిత్రకారుని లోపమును ప్రకటింపదలచిన మనచరిత్రకారుడు చేయవలసినపనిఏమో పైన తెలిపి యే యున్నాము. కాని అట్లుచేయకయే సమకాలికుడగు నొకచరిత్రకారుని- తనకంటె నెన్నియో మడుంగులు దేశాభిమానము భాషాభిమానము గలవానిని-ఖం డితముగ నభిప్రాయము నిచ్చెడివాడని దేశీయులు నమ్మినవృద్ధుని - కీర్తికాయుని గుఱించి ఇట్టివ్రాతలను వ్రాయుటయేగాక వానిని గ్రంథస్థములను జేయుటమా త్రము - నిజముగా గొప్పలోపమనక తప్పదు.

ఈరీతిగా భౌతికకళానిధిని గుఱించిన ప్రశంసను జేయుచు వాఙ్మయచంక్రమణము ను జేయుచు అకలంకవాదమునకు (అనగా ప్రాకృతవ్యాకరణకర్తయగు భట్టాకలం కుడెవ్వరు అనువాదమునకు) దిగి - క్రమముగా ప్రవాహ ప్రమాణాధ్యాయమునకు పాత్రములైనఏడు ప్రకరణములుముగించి ఎనిమిదవప్రకరణములో "నన్నయకుం బూర్వ ప్రవాఙ్మయ మేలనశించినది" మున్నగు పకుటములతో "నిమజ్జనోన్మజ్జనదశం దయ్యెన్" అనిపించినారు. ఈసందర్భమునందు వీరుప్రదర్శించిన హేతువాదముల సామంజస్యము పొడగట్టుటకై ఒంటి రెండంశముల నుదహరించెదను.

(1) "నన్నయకు బూర్వమున్న వాఙ్మయమునశించుటకు నన్నయయే కొంత కారణము. * * * * నన్నయ తెలుగుభారతము పేరితో నారాయణభట్టు సాహాయ్యమున సంస్కృతభారతమునే కొంచెముమార్చి వ్రాయగలిగెను. అంతకంటె సులభమైన యధర్వణభారతమున కాతడు భయపడియుండును. అథర్వణఛందమునకు బ్రతిగ లక్షణసారమునురచియించెను. అదివఱకె కొంతలక్షణమున్నప్పుడుగాని నన్నయ "సారము" వ్రాయనవసరము లేదు.   పే. 163.

*   *   *   *   *   *

(2) "తిక్కన సోమయాజి—తిక్కన గణపతిదేవుకడకుబోయి భారతకథలవినిపించి వాదమున నచ్చటిజైనులనోడించి వారిని గ్రంథములతో దేశమునకు దూరులనొనర్చెననియును వారమరసింహుని గ్రంథములు దక్క తక్కినవన్నియును నిరుపయోగములగునని శపియించిరనియుగూడ కనబట్టుచున్నవి.

ఆ. వా. పే. 165.

*   *   *   *   *   *

(3) మన పూర్వవాఙ్మయ మదృశమగుటకు మనము జైనులయెడజూపిన శత్రుత్వము కారణమని పలుమారులు నుడివియున్నాము.   పే. 167.

*   *   *   *   *   *

(4) పురాణప్రీతి—ఇదిగాక మన భారత భాగవత రామాయణములే మన పూర్వవాఙ్మయ నాశమునకు గారణములని చెప్పవచ్చును.   పే. 168.

*   *   *   *   *   *

(5) శైవవైష్ణవ మతభేదములు. శైవవాఙ్మయము చూచిన వైష్ణవులకనిష్టము. వైష్ణవుల వాఙ్మయము నజూచిన శైవులకనిష్టము.

*   *   *   *   *   *

(6) "మహమ్మదీయులు— * * * కావున హిందువుల దేవాలయములను గ్రంథములను వారు మత తమ వ్యాప్తి కడ్డములని నిరసించిరి. నాశనమొనర్చిరి. అది వారొనర్చిన యకృత్యము. ఆ. వా. పే 171.

(7) "అజ్ఞానము. (8) పండిత పుత్రులు. (9) తెలుగన్న నిరసన— పే 174 178 చూడుడు.

ఈ కారణములు ఎంతవఱకు నిస్సారవహములో తెలుపనక్కఱలేదు. పొరుగువాని సిరిలి గుడ్డివేసికొనుటయే గున దారిద్ర్యమునకు కారణమగుచో— హోలుసేలుగా కొంపలంటించినప్పుడు చుట్టుప్రక్క లిండ్లు కాలి మధ్యనున్న అగ్నిదుని యిల్లొక్కటిమాత్రమే కాలకుండ నుండగల్గినచో— బ్రహ్మసూత్రపారాయణము పెద్దబాలశిక్ష లోపించుటకు కారణమగుచో— పైకారణములన్నియును గూడ నన్నయకు పూర్వపు వాఙ్మయము నశించుటకు తప్పక కారణములు కావలసినదే. ఇది బ్రహ్మవ్రాతయే. తప్పదు. అందునను తక్కిన కారణము లెట్లున్నను— ఆంధ్రదేశములో— ఆంధ్రవాఙ్మయ పోషణకు— తమవ్యాప్తికి తమ గ్రంథవ్యాప్తికి అడ్డురాక— భద్రాచలాది హిందూ దేవాలయములకు— బ్రాహ్మణమత బోధకులు తత్సాధకులగు స్వేతరులకు (వీరును బ్రాహ్మణులే; పండితులును కవులును మంత్రులును యజ్వలు నైనవారే!) మడిమాన్యములను ఇచ్చి గౌరవించి వాఙ్మయాభివృద్ధికి కారకులైన మహమ్మదీయులనుగూర్చి— ప్రాణములకన్న మిన్నగా గ్రంథములను వల్లించి వ్రాసి సేకరించి కాపాడిన పండితులకు తత్సంతతివారిని గూర్చి వ్రాసిన యీవ్రాతలు ఎంత సమంజసములు సువర్ణపతకముల బహుమతికి భాజనములు! భవిష్యదాంధ్రజాతికి చిరస్మరణీయములుకదా!

ఇప్పటికి ఎనిమిది ప్రకరణములు ముగిసినవి. ఈ లేఖయును పెరిగినది. ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారుని చరిత్ర రచనాకౌశలమును చదువరులకు తేటతెల్లమైనది. గనుక పిష్టపేషణమును జ్ఞప్తికి తెచ్చుచున్న తొమ్మిదవ ప్రకరణమును ఇంతతో వదలిపెట్టుచున్నందులకు పాఠకులు క్షమింపప్రార్థితులు. మనమింతవరకు జేసిన విచారణమున దేలినసారాంశమును చదువరులు సులువుగా గుర్తింపగలరు. కాన దీని నింతతో ముగించుచున్నాము. రాబోవు వ్యాసమునందు సాధన సమన్వయమును విచారణ సేయుదము.

తత్త్వవివేచకుడు.

# సమర్పణము

పంద్యారం వెంకటసుబ్బయ్యశర్మ

స్రస్తకేశములు పార్శ్వంబుల మెలఁగ
నశ్రుబిందువులు పయంటపైఁబడఁగ
బిరబిర నరుదెంచి పితృమ్రోలఁగూలి
కఁడుఁబొంగి యేడువ దొడఁగె నబాల.

కాని రారాజుదిగ్గన లేచిపోవ
సాఁగె శిలాకర్కశ మనస్కుఁడగుచు.

అపుడు సుంజరి రయమారఁగ లేచి
తన యలరుంగేలఁ దండ్రికేల్బట్టి
చనసీక నిలిపియాతని వంకఁదిరిగి
పలికెనీరీతి నాపదమూర్తిపూస.

అక్కటా తండ్రి నీవనుకంపనుడిగి
యిట్లు సేయందగవే వచియింపు?
రఘునాధయోగి జరాభారభుగ్న
సకలేంద్రియుఁడు వినఁజాలుట యెట్లు
పొల్లువోకుండ నభోవాణిమాట?
అతఁడెదో వచియింపనగునని నీవు
వివరింపకట్లు గావింపఁగాఁదగునె?
చిరకాలమరసి పెంచినబకదారి
నెలమి సిపాదునకీయఁగాఁ గలమె?
కరుణపుట్టదె యిచ్చకాలంబునందు?

ఎల్లప్రాయమునఁ జరియించునే నేడ?
బలియేడ? నీవది సలుపుట యేడ?
అయ్యయో తండ్రి సద్యఃఫుల్లసుమము
నగ్నిలో వేయ నీయాత్మ యెట్లోర్చు?
రిపులతో నీవు పోరింబోరి పోర
గెలుపు సంపదఁ గోరి వలయునుగాక
నను బలియిచ్చినంతనె నీకు జయముఁ
గలుగఁ జేయునే? దేవి! తలపోయుమయ్య
తలిదండ్రులీరీతి సలుపుదురయ్య!

ఇంతలో రారాజు హృదయంబు గరిగి
కన్నీటి కాలువగా మారిగారె;
నంతట నెమ్మొగంబవలకుఁ దిరుగ
మంజరి మరల నీమాదిరిఁ బలికె—

జనక మోమటు ద్రిప్పి కొనినావిదేమి?
కలిగెనా యేమి నీకర్ణంబులందు
బాధయే దేని నాపలుకులవలన
నూరకొందునె వాగుటుడిగి నేనింక?
చీఁకటులెల్ల నశించినపిదప
నానందమయమై యజాండముదనరఁ
గాంచి పుల్గులు మనఃకమలముల్విరియ
హాయిగాఁ బాడెడు పదనులయందు!
దూఁగుటుయ్యెలఁ బొత్తులనిద్రవోవు
నాచెంతకరుదెంచి నామేను నంటి

మంజరీ లెమ్ము నీమంజులవాక్య
పుంజంబు విన వేడ్కఁ బుట్టెడు నాకు
సారవిహీన కఠోరరావములఁ
గూసెదు నీవుల్లుగుమి వాటి నీవు
వెక్కిరింపుము తల్లి యొక్క మాటాడి!
అని లేపి సారెకు ననుఁ బల్కరించి
ముదమందవే నీవు మనుపు నాతండ్రి
నాగళంబున నీమనంబునఁ బోలె
మారుపు నేఁడు సంభవమాయెనో టు!
జలపూరితాంబకంబుల జూతువెదియుఁ
బలుకాడ విదియేమి పాపమో కాని

అనిపల్కి మంజరి యవనతవదన
కమలమై యూర్పులు గదుర క్షణంబు
చేష్టలుదక్కి నిల్చి పదంపడియిటు
వాక్రుచ్చె గద్గద స్వరమున నపుడు

చిరమిలఁ బేరఁటాలునయి చెల్వుగ నేమతునట్లు కూర్మితో
వరమునొసంగ దేవిపదపద్మములందు వివాహవేళ నా
శిరముడివోని బత్తిమెయిఁ జేర్పఁదలంచితి, దైవమాయ నీ
కరణినొనర్చెఁగాఁ దగినకాలమువచ్చుటెఱుంగక క్కటా!
ననుబలియిచ్చి కీర్తిఁగొనఁగాఁదలంచిన తండ్రికెట్టులేఁ
బెనఁకువలో జయంబు నొదవించునయేని జగంబుతల్లి! నే
నునునసువుల్దొఱంగుదు ననూనముదంబున నెప్పుడేని యీ
తనువుఁ ద్యజించుటే పనిగదా ననుఁబోలిన వారికీశ్వరా?

అనికన్నులన్మూసి యవనిపైఁబడియె
నవనీశుఁడంతట ననలకుఁజనియె

రారాజుపుత్రికా రత్నంబుగోసి
దేవికిబలియిచ్చె; వానికి రిపులు
రారాజుఁజంపి తద్రాజ్యంబుగొనిరి;
లేఖినీ! యాత్ర చాలింపుము నీవు!



## ఓదార్పు

పెనుమర్తి వేంకటరత్నము

గాఢతమసంబులెల్లడఁ గ్రమ్మికొనియె!
లోకమంతయు నిద్దురలోమునింగె!
విహగసంతతి సుప్తినివీడకుండె!
కాననపరిభ్రమణమిట్లుఁ బూనెదేలా!

తెలికనుంగవ నశ్రుధారలుస్రవింప
నూటికవగర్చెదేలా! విద్యుల్లతాంగి!
నశ్వరంబైన జగమున నాసవిడఁచి
కాయమును బాయనెంచెదే కారణమున?

కుందనము వ్రాని మేని చక్కందనమ్ము
నటవిఁగాచిన సాంద్ర జ్యోత్స్నలవిధాన
నిటుల వెతలనుఁ బెట్టుదేమిటికి! చెపుము!
సంశయమ దేల! సోదర సముఁడ నేను!

* *

క్రూరసత్త్వవికీర్ణ మా ఘోరవనులఁ
గేలఁదాకినమాత్రాన వాడిపోవు
తీవియవిధానఁ దనరుమైఁ దీవనిటులఁ
బాధపెట్టంగ నేల! నోపంకజాస్య!

* * *

ధవుని రాదరణ నిట్టులఁ దల్లడిలెదో!
జగము దుఃఖమయంబాచు నగపడెనో కో!
లేక బోయిననిట్టుల శోక మొందఁ
దగిన కారణ మెదియొ! సత్వర మా జెపుము!



# పూర్ణగర్భిణి

కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు.

కోసి పువ్వుబుట్టలో వేసికొనిన తమ్మి
పగిదిఁ గళలెల్లఁ దొలఁగె నీమొగము మిగుల!
చెక్కుగుంటల రసములు చెమ్మగిలవు,
కనులు గుంటలు వడివోయెఁ గలువకంటి!

భానురశ్మికిఁ గసుగందు వాడినట్టి
జాజితీవియఁ బలె సొంపు జాఱువాఱె
నెలమి నెసకంపుఁజిఱునవ్వు లెసఁగ దాయె
పూర్ణగర్భిణి! నీముద్దు మోమునందు.

చెక్కుచెదరదు సీమాలసీమఁ గురులు
కుంకుమపురేక డాఁగె నాకురులనడుమ
కుటిలమై తోఁచె నీదుభ్రూకుటియుగంబు
వదనకమలము పసివాఱె వాడుకతన.

ఫలభరోద్రేకముచ నమ్రమగు లతిక వలకు
జగ్గుతీవియకైవడి జగ్గెమేను
పూర్ణగర్భిణి! నవమాసములును నిండి
సొగసులై యొప్పె నీనిండుచూలుకతన.

ఈక్షణంబునఁ బ్రసవింతో యేమి యగునో
యని యలందురి నల్లాడి యడరి కడకు

గడియలోపల సుఖముగాఁ గంటివీవు!
చందమామను బురుడించు కొమరును జెలి!

మగఁడు రాఁడాయె నని చాలవగలఁబొగిలి!
ప్రియుని నెమ్మోముఁ జూడఁ గోరితివి తరుణి!
ప్రియుఁడు వచ్చెను- నిదుకోర్కెలును దీరె
ముద్దుకొమరునిఁ గంటి వోముద్దుగుమ్మ!



# కాలము మారుతుంది



వేంకటరామయ్య పంతులు కృష్ణా జిల్లా చల్లపల్లి జమీందారుగారి దగ్గర చాలాకాలమునుంచి హుజూరు జవాబునీసుగా పని చేస్తూన్నాడు. ఆయనకు నెల 1కి జీతం ముప్పదిరూపాయిలే అయినప్పటికి హోదా మాత్రము చాలాపెద్ద. ఆపరగణాలోవున్న పెద్దపెద్ద రైతులు సముద్దార్లు మొదలగువారెవరైన జమీందారుగారితో యేదైనా పనివుండివస్తేముందీ వెంకటరామయ్యగారి దర్శనం చేసికోందే ఆపని అయ్యేదికాదు. అందువల్ల ఆచుట్టుపట్ల గ్రామాలయందంతా ఆయనకు రైతులలో పలుకుబడి చాలావుంది. ఊళ్లో

తాహశీల్ దారుగాని, డిప్టీకలెక్టరుగాని యింకా యేపెద్దగవర్న మెంటు వుద్యోగస్థుడు వచ్చినప్పటికి మన వేంకటరామయ్యపంతులు గారికి కబురు పంపించితేనేగాని వారికే సప్లయికూడా జమీందారు గారి దగ్గరనుంచి అయ్యేదికాదు. అందువల్ల గవర్నమెంటు ఉద్యోగస్థులంతా యీాయనకు స్నేహితులు కొన్నికొన్నివిషయాల్లో పరగణాలో పెద్దపెద్ద మోతుబరి రైతులంతాకూడా ఏదన్నా పనివుంటే యీాయన ద్వారానే తాహశీల్దార్లకు సబ్ మజిస్ట్రేట్లకు సిఫార్సులు చేయిస్తూండేవాళ్లు. అదృష్టవశాత్తులభించిన యీాపదవివల్ల పలుకుబడివల్ల వెంకటరామయ్య పంతులుకు ఆయన తండ్రి తాతల నాటి నుంచి పారంపర్యముగా వస్తూన్న దరిద్రము తాపోయి దివిపంపింగు ప్రాజెక్టుక్రింద వేలాముల్లో ముప్పది ఎకరాల మాగాణిభూమిసంపాదించాడు. కాని ఆయనభార్య రమణమ్మ కాపురానికివచ్చి యిప్పటికి పదిహేనేండ్లయినప్పటికి ఆమెకు పిల్లలుకలుగలేదు. ఏదేవుడు ధర్మానన్నా వేలెడు మొగమొలక కలుగుతాడేమోనని కాశీనుంచి రామేశ్వరమువరకు కల తీర్థయాత్రలన్నీ సేవించారు- పుట్టలకు చెట్లులకు మొక్కినారు; కనుపించిన గోసాయి దగ్గరనుంచల్లా రక్షరేకులు, తాయిత్తులు తెచ్చి కట్టుకొన్నారు,

ఏమికట్టుకొంటే ఏమిప్రయోజనము; రమణమ్మకు పిల్లలుకలుగలేదు. వేంకటరామయ్యపంతులు కీవిచారముదప్ప వేరేయింకొక విచారమేమీాలేదు. ఈమనోవ్యాధితోనే మంచమెక్కినాడు. చాకరీకి రాజీనామాయిచ్చాడు. క్రమక్రమంగా రోగంవృద్ధిఅయి బ్రతకడన్నంత స్థితిలోకివచ్చాడు. అదివరకాయన వుద్యోగంలో వున్నప్పుడు ఇంటి చుట్టూ కనుపెట్టుకొని వుండే జమీందారుగారి నౌకర్లలో ఒక్కడైనా యిప్పుడాయన యింటికేసిచూడడంకూడా మానేశాడు. రమణమ్మ యింతబతుకుబత్రికిన తనమొగుడికి అవసానకాలంవచ్చే

సరికి మందు తెచ్చిపెట్టే మొగదిక్కుకూడా లేకపోయిందే అని గ్రుడ్లనీళ్ళు గ్రుడ్లగ్రుక్కుకొంటూఉండేది. తరువాత ఏమీతోచక ఒకనాడు వరంగల్‌లోఉన్న తనఅప్పగారికి కబురుపంపించింది. రమణమ్మ అప్పగారిది కొంచెంపేదకుటుంబము. అందువల్ల వెంకటరామయ్యపంతులు బాగాఉన్నంతవరకు వాళ్లకీవీళ్లకీ ఆట్టేపొత్తుకలిసేది కాదు. కాని యిప్పుడుకబురుపంపక తప్పక పంపింది రమణమ్మ.

౨

“నాయనా! వేంకటేశ్వర్లూ! వచ్చావా! మీబాబాయిస్థితి చివరకిలావచ్చింది.” అని రమణమ్మ వేంకటేశ్వర్లును కౌగిలించుకొని ఏడ్చింది. వేంకటేశ్వర్లుకూడా దుఃఖముపట్టజాలక బాబాయిదగ్గరకు పోయి చూచి పలకరించి కళ్లనీళ్ళుపెట్టుకొన్నాడు.

వెంకటరామయ్య— నాయనా నేనుబాగావున్ననాళ్లు మీపిన్ని ఎంతపోరినా మీకుమాకు రాకపోకలే లేకపోయినయి. కష్టకాలానికి నీవయినావుగాని నాఉద్యోగం అధికారం అక్కరకురాలేదు. అవన్నీతలుచుకొని యిప్పుడేమీ అనుకోబోను. మీనానను అమ్మనుకూడా వెంటబెట్టుకొని రాలేకపోయినావా?

వేంకటేశ్వర్లు—అమ్మానాన్నా ఎందుకనో నన్ను వెళ్లమన్నారు. నేనువచ్చాను.

వేంకటరామయ్య—నేనువాండ్లయెడ చేసినపనులన్నీ వాండ్లింకా కడుపులో పెట్టుకొన్నారేమో నాయనా! మఱచిపొమ్మని వుత్తరంవ్రాయి. చుట్టాలైనా పక్కాలైనా బిడ్డలైనా పాప

్తైనా యీాజన్మానకి మీారేకదానాకు అని వేంకటేశ్వర్లును కౌగిలించుకొని ఆవురుమన్నాడు. అప్పుడు వేంకటేశ్వర్లు దుఃఖానికి మేరయేలేదు. ఆనాటినుండి వేంకటేశ్వర్లు పిన తండ్రి పినతల్లి అంటే ప్రాణాలువిడుస్తాడు. వేంకటేశ్వర్లు సహజంగా జాలిగుండెకలవాడు, ఇతరులకు కష్టమువచ్చిం దంటే ఓర్వలేడు. వేంకటరామయ్యకు రాత్రింబగళ్లు విసుగు విరామములేకుండా అహోరాత్రులు చాలాఓర్పుతో సకలో పచారాలు చేస్తున్నాడు. ఏమిచేస్తే ఏమిలాభము. వైద్యు లెంతమందిదగ్గర ఎన్నిమందులుపుచ్చుకొన్నా ఏమినయము కనపడలేదు. రోగి జీవించనని బాగా నిశ్చయించుకొని ఆగ్రామములోవున్న పెద్దమనుష్యులను పిలిపించి తన ఆస్తిని గురించి విల్లొకటివ్రాయించాడు. ఆవిల్లులో 10 ఎకరముల భూమిమాత్రము తనభార్యకు దానదమున విక్రయస్వాతగా వ్రాసియిస్తూ రమణమ్మ వేంకటేశ్వర్లును దత్తత చేసుకొనే టట్టు అందువల్ల తనకుమిగిలిన పొలము, ఇళ్లస్థలము యావ దాస్తి వెంకటేశ్వర్లుకు సంక్రమించే ఏర్పాటుచేశాడు.

## 3

రమ—ఏమండీ ! మనకు కడుపున పుట్టిన బిడ్డవుంటే మీారునాకు 10 ఎకరాలు వేరుగా వ్రాసియిస్తారా! వెంకటేశ్వర్లు కష్టకా లంలో మనకు బిడ్డకన్న ఎక్కువగా సహాయం చేస్తూన్నా కూడా మనమిట్లాచేస్తే యేమంటు -! లోకము! మీారీఆస్తి నాకుప్రత్యేకంగావ్రాసి యీాయకపోతేమాత్రం వెంకటేశ్వర్లు

నాకు పట్టెడన్నం పెట్టకపోతాడా? ఇది నిన్నదగ్గిరనుంచి నాకు మక్తీ కష్టంగా వుందిసుమండి.

వెంకట—ఓసిపిచ్చదానా! అట్లాఅనబోకు - అతనుమంచివాడే! ఏకాలానికేమో! ఎవరికి తెలుసు- లోకంలో మనమొందటిని చూడడం లేదు- ఎప్పుడూ ఒకటేమోస్తరుగావుంటామనుకోబోకు- పోనీ నీత దనంతరం నీవతనికే చెందేటట్టుగా చేయవచ్చును, నాకింతలో యిట్లా వస్తుందని అనుకొన్నామా అనేసరికి- రమణమ్మ భర్త మంచంమీద నుంచి తనలోతాను దుఃఖిస్తూ దొడ్డిగుమ్మం దగ్గర కూర్చుంది. ఇంతలోనే వేంకటేశ్వర్లు వైద్యుని యింటియొద్దనుంచి మందుతీసుకొని వచ్చాడు- "నాయనా! ఇవ్వాళ! ఇంతప్రొద్దుపోయి వచ్చావేమి? నీకోసంచూచిచూచి కళ్లుకాయలు కాచిపోయినయి ఇప్పుడే యీలావచ్చి కూర్చున్నాను," అని అంటూ రమణమ్మవచ్చి వేంకటేశ్వర్లుచేతులో మందుసీసా తీసికొని ఔన్సు గ్లాసులో కొంతమందు పోసికొని భర్తయొద్దకుపోయి పిలిచింది. భర్త పలుకలేదు, ఇప్పుడే నిద్దురపట్టినట్లున్నది. లేచినతరువాత మందిద్దాములే అనుకొని రమణమ్మకూడా వెళ్ళిపరున్నది. వేంకటేశ్వర్లుకు చాలానాళ్లబట్టి రాత్రింబగళ్లు నిద్దురసరిగాలేకపోవుటచేత అరుగుమీద చిరిచాపమీదనేపడి నిద్రపోయినాడు.

## ౪

వెంకటరామయ్యపంతులు కాలముచేసిన కొద్దికాలములోనే రమణమ్మ వెంకటేశ్వర్లును దత్తతచేసుకొన్నది. అప్పటినుంచి రమణమ్మ, ప్రతివిషయం వెంకటేశ్వర్లుతండ్రిఅయిన నారాయణరావుగారితో ఆలోచించి వ్యవహరిస్తూండేది, నారాయణరావుకే సందర్భ

ములోను రమణమ్మ ఎదురుమాట్లాడి ఎఱుగదు. వెంకటేశ్వర్లుకూడా రమణమ్మకు తలలోనాలుకవలె కన్నబిడ్డకన్న ఎక్కువ వినయ విధేయతలతోనే ప్రవర్తిస్తున్నాడు పిల్లవానిచదువుకోసం రమణమ్మ బందరులోనే కాపురంపెట్టింది.

౫

రత్తమ్మ:—ఏమమ్మా రమణమ్మా! పిల్లవాడిపరిక్షలై వేసంకాలపు సెలవలిచ్చారా ఏమిటి? ఎప్పుడువచ్చారు.

రమ:—రాత్రే వచ్చాము!

రత్త:—ఏమిచదువుతున్నాడు మీపిల్లవాడు!

రమ:—ఫోర్తుఫారమీసంవత్సరం పరిక్షకువెళ్ళినాడు.

రత్త:—మఱి పిల్లవాడి పెండ్లిమాటేమి ఆలోచించావు; సంబంధాలేమైనా వస్తున్నవా!

రమ:—సంబంధాలకేమిలే! వెయ్యినూటపదార్లిస్తామని, పదిహేను వందల రూపాయిలిస్తామని పెద్దపెద్దసంబంధాలే వస్తున్నయి. కాని మాఅప్ప మనమరాలుంది. మాకీపరాయి సంబంధాలెందుకు దాన్నే చేసుకొంటాము.

రత్త—మీఅప్పమనమరాలంటే పిల్లవాడి అప్పకూతురా? దానికెన్నేళ్లు.

రమ—అవును; దానికిప్పుడు మూడేళ్ళు. ఇంకానాలుగేళ్ళుంటే దానికే ఏడేళ్ళువస్తయి అప్పుడే పెళ్ళిచేస్తాము.

రత్త—(నవ్వుతూ) నీవెంత వెఱ్ఱిబాగులదానవమ్మా. ఇప్పటికాలం లో అందులో ఇంగ్లీషుచదువుకొనేపిల్లలు అంతచిన్నపిల్లలను చేసుకొంటారా! పూర్వకాలమనుకొన్నావాఏమిటి? ఇప్పుడు మీఅబ్బాయి కెన్నేళ్ళు.

రమ—రేపుచైత్రమాసానికి పదహారేళ్ళు వెళ్లుతయి.

రత్త—ఇంకా నాలుగేళ్లకు పెళ్లిచేస్తే ఇరవైఏళ్ల అబ్బాయికి ఏడేళ్లపిల్లకి పెళ్లాఅని వాళ్లక్లాసు పిల్లలంతా నవ్వుతారేమో కూడా! అయిన ఎప్పుడైనా మీఅబ్బాయిని అడిగి చూ చావా! ఏమంటాడో!

రమ—పెళ్లికొడుకుల నడిగి పెళ్లిచేయడం యింకా మాయిళ్ల ల్లో అలవాటులేదు.—

రత్త—అట్లాగా! విన్నావా! అబ్బాయి వెంకటేశ్వర్లూ! మీ మేన గోడలినట చేసుకొంటావా!

అనేసరికి అది వరకీసంభాషణ అంతావింటున్న వేంకటేశ్వర్లు మొగము చిట్లించుకొనుచు లేచిపోయినాడు - రత్తమ్మ అంతట లేచి “చూశావుటమ్మా! రమణమ్మా! ఈ కళ్లకీ రెప్పలు దూరముకావు. వేంకటేశ్వర్లీ విషయమై నీమాటవిన్నప్పుడు చూతుములే అని” వెళ్లి పోయినది. ఇది జరిగినకొన్నాళ్లకు వేంకటేశ్వర్లు తండ్రి నారాయణ రావు వరంగల్ నుండి రమణమ్మను చూడటానికి వచ్చినప్పుడు వెం కటేశ్వర్లు పెండ్లిమాటలు వచ్చి “చాలామంది వుద్యోగస్థులు వెంక టేశ్వర్లుకు కట్నాలిస్తామంటూవస్తున్నారు. ఏదోఒకటి మనకను కూలమైన సంబంధంగా చూచియీా సంవత్సరమే పెళ్లిచేసేస్తే బాగా వుంటుం,,దన్నాడు. రమణమ్మ “మనుమరాలిని చేసుకొందామని

యున్నది. కలిసినసంబంధం కావాలి. కట్నాలకేమిలెండి అన్నది.,,
ఆ మాటకెందువల్లనో నారాయణరావు కొంతసేపు ఏమీమాట్లా
డకుండా ఊరుకొని ‹ఏమోలే! ఇప్పుడప్పుడే ఏమితొందర? ఏదో
మాటసామెతగా అన్నాను. చేయనచ్చినప్పటి మాటగదా,,
అన్నాడు.

వేంకటేశ్వర్లుకు 22 ఏండ్లువచ్చినవి. బి. ఏ. పరీక్షయందు త్తీ
ర్ణుడైనాడు. పెళ్ళిసంబంధాలు చాలావస్తున్నవికాని మాబావయిష్ట
మని రమణమ్మ మామరదలి యిష్టమని నారాయణరావు చెపుతు
న్నారు. నారాయణరావుకుమాత్ర మెవ్వరుమంచికట్నమిస్తే వారి
సంబంధము చేసుకోవాలెననియున్నది. రమణమ్మకు అప్పమేనమరా
లిని చేసుకోవలెననియున్నది. వెంకటేశ్వర్లు నెవరైనా స్నేహితులు
గాని బంధువులుగాని ప్రశ్నిస్తే అతి ప్రతి చెప్పేవాడుకాదు. అతని
మనస్సులోమాట ఎవరికీతెలియదు. ఇట్లా ఒకసంవత్సరం గడిచింది.
ఈభేదాభిప్రాయాలవల్ల ముందుముందేమి జరుగుతుందోఅని వెంక
టేశ్వర్లు శ్రేయస్సుకోరేవాళ్ళంతా అనుకొంటున్నారు.

౬

రమ—వెంకటేశ్వర్లూ! నీవునామాట వింటావా! మీనాన్నమాట
వింటావా!

వెంక—ఇద్దరిమాటా వింటాను.

రమ—అయితేసరే! చిట్టెమ్మను పెండ్లిచేసుకోవడం మీనాన్నకిష్టం
లేదు. మీనాన్నగారెవరో కొండమీదివారు పెద్దపెద్దక
ట్నాలిచ్చేవారు రావలెననియున్నారు. నిన్ను చేసుకుంటావా! లే
దా!

వెంక—అమ్మా! నీకుకోపంవస్తే నేనుచెప్పలేనుగాని, చిట్టెమ్మ నాకుసరిగా అప్పకూతురు అప్పకూతురిని చేసుకోకూడదు.

రమ—ఆలాగా! సరే అయితే! నీవు మీనాన్నకలసి చేస్తున్నకుట్ర యేనాయిది; అట్టాచెప్పక “చిన్నపిల్లని సందేహం నాకు అంతకుతప్ప మరేమికాదంటాడేమి మీనాన్న” తెలిసింది పాపం రెండుముక్కల్లో తేల్చేసినావు. ఇకనీయిష్టం మీనాన్న యిష్టము.

అని లోపలికిపోయింది. ఆనాటినుంచి రమణమ్మకు వెంకటేశ్వర్లు అంటే పెంచినమోహముచేత అసూయలేకపోయినా నారాయణరావు అంటేమాత్రం తోకతొక్కిన తాచుపామల్లే మండిపడుతుంది. ఈసందుకనిపెట్టి యిరుగు పొరుగు అమ్మలక్కలంతా “చూశావా వెంకటేశ్వర్లు చివరకు వాళ్ళనాన్నమాటే విన్నాడుకాని పెంచి పెద్దవాణ్ని చేసి చదువు సంధ్యా చెప్పించినావని నీమాటేమన్నా విన్నాడేమో! ఎంతయినా అద్దెపేరంటము అద్దెపేరంటమే! కడుపున పుట్టిన బిడ్డవుతాడా నీకు వెంకటేశ్వర్లు; ఎందుకునీకీపిచ్చి” అని తలొక మాట అనడంమొదలుపెట్టేసరికి రమణమ్మకు కోపము నానాటికి పెచ్చుపెరిగిపోయింది. తనవివాహవిషయములో తనకు తన పెంపుడు తల్లికి కలిగిన భేదాభిప్రాయమువల్ల వెంకటేశ్వరులుకు చిత్తవైకల్యము కలిగి చిన్ననాటి తనస్నేహితులతో ఈకష్టసుఖాలన్ని చెప్పుకొంటే ఏమైనా మనశ్శాంతి కలుగుతుందేమోనని తనజన్మస్థానమైన వరంగలుకు ప్రయాణమైపోయినాడు. ఈవిషయం రమణమ్మకు మరికొంచెము అనుమానానికి కారణమైనది. వరంగలులో నారాయణరావు శ్రీపతివారి సంబంధాన్ని గురించి చెప్పి వాళ్లపిల్లనిచేసుకోవలసిందని

వెంకటేశ్వర్లుకు బాగానూరిపోశాడు. వెంకటేశ్వర్లు కేమీపాలుపోక యింటికిపోతానని తండ్రితో చెప్పి తిరిగి చల్లపల్లి ప్రయాణమైనాడు.

వరంగల్ నుండి బెజవాడకువచ్చే నైజాముమెయిలులో ఒకముసలిబ్రాహ్మణుడు పదకొండేండ్లపిల్లతో ప్రయాణముచేస్తున్నాడు. ఆ బండిలో నేమన వెంకటేశ్వరులుకూడావున్నాడు. ఎందువల్లనోగాని ఇంగ్లీషుచదువుకొన్నవాళ్ల సంప్రదాయవిరుద్ధముగా మనవెంకటేశ్వర్లా ముసలిబ్రాహ్మణునితో యేదోరాచకార్యము ప్రారంభించాడు. ఆ మాటల సందర్భములో ఆ బ్రాహ్మణుడీరీతిగా చెప్పడంమొదలుపెట్టినాడు ,,బాబూ! మాగ్రామం విశాఖపట్టణంజిల్లా చోడవరం. ఈ పిల్ల నామనుమరాలు. నాకొడుకుబిడ్డ. దీనితండ్రిని ముప్పయియేండ్లు పెంచి చివరకు నాచేతిమీదుగా మంట గలిపినాను. యీ పిల్ల దురదృష్టంచేత తల్లికూడా మరణించింది. ఇప్పుడు దీనికి పెండ్లిపేరంటము చేసేభారం నామీద పడ్డది. మాకుటుంబము చాలా నిరుపేదస్థితిలో వున్నది. తల్లిదండ్రులు లేనిబిడ్డకదా ఏదైనా అన్నవస్త్రాలకు లోపంలేని సంబంధంగా చూసి పెండ్లి చేదామనుకొంటే ఎక్కడకుపోయినా కట్నా లడుగుతున్నారు. ఇచ్చేశక్తిలేదు. ఏమి చేయడానికి పాలుపోకుండా వుంది.,, అని కళ్లనీళ్లు పెట్టుకొన్నాడు. వెంకటేశ్వరులుకుకూడాజాలిఅయి ,,తాతగారూ! ఒకసంబధముంది అన్నివిధాలమంచిదే యిస్తారా!"అన్నాడు. "కట్నమివ్వకుండా చేసుకొంటాడా!"నాయనా!అన్నాడు బ్రాహ్మణుడు. వెంకటేశ్వరులుచేసుకొంటాడన్నాడు. వెంకటేశ్వరులు నోటనుండివెలువడిన మాటలవంటి చల్లనిమాటలా బ్రాహ్మణుడింత వరకెప్పుడును విని యుండక పోవుటచే ఆయనకు చాలాసంతోషముకలిగి ఆ సంబంధాన్నిగురించిన వివరములన్నీ అడిగినాడు. వెంకటేశ్వరులుకూడా ఏమీదాపరి

కములేకుండా పూసగ్రుచ్చినట్టుగా తనవిషయమంతా చెప్పి తానా పిల్లను చేసుకోవడానికేమీ అభ్యంతరము లేదన్నాడు. బ్రాహ్మణుడు వెంకటేశ్వర్లును కౌగలించుకొన్నాడు. తానీపిల్లను చేసుకోవడం నారాయణరావుకు గాని రమణమ్మకుగాని యెంతమాత్రము ఇష్టముండదని వెంకటేశ్వర్లుకు తెలుసును. పైపెచ్చు వారికి తెలిస్తే అభ్యంతరం కూడా కలుగవచ్చునని అనుమానం. కాబట్టి తాను కూడా ముసలిబ్రాహ్మణునితో గలసి పోడవరం వెళ్లినాడు.

ఒకనాటి మధ్యాహ్నం చల్లపల్లిలో వెంకటరామయ్య పంతులుగారి యింటిలో ఎవరో చాలామంది స్త్రీలు, పురుషులుకూడ చేరి ఏదో గుసగుసలు ప్రారంభించారు. ఏమిటది అని ఇవతల ఉవతల భోగట్టా చేస్తే వెంకటేశ్వర్లు పెండ్లి అయిందట, వుత్తరం వ్రాశాడు. కన్న తండ్రి, పెంపుడుతల్లీ కూడా లేకుండా తనకుతానే స్వయంవర వివాహముచేసుకున్నాడట, చూచారా? పాపం! పిల్లలులేక రమణమ్మ తనను పెంచుకొని కావలసినంత పొలంకూడా యిస్తే చివరకు ముచ్చటా అచ్చటా లేకుండా తానొక్కడూ వెళ్ళి యెవళ్లో దరిద్రులపిల్లను చేసుకున్నాడట అని ఎవరి యిష్టమువచ్చినట్లు వారనడం ప్రారంభించారు. రమణమ్మ కీచర్య జరిగినప్పటినుండీ, ఇరుగుపొరుగువాళ్ల మాటలువింటూన్న కొద్దీ వెంకటేశ్వర్లుమీద కోపంమండిపోతూంది. వెంకటేశ్వర్లుకు ఆపూరికరణంగారి సలహామీద 'నీవు నాఆస్తి అన్యాయంగా వేసుకుపోవడానికి వచ్చినవాడవుగాని నాకుదత్తపుత్రుడవు గాదు. నీకిటువంటి కృతఘ్నుడవౌతావని తెలియక ఇన్నాళ్లనుంచి నిన్ను పెంచాను. నీవిక నాగడప త్రొక్కవలసిన ఔసరంలేదు, అని యింకా ఏమేమో చాలాకఠినంగా వ్రాసింది. ఈఉత్తర మందిననాడే

నారాయణరావు దగ్గరనుంచికూడ ఏసందర్భములోను రమణమ్మ ఉత్తరానికితీసిపోని ఉత్తరమొకటి వెంకటేశ్వర్లుకందినది. వెంకటేశ్వ ర్లెంత జాలిగుండెకలవాడో అంతమానసీయుడు - కాబట్టి తానుతిరిగి తన పెంపుడు తల్లియింటికిగాని వరంగల్ గాని వెళ్లకుండుటకే నిశ్చ యించుకొని రమణమ్మపేర ఈకిందియుత్తరంపంపెను-

"గంగా భాగీరథీ సమానురాలగు పిన్నిగారికి—

మీకుమారుడు వెంకటేశ్వర్లునమస్కారములు—

త॥ తమరు కఠినముగా వ్రాయించిన ఉత్తరంచూచిన పిమ్మట నామనస్సు చాలాసంక్షోభపడ్డది, నావివాహంవిషయంలో మన కు టుంబమునందుగలిగిన తీవ్రభేదాభి ప్రాయాలకు మతిస్థిమితములేక నేను వరంగల్ నుంచి వస్తూండగా రైలులో ఒకముసలి పేదబ్రాహ్మ ణుడు చెప్పిన విచారకరమగు కథయంతయు వినినపిమ్మట జాలివేసి నేనాయన మనుమరాలిని పెండ్లిజేసుకొందునని వాగ్దానముచేసినాను మీరుదానికి తప్పకుండా అభ్యంతరంపెడతారని ముందుగా నేను మీకు తెలియపర్చలేదు, మాపినతండ్రిగారి విల్లులో నాకేరవ్రాసి న ఆస్తియంతయు తమరేమామూలుగా అనుభవి చవచ్చును. నాకు దానితో ఏసంబంధము అక్కరలేదు. ఆఆస్థినిగురించి మీరునాకంత కఠినంగావ్రాస్తారని నేను కలలోను అనుకొనలేదు. ఇప్పటి స్థితిగతు లనుబట్టి చిరకాలమునకుగాని నేను మిమ్మల్నిచూడడం తటస్థించదు. దయయుంచకోరెదను.

మీ అనుంగు పుత్రుడు

వెంకటేశ్వర్లు"

౭

వెంకటేశ్వర్లు విశాఖపట్టణం హైస్కూలులో ఉపాధ్యాయుడుగా ప్రవేశించి అయిదు సంవత్సరాలయింది. ఇప్పుడు వెంకటేశ్వర్లుకు జీతం నూటపాతిక రూపాయిలు — వెంకటేశ్వర్లే అయిదు సంవత్సరాలనుంచి రమణమ్మగడప త్రొక్కకపోయినా ఆబిడదగ్గర పెరిగిన మమకారంచేత ఆబిడ క్షేమసమాచారాలను గురించి ఇతర గ్రామాల ఆవూరినుంచి వుత్తరాలు తెప్పించుకొంటూనే వున్నాడు. అప్పుడప్పుడు, వెళ్లి పినతల్లిని చూచివద్దామనికూడా అతనికి అభిప్రాయం కలుగుతూండేది. కాని పూర్వానికివలె ఆదరిస్తుందో లేక 'ఆస్థి కాజేయడానికి వచ్చాడు మళ్లీ' నని దురభిప్రాయ పడుతుందోనని ప్రయాణము ఆపివేస్తూండేవాడు.

౮

వేసంకాలపు సెలవులకు నాత్తేరుకన్నకూడా కూనూరుచల్లగావుంటుందని వెంకటేశ్వర్లు భార్యాతోకూడా కూనూరు ప్రయాణమైనాడు - రాత్రి షుమారు 9 గంటలయ్యేసరికి సింగరాయకొండ స్టేషనుదగ్గర ప్యాసెంజరుఆగింది. మన వెంకటేశ్వర్లుభార్య ప్రయాణములో చాల బడలియుండుటచేత ఆరాత్రికక్కడయుండి మఱునాడు ప్యాసెంజరులో పోదామని యూహించి రైలుదిగి స్టేషన్ దగ్గరనున్న యొకసత్రంలోకి పోయినాడు - ఆసత్రందగ్గర నున్న పెద్దబావియొద్ద ఇద్దరును స్నానముచేసినారు. వెంకటేశ్వర్లు భార్య ఒకఅరగంటలో వంటతయారుచేసి వెంకటేశ్వర్లును భోజనానికి పిలిచింది. అతను భోజనందగ్గరనుంచి లేవబోతుండగా వంటగది తలుపుఎవరో కొట్టినట్లయ్యెను. 'ఎవరువారు' అని లోపలనుంచి వెంకటేశ్వర్లు కేకవేసెను. 'అమ్మా' మేము బ్రాహ్మణులము. ఒకముద్ద అన్నంపెడితే

తింటాను. ఇవ్వాళప్రొద్దుటనుంచి కటికిలంకణం”అనిబయటనుంచి ఒక దీనస్వరము వినబడ్డది. వెంకటేశ్వర్లు కాకంఠస్వరము బాగా ఎక్కడో విన్నదానివలె కనిపించింది. బాగా ఆలోచించినాడు. తటాలున దొడ్డి లోనికిపోయి చేయికడుక్కొని లాంతరు దీసికొని బయటకువచ్చాడు. ఒకవెధవఆబిడ గడగడపలో నిలుచుని యున్నది - వెంకటేశ్వర్లు ఏవూ రమ్మా! మీది అంటే ఆమెమాట్లాడకుండా ఊరుకుంది.

అతను లాంతరు దగ్గరపెట్టి పరీక్షించిచూచి ఆకస్మికముగా లాంతరు క్రిందపెట్టి పిన్నీ! నీవా! ఇక్కడికి కొనుకొచ్చావు! నీకీ అవస్థ ఎందుకువచ్చినది అని కౌగలించుకొని ఏడువున్నాడు! 'అయ్యో! నాయనా' వెంకటేశ్వర్లూ! నాదౌర్భాగ్యురాలికిం తేకావాలిలే! అని ఆమెకూడా పెద్దపెట్టున దుఃఖించడంప్రారంభించింది. లోపలినుంచి వెంకటేశ్వర్లుపెండ్లాము, సత్రంలోదిగిన పెద్దమనుష్యులువచ్చి సర్దుబాటుచేసి సంగతంతా కనుక్కొంటే ఆవెధవఆబిడ వెంకటేశ్వర్లుపినతండ్రి రమణమ్మయేఅయినది.

౧౦

వెంకటేశ్వర్లుకు ఆబిడకుమధ్యకలిగిన మనస్పర్థలు సాకుగా జేసికొని, వానిని మతికొంచెమువృద్ధిలోకితెచ్చి అప్పారావుగారు చేసిన కుట్రవల్ల ఆబిడకీపాట్లువచ్చినట్లు అందఱికి తెలిసింది. అకరణాంగానే వేంకటేశ్వర్లుకు రమణమ్మతేమయముగావున్నట్లు పదిరోజుల క్రిందట ఒకదొంగవుత్తరంవ్రాశాడు. ఈకథంతావిని అక్కడివారంతా ఆశ్చర్యపడుతూ ప్రపంచకంలో ఎన్నో చిత్రాలున్నవి. ఎప్పటికైనా కాలమిలాగే మారిపోతుంటుంది అనుకున్నారు.

## కనికీ!

గడపముంగలనీవు అడుగుపెడ్తేను
ఎన్నెలల్లేపాక ఎల్తురొత్తుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

పద్దాకనీవొచ్చి పలకరిత్తేను
పూవంటినావొళ్లు పులకలెత్తుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

నీకన్ను నాకన్ను ఏకమైతేను
లోపమేముంటది స్వర్గలోకమౌతుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

నాపైననీమోజు తఱిగిపోతేను
వెన్నంటిమనసు ఇరిగిపోతుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

నీపెదాల్లోనవ్వు ఆపుసేస్తేను
వైసునూనీబుద్ది బైసిమాలుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

కాశీగాజులు నీవి గల్లుమంటేను
నాబుద్దికీకల్లై ఎల్లుమంటుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికని

# ముక్కు లేనివాడు

(వేలూరి శివరామశాస్త్రి)

ఒకదుర్జనుడు ఒకపాడు పనిచేసి దానికి ప్రతిఫలముగా నాసికాచ్ఛేదమును పొందెను. వాడు తనరూపానికి తానే రోసి నిలువ నీడలేని అడివిలోకి పోయి అక్కడనే ఉంటూఉండెను. దూరంగా ఎవ్వరైనా కానిపించగానే పులితోలు పఱిచి మొహంకనపడకుండా బట్ట కప్పుకొని కూర్చుండేవాడు.

ఈపని తనదగ్గిఱకు ఎవరినీ రానీకుండా చేయటానికి బహులు సంత చేసేసింది. ముఖవస్త్రం తీసి ఎవరినీ చూడడు. ఎవ్వరితో మాటాడడు. మాహాత్మ్యానికి ఇంకా వేఱే యేమికావాలి? మాహాత్మ్యం వ్యాపింపజేయడంలో మనుష్యులనోళ్లే పరలు

ఆతని అనుగ్రహానికి చాలామంది కాచుకొని ఉన్నారుకాని వాడు గర్జనలేని మేఘము. వారందఱిలో దేవదత్తుడు చాలా భక్తిశ్రద్ధలతో ఆతని సేవించుచుండెను. ఒకనాడు అదృష్టవశమున భక్తులందఱూ దూరంగా ఉండుట తటస్థించింది. దేవదత్తుడు తనకు గురుప్రసాదము సిద్ధించినదిగా తలపోసి గురుచరణములకు నమస్కరించి! అయ్యా! నాకు ఉపదేశం చేస్తేనేగాని నేను లేవను అనఁగా ఆముక్కిడి తేవు ప్రొద్దున ఒకవాడి కత్తిని పట్టుకొనిరమ్ము అని అర్థమయేటట్లు సంజ్ఞ చేసెను. దేవదత్తుడునూ తనకు విజ్ఞానము దాపుగా ఉన్న దనుకొని తెల్లవారకముందే స్వాములవారిముందు కత్తితో తయారాయెను.

గురువుతో శిష్యుడేకాంతముచేసెను. విజ్ఞానమునొందుటకు శిష్యుని హృదయపు పొరలన్నియు తపతప కొట్టుకొనుచుండెను. దేవదత్తుని చేతిలోనికత్తిని అతిదయతో గురువు కైకొనెను. వెనుక లక్ష్మణుడు శూర్పణఖకు చేసిన పనిని ఆగురువు చేసివైచెను.

అయ్యో! ఇదియేమి? ఇదియేమి? అని అనునాసికతో దేవదత్తుడు మొర పెట్టుకోగా గురువు "ఓయీ! నేను ఇట్లే సన్యాసం పుచ్చుకొన్నాను. నేను పుచ్చుకొన్నట్లే నీకు ఇచ్చాను. ఐతే సమయం వచ్చినప్పుడు నీవును సన్యాసాలు ఇప్పిస్తువా?"

దేవదత్తుడు గురుప్రసాదంతో శోకాతీతుడై పోయెను. తుదకు ఆయనకూడా ఒక ఆశ్రమం స్థాపించెను గుర్వాజ్ఞను తలపై పువ్వు తాల్చినట్లు తాల్చి తనశక్తికొలదీ శిష్యులకు సన్యాస మిప్పించెను ఈరీతిగా కొలదికాలంలో ముక్కు లేని యతులతో దేశము నిండిపోయెను

ఈకథ పవాహారిబాబా తనకు చెప్పినట్లు వివేకానందస్వామి వ్రాసెను. **Vivekananda's Valumes iv.**



## సెలయేరు

**వే**సఁగి గేల పుచ్చపువ్వువెన్నెల నిగ్గుల నాణిముత్తెపుఁ
రాసులపొల్పునఁ నురుసుగ్రక్కుచు చిందుమహీధరాగ్రపుఁ
మోసులనుండి జాఱు జలపూరముతో సెలయేఱు కిన్నరుల్
గాసిలునట్లుగా ప్రణయగాన పరంపరలేల జేసెదుఁ.

# బిడ్డల ముద్దుమాటలు

(గాడేపల్లి అనంతరామమూర్తి)

తల్లి—ఏమే చిట్టితల్లీ నువ్వు రావుడుబావని పెళ్లాడతావా! యిందాకవచ్చిన తాతని పెళ్లాడతావా?

చిట్టి—ఉఁహీఁ! రావుడుబావనే పెళ్లాడతా

తండ్రి—రావుడైతే నీకునగలేవీపెట్టడు. తాతైతే కావలసినన్ని నగలుపెడతాడు. యెవర్ని పెళ్లాడతావో చెప్పు.

చిట్టి—ఉఁహీ! మరీ—తాతనేపెళ్లాడతా.

తల్లి—తాతని పెళ్లాడితే నగలుపెడతాడుగాని ముసిలికంపుకొట్టుకొంటూ కదలలేక ఒకమూల కూర్చుంటాడు. అస్తమానం అతనికి చాకిరీచేస్తుండాలి రావుడుబావని పెళ్లాడితే నగలాస్టే పెట్టలేడుగాని ఎంచక్క బాగుంటాడు. ఈడూజోడూగా వుంటాడు. పరీక్షలుపేసయి ఉద్యోగంచేస్తూ హాయిగానిన్ను సుఖపెడతాడు. తెలిసిందా ఇద్దర్లో యెవర్ని పెళ్లాడతావో బాగా ఆలోచించిచెప్పు.

చిట్టి—ఉఁహీ! మరీ—మరీ—ఇద్దర్నీపెళ్లాడతా

తల్లి—ఏవిరా గోపాలా! అప్పుడే తెల్లారిందీ ఆటలికి బయలుదేరడానికి? వేగం చద్దన్నంతిని అన్నతో బళ్లోకెళ్లు!

గోపా—అబ్బ! నేడిచాలబళ్లోకెళ్లను. నాక్కడుపునొప్పొచ్చింది.

తల్లి—దొంగనాగమ్మా! ఆటలికికడుపునొప్పిలేదుగాని బళ్లోకంటే కడుపునొప్పొచ్చిందీనీకు? అయినాయిల్లారా చూస్తాను, (కడుపునొక్కిచూచి) కడుపు మెత్తగావుంది నీకుకడుపునొప్పి యేమీలేదు.

గోపా—అక్కడలగాదే కడుపునొప్పి!

తల్లి—కడుపుమీదకాదూ! మరెక్కడనాయనా నీకుకడుపునొప్పి?

గోపా—ఎక్కడలా! (ఒడలు తడిమిచూచుకొని) ఇదిగోనే ఇక్కడ యీపుమీద. ఈపుమెత్తగాలేదు చూడు! 3గి.౨

---

# గొప్పవింత

మీరనేకపర్యాయములు, కళ్ళుండియు చూడఁజాలని చెవులుండియు వినజాలని నిరంకుశాధికార్లను చూచియుందురు. కాని చెవులులేక వినగలిగినవారిని, కళ్ళులేక చూడగలవారిని యెప్పుడును ఎఱిఁగియుండరు.

అమెరికాదేశములో విల్లెటాహగ్గిన్సు అను 17 సంవత్సరముల బాలికగలదు. ఆమెకుతొమ్మిదేండ్లు వచ్చుసరికి తల్లిదండ్రులు గతించిరి. ఆమెకప్పుడు కొంచెములీలగా కళ్లకనుపడుచుండెడివి. మాటలుకూడ ఎంతోబిగ్గరగా మాట్లాడినయెడల వినపడుచుండెడివి. పదవయేట ఆమె, గ్రుడ్డివాండ్ల కొఱకయి జాన్స్వేవేలోనున్న విస్కన్స్యపాఠశాలలో ప్రవేశించెను ప్రవేశించిన 6 సంవత్సరముల కామెకు సంపూర్ణముగా గ్రుడ్డితనమును చెముడును సంభవించినవి.

పాపమీ దిగులుతోనామె మిక్కిలి మందమతియైపోయినది. చాలకాలమువరకామె యేపనియందును ఉత్సాహముగాలేను.

అంత నామెయుపాధ్యాయులామెకు హీలెలు కెల్లర్సుగారిచే కనుపెట్టబడినపద్ధతి కలవరచిరి. ఆపద్ధతివలన చెవిటివాండ్లు మాట్లాడువారి పెదవులుతాకి ఆమాటలను గ్రహింపవచ్చును. విల్లెటా మాట్లాడువారిపెదవులు తాకకయే వారికంఠముతాకి మాటలుగ్రహించగల క్రొత్తపద్ధతికనుపెట్టెను.

విల్లెటాయొక్క కీర్తి ప్రాంతప్రాంతములు వ్యాపించెను. 1922 సం॥ 2వ ఏప్రిల్‌న చికాగోలోనున్న వైద్యసంఘమువారామెను

3గ3

పరీక్షించిరి. ఆమెకు కండ్లేమియు కనుపించవనియు మాటవినిపించదనియు చెప్పును. కాని మాట్లాడుచున్నవారి రొమ్ముపైనగల్లు ఒకకొనను తాకించి రెండవకొనను తాను వ్రేళ్లతో తాకుచు వారేమిమాట్లాడుచున్నారో గ్రహింపగలదు. వెమిటిచాండ్లచే నుపయోగింపబడెడు నొక టెలిఫోను ఆబిడయొద్ద యెల్లప్పుడునుడుండును. కాని ఆమెదానినెప్పుడును తనచెవిదగ్గరనుంచుకొని యుపయోగించక వ్రేళ్లతో తాకియే అవతలివారిమాటలను గ్రహించగలదు. ఈమె నాటకములలో యేమిజరుగుచున్నదియు కూడ ఈరీతిగావే వినగలదు.

ఆమె పంక్తులను వ్రేళ్లతో తాకుచు వార్తాపత్రికలుకూడ చదువగలదు. ఆమె వాసనచూచి రంగులుగుర్తించగలదు.

నాలుగంగుళములు పొడవుగల యొకగాజుగొట్టముగుండా వాసనలచూచి రంగులుకనుగొనగలదు.

---

# ప్రార్థన

నీదుచరణాంబుజపరాగనికరమునను
నాఘుటము తోడుకొననిమ్ము నారతమ్ము
మఱియుగద్దాని నిండతిన్మధురసమ్ము
నింపుకొననిమ్ము నిన్నువర్ణింపనీక,

(ఫ్రెంచినుండి)



# సిన్న రేత్రి

మంచెకిందా సొప్పలోన
మడతదుప్పటి రేకుకప్పుకు
మంచులోనపండుకుంటే
మాటుపడగినయద్దరేత్రి
మెచ్చగాసి శెయ్యితాకిందే
నాకింతలోనె
యేడలేనిసత్తువొచ్చిందే

ఒళ్లంతా సలియెత్తి
ఒక్కమాటునిక్కనిల్గి
సుట్టకాల్వబుద్దిపుడితే
నిప్పుపుల్ల యెలిగిస్తె
యెలుగులోన మొగము మెరిసిందే
నీకింతలోన
ముద్దులోనసిగ్గుయిరిశిందే

కోడికూసేపొద్దుకాడ
కూర్తికునుకూనాకుపడితే
శెప్పకుండా యెల్లిపోతె ।నువ్వు।
శెప్పకుండా యెల్లిపోతె
కన్ను తెరిశిశూశేతల్కి
చుట్టుపక్లశీకటైయ్యిందే
నాసుట్టనిప్పు
ఎప్పటట్లా ఆరిపోయ్యిందే

3౫౫

తింటాను. ఇవ్వాళప్రొద్దుటనుంచి కటికిలంకణం" అనిబయటనుంచి ఒక దీనస్వరము వినబడ్డది. వెంకటేశ్వర్లు కాకంఠస్వరము బాగా ఎక్కడో విన్నదానివలె కనిపించింది. బాగా ఆలోచించినాడు. తటాలున దొడ్డి లోనికిబోయి చేయికడుక్కొని లాంతరు దీసికొని బయటకువచ్చాడు. ఒకవెధవఆబిడ గడిగడపలో నిలుచుని యున్నది – వెంకటేశ్వర్లు ఏవూ రమ్మా! మీాది అంటే ఆమెమాట్లాడకుండా ఊరుకుంది.

అతను లాంతరు దగ్గరపెట్టి పరీక్షించిచూచి ఆకస్మికముగా లాంతరు క్రిందపెట్టి పిన్నీ! నీవా! ఇక్కడికి కొనుకొచ్చావు! నీకీ అవస్థ ఎందుకువచ్చినది అని కౌగలించుకొని ఏడుసుమన్నాడు! 'అయ్యో! నాయనా' వెంకటేశర్లూ! నాదౌర్భాగ్యురాలికి తేకావాలిలే! అని ఆమెకూడా పెద్దపెట్టున దుఃఖించడంప్రారంభించింది. లోపలినుంచి వెంకటేశ్వర్లుపెండ్లాము, సత్రంలోదిగిన పెద్దమనుష్యులువచ్చి సర్దుబాటుచేసి సంగతంతాకనుక్కొంటే ఆవెధవఆబిడ వెంకటేశ్వర్లుపినతండ్రి రమణమ్మయేఅయినది.

౧౦

వెంకటేశ్వర్లుకు ఆబిడకుమధ్యకలిగిన మనస్పర్థలు సాకుగా జేసికొని, వానిని మతికొంచెమువృద్ధిలోకితెచ్చి అవ్వూరికరణంగారు చేసిన కుట్రవల్ల ఆబిడకీపాట్లువచ్చినట్లు అ దటికి తెలిసింది. ఆకరణం గాగే వేంకటేశ్వర్లుకు రమణమ్మతోడేమనుగావున్నట్టు పదిరోజుల క్రిందట ఒకదొంగవుత్తరంవ్రాశాడు. ఈకధంతావిని అక్కడివారంతా ఆశ్చర్యపడుతూ ప్రపంచకంలో ఎన్నో చిత్రాలున్నవి. ఎప్పటికైనా కాలమిాలాగే మారిపోతుంటుంది అనుకున్నారు.

## కనికి!

గడపముంగలనీవు అడుగుపెడ్తేను
ఎన్నెలల్లేపాక ఎల్తురౌతుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!
పద్దాకనీవొచ్చి పలకరిత్తేను
పూవంటినావొళ్లు పులకలెత్తుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!
నీకన్ను నాకన్ను ఏకమైతేను
లోపమేంటుంది స్వర్గలోకమౌతుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!
నాపైననీమోజు తఱిగిపోతేను
వెన్నంటిమనసు ఇరిగిపోతుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!
నీపెదాల్లోనవ్వు ఆపుసేస్తేను
వైనుసూసీబుద్ది వైసిమాలుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!
కాళిగాజులు నీవి గల్లుమంటేను
నాబుద్దికీకల్లై ఎల్లుమంటుద్ది
ఏమనందునీపనికీ!
ఓ నాముద్దులాడికనికీ!

పరీక్షించిరి. ఆమెకు కండ్లేమియు కనుపించవనియు మాటవినిపించదనియు చెప్పెను. కాని మాట్లాడుచున్నవారి రొమ్ముపైనకంఠయొక్క ఒకకొనను తాకించి రెండవకొనను తానువ్రేళ్లతో తాకుచు వారేమిమాట్లాడుచున్నారో గ్రహింపగలదు. చెవిటివాండ్లచే నుపయోగింపబడెడు నొక టెలిఫోను ఆబిడయొద్ద యెల్లప్పుడునుండును. కాని ఆమెదానినెప్పుడును తనచెవిదగ్గరనుంచుకొని యుపయోగించక వ్రేళ్లతో తాకియే అవతలివారిమాటలను గ్రహించగలదు. ఈమె నాటకములలో యేమిజరుగుచున్నదియు కూడ ఈరీతిగానే వినగలదు.

ఆమె పంక్తులను వ్రేళ్లతో తాకుచు వార్తాపత్రికలుకూడ చదువగలదు. ఆమె వాసనచూచి రంగులుగుర్తించగలదు.

నాలుగంగుళములు పొడవుగల యొకగాజుగొట్టముగుండా వాసనలచూచి రంగులుకనుగొనగలదు.

---

## ప్రార్థన

నీదుచరణాంబుజపరాగనికరముచేత
నాఘటము తోమికొననిమ్ము నారతమ్ము
మఱియుదానిని నిండతిన్మధురసమ్ము
నింపుకొననిమ్ము నిన్నువర్ణింపనీక,

(పూందేనెనుండి)



# సిన్నరేత్రి

మంచెకిందా సొప్పలోన
మడతదుప్పటి రేకుకప్పుకు
మంచులోనపండుకుంటే
మాటుమడిగినయద్దరేత్రి
మెచ్చగాసి సెయ్యితాకిందే
నాకింతలోనె
యేడలేనిసత్తువొచ్చిందే

ఒళ్ళంతా సలియెత్తి
ఒక్కమాటు సిక్కనిల్లి
సుట్టకాల్వబుద్ధిపుడితే
నిప్పుపుల్లయెలిగిస్తె
యెలుగులోన మొగము మెరిసిందే
నీకింతలోన
ముద్దులోన సిగ్గుయిరిసిందే

కోడికూసే పొద్దుకాడ
కూస్తికునుకూనాకుపడితే
శెప్పకుండా యెల్లిపోతె !నువ్వు!
శెప్పకుండా యెల్లిపోతె
కన్ను తెరిశిసూశేతల్కి
చుట్టుపట్లశీకటైయ్యిందే
నాసుట్టనిప్పు
ఎప్పటట్లా ఆరిపోయ్యిందే

3౧౧

# చందాదార్లకు విజ్ఞప్తి

మా సాహితీపత్రికకు చందాలు బాకీయున్నవారెల్లరు దయయుంచి వారిచందాలను మనీఆర్డరుపూర్వకముగా మాకార్యాలయమునకు పంపప్రార్థితులు. లేనియెడల వారికిరాబోవు పత్రిక వి. పి. గా పంపెదము. వి. పి. ఖర్చులనవసరముగా తగులుబాటగును.

మేనేజరు

సాహితీకార్యాలయము బెజవాడ.

# ఏజంట్లు కావలెను.

సాహితికి చందాదార్లనుచేర్చుటకు ఆంధ్ర దేశములోని అన్ని భాగములనుండియు సమర్థులగు ఏజంట్లుకావలెను. వివరములకు ఈక్రిందిచిరునామాకువ్రాయుడు.

మేనేజరు.

సాహితీకార్యాలయము బెజవాడ.

---

## 44 రీముల ఫెదరు వెయిటు కాగితం
## 32 పౌనుల డబుల్ క్రౌన్

అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వలయువారు :— యీ క్రింది చిరునామాకువ్రాసి వివరములు తెలుసుకొనవచ్చును.

మేనేజరు.

శారదా భాండార ముద్రాశాల,

3గిఽ బెజవాడ

# తల్లి - తండ్రి

[వేలూరి శివరామశాస్త్రి]

లేకలేక సుగుణునకు ఒక కొడుకు కలిగెను. వానిపేరు- అసలుపేరు మనకు తెలియదుగాని ఆ అసలుపేరునకు బదులుగా విగుణుడు, అను వ్యవహారము వ్యాపించెను. సుగుణుడు కొడుకు నల్లారుముద్దుగా పెంచి సంపూర్ణముగా చదువు చెప్పించెను. విగుణుడును విద్యయందు దాటితేటి దిక్కులలో విజయవైజయంతికలను పాతెను. ఆతని విద్యయను ఇక్షులత గర్వఫలములను కాచెను. ఆతడు తలిదండ్రులను ఈసడించుట పుట్టుకతోనే నేర్చికొనెను. రోజూ తల్లినీ తండ్రినీ తిట్టుట ఉచ్ఛ్వాస నిశ్వాసములకంటె అతనికి ఎక్కువ అలవాటైపోయెను.

ఒకనాడు తల్లి కుమారుని చూచి—

"నాయనా! చదువుకోసం చాలారోజులు ఇతరత్ర గడిపినావు. చిన్నప్పుడు ఎప్పుడు ఎత్తుకొన్నానో ఎప్పుడు పక్కలో ఉపలాలించినానో అవన్నీ పూర్వజన్మలోని అనుభవము వలె ఉన్నవి. నేడు నావద్దనే పండుకొందువుగాని!" అనగా విగుణుడు తల్లిప్రేమకు కఱగి అంగీకారము చూపి ఆరాత్రి తల్లివద్దనే శయనించెను.

తల్లి కొంతవడికి తనకాళ్లను విగుణుని మొగముపై పెట్టెను. కుమారుడు ఊరకుండెను. ఆమె మోకాళ్ళచే పొట్టలో గ్రుచ్చెను. వాడు సహించెను. ఆమె గోళ్లచే గీఱెను. బొటనవ్రేలితో తన్నెను విగుణు డెట్లెట్లో సైరించియుండెను. ఆమెలేచి చలినీళ్లకుండ తెచ్చి

వానిపై భ్రమ్మరించెను. వాడు తాళలేక—ఓసి రాకాసిముండా! నేనెంతపండితుడనో నీకు తెలియునా? తన్నితివి, తొక్కితివి, గ్రుచ్చితివి, గీరితివి, సహించితిని. ఇంత చలికాలములో కుండ లోని నీరు మీదపోసితివి. చూడు! ఏమిచేసెదనో.

తల్లి ఇట్లనెను. నాయనా! ఏమి నీసహనము, నీశాంతి అంతయు ఈఒక్క రాత్రిలోనే తెలిసిందే! ఎన్నిరాత్రిళ్లు నన్ను తొక్కావో తన్నావో గీరావో కుమ్మావో నీకు జ్ఞాపకం ఉంటుందా? గర్భంలో ఎన్నిసార్లు నాకపాయం కలిగించావో చెప్పినా నీకిప్పుడు తెలుస్తుందా? పాపము! వీని నన్నిటి సహించావు ఇక నీళ్ళు పోస్తే సహించలేక పోయావూ! నా ఒంటిమీద ఎన్నిసార్లు విణ్మూత్రములు విసర్జించినావో ఊహించుకొనుము.

౨

సభలలోనికి తనతోపాటు తనతండ్రికూడా వస్తే తనకు విగుణుడు ఎవరైనా తండ్రిని చూపి 'ఈయన ఎవరు?' అని అడిగితే 'మా వంట బ్రాహ్మణుడు' అని ప్రత్యుత్తరం చెప్పేవాడు. ఒకనాడు, అట్లు జరిగిన తరువాత సుగుణుడు ఒకకాకిని చూపి కుమారుని— అదియేమి? అని అడిగెను.

వి—కాకి

సు—కాకియా?

వి—ఔను. కాకి

సు—కాకియా?

వి—ఔను. కాకి.

సు—కాకియా?

వి—ఔనయ్యా. కాకి.

సు—కాకియా?

వి—ఎన్నిసారులు చెప్పినను నీకు తెలియదేమయ్యా? ప్రకృతి మాఱినదా? లేక కల్లు త్రావితివా? ఎన్నిసారులు చెప్పినను కాకికాకి యని కాకివలె, కాకా, అందువేమి?

సు—నాయనా! చాలు. ఇఁక చాలు ముమ్మాఱులకే నీకు ముక్కాఱినది? నేను బాల్యమున నీకు 'శ్రీగణేశాయనమః' అని నూఱుమాఱులు చెప్పినను 'ఛిరిగణేఛాయ నమ' అను ఉచ్చారణ మార్చుకొనలేక పోతివే. ఔను. నీవునన్ను నిందింపఁదగ్గదే!

---

# మోహినీ ప్రకృతి

(గేయము)

జిలిబిలి తియ్యనిరాగము లెత్తిచేసెను గానము సెలయేఱు;
తళతళ వెన్నెలనిగ్గుల నలలుం దాండవమాడెను మైమఱచి;
కలకలకోకిలరవములు రజనీగాంభీర్యమునకుఁ దోడ్పడియె;
జలజలదేహము పులకించి వేళ్ళులు జాఱెనువీణాతంత్రిలను

ఓరే! నాజీవన శుష్కార్ఘురంబు
పాపొగూలంకవ పూర్ణముగ!
జాతెరా, పరలోక జీర్ణతటంబు
పూరసంఘర్షణ శీర్ణముగ!

పగిలెంగ మండలు పాత్రిక!
చిగిరించె సంసారవల్లిక!
తగడింక బైరాగిజీవిక!
జగమెల్ల నందనవాటిక!!

దువ్వూరి రామిరెడ్డి.

---

# ఆరామము

కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు (సాహితీ సమితి)

ఏమహారాజు వేయించె నీతోట!
ఏమహారాజు త్రవ్వించె నీబావి!
బాటసారులమేలు పాటించి యిచట
నిట్టిసత్కార్యంబు నేదాత చేసె!

కాళ్ళబొబ్బలులేచి కాలిపోవంగ
గాటంపుమసకలం గనులు మండంగ
తలమంటుచునటుగాయు తగనిమెండలకు
భరియింపలేక యీవనముఁజేరితిని!

అధికదాహాముచేత నల్లాడుచుంటి
ప్రాణాలు కదలిపోవగసాగె నాకు
మేను తత్తరపోయె మిగుల డస్సితిని
కనుఁగొంటిఁ గనుఁగొంటిఁ గడకు నివ్వానము

ఆయాసమణగ నేత్రానందమబ్బె
చల్లదనము తోఁచె సౌఖ్యంబు గలిగె
ఎంతతియ్యనినీర, మెట్టిచన్నీరు
త్రావితిఁ గడుపారఁ దనివి చేకూర

గుబురు గుబురు మావిగున్న లల్లాడఁ
బిల్లగాలులు మేన వీచెఁ జల్లగను.
చెలువారు టెంకాయచెట్టుల వరుస
శోభిల్లె నత్యంత శోభలం జెలఁగి

ఏమూలఁ జూచిన నేమాత్రమైన
సూర్యరశ్మికిఁ దావ చూపట్ట దందు
ఎంతచక్కనినీడ యెంతటి సుఖము!

పువ్వుచెట్టులం గంటిఁ బూవులఁ గంటి
వెదఁజల్లు నెత్తావి వీఁకఁ గన్గొంటి
ఎండగాలులఁ గొల్చి యొసలారునట్టి
దవనంబు, మరువంబు నవియెల్లఁ గంటి

ఒక చెట్టుకొమ్మపై నొయ్యారిచిలుక
కొట్టికంకిని ముక్కుకొనలోన బట్టి

గ్రుచ్చిగ్రుచ్చితినెడు గొనబు చూడంగ
మన ముబ్బె నిజముగా మన ముబ్బె నాకు!

పచ్చపట్టు విధాన వరలు టెక్కెలును
వెన్నముద్ద విధాన వెలయు మార్దవము
కస్తూరి బొట్టులకరణి నేత్రములు
పగడంపుగెంపులఁ దెగడు నాసికము!

ఔరౌర! ఒయ్యార మైనయాచిలుక
కొమ్మపైఁ దినుచుండెఁ గోఱ్ఱిగింజలను
మఱియొక్కకీరంబు పరువెత్తి వచ్చి
కిలకిలారావముల్ చెలఁగించె నంత

శుక దంపతులు చాల సుఖములో నుండ
తోట వేయించిన దొర నుతించుచును
నాదారిఁ బట్టి నే నడచిపోయితిని



# కృష్ణవేణి



పెనుమర్తి వేంకటరత్నము.

స్వాదుజలములనిచ్చి
మోదమ్మునొసఁగెదవు !

    తల్లిరో! కృష్ణవేణీ! నీకువం
    దనమిత్తు! కృష్ణవేణీ!

నీపూతవారిపూర
నిర్మలతరంగముల

    మజ్జనమునాడితమ్మా! మాయమ్మ!
    ముజ్జగంబులతల్లిరో!

తర్షపీడ వెలార్చి
హర్షమ్ము చేకూర్చి

    మమ్మురక్షింతువు! గదే! మాయమ్మ!
    నెమ్మిమైనిన్గొల్తునే!

పాపమ్ములందోలి
కాపాడగదవమ్మ!

    నీపుత్రకులనెప్పుడు! సత్కృపా
    నిర్మలముగాదృక్కుల!

• ఒకనాఁడు విజయవాడఁ గృష్ణాతీరమునఁ గూర్చుండి వ్రాసినది •

 ( పె॥ వేం॥ర )

# కోకిల



(పెనుమత్స వేంకటగత్సము)

చ॥ తరుణరసాలభూరుహవిశాఖముచేఁ జెలువొందునట్టి శ్రీ
సుఖవనసీమలందు నినుఁ జొప్పడఁగాంచి తదీయగీతికా
వరమకరందమానితిమి——! బాపురె! కన్నులఁగట్టివైచి యీ
తెఱఁగునఁ బారెదంచును-మునిన్ దలపోయఁగలేదు! కోకిలా!

నవకిసాలయవితతినానందమొలయ
మెసవి - యవ్యక్తగీతికా విసరజనిత
నవనవోన్మేష మాధుర్యమవనికిని శ్రీ
పాటిపోతివి! కోకిలా! బాగు! బాగు!

నీమధురగానరావముల్ లేమి కమ్ర
భూరుహ ప్రతాన సంయుతంబై రహించు
వనలతాంగి కళ్దొరంగెను! పికంబ!
భూషణవిహీనయైనట్టి పొలఁతుకఁబలె!

నీవియోగభరంబున మావిగున్న
లసదుషఃకాలముల దుఃఖరసముగతన
పత్రపుటికల సంతాపబాష్పకళిక
లనఁగఁగార్చు తుషారవాఃకణచయమ్ము!

---

# తిరుపతి

(కొన్ని చిత్ర కథలు)

తిరుపతిలోనున్న శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఆలయము షు మారు 9౦౦౦ సంవత్సరముల క్రిందట కట్టబడినట్లు తెలియుచున్నది. కాని స్వామివారు మాత్రము కలియుగానికి పూర్వము అనగా యుగ ములనుంచికూడా అక్కడ నివసించుచున్నట్లు పురాణములవలన రూఢిపడుచున్నది. అనగా తిరుపతిక్షేత్రము చాలాపురాతనమైన దన్నమాట. ఈ క్షేత్రము ఒక్కొక్కయుగములో ఒక్కొక్క పే రున పిలవబడుచున్నది. కృతయుగములో వృషభాసురసంహారము జరిగినప్పుడు అతనికోరికమీద యీక్షేత్రము వృషభాద్రి అని పిలవ బడ్డది. రెండవయుగములో హనుమంతునితల్లియైన అంజనీదేవి కోరికమీద అంజనాచలము అని పిలవబడ్డది. మూడవయుగములో వేయితలలు గల ఆదిశేషునకును, వాయుదేవునకును పెద్దతగాదా వచ్చి వారిద్దరును మేరుపర్వతముమీద బలాబలాలు చూచుకోవ డానికి పందెము వేసికొన్నారు. ఆదిశేషుడు వేయి తలలతోను తనబలమంతాచూపించి ఉఫ్ అని ఒక్కసారి బుసకొట్టే సరికి మేరుపర్వతముమీదనున్న చాలాపెద్దశిఖర మొకటి యించు మించుగా ఆకాశ మంటేటంత ఎత్తుకు, ఎగిరిపోయింది. వాయుదే వుడు అదిచూచి నిర్ఘాంతపడి ఆశిఖరంపైకెగిరి తనరెక్కలతో బలం కొద్దీ క్రిందకు ఒక్కవిసురువిసిరాడు. వెంటనే ఆశిఖరముకొట్టుకు వచ్చి యిప్పుడు తిరుపతికొండ ఉన్నచోట పడింది. కాబట్టి దాని కప్పుడు శేషాచలం అనిపేరువచ్చింది. కలియుగంలో మాధవుడనే బ్రాహ్మణుడు తానగ్నిసాక్షిగా పెండ్లిచేసుకొన్న భార్యనువిడచి పెట్టి అంత్యజాతిస్త్రీతో కాపురంచేస్తూండేవాడు. కొన్నాళ్లకా స్త్రీ

చనిపోయింది. అంతట వానికి వైరాగ్యంకలిగి ఈతిరుపతికొండకు వచ్చిపుష్కరిణిలో స్నానంచేసి పాపవిముక్తిపొందినాడు. అప్పుడు దేవుడితనికి ప్రత్యక్షమై నారాయణవనంలో ఆకాశరాజు అనే పేరుతో జన్మించేటట్టున్నూ, ఆయనకు పుట్టిన పద్మావతి అనే కూతురిని తాను (తిరుపతిదేవుడు) పెండ్లి చేసుకొనే టట్టున్నూ వరమిచ్చినాడు. అందువల్ల కలియుగంలో ఆకొండకు వెంకటాద్రి అనే పేరువచ్చింది. వెంకట అనగా పాపవిముక్తిచేసే దని తమిళములో అర్థమట. ఈ కొండనే వరాహగిరి అనికూడా అంటారు, ఎందువల్లనంటే హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు తన భార్యా కడుపుతోవున్నప్పుడు మన్నుతింటూంటే ఈభూమి అంతా చిరిచాప చుట్టినట్లు చుట్టుకొనిపోయి, సముద్రములో దాగుకొన్నా డట. అప్పుడు విష్ణుమూర్తి వరాహావతారమెత్తి భూమిపైకి వచ్చి వానిని సంహారించాడు. తరువాత భూమండలములో ఈతిరుపతి కొం డనుచూచి తానుకూడా శాశ్వతముగా యీకొండమీద కాపుర ముందామనుకొని, గరుత్మంతునికి కబురుపంపించి, వైకుంఠమునుంచి తన భార్యాఅయిన లక్ష్మీదేవిని తన విమానాన్ని తెప్పించి అప్పటి నుంచి యిక్కడనే కాపురమున్నాడని వాడుక. అందువల్లనే దీనికి వరాహగిరి అనికూడా పేరువచ్చింది.

ఈ కొండనుగురించియే ఇంకొకకథయున్నది. ఒకరోజున ఋషు లంతాకూడుచుండి ఏదోపిచ్చపాటి మాట్లాడుకొంటూండగా, వారి లో వారికి బ్రహ్మావిష్ణుమహేశ్వరులలో ఎవరు గొప్పవారని చర్చ వచ్చింది. కొందఱు బ్రహ్మ అన్నారు. కొందఱు విష్ణువన్నారు. కొందఱు శివుడన్నారు. ఇందులో ఎవరిమాట ఓడిపోవడానికి ఎవ గొప్పకొక్కరు! అందఱు గుమ్మడికాయంత ముత్యాలు! అందు

వల్ల వారిలో వారికి వాదన పెరిగిపోయి వారందఱు కలసి భృగ మహర్షిని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురియొద్దకు పంపి వారిలో ఎవరు గొప్పవారో కనుక్కొని న్యాయము చెప్పవలసిందని కోరినారు. భృగమహర్షి వారిముగ్గురియొద్దకు వెళ్లినాడు. బ్రహ్మ మహేశ్వరుల చర్య లతని కేమి తృప్తికరముగాలేవు. విష్ణుమూర్తి భృగుమహర్షిని వెళ్ళడంతోనే చక్కగా గౌరవించి అ తి థి పూ జ లు చే శా డు. అంతచేసినప్పటికి ఈయనదగ్గరెంతమంచితనము, సహనము, ఉన్నవో చూడవలెనని ఏదోచీరికయ్యము పెట్టుకొని విష్ణుమూర్తిరొమ్ముమీద బలంకొద్దీ ఒకతన్నుతన్నాడు. పాపం విష్ణుమూర్తి భృగుమహర్షులవారేమనుకొనిపోతారోనని అప్పుడుకూడా ఏమీమాట్లాడలేదు. కాని ఎప్పుడూ విష్ణుమూర్తివక్షస్థలమందే నివసించేటటువంటి లక్ష్మీదేవికిమాత్రం దెబ్బతగిలి చాలాకోపమువచ్చి అక్కడనుంచిలేచి ఎక్కడకోవెళ్లిపోయింది,

అప్పుడు మహావిష్ణువు పాపమామెను వెతుక్కుంటూ భూమండలంలోకి వచ్చాడు. చెట్టనకగట్టనక, పుట్టనక భూమండలం అంతా గాలించడం ప్రారంభించాడు. ఒకనాడు ఈతిరుపతికొండ మీదికి కూడా వచ్చాడు. ఈకొండ అతనికి చాలాబాగావుంది. లక్ష్మిలేకుండా మళ్లీవైకుంఠానికి పోడానికి మనసుపుట్టలేదు. ఇకను ఇక్కడే కాపుర ముందామనుకొన్నాడు. పాపమక్కడ ఇల్లా! వాకిలా! ఒక పెద్దచింతచెట్టుక్రిందనున్న పుట్టలో నివసిస్తుండేవాడు. లక్ష్మీదేవి అప్పుడు మహారాష్ట్రదేశములో కొల్హాపూరు అనేవాడుకగల కొల్లాపురిలో వుంటూండేది. ఒకనాడామె విష్ణుమూర్తి వైకుంఠం విడిచిపెట్టి భూమండలంలో తిరుగుతున్నాడని తెలిసి ఈకొండకు వచ్చి విష్ణుమూర్తిని చూచింది. పాపమాయన చాలాచిక్కిపోయి

నాడు, వేళకు అన్నము నిద్రా లేక పోవడంచేత. అప్పుడు ఆ ప్రదేశాన్ని యేలే రాజుగారి ఆవునొకదాన్ని విష్ణుమూర్తికి చూపించి రోజూ దీనిపాలు త్రాగుతూండండి అని చెప్పి పోయింది. ఆనాటినుంచి ఆ ఆవు తనపాల ధారనీ పుట్టలో విడిచిపెట్టి పోతూండేది.

ఒకరోజున రాణీగారు ఈ ఆవుదగ్గర ఏమీ పాలు లేక పోవడం చూచి గొల్లవానిమీద చాలా కోపపడ్డది. "ఎందువల్ల పాలు లేక పోయినవో ఈపడవ జాగ్రతగా కావిలి కాస్తానండీ" అని గొల్లవాడు చెప్పినాడు. కాని మరునాడుకూడా యేమీ పాలు లేక పోయినవి. అప్పుడు రాణీగారు 'బహుశా రోజూ నీవే పిండుకు త్రాగుతున్నట్టున్నావు. నిక్షేపమువంటి ఆవుదగ్గర పాలు లేక పోవడమేమిటి? ఇవ్వాళ లేక పోనీ! నిన్నేమి చేయిస్తానో రాజుగారితో చెప్పి.' అని బెదిరించింది.' ఆనాడు గొల్లవాడు చాలా భయపడి బహుజాగ్రతగా కావలి కాశాడు. ఈ ఆవు విష్ణుమూర్తి ఉన్న పుట్టమీదికెక్కి కోవలగుండా లోపలకు పాల ధారలు విడుస్తూంది. గొల్లవాడు కోపము పట్టలేక గొడ్డలి పుచ్చుకొనిపోయి ఆవును నరకడానికి గొడ్డలి పైకెత్తినాడు. వెంటనే లోపలనున్న విష్ణుమూర్తి ఆవును నరకకుండా పైకివచ్చి తన తల అడ్డంపెట్టినాడు. ఆకోపంమీద గొల్లవాడు విష్ణుమూర్తి తలకాయిమీదనే ఒకపెట్టు పెట్టినాడు. పాపం వెంటనే గొడ్డలి వాయిదగిలి (బెలబెల) నెత్తురు కారుతూండగా విష్ణుమూర్తి పుట్టలోకి వెళ్లిపోయినాడు. దేవుడిని కొట్టినపాపంచేత గొల్లవాడక్కడనే పడిచచ్చిపోయినాడు. వెంటనే ఈ ఆవు వెళ్ళి రాజుగారిని తీసుకొనివచ్చి గొల్లవాడు పడివున్న చోటున్నూ విష్ణుమూర్తి ఉన్న పుట్టచూపించింది. దేవుడు రాజుగారిని చూచి ఆయన అజాగ్రతకు చాలాకోపముతో శాపమిచ్చినాడు.

రాజుగారు తనకేవిషయమేమియు తెలియదు. తానిందులో నిర్దోషినని దేవుణ్ని బ్రతిమాలుకొన్నాడు దేవుడందుకు కనికరించి, "నా నెత్తిమీదనున్న గాయముమాసి పెండ్లినాడు నామామగారవబో యే ఆకాశరాజుగారిచ్చిన ౨౦౦౦ మణుగులబరువుగలబంగారపుకిరీటము ధరించగలిగినప్పుడు నీనీశాపమునుండి విముక్తిపొందుతా"నని మరల వరమిచ్చిపుట్టలోకి వెళ్లిపోయినాడు.

వెంకటేశ్వరస్వామికి గాయము, నెమ్మదించగానే ఆకొండకు యజమానిగా వుంటూన్న వరాహస్వామితో స్నేహముచేసి కొంతస్థలం సంపాదించి అక్కడనే తానుకూడ ఒకభవంతి కట్టుకొన్నాడు. వరాహస్వామి 'వకుళమాలిక' అనే ఆబిడను వెంకటేశ్వరస్వామికి సేవ చేయడానికి నియమించినాడు- ఈ వకుళమాలిక కృష్ణావతారములో కృష్ణుడు పెంపుడుతల్లియైన యశోదాదేవియేనని ఒకప్రతీతి.

ఒకనాడు వెంకటేశ్వరస్వామి తిరుపతికొండకు దగ్గరగానున్న నారాయణవనము అనే అరణ్యములోకి వేటకువెళ్లినాడు. అక్కడ ఒకపూలతోటలో సుందరమైన యొకకన్యారత్నమునుచూచి మాట్లాడుదామని దగ్గరకు వెళ్లగా ఆమెచెలికత్తె లభ్యంతరపెట్టినారు. అందువల్ల చాలాఆశాభంగముగలిగి యింటికి తిరిగివచ్చినాడు. వకుళ తానుప్రయత్నముచేసి ఆమె వెంకటేశ్వరస్వామిని వివాహము చేసుకొనేటట్టుగా తాను సహాయంచేస్తానని చెప్పింది.

ఒకనాడు నారాయణవనము ఒకయెరికలదివచ్చినది. ఆవూళ్లో నున్న స్త్రీలందరువచ్చి ఆయెరికలదానిచేతసోదె చెప్పించుకొంటు న్నారు. అది చాలా నిజంగా అన్నిసంగతులు పూసగ్రుచ్చినట్లు చెప్పగలదని వూరంతా పెద్ద వాడుకఅయింది. నారాయణవనంలో ఆకాశరాజు కూతురు పద్మావతికీసంగతి తెలిసి ఆబిడకూడావచ్చి

సోదెఅడిగింది. అప్పుడా సోదెది పద్మావతినిచూచి 'అమ్మా! నీకు త్వరలో వివాహమవుతుంది; నీవు తిరుపతి వెంకటేశ్వరస్వామిని పెండ్లి చేసికొంటావు చాలా అదృష్టవంతురాలవు! మంచి పెనిమిటి దొరికినాడని చెప్పింది' పద్మావతికి పాపము వెంకటేశ్వర్లే పరికిల దాని వేషముతో వచ్చాడని తెలియక యిదంతా నిజమనినమ్మినది. పద్మావతి హృదయక్షేత్రమున వేంకటేశ్వర్లుమీద ప్రేమాంకూరములు మొలకలెత్తసాగినవి. ఈసంగతి కనుపెట్టి వకుళ పద్మావతి యొద్దకు ప్రతినిత్యము వెళ్ళుతూ వెంకటేశ్వర్లు సుగుణాలువర్ణిస్తూ ఆమెప్రేమకు మఱింతదోహదముచేస్తూవుండేది.

ఇదంతా ఆకాశరాజుకు తెలిసి మంచిలగ్నమువిచారించి పద్మావతినిచ్చి వెంకటేశ్వర్లుకు వివాహముచేశాడు. ఆకాశరాజు వెంకటేశ్వరస్వామిని అప్పటినుంచి నారయణవనములోనే కాపురముండవలసిందని ప్రార్థించి అక్కడొక దేవాలయము కట్టించినాడు. ఆదేవుణ్ని కల్యాణవేంకటేశ్వరస్వామి అని యిప్పటికి పిలుస్తూంటారు.

## అనుమానము

సుధాకరరావు స్కూల్ ఫైనలు క్లాసుచదువుతూవుండగా ఒకసారి చాంప్లమేనమామ బెజవాడవచ్చాడు. ఆయన పెద్ద జ్యోతిష్కుడు. సుధాకరరావు జాతకచక్రంచూచి. "ఈజాతకుడు పంక్తిని అధమపక్షం పదిమంది బ్రాహ్మణులైనా లేకుండా సాధారణంగా యెప్పుడు భోజనంచేయడం తటస్థించదు" అన్నాడు. ఆజాతకప్రభావమో ఏమోగాని సుధాకరరావు చాలారోజులనుంచి పూటకూళ్లింటో పంక్తిని పదిమంది బ్రాహ్మణులు లేకుండా భోజనంచేయడం తటస్థించలేదు. అతను రాజమహేంద్రవరము క్రొత్తగావచ్చిన నాటికి రాత్రి రైలుదగ్గరగా ఒకపూటకూళ్లింటికి వెళ్లి భోజనంచేశాడు. అక్కడపనసకాయకూర నూనెపోపువేసినదానిని 'ఆహా' భోజన

సౌఖ్యమనగా! గోదావరిజిల్లా వాండ్లదేనండీ' అని ఆపూటకూళ్లయజమానిని పొగడి అంతా అయిదణాలిస్తూంటే తానారణాలిచ్చి మఱునాటినుంచి పూటకొక హోటలుకు పోవడం ప్రారంభించాడు. అతనువచ్చిన పనిఅయితే తొందరగానే అయిపోయిందిగాని రాజమహేంద్రవరము, ఒకప్పుడాంధ్రదేశములో మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన చరిత్ర ప్రసిద్ధమగు పట్టణమగుటచేత పదిరోజులుండి చూచిపోదామని నిలవున్నాడు.

వేసవికాలమవడంచేత ఎండవేళప్పుడు వీధులలోతిరుగుతూంటే కాళ్లుకాలుతవని చక్కని చెప్పులజోడొకటి కొనుక్కొని కాళ్లకువేసుకొని తిరగడంప్రారంభించాడు. ఆచెప్పులజోడు కొన్నదిమొదలుకొని భోజనానికివెళ్ళినప్పుడుతప్ప ఎప్పుడు విడిచిపెట్టుగడు.

ఆనాడు మే 18 వ తేది గాంధీమహాత్ముని శిక్షాదినోత్సవము జరుగుతూంది. అనేకమంది ఆంధ్రనాయకులు మహోపన్యాసములు చేస్తూన్నారు. ఆ ఉపన్యాసాలు వినడానికి మన సుధాకరరావు కూడా వెళ్ళినాడు. ఆజనసమూహంలో సుధాకరరావుకు ఇద్దరు ప్రాతస్నేహితులు కనిపించారు. వాండ్లిద్దరు రాజమహేంద్రవరము తాలూకా కచేరిలో కొత్తగా వుద్యోగములో ప్రవేశించారు. రాజమహేంద్రవరం వచ్చిన నాలుగైదు రోజులనుండి స్నేహితులెవరు లేక సుధాకరరావు రాత్రిళ్ళుపడుకొనేందుకు మంచిచోటుదొరకక చాలాయిబ్బందిపడుతున్నాడు. ఈ స్నేహితులు, రంగారావు, నరసింహము, కనుపించినప్పటినుంచి వాండ్లపూటకూళ్లయింటికే భోజనానికిపోతూ వాళ్లగదిలోనే పడుకుంటున్నాడు.

ఒకనాడుఉదయం లేవడంతోనే సుధాకరరావుకు ఒకమాదిగవాడు కనపడి "అయ్యామీచెప్పులీయండి, క్రింద అరిగిపోకుండా

చక్కనిఅట్టవేసి నాళములు వేస్తాను. మూడణాలవుతుంది'' అని చెప్పి తీసుకొనివెళ్లినాడు. సుధాకరరావు సరేనని గదిలోనున్న చెప్పులు తీసికొనివచ్చి మాదిగవానికిచ్చి 'చక్కగా చేసుకొనిరా! చెప్పులు బహుబాగున్నవి. మూడణాలుకాకపోతే నాలుగణాలిస్తాను.' అనిచెప్పి తనపనిమీద తానువెళ్లిపోయినాడు. పాపమానాడెల్ల సుధాకరుడు కాలిజోడులేక చాలాయిబ్బంది పడ్డాడు

సాయంత్రం కనిచీకటిపడేసరికి తమకొట్టుదగ్గరకు చెప్పుల జోడుపుచ్చుకొని మాదిగవాడువచ్చినాడు. సుధాకరరావే చెప్పుల జోడుచూచుకొని చీకాకుపడి జోడునాజూకంతా చెడగొట్టినావు. ఈమొద్దుఅట్టలువేశావేమిటి? అన్నాడు. రంగారావు బయటకువచ్చి చెప్పులు పరీక్షగాచూచి "ఇవిమీవికావండీ! ఇదెక్కడిదో పాత జోడండీ! మీరు తేలికగా మోసపోయేటట్టున్నారే!" అన్నాడు. సుధాకరరావు ఇంగ్లీషులో మణీఅంతమోసం చేయడానికి వానికి మాత్రం ధైర్యముంటుందా! కాదండీ! చేతకాక పాడుచేశాడు; నిక్షేపమువంటిజోడు!"అనివిసుగుకొన్నాడు, నరసింహాం నవ్వుతూ! వీళ్ళు మార్పువాళ్లండోయి! క్రొత్తచెప్పులు తీసుకొనివెళ్లి అమ్ముకొని ప్రాతవితీసుకవచ్చి యిస్తారండోయి'' అన్నాడు. సుధాకరుడు చాలా సరళహృదయం కలవాడు. ఎవరినిసాధారణంగా అనుమానించేవాడు కాడు. కాబట్టి "వీళ్లమ్మితేమాత్రం వీళ్లదగ్గర ఎవళ్లోతొడిగి బాగు చేయడానికనియిచ్చినపాతజోడుకొనుక్కునేటంత దరిద్రుడెవడుంటాడండీ' అన్నాడు 'అయ్యా, పెద్దమనుష్యులల్లే వుండేవాళ్లే కొంటారండీ!' అన్నాడు నరసింహాం.

ఈసంభాషణంతా వింటూ మాదిగవాడు 'అయ్యా మేము కులానికింతతక్కువ వాళ్లమైనా మీరుచెప్పేటంత దొంగలము

కామండీ! అయ్యగారిని నేను మోసము చేయడానికి రాలేదు. అయ్యా! కష్టించేశాను. ఇంకొక రెండణాల డబ్బులిప్పించండీ! అని అడుగుకొని పుచ్చుకుంటాము కాని ఇటువంటితప్పుకు కూళ్ళుకుడువను! నాకొక్కడేబిడ్డ! నాబిడ్డతోడు నేనిలాంటి తప్పుడుపనిచేస్తే! అని దీనాలాపము లాడ మొదలుపెట్టినాడు.

అదివిని మనసుకరిగి సుధాకరుడు 'అయ్యో పాపము! వాడంత ఒట్టుపెట్టుకుంటూడా! చేతకాక పాడుచేశాడు కాబోలు! పోనీయండి! ఏంచేస్తాము' అని చెప్పులజోడు తీసుకపోయి మిత్రులవంక చూచినాడు. మిత్రులు 'పాతచెప్పులుతీసుకొనివచ్చి పైగానొంగ ఒట్లు పెట్టుకొంటావేమిటి! తీసికొనివస్తే మాచెప్పులుమాకు తీసుకొనివచ్చియియ్యి లేకపోతే రేపుప్రొద్దునే పోలీసుకు రిపోర్టుచేసి నీమీద కేసుచేస్తాము.' అని వాడిమీద కేకలువేస్తే వాడుసుధాకరరావు వంకతిరిగి 'అయ్యా: మీరు పెద్దకులంలో పుట్టినారు చదువుకొన్నారు. నెయ్యిఅన్నంతినే మహారాజులు మీరిట్లా పాతచెప్పులిచ్చి కొత్తచెప్పులిచ్చానని పోట్లాడితే యికమాబోటివాండ్లేలాగండీ! బ్రతకడం! పోనీలెండి డబ్బులివ్వకపోతేమానే! మీజోడుతీసుకోండిఅని జోడక్కడవిడచిపెట్టి వెళ్ళిపోయినాడు. సుధాకరుడు తన మిత్రుల మాటలమీద వాడు నిజముగా మోసగాడనినమ్మి మోసగాడైననుసత్యవంతునివలె వాడునటించే నటనచూచి చాలాఆశ్చర్యపడ్డాడు.

రెండు మూడు నాళ్ళయింది, సుధాకరరావు స్నేహితులతో కూడాభోజనానికి వెళ్ళినాడు. పూటకూళ్లింటి చావిటిగడపదగ్గర తన జోడుచూచాడు. స్నేహితులకుకూడా చూపించాడు. వాండ్లుకూడా నవ్వి మేమప్పుడే చెప్పలేదు 'వాడమ్మియుంటాడని! చూడండి!

ఇప్పుడే తెలుస్తుంది యెవరికమ్మినాడో!' నని ఆజోడు తీసికొనివెళ్లి ఆయింట్లోనే ఒకగదిలో దాచివచ్చారు. భోజనాల దగ్గరనుంచి ఒక పంక్తివారు లేచారు. రెండోపంక్తికి సుధాకరుడు స్నేహితులు కూర్చున్నారు.

'నాజోడు కనుపించలేదండీ! ఎవరో కాళ్లను వేసికొని పోయినట్టున్నారండి!' అని ఒకపెద్దమనిషి బయట వెతుకొంటున్నాడు. మన సుధాకరుడు స్నేహితులు నవ్వుకొంటూకూర్చొన్నారు. కొంతసేపటికిభోజనందగ్గరనుంచిలేచి రంగారావుజోడు తెచ్చి 'ఇదేనాఅండి మీజోడు' అని అడిగినాడు. 'అవునిదే! ఇదే! అని తేరిపారచూచి మొన్న నీహోటలులోనే మారిపోయిదండి! నాపాతజోడుపోయి క్రొత్తజోడువచ్చింది' అని నవ్వుతూ అన్నాడాపెద్ద మనిషి!

సుధాకరరావు స్నేహితులు తెల్లపోయినారు. 'ఔరా! అనుమాన మెంత చెడ్డది? చూచారా! పాపమా! మాదిగవాడెంత ఒట్టుపెట్టుకొన్నాకూడా వానినే అనుమానించి తిట్టినాము', ఆరాత్రిచీకట్లో నేనేపాతజోడు చూడక పొరపాటున తొడుకొని పోయి వుంటాను ప్రొద్దున్నే వాడువస్తే వానికిచ్చినాను. చూచారాస్వయంకృతాపరాధమునకు వానిమీద వృథాగా అపోహపడ్డాము. అని మఱునాడు వానికోసము వెదకి వానిని కలుసుకొని సుధాకరరావు, 'నీమీద అన్యాయముగా నిందవైచి నిన్ను దూషించినాము! తరువాత నిజము తెలియవచ్చినది'. అని వానికి క్షమాపణచెప్పి వాని యేకపుత్రుని కన్నీటిధారలతో 'నాయనా! నీవు చిరాయువుకమ్ము' అనిదీవించి పాపవిముక్తి చెందెను.

---

# రాజకీయాందోళనము: వాఙ్మయము

## నోరి నరసింహశాస్త్రి,

(గుంటూరు యువజన సాహితీ సంఘమున ప్రారంభోపన్యాసముగా చదువుటకు వ్రాయబడినది)

జర్మను మహర్షి 'నీచే' చెప్పినట్లు జగడమాడి నలుగురితో ప్రథమపరిచయము కల్గించుకొనడము మంచిది కాదనను. కాని నే నాఉద్దేశముతో మీఎదుట ఇప్పుడీ ఉపన్యాసము చదువుటకు పూనుకో లేదు. మీవంటి పెద్దలతో ప్రథమ పరిచయము కలిగించుకొనబోతూ నేను చదువబోవుతున్న విషయాలన్నీ నాకు చేతనైనంత ఆలోచనము చేసి వ్రాసినవే కాని వేరే అభిప్రాయముతో వ్రాసినవి కావని ముందుగా మీకు మనవిచేసుకుంటున్నాను. నా అభిప్రాయములతో తమలో కొందరు ఏకీభవించకపోయిననూ నేను వ్యర్థవాదము కల్గించుటకీ మాటలు చెప్పుచున్నానని తలంచవద్దని ముందుగా ప్రార్థిస్తూ ప్రస్తుత విషయమునకు వచ్చెదను

రాజకీయస్థితికీ వాఙ్మయానికీ ప్రకృతిసిద్ధంగా విరోధముగాని మైత్రిగాని లేదు. కాలమహాత్మ్యంవల్ల భేద మెరుగని విషయాలకు భేదము కలుగుతుంది; సంబంధము లేని విషయాలకు అన్యోన్యమైత్రి ఏర్పడుతుంది. ఈ కాలపురుషుడు ఈమధ్యమన ఆంధ్ర దేశంలో రాజకీయ విషయాలకూ వాఙ్మయానికీ విరోధం కల్పించినాడు.

ఉత్తమమైన వాఙ్మయము సామాన్యముగా దేశము సుఖస్థితిలో ఉండి శాంతి కలిగి తృప్తిపొంది ఉన్న కాలంలో అభివృద్ధి పొందుతుంది. ఒకవేళ దేశము ఆందోళనముతో ఉడికిపోతున్న సమయంలో రవీంద్రునివంటి మహాకవులు ఉత్తమ కావ్యాలు రచించినారంటే, దానికికూడా ఆయాకవుల మనస్సులలో వెలుగుతున్న అనంతమైన మనశ్శాంతియే కారణము. ఇక దుఃఖగీతాలు గానము చేసే కవి మనస్సులో మనశ్శాంతిఉన్నదా అనే శంక కలిగేయెడల విజయగీతాలు

షాడ్డేకవి మనస్సులోకంటె కూడా ఇటువంటివారికే ఎక్కువ పనశ్శాంతి ఉంటుందని చెప్పవలసి వస్తుంది.

కాబట్టి ఉత్తమ కావ్యము సఖమువల్ల కలుగుతుందని చెప్పుతున్నాను. మన ఆంధ్రమహాకవికూడా చెప్పియున్నాడు.

"నిరుపహతిస్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజనముయ్యెల పంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక ఊరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే."

ఈపద్యము కవి యేసందర్భములో చెప్పినదైనప్పటికీ దీనిలో ఉత్తమ కావ్యజన్మమునకు అవసరములైన పరికరాలన్నీ ఆతడు చెప్పియున్నాడు. కావ్యకర్త మహాభోగి. అంతకంటెనూ మహాభోగి కావ్యరసాస్వాది!

నేడు మనము ప్రస్తావించుచున్న విషయము "రాజకీయాందోళనము-వాఙ్మయము,, అని చెప్పినప్పుడు ఈ రెండింటికిగల సంబంధమనీ అదిన్నీ ప్రధానంగా ప్రస్తుతకాలానికి సంబంధించినదనీ మీరు తెలుసుకున్నారని తలంచుతాను. ఈకాలంలో రాజకీయ విషయాలకూ వాఙ్మయానికీ విరోధం కలిగిందని ముందేచెప్పియున్నాను. ఈ విరోధమువల్ల నష్టపడ్డది వాఙ్మయమే. ఈ మధ్య మన దేశమును ఆందోళనపరచి ప్రస్తుతము నిద్రావస్థలోఉన్న రాజకీయోద్యమముచేత తాత్కాలికముగా మన ఆంధ్రవాఙ్మయ మెంతనష్టముపొందినదో చూచినప్పుడు వాఙ్మయాభివృద్ధికి శాంతియెంత అవసరమో బోధపడగలదు. కాని ఇది ఆలోచించడానికి ముందు ఈవిధంగా నష్టపడిన వాఙ్మయముయొక్క అతిశయము ఎటువంటిదో కొంచెము విచారింతాము.

వాఙ్మయము భోగము. దానిఆకర్షణశక్తివల్లబట్టి అది వ్యసనమని చెప్పినప్పటికీ నాకభ్యంతరములేదు. కాని దుర్వ్యసనముమాత్రముకాదు. ఒకవస్తువు ఆకర్షించేశక్తి కలదన్నమాత్రముచేత అది త్యజింపవలసినదని అర్థముచేసుకొనడము పొరపాటు. సన్యాసము ఉత్తమాదర్శములలో ఒకటిగాగల మనదేశములోమాత్ర మీపొరపాటు

విశేషముగాకనబడుతున్నది. సత్త్వోద్రేకమువల్ల అఖండస్వప్రకాశానంద చిన్మయమనీ బ్రహ్మానందసహోదరమనీ ఆలంకారికులు పొగడుతున్నరసమే ఆత్మగాగలది కావ్యము. ఇట్టికావ్యాల సమాహారరూపమైన వాఙ్మయము ఎంతకొద్దికాలముపాటైనా హీనదశపొందియుండడము మిక్కిలిసంతాపకారణమైన విషయము.

ప్రాచీనాంధ్రవాఙ్మయ ప్రశంసతో మనకిప్పుడుపనిలేదు. ఆధునాతనాంధ్ర వాఙ్మయము విజ్ఞానచంద్రికామండలి స్థాపనముతో ప్రారంభించినది. అంతకుమునుపే ఆధునికాంధ్రవాఙ్మయకర్తలైన కందుకూరి వీరేశలింగమువంటివారు తమగ్రంథాలు వ్రాసినప్పటికీ విజ్ఞానచంద్రికామండలివారి పుస్తకాలే ప్రథమములో మన ఆంధ్ర నూతనోజ్జీవానికి కారణాలైనవి. ఈమండలిప్రచురణములపిమ్మటనే దేశములో నూతనగ్రంథాలు చదువుటకూ కొనడమందాసక్తి హెచ్చినది. ఆపిమ్మటనే ఆంధ్రప్రచారిణీగ్రంథమాల మొదలైన గ్రంథమాలలు స్థాపితములై ఇతరదేశాలలోని గొప్పకావ్యాల స్వరూపము మనకువెల్లడిచేసి మనఆంధ్రవ్యక్తికి మార్గదర్శకములైనవి ఆంధ్రభారతి, త్రిలిఙ్గ, మొదలైన వాఙ్మయపత్రికల ప్రచురణముసాగినది. పద్యకావ్యరచనలో నూతనపద్ధతులు రాయప్రోలు సుబ్బారావుగారి కావ్యాలతో కొంచెము మొలకెత్తి నానాటికీమిక్కిలి వృద్ధిపొందుతున్నవి. నవలలనీ నాటకాలనీ చిన్నకథలనీ చెప్పతేసన్నిరీతులుగా గ్రంథాలువ్రాసి ఆంధ్రులు వాఙ్మయాభివృద్ధికై పాటుపడసాగినారు. వాఙ్మయాభివృద్ధియే ఉద్దేశముగాపెట్టుకొని ఆంధ్రసాహిత్యపరిషత్తు ఆంధ్రసారస్వతసభ మొదలైన సభలు స్థాపింపబడినవి. దేశములో వాఙ్మయచర్చ భాషాచర్చ అతిశయించినవి. ఈవిధంగా విరోపా మహాసంగ్రామసమయంలోకూడా శాఖోపశాఖలై, వృద్ధిపొందుతున్న ఆంధ్రవాఙ్మయాభివృద్ధి ఈమధ్య అకస్మాత్తుగా ఆగిపోయినది. సాహిత్యవిషయంలో దేశంలో భయంకరమైన మౌన మొక్కటికల్గినది. దీనికంతా ముఖ్యకారణము అసహాయోద్యమమే కాని వేరుకాదని నాదృఢ విశ్వాసము. 'ఈఉద్యమము సాహిత్యాభి వృద్ధికి తాత్కాలికంగా ఎట్లా ఆటంకమైనదో ప్రస్తుతము మన యువజనసాహితీసంఘపు చరిత్రను బట్టియే స్పష్టపడగలదు. ముఖ్యంగా సాహిత్యాభివృద్ధికై స్థాపింపబడిన దీసంఘము. అట్టి ఈసంఘములోని సభ్యుల పేర్లను C. I. D. ఉద్యోగులు

వ్రాసుకొనిపోవలసిన అవసరము వచ్చినది. ఈ సంఘపు పోషకులలో ఒకరైన దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారునూ, ఈసంఘానికి ప్రస్తుత మధిపతియైన ఉన్నవ లక్ష్మీనారాయణగారునూ, సభ్యులైన మాడభూషి నరసింహాచార్యులుగారు గొల్లపూడి సీతారామశాస్త్రిగారు మొదలైన పెద్ద లెందరో రాజకీయ వ్యవహారములలో పాల్గొని అవసరమైనప్పుడు చెరసాలకుపోయి తమకార్యనిష్ఠ చూపవలసి వచ్చినది.

ఈవిధంగా అసహాయోద్యమము సాహిత్యాభివృద్ధికి ఆటంకము కలిగించిన దని చెప్పినప్పుడు ఈ ఉద్యమమును దూషిస్తున్నా ననిగాని, అది దేశమునకు మేలు చేయలేదంటున్నా నని కాని మీరు తలంచరాదు. ఈ యుద్యమము ప్రజలలో కలిగించినశక్తీ, ఆత్మగౌరవమూ, స్వతంత్రబుద్ధీ, పొగడడము సాధ్య కాదు. అన్నిటికంటే ఈఉద్యమము పల్లెపల్లెలలో ఉన్న జన సామాన్యమునకు రాజకీయ విషయాలలో కల్గించిన ప్రేమమాత్రము గవర్నమెంటువారునూ ప్రజలునూ ఏకగ్రీవముగా ముఖ్యముగా అభినందించవలసిన సంగతి. ఎప్పటికైనా స్వపరిపాలనమునకు మనదేశ మర్హమయ్యేయెడల సామాన్య ప్రజలకు పరిపాలనలో పాల్గొనవలె ననే ఆశయముగట్టిగా కలిగి తీరవలెను. ఇట్టి ఆశయమును గవర్నమెంటువారు ఇన్నేళ్ళబట్టీ ఇంత ధనవ్యయముచేసి ఇన్నిపాఠశాలలు స్థాపించి ఇంతకష్టపడేకూడా ప్రజలలో తగినంతగా కల్పింపలేకపోయినారు. కాని ఈ అసహాయోద్యమము రెండుసంవత్సరాలలో ప్రతిమారుమూలలలో ఉన్న పల్లెలలో ఉన్నవానివద్దకునూ పోయి అతడునూ పరిపాలనచక్రములో పాలుపొంద దగినవాడనీదానికై ప్రయత్నింపవలెననీచెప్పి లోకానికి అద్భుతమావహింపజేసింది.

ఈవిధంగా కొద్దికాలములో ఇంతపని ఈఉద్యమము నిర్వహింపగలిగి ఉండడానికి కారణంలేకపోలేదు వివిధమార్గాలలో ప్రసరిస్తున్న భారతశక్తి ఈకొద్దికాలంపాటునూ రాజ్యాంగవిషయాలపైన కేంద్రీకరింపబడినది. దేశము వీరావేశము పొందిఉన్న రోజులలో వాఙ్మయపు మొరఆలకించేవా రెవరు? వాఙ్మయమ నేది అసలం లోకములో ఉన్నదనీ అది తాత్కాలికములైన రాజకీయపరిస్థితులకంటె ప్రధానమూ శాశ్వతమూ ఐనద నేవిషయము ఎవరికి జ్ఞాపకమున్నది? ఎవరైనా అటువంటి

అభిప్రాయాలున్నవాళ్ళు తమదోవను తామున్నప్పటికీ వాళ్లు లోకానికి హాస్యాస్పదులైనారు.

ఇట్లా భారతశక్తి ఒక్కవిషయంలో కేంద్రీకరించిన కారణంవల్ల మనదేశంలో స్థూలబుద్ధియెక్కువైంది. అనంతములైన ప్రవాహాలలో ప్రవహించే జీవతరంగము ఒకే ప్రవాహములో ప్రవహించ ప్రయత్నించేటప్పుడు ఆప్రవాహము ఎంతవిశాలమైనదైనా చాలుతుందా? రాజకీయ వృత్తాంతమేకాని మానవుడు తెలుసుకోదగినది, వేరేదీలేదనే అభిప్రాయము జనాంగంలోకలిగింది. నలుగురు కూడిన ప్రతిచోటనూ సంభాషించడానికి వేరేవిషయాలు లేనట్లుగా ఈ ఉద్యమవిషయమే చర్చించసాగినారు. భారతదేశములో ఇందువల్ల విశాలదృష్టి క్షీణించినది. కాని అందులో ఆంధ్రదేశంలో మరీ ముఖ్యంగా క్షీణించింది. దానికి కారణము ఈదేశము రాజకీయోద్యమములో గౌరవాస్పదముగా పాల్గొనుట కిదే ప్రథమపర్యాయము కావడము. కొత్తబిచ్చము పొద్దెరుగదు. ఇట్లా విశాలదృష్టి క్షీణించి స్థూల దృష్టి అభివృద్ధి పొందినది ఒక్క అనహాయోద్యమ వాదులలో మాత్రమేకాదు వారిలోకంటెనూ వారి శత్రువులలోనే అది ఎక్కువ ప్రబలినది. తన అభిప్రాయరాగాలతో ఏకీభవించని వాళ్లను మూర్ఖులనీ ఆత్మలాభపరాయణులనీ దుర్మార్గులనీ దూషించిన సమయమది. వేర్వేరు మనుష్యులకు అభిప్రాయభేదము లుండవచ్చుననే విషయమే దేశము మరచిపోయినది.

ఆనీ బీసెంటు తనప్రచారము సాగించినప్పుడే మనదేశంలో పుట్టి, అసహాయోద్యమ సమయంలో పూర్వాచారమందాదరణము వృద్ధిపొందినది. పరదేశాభిప్రాయములకు బానిసలమై ఉండడము మంచిదని నేను చెప్పబూనుకోలేదు. కాని ఈపూర్వాచార పరాయణతవల్ల అంతకంటే భయంకరమూ అపాయకరమూ ఐన బానిసతనముతో ప్రవేశించినామనిమాత్రము మనము మరువరాదు. మనము మనదేశమువారమనేమాట నిజమేకాని మనము పూర్వకాలపు వాళ్లముకాక ఈకాలపు వాళ్లమనేమాటకూడా అంతటి సత్యమే. ఈకాలంలో ప్రబంధాలే వ్రాయవలెనని కాని పద్యప్రాయమైన పూర్వవచనమే వ్రాయవలెననికాని అనడము హాస్యాస్పదము

నేనొక తెలుగుబాగా చదువుకొన్న ఇన్స్పెక్టరు గారితో మాట్లాడడము తటస్థించినప్పుడు వారు ఈకాలంలో పుట్టినకావ్యాలలో చిన్నయసూరినీతిచంద్రికే గానిఉత్తమ కావ్యమింకొకటి లేదని చెప్పినప్పుడు నామనస్సులో ఎంతసహ్యపుట్టిందో మీరూహించలేదు. ఒకసారి నేను బజారులో ఒకవర్తకునివద్ద ఇంగ్లీషు మందొకటి కావలసి దానిపేరు ఇంగ్లీషులో చెప్పి 'ఉన్నదా, అని తెలుగులో అడిగినప్పుడు ఆవర్తకుడు "మీరు దొరలాయెను! ఇంగ్లీషుతో మాట్లాడితే మాకర్థముకాదు,, అనినన్ను కోపపడి పంపివేసినాడు. ఇటువంటి వెన్నోకలవు. విశాలదృష్టి క్షీణించిన సమయంలో పూర్వాచార పరాయణతవల్ల కలిగేనష్టము విదేశాధీనతకంటెనూ అపాయకరమైనది.'

ఈ ఉద్యమము దేశానికి నూతనశక్తి అఖండంగా ఇచ్చినదనే మాట నిజము. ఉద్యమోద్దేశములో ఇది సాత్త్వికశక్తియే ఐనప్పటికీ పశుశక్తితప్ప తెలుసుకోలేని సామాన్యజనులు పశుశక్తికి సాత్వికరూప మారోపించి నాయకులను గూడా దానియం దుత్సాహము కలిగించినారు, (మీరు నేనొకమాట చెప్పబోతున్నందుకు క్షమించవలెను, అసహాయోద్యమ వ్యాపకమునకై నిండు సభలలో స్త్రీలూ పురుషులూ అనే భేదములేక ఒకరికొకరు తీసిపోక మిక్కిలిమోటుగా మాట్లాడి ఉన్నారు. ఎంతమోటుగా మాట్లాడడము అంతగొప్పగా ప్రజలు పరిగణించినారు.

స్థూలదృష్టీ, పూర్వాచార పరాయణత, మోటుదనమూ దేశంలో వ్యాపించియున్న సమయంలో ప్రజనాకర్షించిన వాఙ్మయస్వరూప మెటువంటిదో మీరే ఊహించుకోగలరు. అంతచౌక వాఙ్మయము మనదేశంలో మునుపెప్పుడూ పుట్టి ఉండలేదని నానమ్మకము. అందులో ఉత్తమమని పేరుపొందిన "సాక్షి,, శాశ్వతముగా వాఙ్మయంలో నిలిచినప్పుడు దానిమీద ప్రజలకున్న వ్యామోహము తెలిపేయెడల వాఙ్మయమునుగూర్చి అప్పుడు ఎట్టి అభిప్రాయాలు ఉన్నవో తరతరాలకు తెలుస్తూ ఉండగలదు.

ఇంతవరకూ వెనుక చెప్పినమాటలనుబట్టి నేను అసహాయోద్యమమును దూషించినానని మీరనుకోగాదు. అసహాయోద్యమము దేశములో వ్యాపించినసమయాన

వాఙ్మయస్థితి ఉన్నదన్నట్లు చెప్పితినేకాని వేరేమీ లేదు. స్వరాజ్యముకంటె వాఙ్మయమెక్కువా? జనము కరువుతో అల్లాడుతున్నప్పుడు ఈ వాఙ్మయభోగపరాయణత ఎంతటి కఠినహృదయులకుకాని తగదు. అని ఎవరైనా అనవచ్చును. కాని కవి కఠినహృదయుడే. అతడు దూరదృష్టికలిగి శాశ్వతానందాన్నిగూర్చి ఆలోచిస్తూ తాత్కాలికకష్టాలుచూచి, దివ్యజ్ఞానికాబట్టి నవ్వినా నవ్వవచ్చును. ఇటువంటి కాఠిన్యము ఈశ్వరునికికూడా ఉందే.

ఈమధ్య రెండుమూడు సంవత్సరాలపాటు వాఙ్మయము శవప్రాయమై ఉన్నది గాని అప్పుడైననూ శవముగా లేదు. సామాన్యజనుల మనస్సుల నాకర్షించలేకపోయిననూ మారుమూలలలోనైనా వాఙ్మయమందు ప్రేమకలవారు ఉన్నారనే సూచనలు కనపడకపోలేదు. దువ్వూరి రామిరెడ్డిగారు తమ కావ్యాలు కొన్ని ఈరోజులలోనే ప్రచురించినారు. సాహితీసమితివారు చేసినపనినిగూర్చి విశేషించి మాట్లాడడము ఆత్మస్తుతిగా ఉంటుంది. కాబట్టి దానిని ప్రస్తావనమాత్రముతో విడిచిపెట్టుతున్నాను. వంగూరి సుబ్బారావుగారి ఆంధ్రవాఙ్మయచరిత్ర ప్రచురణము మాత్రము ఏకాలములోనైనా వాఙ్మయముపైన ప్రేమకలవారు కొంతమందియైనా ఉండకమానరనేమాట స్పష్టపరచినది.

ప్రస్తుతము రాజకీయోద్యమము నిద్రిస్తున్నది. ఈసమయము కనిపెట్టి వాఙ్మయము తలయెత్తినది. దీనికి తోడుగా కాగితము ధరకూడా చాలా తగ్గినది. ఇప్పుడు అసంఖ్యాకములుగా పుట్టుతున్న పత్రికలను బట్టీ, ప్రచారణ మవుతున్న గ్రంథాలను బట్టీమళ్లీ మనదేశములో జీవతరంగము స్వేచ్ఛగా ప్రవహింప సాగిందని తోస్తున్నది. ఇప్పుడు దేశము బాగుపడ్డదనను. చెడిపోయినదనను. కాలపురుషుడు మనదేశమును ఉత్తమమైన మార్గాన ప్రసరింపజేసి శుభప్రదుడు కాక మానడు.

---

# బంతిపూలు

కంద్యారం వెంకటసుబ్బయ్యశర్మ.

ఎలనాఁగా, లవలీలతాఘుసృణతా హృద్యంబులైయొప్పు చే
తులపై కెత్తి గులాబిపూవు గొలకం త్రుంపం బ్రయత్నింతువే
వలనంగన్గొనవో! గులాబులను నవ్యంజాలు నాడెంపుఁ బూ
వులు నానాసుమవల్లికామహితమై పొల్పారు నీతోటలోన్॥
ఏలా ముంగులతీగఁ బూఁతపై న్మోదేముల్లు మైగాడినన్
దాళంజాలని దానవుద్గమము నితాంతశ్రీఃపుట్టించు పూ
ల్పాలంగల్గిన చోటుజూపెదను నీలానిర్జితాంభోజ
పొమ్మాలస్యం బొనరింపకచ్చటికి నేలా! యీవృథాయాసముల్॥
ఫలభారానతచూత పాదపంబేచోట
నయనపర్వంబు నొనర్చుచుండు
ఘనసారిపాంశు వాసనలనేతావున
గరువలి కందువు నెరపుచుండు
మృదులపల్లవరాజి మెసవికోయిలపిండు
లేయెడ రాగాలు దీయుచుండు
హరిణంబులేసీమ కావలంగల శాద్వ
లావృతస్థలి గంతులాడుచుండు
నేకడం గృత్రిమసరిత్తు ప్రాకులాడు
నాకడంజాల్లు చాల్లుగా నలరుబంతి
పూలచెట్టులు, నీవందుఁబొమ్ము వేగ
చారుసుకుమారగాత్రి విశాలనేత్రి॥
ఆయీ తావులమధ్యఁ జంపకలతాహర్మ్యంబు చేతోహరం
బై యొప్పు న్వడిదానిలో విరులుగోయంగాఁ జొఅంబోకు మం
దే యాళీ విషముండి నిన్గఱచునో! యింతేల చంద్రాస్య చాం
పేయోద్యానిఁ దలన్వసింతురట సుమ్మీదందశూకాధముల్॥

"మోసంబుం బొనరింపఁ గాఁదలఁచితే మోయట్లుగా దేని నా
నాసౌరభ్యయుత ప్రసూనములకన్నన్ మిన్నయౌనంచు నే
ప్రాశస్త్యంబును లేని బంతిపువుఁబీభాతిం బ్రశంసించి నా
కాసల్పుట్టఁగఁ జేతువే యనకు కాంతా! నిక్కముల్డాఁగునే?
లతకోన నున్న వేళలఁ గళాకమనీయములై తనర్చి సం
చ్యుతిఁగని పోయగంబు నఱుసూయితర ప్రసవంబులట్టులో
అతివ, విలాసమేదవు రయంబున నిద్దపుబంతిపూలు నీ
మతిఁదలపోయు మిందులసమంచిత పుష్పములేవి యందునా!

కాంతియును వాసనయుఁ గల కమ్రపుష్ప
వారములనెన్ని యేనీవు నడయఁగలవు
నానియోగించిన విధానఁ బూనిపొమ్ము
చారుసుకుమారం గాత్రి! విశాల నేత్రి!

---

## ఒక దొంగ నిజాయితీ

ఒక మేజస్ట్రీటు ఒక దొంగనుద్దేశించి 'నీవు దొంగతనము చేసినావుగనుక నీకు ఆరునెలలు కఠినశిక్ష వేసితి'నని కోపముతో తీర్పు చెప్పెను. దొంగ చిరునవ్వు నవ్వుతూ ఊరకొనెను. అది మేజస్ట్రీటు చూచి 'ఏమి' నీవట్లు నవ్వుతున్నావు. కారణము చెప్పకపోయిన యెడల కోర్టువారిని అగౌరవపరచినందుకు మరల శిక్షిస్తానని బెదరించెను. అంతట దొంగనవ్వుతూనే నిజముగా మీరందుకు శిక్షించలేదని నేనెఱుగుదునండీ అనెను. మేజస్ట్రీటు ఆశ్చర్యముతో మరెందుకు శిక్షించినాననుకొంటున్నావో చెప్పుము అనిగద్దించెను. 'నేను నిజముగా దొంగతనము చేసినందుకే మీరుశిక్షించేయెడల అధ

మను ఇదివరకు పది పన్నెండుసార్లయిన కోర్టులోకి పోయియుండే వాణ్ని. మీరనన్నందుకుగాదు శిక్షించింది. దొంగతనముచేసి పట్టుబడ్డందుకు శిక్షించారు. అని నిర్భయముగా జవాబుచెప్పెను. కోర్టులోనున్న వకీళ్లలో ఒక్కరికికూడా యీవాదన తోచనందుకు వారందఱుకూడా ఒకరిమొగమువంక ఒకరు చూచుకొని నవ్వుకొన్నారు.

---

## నిర్దోషి

ఒకడొక పెద్దదొంగతనము చేసినాడని నేరముమోపఁబడి వానిపై మేజస్ట్రీటుకోర్టులో కేసుచేయబడెను. వానికేమియుదోచక వానిపక్షమునవాదించుటకై యొక ప్లీడరును పెట్టుకొనెను. మేజస్ట్రేటుగారు కేసంతయు సవిస్తరముగా విచారించినపిమ్మట ముద్దాయిపక్షమున ప్లీడరు, ముద్దాయిమీద విరోధమువల్ల ప్రతిపక్షులన్యాయముగా కేసుతెచ్చిపెట్టిరేగాని ముద్దాయినేరమునుగుఱించి యేమియునెఱుగడని యుక్తియుక్తముగా వాదించెను.

మేజస్ట్రీటుగారుకూడా ఆవాదమును నిజమనినమ్మి ముద్దాయి నిర్దోషియని తీర్పుచెప్పెను.

ప్లీడరుగారు బయటికివచ్చి ముద్దాయినిచూచి 'ఏమోయినీవు నిజముగానేరముచేసినావా' యనియడిగెను.

అందుకుముద్దాయి అంతకుపూర్వము నాకునేరముచేసినాననే నమ్మకముకలదుగాని మీవాదన విన్నపిమ్మట జడ్జీగారివలెనే నేనును నిర్దోషిననియే నమ్మితిని అని బదులుచెప్పెను.

---

# రాధ



మాసిన చీరతో పొగడమ్రాకుల రెమ్మలనీడ దీర్ఘని
శ్వాసము లన్ని గుడ్చెదవు! జంకక, నీచెలి కోసితేరనీ
దోసెడు మొల్లమొగ్గలను దూసి, దళమ్ములు కుప్పవెట్టెదే
లే! సుకుమారి! యింతవిసువేటికి యీమొలజవ్వనంబునన్॥

ఈసుకుమారపున్నిశల కృష్ణుఁడొసంగిన పుష్యరాగపున్
బూసలదండ రాపుడుల పూను కుచాగ్రము లుష్ణబాష్పపున్
రాసులకందువారెడు విరాగమ దేటికి? నిండుప్రాయపున్
మోసులవేళ నిట్టియిసుముల్బడ నిన్ను విరించి జేసెనే;

మోసముజేసి యెచ్చటికొపోయిన మాధవుఁగూర్చి యింతగా
వేసటఁజెంది పుష్పవనవీథికలన్ వెదుకంగనేల? నీ
వేసఁగిపూలవెన్నెలలు ప్రేమకనర్హములో! పికాంగనా
భ్యాసితరాగముం బ్రణయ పాత్రముగాదొ! వచింపుమిత్తఱిన్॥

చెల్లరె! యీమధూపవనసీమల నావులగాచువానికై
పల్లెలనుండి నాగరిక పద్ధతులేమియెఱుంగనట్టి యీ
గొల్లపడంతులెల్లరును కోరినకోరికగాక నీవు నా
నల్లనివాని కేవలచినావట! యెంతటిసిగ్గుచేటొకో!

---

# అడవి పిల్ల



నిండుప్రాయమ్మునకు తోడునీడమైన
సిగ్గుసింగారమెఱుగని చెలియ! నీదు
ముగుదచూపులు మాపూర్వపుణ్యమునను,
అడవితొలకరి పూవులయట్లుదోఁచెకె!

ముళ్లపూతీవగుంపుల చాళ్లనుండి
కన్నెగాడుపువీచిన కదులునీదు
వెన్నెలయిగుళ్ల పయ్యెద వెలితినుండి,
జవ్వనపునీడలారిన చాలుమాకు!

సడియుచప్పుడు లేనియీయడవికోన
అలతిసెలయేటి సొనల యీలలకు లయలు,
తెలియఁజెప్పునీరాగాల తీయదనము
వలన, పూలకారుపవళ్లు పులకరించు

ఈషులయక్షవనమ్ములు, ఈమనోజ్ఞ
యామిచులు నివనుభవింప నావిరించి
తెఱవ! నీకొక్కతకు ప్రసాదించెనేమొ
వేలపువలవంతలెఱుగని పసుచుదనము

వింటిబద్దల అంబులువిడచునీదు
మసపునేర్పులలోని నాజూకుదనము,
అలరువిలుకాసికేనియుఁ దెలియరామి
బ్రతికిపోయిరి తపసి జవ్వనులునిజము!

# స్వప్నమే

(జంధ్యాల వెంకటశర్మ! శివన్నశాస్త్రి)

ప్రాణనాయక! నీవుస్వప్నమ్మునందె
నాదరికివచ్చి నాకుఁ బ్రమోదమిడెదు
క్షణముసేపును గనులారఁ గాంచవీవు
ఛాయవలె వెంటనే యేలమాయమౌదు?

ప్రాణనాయక నీవుస్వప్నమ్ము నందె
నాదరికివచ్చి మధురగానమ్మువినిచె
దేలొకో వినీవినక ముందే గభీర
నిద్రలో నన్ను ముంచెదు నీవుచెపుమ?

ప్రాణనాయక నీవుస్వప్నమ్మునందె
నాదరికివచ్చి యాలింగనమ్మునర్ప
చేయిసాచెదు, నేనునీచెంతకురికి
పడుచుచుండగనే, శరద్వారిదంపు
ముక్కవలెనెట లీనమైపోయెదీవు?

ప్రాణనాయక దీనికర్థమ్మునీవు
నన్ను ప్రేమింపమియె యనినమ్ముదునొకో!
కాదు! ఈస్వప్నమం ను నింతకరుణఁజూపు
నీయెడలనిట్టి యర్థ లఁజెపుదు?

అటులఁగానిచో క్యమ్ము, నీవు
స్వప్నమేయగు నిష్టమ్మునీకు!

(పూదేనెనుండి)

# ప రి చ య ము



స్వరాజ్య:—ఇది శ్రీయుత దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారి సంపాదకత్వమున బెజవాడనుండి వెలువడు తెనుగు వారపత్రిక. ప్రతి ఆదివారము వెలువడును. సంపాదకుడు స్వరాజ్యపక్షవాది గనుక పత్రిక కాంగ్రెసువారిని శాసనసభలకుపోయి, ప్రతిష్టంభనములుచేసి ప్రభుత్వమును స్తంభింపజేయవలెనని యుద్బోధించుచున్నది. అందులకై యీపత్రిక చూపుచున్న వాదములును చేయుచున్న కృషియు నత్యంతశ్లాఘనీయములు.

కాంగ్రెసువాదులలోనే భేదాభిప్రాయములుకలిగి, జాతీయ మహాసభయొక్క ప్రతిష్టకే భంగముకలుగుటకు సిద్ధముగానుండగా, బాధ్యతగల పెద్దలచేనడుపబడుచున్న జాతీయవాదపత్రికలుసహితము సహనముగోల్పోయి, భేదాభిప్రాయములను న్యాయదృష్టితో చూడజాలని యీతరుణములో ఈపత్రికచూపుచున్న నిగ్రహమును, స్వరాజ్య కాంగ్రెసు పార్టీలకు ఎట్లయినను సామరస్యము కుదుర్చుటకుచేయుచున్న ప్రయత్నములును మిక్కిలికొనియాడదగియున్నవి.

పత్రిక స్వరాజ్యపక్షమునకు చెందినదైనను దేశబంధు దాసుగారు చెప్పునదంతయు 'సరే;' యని తలయూచునట్టిదిగాదు. నాగపురసత్యాగ్రహము సందర్భమున దాసుగారియుద్దేశము నెంత మాత్రమును పాటింపక తీవ్రముగా సత్యాగ్రహము కొనసాగింపవలయునని సమరదుందుభిమ్రోయించుచున్న స్వతంత్రభావములుగల దీపత్రిక.

నిరంకుశమగు ప్రస్తుతప్రభుత్వ పద్ధతికి గుండెదిగులుగా యీపత్రిక చిరకాలమువర్ధిల్లుగాక!

దుర్గాదాసు:— ఈగ్రంథము గుడివాడ ఆంధ్రగ్రంథరత్నాకర కార్యాలయమునుండి మాకు పంపఁబడినది. కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇది నాటకరచనయందు మిక్కిలిపేరుగాంచిన ద్విజేంద్రలాలురాయలుగారిచే వంగభాషలో రచింపబడిన నాటకమున కనువాదము. ఇది వంగదేశమున ప్రారంభింపబడిన స్వదేశోద్యమ కాలములో రచింపబడినది. ద్విజేంద్రలాలుగారీనాటకము తమ తండ్రిగారికి కృతియిచ్చియుండుటచేతను, తమ తండ్రిగారిచరిత్రమును స్మరించియే ఈ నాటక కథానాయకుఁడైన దుర్గాదాసును చిత్రించి నానని చెప్పియుండుటచేతను, ఈ నాటకము నతఁడు అభిమానపురస్సరముగా తనయావచ్ఛక్తియు వినియోగించి వ్రాసియుండునని తోఁచుచున్నది. దీనినిబట్టియే ఈ గ్రంథప్రాశస్త్యము చాలవఱకు గ్రహింపదగియున్నది.

నాటకమంతయు వచనరూపముననేయున్నది. మన తెలుగు నాటకములు పార్సీమట్లతోను, పద్యములతోను నిండియుండుట వలన, పాత్రౌచిత్యముపాటింపబడక నాటకములోని పాత్రలన్నియు, సంగీతముతో నొకరితో నొకరు సంభాషించుకొనుచున్నప్పుడు నాటకకళాభిజ్ఞుల కనేకులకు నిజముగా నేవగింపు కలుగుచున్నది. ఈ నాటకమంతటిలో చక్కఁగా సందర్భానుకూలముగా మొత్తము మీఁద పదిపదియేను మధురమైనగీతములు మాత్రమే కలవు.

కథానాయకుఁడు దుర్గాదాసుయొక్క రాజకీయధురంధరత, శౌర్యము, శత్రువైనను శరణాగతుఁడైనప్పుడు అభయమొసంగుటకు వెనుదీయని మహోదారస్వభావము కడుహృద్యముగా చిత్రింపబడినవి. ఔరంగజేబు యోధపురరాణిని వారి పసిబిడ్డను తనకు స్వాధీనముచేయుమని కోరినప్పుడు దుర్గాదాసు, ఔరంగజేబుసార్వ

భౌముని మహాసభలో చెప్పిన ప్రత్యుత్తరమును తనను మొగలు సేనానాయకుడు నిర్బంధింప ప్రయత్నించినప్పుడు 'సార్వభౌమా! ఈయైదుగురిని చూచితిరా' (ఈమారు ఈల వేసినచో అయిదువందల మంది యిచట హాజరయ్యెదరు! తెలిసి ప్రవర్తింపుడు' అని వీరాలాపములాడినప్పుడును, దుర్యోధనుని సభాంతరాళమున విశ్వరూపము చూపించిన కృష్ణభగవానుడు పాఠకుని గభీరహృదయమునందు ప్రత్యక్షమగుచున్నాడు. ఇందులో మఱువదగని స్త్రీపాత్రములు రెండుమూడు గలవు. వానిని గుఱించి స్థలాభావసంకోచము లేకున్న యెడల ఎంత వ్రాసినను తనివిదీరదు.

సమరదాసు 'అజితసింగును పట్టుకొందురేమో' యని సంశయించినప్పుడు రాణి 'ఎవ్వరేని పట్టుకొన్నచో ఈకత్తితో కుమారుని గుండెలో పొడువుము. జీవితావస్థలో కొమరుని ఔరంగజేబు వద్దకు కొనిపోవజాలరు' అని పలికిన వీరవాక్యములు ఎట్టివానినైనను పులకాంకితునిగాఁ జేయుచున్నవి—

రజియా! ఈమె ఔరంగజేబు మనుమరాలు - ఈమె సంగీత ప్రియత్వము వర్ణనాతీతము - ఆమెకు ప్రపంచమంతయు సంగీతమయము. తుదకు మృత్యువుకూడ సంగీతమయమె! 'చచ్చుటయే యున్నచో పాడుచు, పాడుచు చచ్చెదను. ఒక్కతో నెదుర్కొను తరంగమువలె పాడుచుపాడుచు మృత్యువులో లీనమగుదు' నన్నది! జౌరా! సంగీతమా! ఎంతదానవు! ఒకసార్వభౌముని సుకుమార పుత్రిక యెదుట మృత్యువునన్నెంత మనోహరస్వరూపిణిగా చిత్రించితివి- ఆ గానకళ మొగలుసామ్రాజ్యముతోనే భారతదేశమున నంతరించియుండును.

రాజపుత్రులతో ఎదిరి యుద్ధముగావించిన మొగలుసేనా నాయకుల ప్రతిభ యేమియు గన్పించుటలేదు. ఇది కవి పక్షపాత దృష్టితో చేసియుండవచ్చును కాని తన ప్రతిపక్షులు పిఱికివారగుటవలన రాజపుత్రవీరులకును గౌరవము తగ్గుచున్నది. నాటకము లోని రంగవిభజన పాత్రపోషణము రమ్యముగానేయున్నది. కాని కొన్ని రంగములు అనవసరములేమోయని సందియము. మొత్తము మీద నాటకము బహురసవంతము.

ఇట్టి చక్కని నాటకమునకు శ్రీయుత జంధ్యాల శివన్న శాస్త్రి గారివంటి తగు అనువాదకర్తలు, లభించుట ఆంధ్రుల భాగ్యము. ఆంధ్రగ్రంథరత్నాకరమువా రిట్టి గ్రంథముల ననేకము ఆంధ్రుల కొసంగెదరుగాక!



# చందాదార్లకు విజ్ఞప్తి

మా సాహితీపత్రికకు చందాలు బాకీయున్నవారెల్లరు దయయుంచి వారిచందాలను మనీఆర్డరుపూర్వకముగా మా కార్యాలయమునకు పంపప్రార్థితులు. లేనియెడల వారికి రాబోవు పత్రిక వి. పి. గా పంపెదము. వి. పి ఖర్చులనవసరముగా తగులుబాటగును.

మేనేజరు

సాహితీ కార్యాలయము బెజవాడ.

---

# ఏజంట్లు కావలెను.

సాహితికి చందాదార్లనుచేర్చుటకు ఆంధ్రదేశములోని అన్ని భాగములనుండియు సమర్థులగు ఏజంట్లుకావలెను. వివరములకు ఈ క్రింది చిరునామాకు వ్రాయుడు.

మేనేజరు.

సాహితీ కార్యాలయము బెజవాడ.

---

# 44 రీముల ఫెదరు వెయిటు కాగితం
# 32 పౌనుల డబల్ క్రౌన్

అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వలయువారు:— యీ క్రింది చిరునామాకువ్రాసి వివరములు తెలుసుకొనవచ్చును.

మే నే జ రు .

శారదా భాండార ముద్రాశాల,

3- 3

బె జ వా డ

# గిరికుమారుని ప్రేమగీతాలు

చరంమశీతలమగు దివాచ్ఛాయలందు
నీనడక కొంచెముగ స్పష్టమైనయవియు
ప్రణయసూన పరీమళవ్యాప్తదేహ
కృతకుతూహలులము పులకితులమేము

ద్రుతదినాంత సంధ్యానటల్లోకనాథ
చరణజనితరావమ్ములు గిరులుకొన్న
నీయురములోన కలసిధ్వనించుచుండె
మాహృదంతరమ్ములు నీలమసృణమూర్తి

ప్రణయినీ నీలనీరజప్రభలుగ్రమ్మ
కనులకాటుకవలె మిన్నుగ్రమ్మియున్న
నీగాఢగునీడల నొదిగినిల్చినాము
శైత్యముగ్ధ ప్రభూ! నవాషాఢజలద!

# వాడుకభాష

తెలుగుభాషలో మన ప్రజలందరూ సామాన్యంగా వాడుకొనేభాషకు మన కవులుగాని పండితులుగాని గ్రంథాలలో వ్రాసే భాషకు చాలా భేదమున్నది. తెలుగుదేశములో పుట్టి తెలుగుదేశములో పెరిగి తెలుగుభాష మాతృభాషగాగల వాళ్లకుకూడా మన గ్రంథాలలో వ్రాసే తెలుగు బాగా అర్థముకాదు. అందువల్లనే తెలుగు భాషలో పుస్తకాలలో యిదివరకు వ్రాయబడిన తెలుగుగాక 'వాడుకభాష' అనేపేరుతో ప్రత్యేకశాఖ ఒకటిఏర్పడ్డది. ఇట్టివిభేదము ఇంకేయితర భాషలలోను విశేషముగానున్నట్లు తోచదు. మన కవులూ పండితులూకూడా యింటియొద్దగాని, యింకాయితర వ్యవహార సంబంధాలలోగాని ప్రజాసామాన్యమువలెనే వాడుక తెలుగు భాషనే ఉపయోగిస్తారు. కాని గ్రంథము వ్రాయ ప్రారంభించేటప్పటికి చాలాకష్టపడి ఎక్కువమంది తెలుగువాళ్ళకే అర్థముకాని అసహజమైనభాష ఒకటి వ్రాస్తారు. నేనుమాట్లాడేది బంధకవిత్వాలు, యమకనియమాలు, అచ్చ తెలుగు పద్యాలువ్రాసేవాళ్ల మాట కాదు. ఏనియమములేక సాధారణ విషయాలనే పుస్తకరూపంగా వ్రాయడం తలపెట్టేసరికి మనవాళ్లకటువంటి భాషాదేవతముందుగా ప్రత్యక్షమవుతుంది. అసహాయోద్యమములో కొందరు ఉపన్యాసాలిచ్చేటప్పుడుకూడా తమరు ధారాళంగా, ఇంట్లోను, స్నేహితులతోను మాట్లాడే భాషకాకుండా యీ అసహజమైన పుస్తకాలభాషలోనే నట్టునట్టుగా, మాటలు తడుముకొంటూ, తప్పులుదిద్దుకొంటూ మాట్లాడడం చూస్తేచాలా నవ్వువస్తుంది. ఈపరిస్థితికంతకును కారణము మనపూర్వలాక్షణికులే అయియుండవచ్చును. ఒకవేళ మా

ప్రతివాదులు పూర్వకవులు గ్రంథాలు వ్రాసే కాలములో వాడు కొనే భాషకు, గ్రంథాలలో భాషకు విశేషము భేదము లేనే లేదు! ఇటీవల ప్రజలు వాడుకొంటూన్న భాష చాలా చెడిపోయినందువల్ల ఇంత భేదము కనిపిస్తూంది. అని వాదించవచ్చును. అయితే ఈ కవుల కాలంలోనే వ్రాయబడిన శాసనాలిటీవల చాలా వెల్లడియైనవి. అవన్నియు చాలావరకు వాడుక భాషలోనే వుంటున్నవి. కాబట్టి మనమంతా యిప్పుడు వాడుకొంటూన్న భాష అప్పుడు కూడా ప్రచారములో వుందనే నమ్మవలసి వస్తూంది. ఒక్క శాసనాలే గాదు. ఇంకా యితర సంబంధమైన వ్యవహారములుకూడా వాడుక భాషలోనే నడపబడుతూండేవని అనేకములైన నిదర్శనములు కలవు.

అట్టివుదాహరణము లనేకములు యిదివరకే శ్రీయుత గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు తమ 'గ్రామ్య సంప్రదాయము' అనే పుస్తకములో చూపించి వున్నారు. వారు పేర్కొనిన నెల్లూరు జిల్లాలోని తామ్రశాసన మొకదానిని ఈ క్రింద వుదహరిస్తున్నాను.

"స్వస్తిశ్రీ శా॥ వా॥ ౧౭౨౩ విరోధికృతునామ సంవత్సర జేష్ట శుద్ధ ౧౫ లు కలిగిరి వెంకటాచలంగారు, ముత్యాలపాటి పొలంలో కాశీ రామేశ్వరపు ఘాటలోకి నేరు తొవ్వించి వూరితో సత్రము కట్టించి ధర్మం నడిపిస్తూ వచ్చినారు. తదనంతరం వారి రెండో సహోదరుడైన కలిగిరి రామయ్యగారు అదే ప్రకారం ధర్మం జరిగిస్తూ వచ్చినతర్వాత మూడో సహోదరుడయ్యిన కలిగిరి శేషయ్యగారున్నూ, అధర్మం పరిపాలన చేస్తూ వచ్చి ఆయన దినములలో వున్న వార్షికము మాన్యంన్నూ, సదరహీ వెంకటాచలయ్యగారి మనుమడైన కలిగిరి సుందరయ్యగారు కొన్ని దినములు సదరు ప్రకారం ధర్మం నడిపిస్తూ వచ్చి దుర్మతినామ సంవత్సర మాఘ శుద్ధ ౫ లు ధర్మసత్రం పెంకుటిల్లు కట్టించి శార్వరి సం॥ ఆషాఢ బ ౨ గురువారం శ్రీం॥ మం॥ గృహప్రవేశం అయ్యినది.,,

ఈ శాసనము క్రీ. శె. 16 వ శతాబ్దములో వ్రాయబడినట్లు తెలియవస్తున్నది.

ఇందులో వ్రాయబడ్డ 'జేష్టశుద్ధ' 'భాట' 'నడిపిస్తూ' 'సహాలీ దరుడయ్ని' 'సదరహీ' మొదలగు వాడుకభాషాప్రయోగములు క్రీ. శె. 15 వ శతాబ్దమునాటికే ప్రచారములోవున్నవని దీనివల్ల రూఢిఅవుతూంది.

మఱియొకవుదాహరణము శ్రీ గిడుగు వెంకటరామమూర్తి గారిదే సింహాచల దేవాలయముమీద శాసనములోనుండి,

"శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ యవన రాజ్యస్థాపనాచార్య శ్రీవీరప్రతాప కృష్ణదేవమహారాయలు, విజయనగరాజ సింహాసనారూఢుడై పూర్వదిగ్విజయ యాత్రకువిచ్చేసి, ఉద్దగిరి కొండవీడు కొండ పల్లి, రాజమహేంద్రవరం మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికివిచ్చేసి స్వస్తి విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౮ బ ౧౩ వారాన, శ్రీసింహాద్రి నాథునిదర్శించి తమతల్లి నాగాదేవమ్మగారికిన్ని తమతండ్రి నరసారాయనింగారి కెన్ని పుణ్యముగాను దేవునికిసమర్పించిన కంఠమాల ౧ కి ముత్యాలు ౯౧ వజ్ర మాణిక్యాలకడియాలజోడు ౧॥ శంఖచక్రకాలపతగం ౧ పైడిపళ్లెం ౧ తుం ౯·లు ౫ ౪౪౩౦౦ కానికమాడలు ౨౦౦ తమదేవులు చిన్నాదేవమ్మగారిచేతను సమ ర్పించిన......యింతమట్టుగు సమర్పించిన ధర్మశాసనం"

దీనిలోని 'నాగాదేవమ్మగారికిన్ని 'నరసారాయనింగారికిన్ని' 'పతగం' 'యింతమట్టుగు' మొదలగు వాడుకభాషాప్రయోగాలు, సాధారణంగా పెద్దపండితులమనుకొనే వాళ్లకుకూడా తెలియరాని విష్ణుచిత్తీయమునువ్రాసిన కృష్ణదేవరాయల కాలంలో వారిధర్మాలను గుఱించి వాడబడ్డవని చదువరులు తెలుసుకొందురుగదా! వ్రాయ డానికి చోటుచాలదనే భయములేకపోతే ఇంకావుదాహరణాలు

చూపించవచ్చును. దీనిబట్టిన్నీ కృష్ణదేవరాయలకాలములో గ్రంథాలనుబట్టిన్నీ చూస్తే ఇప్పటివలెనే అప్పుడున్నూ ఇతరవ్యవహారాలన్నిటిలో వాడుకభాషనే ప్రయోగిస్తూ పుస్తకాలలో మాత్రం వేరేభాష సాధారణంగా ప్రయోగించేవాళ్లని తోస్తుంది. కాని అప్పుడు పుస్తకాలలోభాషకు వ్యావహారికభాషకు ఏమీభేదములేదనిమాత్రము తోచదు.

ఒకవేళ వాదముకోసము పూర్వకాలములో వాడుకోనేభాష పుస్తకములోభాష, ఒకటేఅని ఒప్పుకొందాము. అయితే అప్పటి భాషనుబట్టి వ్రాసిన వ్యాకరణలక్షణాలు, ఇప్పుడెట్లాపనికివస్తుంది! వ్యాకరణాన్నిగాని లక్షణంగాని భాషనుబట్టి వ్రాశారంటే సమంజసంగా వుంటుందిగాని, ముందువ్యాకరణాలు లక్షణాలు వ్రాశారు, తరువాత వాటినిబట్టి భాష యేర్పడ్డదని యెవరుచెప్పరుగదా! అదిన్నీగాక భాషకుమార్పు సహజంగావుంది. అన్నిభాషలలోను అట్టిమార్పు కనిపిస్తుంది. పూర్వకాలపు ఇంగ్లీషుభాషకు ఇప్పటికాలపు ఇంగ్లీషుభాషకు చాలాభేదముందని ఆంగ్లభాష తెలిసినవాండ్లంతా ఒప్పుకొంటున్నారు. పూర్వకాలపు వ్యాకరణప్రకారమే ఇప్పటికాలపు ఇంగ్లీషుభాష గూడావుండాలంటే ఎంతోఅసమంజసంగావుంటుంది. కాబట్టే భాషమారినకొద్దీ ఇంగ్లీషుభాషలో క్రొత్త క్రొత్త వ్యాకరణాలు, లక్షణాలు, పుట్టుతూవచ్చినవి. మనభాషలో కూడా అలా ఎందువల్ల పుట్టకూడదు; పూర్వకాలములోనే తెలుగుభాషలో ఒకలక్షణానికి ఇంకొక లక్షణానికి ఒక వ్యాకరణానికి ఇంకొక వ్యాకరణానికి సంబంధం లేకుండా వుంటూందే! బాలవ్యాకరణములో సాధువులుగా కనుపించేవి ప్రౌఢవ్యాకరణములో అసాధువులుగా కనుపిస్తున్నవి. అప్పకవివ్రాసిన

దానిని యింకొకలక్షణవేత్త కాదంటాడు. ఆలక్షణవేత్త వ్రాసింది వేరొకడు తప్పంటాడు. తెలుగులో యింతవరకు సమగ్రమైన వ్యాకరణంగాని లక్షణంగాని లేనట్లుతోస్తుంది. సులక్షణసారము సలక్షణసారము కవిసంశయవిచ్ఛేదము కవిజనకల్పద్రుమము ఛందోలక్షణశాస్త్రాలు కనిపిస్తున్నవి ఒకదానితొత్తు ఒకదానికిగిట్టదు. వీటన్నిటినిమించి కొన్ని మహాకవుల కావ్యములు స్వేచ్ఛగా వ్రాయబడినవి కలవు. ఇది మాయొక్కరి అభిప్రాయమే కాదు. ఆంధ్రదేశమున విఖ్యాతియశము పొందిన శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు ఆంధ్రభాషా మహార్ణవమును తఱచితఱచి తుదకు దానిరహస్యమంతా ఒక్క వాక్యములో చెప్పినారు చూడండి.

"వ్యాకరణ మొక్కత్రోవ మహాకవు లొక్కత్రోవ కోశసంఖ్యల మొక్కత్రోవై కనుపట్టెడి నీభాషాకావ్యమ్ములను దఱచు చదివినకొలదిన్"

దీనినిమించినవుదాహరణము మీ కేమి కావలెను. దీనిబట్టి లక్షణాలకు వ్యాకరణాలకు నిఘంటులకు మహాకవుల పోకడలకు చాలాభేదము కనుపిస్తూంది. అని మహాకవులు స్పష్టముగా సాక్ష్యమిస్తుండంలేదా! అదియునుగాక వారే "తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది," "భారతాదులలేని పదములుపనిగావె?" "అందుచేనిం గ్రామ్యమనియు దేశ్యమనియు పెనగశక్యంబె" అని యింకను వెల్లడిగా చాటూమాటూ లేకుండా ప్రపంచకానికి చాటించారు. వయోవృద్ధులైన ఆధునికాంధ్రమహాకవులలో తిరుపతి వెంకటేశ్వరులవలె వారుకూడా భాషలోని అందమునుగ్రహించి మెచ్చుకొనేవారు లేరు. జాతీయములలో మనసుకరగించడం వారికి తెలిసినట్లుగా నితరులకు తెలియనే తెలియదన్నను అతిశయోక్తి కాదు. చూడండి

"జననంబున్మరణంబు జంతువులకున్ స్వాభావికం బేరికెల్లి
నిజంబౌనెసుఖంబులెక్కడిది తల్లీ! నేటికేడాదియై
ననుగాలేదు ప్రయోజనమ్ము సుజనసుందారంబు చెట్టంతవా
నినిపుత్రుం దిగమ్రింగి ఱాయికరణిం జీవించియిట్లుండనే' (బుద్ధచరిత్ర)

ఒకముసలిఆబిడ తనదురవస్థ చెప్పుకొనినమాటలివి. వారు నిర్యతిప్రాస సుగా పద్యమువ్రాయకపోయినప్పటి గణయతిప్రాసల కోసము వారెప్పుడూ లోకోక్తులను, పాడుచేసి వాడుకభాష పనికి రాదని గట్టిపట్టు పట్టుకొని కూర్చునే రకమువారు కారు. వాడుక భాష పనికిరాకనే వారంతా చక్కని తెనుగు సామెతలను పద్యములో యిమడ్చబోయి దాని సహజసౌందర్యము పాడుచేస్తారు. వాళ్లా ఎప్పుడూ చేయరు. చూడండి (అల్లితిమి ఈ మగతి కవితల్ల జాలోనరి చు గ్రంధతతికిది సమయూ ఢిల్లికి! ఢిల్లే! పల్లికిపల్లే!, యని చెప్పినట్టి పల్కులువినరే!' ఇదే ఇంకొకరైతే (ఢిల్లికి డిల్లియే పల్లెకు పల్లెయే, అనిమార్చి పద్యము కుంటునడేటట్టుగా అంతా రసాభాస చేసేవాళ్లు.

వాడుకభాష కూడదనివాదించేవారిలో యింకొకొందఱు వాడుక భాష అనడంలోనే ఎవరిష్టమువచ్చినట్లువారు వ్రాస్తారు. ఉత్తరజిల్లా లవారు మాట్లాడుకొనేభాషకు దక్షిణజిల్లాలవారు మాట్లాడుకొనే భాషకు చాలాభేదముంటుంది! కాబట్టి వారువ్రాసినభాష వీరికి, వీరు వ్రాసినభాష వారికి అర్థముకాదు అందువల్ల వాడుకభాష పనికిరా దని చెపుతున్నారు. మనముమాట్లాడే భాషగాని, వ్రాసేభాషగాని అందఱికీ తెలియవలెననే వీరిసదుద్దేశముతో మేమూ ఏకీభవిస్తు న్నాము. కానికృష్ణాజిల్లావారు ఏకడపజిల్లాకో పోయినప్పుడు ఏవో అక్కడకూడా కొన్నిమాటలు అర్థంకాకపోతె పోవచ్చును కాని

కేవలముఅది అరవభాషవలె తెలుగువారికి అగమ్యగోచరంగా వుంటూందా! మనఆంధ్రనామ సంగ్రహంలో వున్న పదాలన్నీ ఒకజిల్లా వారికే సంబందించినవా! తెలుగుజిల్లాలవారందరు వాడుకొనేమాటలు దానిలో లేవా! 'గుంటడు' 'గుంట' ఈమాటలు కృష్ణాజిల్లాలో బాలబాలికలకు వాడుతారా! విశాఖపట్నం జిల్లాలో వాడుతారు; ఇవి ఆంధ్రనామసంగ్రహంలో వ్రాయబడి వుండలేదా! వాడుకను బట్టి ఆయామాటలకు నిఘంటు వేర్పడుతూనే వుంటుంది. అటువంటి అప్పుడు ముందువచ్చే సంతతివారికికూడా అర్థము కాక పోయేటంతదురవస్థ యెప్పటికి రాదు పిష్టాచిత్తీయములోవున్న పద్యాలు ఎంతమందికి అర్థమవుతున్నవి? సామాన్యుల మాటకాదు! పెద్దపండితులను కొనేవాళ్లమాట! అంతకన్న అన్యదేశీయము లైనప్పటికి వాడుకభాషలో మాటలు సుళువుగా అర్థమవుతూనే వుంటవని అందరూఒప్పుకు తీరవలసిందే!

కొందరు పూర్వాచార పరాయణులు వాడుకభాష అనే పేరు వినడంతోనే చిరాకు పడతారు. ఎందువల్లనంటే వాడుక భాషలో ఏవిధమైన నియమము అలంకారము, అందము, వ్యాకరణము వుండదని వారినమ్మిక. కాని నిజమైనజీవము వాడుకభాషలోనే వుందని వారికిమనము వినయపూర్వకముగా నచ్చజెప్పవలసియున్నది. వాడుకభాషఅనగా మనముసాధారణముగా మాట్లాడుకొనే భాషమాత్రమే కాదు. వ్రాసేమనిషినిబట్టి భాషలోకొన్ని పూర్వలక్షణములు పాటింపబడినప్పటికి మారుమూల మాటలులేకుండా ప్రజాసామాన్యముయొక్క వినికిడికి చేరువుగావున్న వాక్యాలు, జాతీయములు విశేషముగావుంచేచాలును. చూడండీ దాసుశ్రీరాములుపంతులుగారి తెలుగునాడు! అదిఎంతసరసంగా వుంటుందో! ఛందోలక్షణము

వ్యాకరణము పూర్తిగా విసర్జించి వ్రాసినారా వారు? కాని అందులో కావలసినన్ని జాతీయములుండి సామాన్యప్రజల వినికిడికి వాడుకకు చేరువగానున్న దా గ్రంథము.

ఉ॥ త్రుళ్లి • పేరుకా విడిచి దోవతికమ్ములు వెళ్లగిళ్లకు
చెళ్లికికట్టి నీళ్లబుడి చెంబొక చేతను బట్టి దారిలో
చిళ్లలకొత్తుకొంచు నొక జేతడి కోళ్లయిబెట్టి పెండ్లిపం
దిళ్లకు భోజనాన కరుదెంచును వైదిక శేఖరుండిలన్

మనపూర్వాచార పరాయణులీపద్యము బాగుండలేదంటారా? ప్రతిఆంధ్రుడు ఈపద్యమువింటే సంతోషంతో వుప్పొంగిపోతాడు. శ్రీరాములుపంతులుగారు కావలసినన్ని వాడుకమాటలవల్లనే తెలుగునాడు యొక్క నిజమైన రూపాన్ని చిత్రించి ఎదుటపెట్టకలిగినారు. గ్రంథాలలోని క్లిష్టశైలిలో అయితేవారికీ పనిసాధ్యమయ్యేదా! కావ్యమింతరసవంతముగా వుండేదా!

ప్రజలవల్ల పరంపరాగతముగా వాడుకొనబడుతూన్న భాషకే నిజముగా వాఙ్మయమనేమాట చెల్లుతుంది. అటువంటిభాష కొంత వరకు దేశచరిత్ర తెలుసుకోవడానికికూడా అవకాశంగా వుంటుంది. దేశాన్నిబట్టి, కాలాన్నిబట్టి, ప్రజలభావాలనుబట్టి భాషకూడా మారుతూండడం సహజం. ఎన్ని వ్యాకరణాలు, ఎన్ని లక్షణగ్రంథాలు వున్నా విశృంఖలంగా వస్తూన్న ఈమార్పును నిర్బంధింపజాలవు! కాబట్టి లక్షణశాస్త్రాన్ని అనుసరించే పోదామనుకొన్న శ్రీనాథాది మహాకవులుకూడా అన్యభాషాప్రయోగములు వాడక తప్పినదికాదు.

''బెంచీలకర్రలేదు గేమ్సు మొదలా ఫీజుల్ వినర్ రావు''

అని తిరుపతి వెంకటేశ్వరులు ఇంగ్లీషుమాటలు నిరభ్యంతరంగా వాడి లక్షణశాస్త్రమర్యాదాతిక్రమణము చేసినందువల్ల ఆంధ్రదేశానికిగాని భాషకుగాని ఏమీవిపత్తురాలేదు—వాటిని తెలుగులోకి మార్చివ్రాస్తే మార్దవము చెడిపోయేది. ఆవాక్యాన్ని గురించి తెలుసుకోదగినంత తెలివేదిగాదు!

వాడుకభాషలో సహజమైన జీవమున్నదికాబట్టే ఆభాషలో వున్న సామెతలు నశింపక శాశ్వతంగా వుంటూన్నవి. ఆసామెతలు మనోహరంగాకూడా వుంటూన్నవి. వాడుకభాషవల్ల అందంచెడిపోతూందనుకొనే పెద్దలు చక్కని తెనుగుసామెతలు కావ్యశైలిలో వ్రాసినందువల్ల ఎట్లా అపభ్రంశమవుతున్నవో చూడండి! 'అందరికి అన్నిరోగాలు అద్దెడుతప్పేలా కేరోగమూలేదు' అని ఒకసామెతుంది. దాన్నొక కవి ఛందోబద్ధముగా వ్యాకరణమర్యాద అతిక్రమించకుండా

"అందఱి కన్నిరోగములు నద్దెడుతప్పెల కెట్టిరోగముం జెందదు"

అనిపాడుచేశాడు. మొదటిదానికన్న ఛందోబద్ధముగావున్న రెండోది రసవంతముగావుందని మాప్రతివాదులుకూడా అనసాహసించరు. ఇట్టివి వేనవేలు—వాడుకభాషలోనే వేమనవంటి మహాకవి అనేకపద్యాలు మనోహరంగా, వ్రాసి కీర్తిపొందినాడు. కాని యిప్పటివారెవరైనా వ్రాస్తే చాలమందిని అందం గ్రహించలేకనో, సమకాలికులాటచేతనో మెచ్చుకోకపోవడముట్లావుండగా పైపెచ్చు నిరసిస్తూన్నారు.

దయచేసి ఒకక్షణము మన వాదప్రతివాదములను దూరంగావుంచి అప్పుడప్పుడు మాసాహితిలో చింతా దీక్షితులు బి.ఏ.ఎల్.టీ.

గారు వ్రాస్తున్న యీ క్రింది గీతములను నిష్పక్షపాతబుద్ధితో కావ్య భాషావాదులు చదివి ఆనందింతురుగాక!

"బాజాలురా నాన్న బాజాలు!
బాజాలు వచ్చేయి బాజాలు!

బాజాలతో వచ్చె పల్లకీ అదుగో,
పల్లకీలో వుంది పార్వతీదేవి
బాజాలు వింటుంది పార్వతీదేవి,
పార్వతీదేవికీ జేజేలు పెట్టు!

బాజాలురా నాన్న బాజాలు!
బాజాలు వచ్చేయి బాజాలు!

అమ్మనీ పిలవరా, బాజాలు
అక్కనీ పిలవరా, బాజాలు
అందర్ని పిలవరా, బాజాలు
అవిగోను చూడరా, బాజాలు

బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు!

బాజాలు ఇక్కడా, బాజాలు
బాజాలు అక్కడా, బాజాలు
కాగడాల్తో వచ్చె బాజాలు
ఖంగుసా మోగేయి, బాజాలు

బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు!"

* * * * *

"జుట్టులో పువ్వులూ పెట్టుకొన్నావా!
వ త్యాల జూకాలు పెట్టుకొన్నావా!
గంటలా మొలతాడు కట్టుకొన్నావా!
వచ్చి ముద్దియ్యవే వరహాలతల్లీ!

*  *  *  *  *

బొజ్జ నిండా వేడి బువ్వ తిన్నావా!
కాళ్లకూ గజ్జలు కట్టుకొన్నావా!
దోసగింజా బొట్టు పెట్టుకొన్నావా!
వచ్చి ముద్దియ్యవే వ-హాలతల్లీ!"

*  *  *  *  *

ఏమండీ! ఇవి వాడుక భాషలో వుండడంవల్ల రసభంగం కలిగించని ఎవరైనా అంటారా! గ్రంథశైలిలో ఈవిషయాన్ని యింతకన్న మధురంగా ఎవ్వరైనా వ్రాయగలమని ధైర్యముగా చెపుతారా! వాడుకభాష హృదయంగమముగా నుంటుందని చెప్పడానికి యింతకన్న ఏమీ విశేషం వ్రాయనక్కర లేదు. మేము, వాడుకభాషను గురించి యింతగట్టిగా సమర్థించి వ్రాయడంచేత అందఱుకూడా యిదే అవలంబించాలి; పూర్వకావ్యములలోని భాష పనికిరాదని కాదు మా వుద్దేశం. వాడుకభాషను తేలికగా నిరసించవలదనే వినయపూర్వకముగా ప్రార్థిస్తున్నాము.

ముందు ముందు వాడుకభాషలో వ్రాయబడిన శ్రీ గురజాడ అప్పారావుగారు వీరేశలింగం పంతులుగారు మొదలగువారి గ్రంథములు అవకాశమున్నప్పుడల్లా విమర్శింతుము.

## జీర్ణ శృంగారము

సంజ నీరెండలపసిండి చాయలలము
శాద్వలశ్యామల కిశోర శయ్యలందు
తేటకన్నీటి ఆణిముత్తెములు రాలి
చిందె, చిటిలిపోవగ నేల చింతవడెదు ?

నీవు నీరోసి పెంచిన పూవుఁదోట
చెలిమి కన్నెలు చివురు దోసిళ్లకొలఁగ
నేరి తెచ్చిరి తావిపన్నీరుపూలు,
మృదుల నీలాలకల సంస్కరింపవేమి ?

నేటి తొలకరి మబ్బుల నీడలందు
మాధవునితోడ క్రీడింప మలచుకొనిన
పెదవి తాంబూల రాగంబు చెదరిపోవ
వేడి నిట్టూర్పు లింతగా విడువనేల!

వేణుగానమ్ము వినరాని వేళ, రాధ !
వీణెతంత్రిల నీవాలపించుచున్న
కేవల వియోగనాగర గీతములకు
ప్రకృతి జీర్ణశృంగారభావములు పూనె.

*   *   *   *   *   *

అదిగో యమునాతరంగిణి కవలిదరిని
పొగడద్రుమాకుల క్రీనీడ ప్రొద్దుగ్రుంకె

చీకటికెరళ్ల నొక చక్రవాకి విరహ
యామినీ స్వప్న శిథిలహార్మ్యములనుండి
బాష్పకలికా విషాదతర్పణము విడిచె!

శంక

# ప్రాణము

యస్. వి. రాఘవయ్యంగారు. బి, ఎ;

ప్రాణమా! నీస్వరూపము నేనెఱుంగ।
ఈవు నన్నెడబాయుదం చెఱుగువాఁడ।
ఎచటనో ఎప్పుడో లేక ఏటులమనము।
గూడిమనుచుంటిమో వాక గోచరంబు॥

ప్రాణమా! చిరసహవాస పరతమనము।
కష్టసుఖములనొకరీతి గడపినాము।
అలతినిట్టూర్పు; దుఃఖాశ్రు వైన లేక।
సఖులకు ప్రవాసకష్టము సైపవశమె?॥

కానినీయిచ్ఛవచ్చిన కాలమందు।
పరులెఱుంగకమున్నె వేతరలిపొమ్ము।
పొమ్మటంచువచింపక రమ్మటంచు।
విబుధలోకంబునందునఁ బిలువరమ్ము॥

# పికప్రశంస

వెలగపూడి దానయ్య

గున్నమామిడిపైకొమ్మ కొనకుఁ జేరి
నాకుగా దేవుఁడిచ్చె నస్తోకమధుర
కంఠరవమని మదినెంచి గర్వమంది
కోయికోయంచుఁ గూసెదు; కూఁతయొకటె
ఘనమని తలంపఁబోకుము గణుతిఁగాంచఁ
గులమునీయువన్నెయుఁ గూడవలయు
నెన్నఁగా నివిమూఁడును సున్న సుమ్ము

పెంచనేరక నీతల్లి ప్రేమవీడి
భూమిపైఁ గ్రుడ్డుఁ బెట్టికొం పోయిదాని
వాయసపుగూఁటియందున వదలిపోవ
మర్మమెఱుఁగని యాకాకి మనసునందు
నదియునుం గూడఁ దన గ్రుడ్డె యనుచుఁ బొంగి
కష్టములకోర్చి పొదుగఁగా గలిగి; యదియె
పెనుపఁ బెరిగిన కతమునఁ బికమ! నీదు
కులము సంకరమైపోయెఁ గుమతి; నిన్నుఁ
బాదిగి పుట్టించి పెంచిన పుణ్యమైనఁ
దలఁపకయె దానిబిడ్డల దయను వీడి
నేలపైఁ ద్రోయుటం జేసి నీతి చెడితొ;
గాకివలె నల్లనౌ వన్నె గలుగు కతన
వన్నెనుం గూడఁ జెప్పఁగా వలను పడదు
గాన నొక కూఁతకై యింత గర్వమేల?
నగుదురందఱుఁ బొమ్ము నల్లపికమ!

# జాగ్రత

యస్. వి. రాఘవయ్యంగారు, బి. ఏ.,

బ్రతుకుతెరువెన్నమండ్లతో బలసియుండు।
చావుపుట్టుకలెన్నగా జాగలవు
భార్యబిడ్డలతో భువి బ్రతుకుటెన్న।
గాలివానలముసుగుచు దేలుచుంట।
గానజాగ్రతజాగ్రత గాంచవలయు॥

జనమాధనమున కెపుడు దాస్యంబు సేయు।
పిల్లగాలులుసుడిగాలి బెంచుచుండు।
ప్రతిపదంబు సుగమనించి పలుకవలయు।
ప్రాణవాయువు వడివడిపరువులిడుచు।
గానజాగ్రతజాగ్రత గాంచవలయు॥

జననిజనకులు మనలచుసాక లేరు।
కులముపొలములు మనకిలఫలమునీవు।
కోటకోశముల్మనతోడ గూడరావు।
నరుల నైజమూల్యముల్వారి నగసిగ్రోచు।
గానజాగ్రతజాగ్రత గాంచవలయు॥

ఒడలిగీమున కాపురముండిసతము।
మోహకోపలోభంబులు ముచ్చులట్లు।
దూరదృష్టిధనంబును దోచుకొనగ।
నరుడుచుకాక్కని లేవట్టి నావబోలు।
గానజాగ్రతజాగ్రత గాంచవలయు॥

# పశ్చాత్తాపము

జి. రాఘవశర్మ

పిశుపాటివారు వైదిక బ్రాహ్మణులు. వారివంశములో అందఱు విద్వాంసులు! మంచికుటుంబీకులు; సంపన్న గృహస్థులు. అమరావతిలో వారిగృహ మొక్కటేవుంది. ఇదివరకు వారిపూర్వులవి అసలేగ్రామమో ఎక్కడినుండివచ్చి ఇక్కడ కాపురమున్నారో ఎవరికి తెలియదు కాని మూడు నాలుగు తరములబట్టి వారివంశస్థులంతా అమరావతీలో నేవుంటున్నారు.

అమరావతిని కమ్మజమీందారులు పరిపాలిస్తూవుండేవారు. ఆజమీందారులు మంచికీర్తిసంపన్నులు. అందులో వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారివంటివారు ఏజమీందారులలోనూ ఎప్పుడూ జన్మించలేదు. వారు అవతారపురుషులనియే కృష్ణా, గుంటూరు జిల్లాలవారినమ్మకము. వారుకట్టించిన దేవాలయములిప్పటికీ కృష్ణా గుంటూరుజిల్లాలలో, వారివంశీయుల ధర్మకర్తృత్వముక్రిందనే నడపబడుతున్నవి. వారికిబ్రాహ్మణులయం దధికభక్తివిశ్వాసములుకలవు. అనేకమందిబ్రాహ్మణుల కగ్రహారములు, మాన్యములుఇచ్చి వేదవిద్యనుపోషించినారు. ఇప్పటికిగుంటూరుజిల్లాలలో కొల్లూరు అగ్రహారములోనున్న బ్రాహ్మణులందరు వారిచ్చినమాన్యములవల్లనే జీవిస్తున్నారు.

మనపిశుపాటివారికుటుంబములో అమరయ్యశాస్త్రి అనేఆయన దిగ్గంతి వంటిపండితుడు. వేదము చివరఅక్షరంప్రారంభించి మొదటి అక్షరంవరకు నట్టులేకుండా తలక్రిందులుగా కంఠపాఠముగా చదవగల శక్తిగలవాడట. అందువల్ల అప్పటికి అమరావతి ప్రభువైన వెంకటాద్రినాయుడుగారి సంతతి వారొకరు ఆయన మేధా

శక్తికి ఆశ్చర్యపడి అమరావతీలో సుక్షేత్రమైన మాన్యమొకటి వారివంశపారంపర్యంగా అనుభవించేహక్కుతో దయచేయించినారు.

అమరయ్యశాస్త్రిగారికి అప్పటికి ఇరవైయైదు సంవత్సరములు. అంతవరకు వారు బ్రహ్మచర్యాశ్రమములో నుండి సాంగో పాంగముగా వేదాభ్యాసముచేసినారు. వారి తల్లిదండ్రులు చిన్ననాడే గతించిరి. వారికి ఒక మేనమామకలడు. ఆయన చాలానిరుపేద. పిల్లలు లేరు. కాబట్టి ఇంతవరకు అమరయ్యశాస్త్రిగారి వివాహమునుగురించి యెవరు యోచి చేవారే లేకపోయినారు. వారుచదువుపూర్తి చేసుకొని కాశీనుంచివచ్చి యింకాయేడాదికూడా కాలేదు. దైవానుగ్రహంవల్ల ఇంతతొందరలోనే అమరావతీ ప్రభువుగారి ప్రాపకం లభించింది.

ప్రాపకంవల్ల అమరయ్యశాస్త్రిగారి కీర్తి ఆంధ్రదేశమంతా వ్యాపించింది. శాస్త్రిగారుతమకు అల్లుడుకావటంకన్న వేరే అదృష్టములేదని, సోమయాజులుగార్లు, దీక్షితులుగార్లు, ఘనులుగార్లు, సంస్కారులు అందరు. 'మాఅమ్మాయినిస్తామంటే మాఅమ్మాయినిస్తామని, కబురుపంపడం ప్రారంభించారు.

ఈవిషయంలో కొందరు అమరయ్యశాస్త్రిని తమపిల్లను చేసుకొనేటట్టుగా చేయ డని అమరావతిరాజుగారి దగ్గరకుకూడా పెద్దపెద్దసిఫార్సులు తీసికొనిరావడం జరిగింది.

౨

పెదకళ్లేపల్లి దేవరకోట సంస్థానములో ఒక అగ్రహారము. పుణ్యక్షేత్రము. దక్షిణకాశీఅంటారు. మనము కాశీఎంతపుణ్యక్షేత్ర

మనిభావిస్తున్నామో పుత్తరహిందుస్థానమువారు పెదకళ్లేపల్లి అంత పుణ్యక్షేత్రంగాభావిస్తారట. అక్కడకూడా పూర్వము పెద్దపెద్దపండితులున్నారు. దాన్ని పరిపాలించే దేవరకోటసంస్థానాధిపతులుకూడా కమ్మజమీందారులే. వారుకూడా అనేకమందిబ్రాహ్మణులకు అగ్రహారములిచ్చినవారే! వారూఅనేక దేవాలయాలునిర్మించి శాశ్వతయాశస్సు సంపాదించినవారే. ఆజమీందారులకు వాసిరెడ్డివారికి పూర్వంనుంచి సంబంధబాంధవ్యాలుకూడావున్నవి.

ఒకనాడు పెదకళ్లేపల్లినుంచి సుసర్లవిశ్వేశ్వరశాస్త్రిలవారు అమరావతి రాజాగారి దర్శనానకివచ్చారు. విశ్వేశ్వరశాస్త్రిల వారంటే చాలాచదువుకొన్నవాడు సద్బ్రాహ్మణుడు అని చల్లపల్లి రాజాగారికి చాలా అభిమానం. ఆయనరాజాగారిచ్చిన మాన్యంవల్లనే జీవిస్తున్నాడు. అమరావతి రాజాగారు విశ్వేశ్వర శాస్త్రిలవారిరాకకు కారణమడుగగా తనకుమార్తె వివాహసందర్భములో శ్రీవారి సహాయము కావలసియున్నదని. చల్లపల్లి రాజాగారు వ్రాయించియిచ్చిన సిఫార్సుపుత్త్రం చూపించెను. ఆవుత్త్రంచూచి అమరయ్యశాస్త్రిగారికి విశ్వేశ్వరశాస్త్రిలుగారే అన్నివిధాలా మామగారవడానికి యోగ్యతగలవాడని భావించి వారికుమార్తెను అమరయశాస్త్రికిచ్చి వివాహముచేయించెను.

అమరయాశాస్త్రి తన అత్తవారి భాగ్యభోగ్యాలు, పరువుమర్యాదలుమాట ఎట్లావున్నా, అమరావతి మోస్తరుగానే పెదకళ్లేపల్లికూడా కృష్ణాతీర మవడంచేత తాను చాలా అదృష్టవంతుడని భావిస్తూండేవాడు.

అమరయ్యశాస్త్రికి, భార్యాకాపురానికి వచ్చిన పది పదిహేను సంవత్సరాలకు ఒక ఆడపిల్లకలిగింది. ఆపిల్లజన్మించిన వేళా

విశేషమో ఏమోకాని ఒక యేడాదిలోనే అమరయ్య భార్యాకూడా గతించారు. అప్పటినుంచి ఆపిల్ల పెదతల్లి తాతముత్తవలదగ్గరే పెరుగుతూంది. పిల్లదాన్ని వేదవతి అని స్తూండేవాళ్లు. విశ్వేశ్వరశాస్త్రిగారికి ఇంకామగపిల్లలుకూడా ఎవరు లేరు. మగపిల్లడైనా, ఆడపిల్లయినా, మనమరాలైనా తవృద్ధసంతతులకీ వేదవతి ఒక్కతె. అందువల్ల ఆడపిల్లలకు చదువక్కరలేదనే పట్టుదలలోవాడైనా మనసుపడి వేదవతికి విశ్వేశ్వరశాస్త్రి అక్షరాభ్యాసంచేసింది మొదలు తానేస్వయముగా పాఠంచెపుతున్నాడు. వేదవతికి పదిసంవత్సరములవయసువచ్చింది. విశ్వేశ్వరశాస్త్రి వివాహంచేయడానికి సంబంధాలువిచారిస్తూన్నాడు. రేపల్లెలో వెంకటేశ్వరావధానులుగారి కుమారుడున్నాడనివిని తనబావమరదిని పంపి కనుక్కొన్నాడు. వెంకటేశ్వరావధానులుకొడుకు వెంకటరామయ్యకు ఇరవైఏండ్లువుంటవి. కొద్దిగా తెలుగుచదువుకొన్నాడు. అంతేకాని ఏశాస్త్రంలోను విశేషంపేరెన్నికగన్న ప్రవీణతలేదు. వెంకటేశ్వరావధానులు పెద్దకొడుకు పదహారేండ్లు వచ్చేసరికే సంస్కృతంలో మంచిపాండిత్యంసంపాదించి అకస్మాత్తుగా కాలంచేశాడు. అందువల్ల తమపిల్లలను చిన్నప్పుడుచదవవేస్తే అచ్చిరాదనేప్రద్దేశము తో వెంకటరామయ్యకు పదమూడేళ్లువచ్చేవరకు అక్షరాభ్యాసమే చేయించలేదు.

విశ్వేశ్వరశాస్త్రి వెంకటరామయ్య అల్పవిద్యావంతుడైనప్పటికకొంచెం భూమీబుట్ర గలవాడవటంవల్ల తల్లిదండ్రులున్నపిల్లవాడవటంవల్ల పిల్లసుఖపడుతుందని అతనికేయిచ్చి వేదవతిని పెండ్లిచేశాడు.

వేదవతి కాపురానికి వచ్చినదిమొదలు భర్త వెంకటరామయ్య యెందువల్లనో జబ్బుగావుంటున్నాడు. పూర్వమువలె వుత్సాహము గాలేదు. 'పెళ్ళాన్నిచూచి పెళ్ళాం తెలివిచూచి భయపడ్డావా! ఏమిటి!' అనీ నీకుసిగ్గువచ్చేపెళ్ళామువచ్చిందిలే నీకన్నబాగా చదువుకున్నది, అనీ యిరుగుపొరుగువాళ్లంతా అనడం ప్రారంభించారు. అందువల్ల వెంకటరామయ్య చాలాదిగులుపడిపోయినాడు. ఆవూళ్లోవున్న శాస్త్రిలుగారిదగ్గరకువెళ్లి తనకన్నా చాలా చిన్నపిల్లలతో చదువుకోవడానికి సిగ్గుపడుతూండేవాడు.

వేదవతి సంక్రాంతిపండుగకు తాతముత్తవల యింటికివెళ్లినది. పండుగువెళ్లిన రెండుమూడునాళ్లకు వెంకటరామయ్య రేపల్లెలో లేడనిన్ని తల్లిదండ్రులతో చెప్పకుండా యెక్కడికో లేచిపోయినాడనిన్ని, ఎక్కడభోగట్టాచేసినా ఏమిఅంతు తెలియడం లేదనిన్నీ వర్తమానంవచ్చింది. విశ్వేశ్వరశాస్త్రిమనస్సులో పెద్దరాయిబడిపోయింది. తల్లిదండ్రులు లేనిబిడ్డ సుసుఖపడుతుందనికాస్త కలవాడనియిస్తే వెంకటరామయ్య దేశాంతరముపాలయినందుకు మనోవ్యాధిపడ్డాడు. వేదవతి అభంశుభం తెలియనిబిడ్డ. భర్తమాట తెలియడంతోనే దిగులుపడిపోయింది. ఇకనావృద్ధదంపతుల హృదయకల్లోలము, చెప్పడానికివీలులేదు. ఈసంగతివిని శాస్త్రిలుగారిని స్నేహితులు, బంధువులు, ఎంతమందో చూచి ఓదార్చిపోయినారు. ఎంతమందివస్తేం ఏమి! వెంకటరామయ్యవృత్తాంతము చెప్పినవారెవరు లేకపోయినారు.

నాలుగుమాసములుగడచినవి. రేపల్లెలో వెంకటేశ్వరావధానులుగారికిగాని పెదకళ్లేపల్లిలో విశ్వేశ్వరశాస్త్రిగారికిగాని వెంకటరామయ్యవృత్తాంతమేమీ తెలియరాలేదు. కొందఱు చదువుకోవ

డానికి కాశీలేచిపోయినాడేమోనని, ఇంకాకొందఱు అతనికి ప్రపంచకమంటె మొదటినుండీవిరక్తే అందువల్ల బైరాగులలో కలసినాడేమోనని, సన్యసించివుంటాడని యింకాకొందఱు ఎవరినోటికివచ్చినట్లుగావారు తలోకమాటఆడడం ప్రారంభించారు. ఇవన్నీ వింటూ మఱికా స్తమనోవ్యాధితో వేదవతి అన్నంతిండిలేక శల్యమైపోయింది. తనభర్తను ఫలానిచోట చూచామని చెప్పేవారుగాని, ఫలానిచోట వున్నాడని చెప్పేవారుగాని లేకపోయినారు.

వేదవతి దుఃఖంశమించడానికి విశ్వేశ్వరశాస్త్రి ఆమెచేత వేదాంతగ్రంథాలు చదివించడం ఆమెకు వేదాంత ప్రసంగాలు తాత్పర్యమయ్యేట్టుగా చేయడం ప్రారంభించాడు. వేదవతిసహజంగా చక్కని తెలివితేటలుగలది గనుక, కొన్నాళ్ళకు ఆమెకు కొన్నిగ్రంథాలు తనంతటతానే ఎవరిసహాయముకూడా లేకుండా అర్థంచేసుకొనే శక్తిసంపాదించింది. నానాటికామెకు ఇకతనభర్త ఎప్పటికీతన కళ్లపడడని తనకేమీ యీఇహలోకంతో సంబంధములేదని గట్టి నమ్మకం కలిగింది. గ్రామంలో హరికథలకు, పూఖపురాణాలకు, ముత్తవతల్లితో కలసితానుకూడా వెళ్లుతూండేది.

విశ్వేశ్వరశాస్త్రి, భార్యానువేదవతినితీసికొనిపోయి యాత్రలుసేవించివస్తూండేవాడు. యాత్రాస్థలాల్లో కనుపించినసన్యాసిదగ్గర ల్లావేదవతికి వేదాంతోపదేశాలు చేయించియించుమించుగా నామె నీప్రపంచకమే మరచిపోయేటట్టుగా చేశాడని చెప్పవచ్చును.

ఇలా నాలుగైదుసంవత్సరములు గడచినది. గోదావరీపుష్కరానికి విశ్వేశ్వరశాస్త్రిభార్యను మనమరాలినికూడా తీసుకొని రాజమహేంద్రవరం వెళ్లినాడు. అపుడెండురోజులు రాజమహేంద్ర

వరం ఇరుకువీధులలో చీమలబారల్లే జనసమూహం క్రిక్కిరిసిపో యింది. ఎక్కడ లేని బైరాగులు, ఎక్కడలేని సన్యాసులు, ముష్టివాళ్లు, రాజమహేంద్రవరంలోనే వున్నారు. గోదావరి నిండుగావచ్చి అవతలకట్టకు ఇవతలకట్టకు ఆనుకొని తొణుకుతూంది.

విశ్వేశ్వరశాస్త్రిగారు నాళంవారిసత్రానికి దగ్గరగావున్న ఒక గృహస్థుయింట్లో బసచేశాడు. నాళంవారిసత్రంలో ఎవరో నలుగురైదుగురు స్వాములవార్లు దిగినారు. వారంతా ఏవేవో వేదాంతపుచర్చలు చేస్తూండేవారు. వేదవతి, ముత్తవతల్లీపోయివిని వస్తూండేవాళ్ళు. వేదవతికి ఎక్కడ స్వాములవారు కనపించినా వారిమీద అధికగౌరవం. వారిదగ్గర వేదాంతోపన్యాసాలు వినడమే పని.

వేదవతికి ఒకనాడు తీవ్రముగా జ్వరమువచ్చింది. ఆనాడుసాయంకాలము కనిచీకటిగావుండగా వేదవతిఅమ్మమ్మ ఎవరోఒకసన్యాసి వాకిట్లోనుంచి పోతూంటేపిలచి మాఅమ్మాయికి మంత్రతీర్థమిచ్చిపొమ్మని వేడుకొన్నది.

ఆసన్యాసి తనకేమియు తెలియదనిచెప్పినవినక 'మీయందు మాకు నమ్మకముకలదు! మీచేతితో కొంచెము మంత్రోదకమిస్తే మాఅమ్మాయికి జ్వరంనయమవుతుంది.ఏదోఅర్థాంతరానవున్నాము ఈమాత్రం సహాయంచేయండని' మరిమరీ బ్రతిమాలడంసాగించి. దానికి మనసుకరిగి అమ్మాయిలాఅయితే మాతోవున్న ఒకముసలిస్వాములవారిని తీసుకొనివచ్చి మంత్రతీర్థమిప్పిస్తానని ఒకముసలి సన్యాసిని తీసుకొనివచ్చాడు. వారిద్దరులోపలికిపోయినారు. ముసలి సన్యాసి జపంచేసుకొంటూండగా ముసలమ్మ వేదవతిని తీసుకొని వచ్చింది. వేదవతిజ్వరతీవ్రతచేత తమబసలోకివచ్చిన సన్యాసుల

నిద్దరిని సరిగాచూడనైనా చూడలేకపోయింది. పశుపస్వాములవారు వేదవతిని చూచినదగ్గరనుంచి ముఖకవళిక మారిపోయింది. ఏదోదీర్ఘాలోచనలో మునిగిపోయినాడు. కళ్ళు బాష్పపూరితములైనవి. కొంతసేపటికి వృద్ధసన్యాసి తనజపంపూర్తిచేసి కళ్ళుతెఱిచేసరికి పశుపస్వాములవారి స్థితిలో వుండడం చూచాడు. 'ఏమినాయనా! ఈవేళ ఆలాగ కళ్లనీళ్ళుపెట్టుకొంటున్నారు? మీ యిల్లు సంసారం, భార్యా! జ్ఞాపకం వచ్చారా! ఏమిటి' మీవంటి పశుపవాళ్ళు విరాగులుగా అందువల్లనే వుండతిగరు' అన్నాడు. ఆమాట ముసలమ్మ విని 'మా యీ ఒంటికొచ్చిన పిల్లమొగుడు ఒకడు యిట్లాగే అయిపోయినాడుగా నాయనా' అంది. ఆమాటకు బాలసన్యాసి దుఃఖమాపుకోలేక ఆవురుమన్నాడు. వేదవతి కళ్ళు విప్పి తేరిపారచూచింది. బాలసన్యాసిని గుర్తుపట్టి 'ఎన్నాళ్లకు కనుపించినారు' అని ఆకస్మికంగా వెళ్లి వెంకటరామయ్యను కౌగలించుకొని ఒకేపెట్టున దుఃఖించడం ప్రారంభించింది. ఇంతలో విశ్వేశ్వరశాస్త్రిలు గోదావరినుంచివచ్చి యిదంతా చూచి సంతోషాశ్చర్యములలో మునిగిపోయినాడు.

'కావిపుట్టముక్క కటిసీమకప్పభాగ్య
భోగ్యరాహిత్యమైన వైరాగ్యమునకు
జాజిపూసౌరభంబులు జల్లువిరియు
జవ్వనంబున కెంతటి దవ్వుగలదు.'



# కామః క్రోధవు

కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు (సాహితీసమితి)

హృదయాకాశంబునందున
చింతాజలదశ్రేణులు
చీకట్లు గ్రక్కుచున్నవి
నలుదిక్కుల నెక్కసముగ!

వదనము వసివాళ్వాడెను
కళలెల్లను క్షీణమయ్యె
వాల్చినతల పైకెత్తవు
సిగ్గో లేక దిఃఖమొ?

నీకన్నుటద్దములలో
ముత్యాలు మెఱయుచున్నవి
ఆనందబాష్పమా యది?
నిజము వచింపుము వేడెద!

నీకపోలదర్పణమున
నామోము జూచికొనియెద
సమీపమునకుం రమ్మా
ముద్దైన నిగ్గుటద్దము!

దూరము పోయెద వేలా?
నిను నేచుం గవియంగూడదా?
నీ వెవ్వరు నే నెవ్వరు
మనమిద్దర మొకటేకద! ౪౧౭

## నా మొర

నీలో నుండే దేవుఁడా
నాయందును గలఁడా తన్వీ!
నాలోన నున్న దేవుఁడు
నీయందును గలఁడు నిజము

నీపై మోహము నిలుపఁగ
జేసి నదియు నా దేవుఁడా
ఆదుర్మార్గపు దేవుఁడా
దూరము పొమ్మనెఁగా నిను?

తొలుత నిట్టికృత్యములను
దేవుఁడే యొనర్చియుండె
మన మేల చేయరాదో?
అతఁడుమాత్ర మధికమేమొ!

బాగున్నది—బాగున్నది!
ఇఁక నే సహింపఁజాలను
ప్రాణము పోయిన పోని
నిను విడనాడఁగఁజాను!

నీపలుకులోని తేనె
నీనడకలోని వెన్న
నీచూపులలోని మిసిమి
గనని బ్రతుకు బ్రతుకగునా?